


వేణీ మాధవఘోషాల్ ముఖర్జీలవారింటి ముంగిలిలో అడుగుపెట్టుతూనే జపం చేసుకుంటున్న పడికారుస్త్రీని చూసి—"అత్తా! రమ యెక్కడుంది?" అని అడిగాడు. అత్త సైగతో వంటిల్లు చూపించింది. వేణీ వంటింటి గుమ్మందగ్గిరికి పోయి నిలబడి—"ఐతే, రమా? ఏం చెయ్యటానికి స్థిరపరుచుకున్నావు?" అని అడిగాడు.

ఖగఖగ మండుతున్న పొయ్యిమీదనించి చిటపటలాడుతున్న చట్టి దించి—

కిన్నా' ది రమ.

"తారణీకక్కాయి శ్రాద్ధం సంగతి, రమా! రమేశుడు నిన్ననే వచ్చారు. తండ్రి శ్రాద్ధానికి బాగా ఖర్చుపెట్టేటట్టుకూడా వున్నాడు. పోతావేమిటి?"

రమ ఆశ్చర్యంతో కళ్లు రెండూ పెద్దవిచేసి—"నేను పోతానా తారిణీఘోషా లింటికి?" అన్నది.

వేణీ కొంచెం సిగ్గుపడి—"నా కా సంగతి తెలుసు, రమా! ఆరు నూరు కానీ నువ్వక్కడి కెంతమాత్రం పోవు. సరేగాని, ఆ వెధవ ఇంటింటికీ వచ్చి పిలుస్తున్నాడట; కుంటెత్తుల్లో వాడు తండ్రినికూడా మించేటట్టున్నాడు—వస్తే ఏం చెప్పుతావ్?" అన్నాడు.

"నేనేమీ చెప్పను—దర్వానే చెబుతాడు జవాబు!" అన్నది రోషంతో.

జపం చేసుకుంటున్నామె కర్ణరంధ్రాలలో ఈ మహా రుచికరమైన సంభాషణ పడగానే ఆమె జపానికి స్వస్తిచెప్పి వీరి దగ్గిరికొచ్చి నుంచుంది. రమ మాట పూర్తి కాగానే పేలగింజలాగా యెగిరిపడుతూ, "దర్వానెందుకు? ఈ మాత్రం నేను చెప్పలే నేమిటి? పుట్టుకుంకని యిక ప్రాణముండగా యీ యింటిలో కాలుపెట్టకుండా చేస్తాను. తారిణీఘోషాల్ కొడుకు. మనల్ని పిలవటానికి మనింటి కొస్తాడా?—నేనేమీ మరిచి పోలేదు. వేణీ! తారిణీ ఈ కొడుకుకేగా మన రమను చేసుకోవాలని చూసింది; అప్పటి కింకా మా యతీన్ పుట్టలేదు—యదుముఖర్జీ ఆస్తంతా తనకు కలుస్తుందనుకున్నాడు! చూశావా ఎంతదూరం ఎత్తాదో? ఆ పథకం కుదరకపోయేవరకు భైరవాచారిని పట్టుకుని యేమి చాతబడి చేయించాడో ఆరునెల్లు వెళ్ళకముందే అమ్మాయి పసుపుకుంకం వట్టిల్లో కలిసిపోయింది. కులంతక్కువ వన్నాసికి యదుముఖర్జీ కూతురు కోడలు కావాలట! ఆఖరికి చూశావా. ముండాకొడుకు యెల్లాంటి చావు చచ్చాడో—కొడుకు చేత తల కొరివి పెట్టించుకునే రాతకూడా లేకపోయింది. వాడి కులంతక్కువ నోట్లో దుమ్ముపడా?" అని ఆమె కుస్తీ పట్టినతర్వాత రొప్పినట్లుగా రొప్పసాగింది. మాట మాటకూ కులం తక్కువని ఎత్తి పొడవటంవల్ల వేణీ ముఖం మాడిపోయింది. తారిణీఘోషాల్ అతని పినతండ్రే.

రమ ఈ సంగతి గ్రహించి పిన్నిని మందలిస్తున్నట్టుగా—"ఎందుకు పిన్నీ! నువ్వు ప్రతివాళ్లనీ కులమెత్తి మాట్లాడతావు? కులం ఒకళ్లు తెచ్చుకున్నదా? ఎందులో పుట్టినవారి కదే గొప్ప!" అన్నది.

వేణీ సిగ్గుపడుతూనే మందహాసంచేసి—"కాదు, రమా! పిన్ని యదార్థమే చెప్పింది. నీవంటి కులీనులపిల్లని కోడలుగా తెచ్చుకునే అర్హత మాకున్నదా? కక్కయ్య ఈ ప్రస్తావన తేవటమే హద్దుమీరిన పని!—ఇక చాతబడి సంగతా,



అందరికీ తెలిసిందే! ఈ ప్రపంచంలో ఆ భైరవాచారిగారికీ కక్కయ్యకూ సాధ్యం కాని పనేదీలేదు. మళ్ళీ ఈ భైరవుడేనటగా ఇప్పుడు రమేశుకు సలహాదారు?" అన్నాడు.

పిన్ని—వాళ్ళసంగతెవరెరగరు. సరేగాని ఆ గుంటడు పది పన్నెండేళ్ళనించి ఈ ఊరు రాలేదుగదా, ఎక్కడుంటున్నాడు?

వేణీ—నాకేలా తెలుస్తుంది పిన్నీ? కక్కయ్య మీకెంత అనుబంధమో నాకూ అంతేనాయె. వినికిడిమాత్రం బొంబాయిలో వున్నాడని. కొంతమంది డాక్టరు పాసయ్యాడంటున్నారు; కొంతమంది వకీలు; కొందరు అంతా ఉత్తది, వెధవ పక్కా త్రాగుబోతంటున్నారు! కాని ఇంటికొచ్చినప్పుడు మాత్రం వాడి కళ్ళు రెండూ చింత నిప్పులల్లే వున్నాయి.

పిన్ని—నిజంగా! ఐతే వాడినింట్లో కాలు పెట్టనివ్వటమే మంచిదికాదు.

వేణీ హుషారుగా తల ఎగరవేసి—"అంతకాక!—సరే రమా! నీకు రమేశుడు జ్ఞాపకమేనా?" అని అడిగాడు

యు వ

"ఎందుకులేదు! అతను నాకంటే అంత పెద్దవాడు కాదు. అదీకాక, వీధిబళ్ళో మేమిద్దరం కలిసే చదివేవాళ్ళంగా! ఇంకా వాళ్ళమ్మ చనిపోయిన సంగతి నాకు బాగా జ్ఞాపకముంది. అత్తయ్యకు నేనంటే చాలా ప్రాణం" అన్నది.

రమ పిన్నమ్మ ఇంకోమారు చేతులు తిప్పి అంటూ—"దాని ప్రాణంపోట్లో దానిపోట్లో దుమ్మడ! ఆ ప్రేమంతా వాళ్ళ పబ్బం జరుపుకోటానికే. అసలు వాళ్ళ ఎత్తే నిన్నెలాగో—వొకలా చేజిక్కించుకోవాలని!" అన్నది.

వేణీ వెనకటి సంగతులన్నీ యెరిగినవాడి మాదిరిగా ఆమోదిస్తూ—"అందులో యింకా సందేహమా, పిన్నీ? చిన్నమ్మకూడా...."

కాని అతని ఉపన్యాసం పూర్తికాకముందే రమ విసుక్కుంటూ—"ఆ వెనకటివి తవ్వటమెందుకు పిన్నీ?" అన్నది.

రమేశుని తండ్రితో ఎంత వైరమున్నా అతని తల్లివిషయమై రమకు సాభిప్రాయమున్నది. ఆమె తలుపుకొస్తే ఇప్పటికీ దుఃఖం కలుగుతుంది. ఇంత కాలమైనాకూడా ఆమెను రమ మరచిపోలేదు.

వేణీ రమ మాటనుకూడా ఆమోదిస్తూ "ఆ మాటా నిజమే! చిన్నమ్మ కులీనులపిల్ల. మా అమ్మ యిప్పుడుకూడా ఆమె సంగతి వస్తే కంట నీరు పెట్టుకుంటుంది" అని ప్రసంగం అనవసరంగా ఇంకో దాంట్లోకి దిగటం చూసి మార్చాడు: "ఐతే ఇంకేమీ మార్పు లేనట్టేగా?"

రమ నవ్వి—"నాన్న 'అగ్నిశేషం, ఋణశేషం, శత్రుశేషం యెన్నడూ వుంచకూడదమ్మా' అని చెప్పుతూ వుండేవాడు. తారిణీఘోషాల జీవించివుండగా మనల్ని ఎంత వేధించలేదు? నాన్నను జైలులోకూడా వేయించాలని చూశాడు. నేనేమీ మరిచిపోలేదు, వేణీ! ఇకముందు బ్రతికున్నంత కాలంకూడా మరిచిపోను రమేశుడు అతని కొడుకేగా! నాన్న, తమ్ముడికీ నాకూ ఆస్తి పంచిపెట్టిపోయినా కాపాడే భారమంతా నా వొక్కదానిమీదనే వుంది. మేము యెలానూ పోము. మాకు సంబంధమున్న వాళ్ళనుకూడా పోనివ్వము!" అన్నది.

వేణీ కొంచెం దగ్గరికివచ్చి, గొంతు తగ్గించి—"నేనుకూడా ఆ ప్రయత్నమే చేస్తున్నాను రమా? నువ్వు నాకు అండగావుంటే చాలు, నా కింకే చింతా లేదు. రమేశుని గనక ఈ వూరిపంచి వెళ్ళగొట్టకపోతే నాపేరు వేణీఘోషాలు కాదు? ఇక ఆ తర్వాత నేనున్నాను—భైరవాచారిగాడున్నాడు. కాని తారిణీఘోషాలు లేడు. చూస్తాను; ఈ ముండాకొడుక్కి ఇక ఎవరడ్డపడతారో" అన్నాడు.

"రమేశఘోషాలే అడ్డుపడతాడు. చూడు వేణీ! నేను ముందుగానే చెప్పు-




FIST PRI

తున్నాను—పగపట్టటంలో ఆతనుకూడా యెవ్వరికీ తగ్గడు" అన్నది రమ.

వేణీ యింకా కొంచెం ముందుకొచ్చి గడపమీద కూర్చుని, ఒకమాటు చుట్టూ పారచూసి, గొంతు బాగా తగ్గించి—"వెదురుకు వంపు తీయాలంటే యిదే మంచి సమయం. ముదిరిందంటే లాభంలేదు! చూడూ, ఇంకా ఆ స్థిపాస్తి లెలా సంరక్షించుకోవాలో వాడికి తెలియదు. ఇటువంటప్పుడే గనక మనం శత్రువును తుంచి వెయ్యలేకపోతే యికముందు మనవల్ల అసలే కాదు. మనం అహర్నిశలూ వీడు శారిణీ ఘోషాలు కొడుకేనని జ్ఞాపకం పెట్టుకోవాలి; మరోవిధంగా వీణ్ణి చూడకూడదు" అన్నాడు.

"ఆ సంగతి నాకూ తెలుసు, వేణీ!"

"నీకెందుకు తెలియదు రమా? దేవుడు నిన్ను మగవాణ్ణి చేయబోయి ఆడదాన్ని చేశాడు. నీ ముందు మంచి అనుభవమున్న జమీందారుకూడా పనికిరాడని మేము అప్పుడప్పుడనుకుంటూ వుంటాము!—సరే నాకు వేళ మిగిలింది. మళ్ళీ రేపొస్తాను—" అని వేణీ లేచాడు.

ఈ ప్రశంసకు రమ సంతోషించింది. కాని మర్యాదకు కాదని చెప్పాలని లేచి నిలబడింది. ఇంతలో తలవాకిట్లోనుంచి ఎవరో గంభీరస్వరంతో—"రాణీ! ఎక్కడున్నావే!" అని పిలవటం విని రమ హృదయం పులకరించింది. ఈ పేరుతో రమేశుని తల్లి ఈమెను పిలుస్తూవుంది. ఇంతకాలం ఈమె ఆ పేరే మరచిపోయింది.

వేణీఘోషాలు ముఖం నల్లబడింది.

మరు క్షణంలోనే రేగిన జుట్టుతో, కాళ్ళకు చెప్పులైనా లేకుండా రమేశుడు వచ్చి నిలబడ్డాడు. వేణీని చూడగానే—"అన్నయ్యా! నువ్విక్కడే వున్నావా? నిన్ను వెతుకుతూ వూరంతా తిరిగాను. సరే, పదండి—మీరు లేకపోతే అక్కడ పనులెవరు చూస్తారు! ఏదీ, రాణి ఎక్కడ?" అని తలుపుదగ్గరకొచ్చి నుంచున్నాడు. తప్పుకోవాలన్నా మార్గం లేకపోవటంచేత రమ తలవొంచుకుంది. రమేశుడు వొక్కక్షణం ఆమెవంక చూసి ఆశ్చర్యంతో—"ఇదుగో!—అరే! ఎంత పెద్దదానివయ్యావే? బాగా వున్నావా?" అన్నాడు.

రమ అలాగే తలవంచుకుని నిలబడింది. చప్పున యేమీ మాట్లాడలేకపోయింది. రమేశుడు మందహాసం చేసి వెంటనే అన్నాడు: "గుర్తుపట్టగలిగావటే? నేను రమేశుణ్ణి!"

ఇప్పటికీ రమ తలెత్తి చూడలేకపోయింది. "బాగా వున్నారా?" అని మాత్రం అడిగింది.

"ఆఁ బాగానేవున్నాను. కాని నన్ను బహువచనంతో పిలుస్తావెందుకు, రమా?" అని వేణీవంక చూసి మలిసహాసం చేసి—"రమ అన్న ఆ మాట నేనిప్పటికీ మరచిపోలేదు, అన్నాయి! అమ్మ చచ్చిపోయినప్పుడు అది చాలా చిన్నది. ఆ వయసులోనే నా కళ్ళు తుడిచి, బావా నువ్వు ఏడవమాకు, మా అమ్మను మనిద్దరం పంచుకుందాం అన్నది" అని రమవైపు తిరిగి "ఆమాట బహుశా నీకు జ్ఞాపకం లేదనుకుంటాను!—సరేగాని, మా అమ్మన్నా నీకు జ్ఞాపకముందా?" అన్నాడు. ఈ మాటకు రమ తల సిగ్గుతో ఇంకా వాలిపోయింది. "ఆఁ అత్తయ్య జ్ఞాపకమున్న"దని ఒక్కమాటు కూడా తల యెగురవేయలేకపోయింది. రమేశుడు విశేషించి రమ నుద్దేశించే చెప్పనారంభించాడు.

"ఇక వ్యవధికూడా లేదు, మధ్య మూడురోజులే వున్నాయి. అవసరమైన పను లేమిటో కాస్త చేసిపెట్టండి. నా అనేవారు లేని స్థితిలో మీ వాకిటి ముందువచ్చి నిలబడ్డాను. మీరు పూనుకోకపోతే నావల్ల యేమీకాదు."

రమ పిన్నమ్మ మెదలకుండా వచ్చి రమేశునివెనక నిలబడింది. రమగానీ, వేణీగానీ ఇతని ఒక్కమాటకూ జవాబివ్వకపోవటం చూసి, ఆమె రమేశుని యెదుట పడి "బాబూ నువ్వు తారిణీఘోషాలుగారి అబ్బాయివే కదూ?" అని అడిగింది.

రమేశు డీమె నిదివరకు చూడలేదు. రమతల్లి బ్రతికివుండగానే రమేశుడు ఈ ఊరు వదిలిపెట్టాడు. ఇక ఈమె, రమ తల్లికి జబ్బుచేసినప్పుడు ఈ ఇంట్లో కాలు

పెట్టింది; మళ్ళీ బయటికి పోనేలేదు। రమేశునికి ఈమె ప్రశ్న ఆశ్చర్యం కలిగించింది. ఆమెవంక చూస్తూ వుండిపోయాడు.

"లేకపోతే ఇంత సిగ్గెవడు విడుస్తాడు? తండ్రికితగ్గ కొడుకు! చెప్పకుండా పెట్టకుండా సంసారుల ఇంట్లోకొచ్చి అల్లరి అగమూ చేయటానికి నీకు మొఖమెలా చెల్లుతున్నదీ?"

రమేశుడు మతిపోయినవాడిలా నిలబడిపోయాడు. వేణీ తొట్రుపడుతూ నేనూ వెళ్ళుతున్నానని తప్పుకుపోయాడు. రమ ఇంట్లో వుండే అన్నది: "ఏమిటి నువ్వు వాగేది, పిన్నీ? నీ పనిమీద నువ్వు పోరాదూ?"

పిన్నమ్మ అక్కకూతురు సూచించిన దాంట్లో అర్థం గ్రహించా ననుకుని, గొంతులో ఇంకా కొంచెం విషంకలిపి అన్నది: "లోపలున్నది చెప్పటానికి మీ మాదిరిగా నేను మొగమాటపడను. అలా భయపడి పారిపోవటానికి వేణీకేమి అవసరం? చెప్పిపోతే సరిపోయేదిగా 'బాబూ మేము నీ గుమాస్తాలం కాము. నీ కింద ప్రజలం కాము—నీ శ్రాద్ధపు కొంపలో నీళ్లూ విస్తులూ తేటానికీ, పనిపాటలు చేయటానికీ,' అని. తారిణీ చచ్చాడంటే ఊళ్ళోవాళ్ళ ప్రాణాలన్నీ కుదటపడ్డయి. హాయిగా గుండెమీద చెయ్యిపెట్టుకుని నిద్రపోతున్నారు. ఈ రెండుముక్కలూ ఆడదానిచేత అనిపించక తనే మొఖాన అనిపోతే మొగసిరిగా వుండేదిగా" అన్నది.

రమేశుడు అప్పటికీ చలనం లేకుండా కొయ్యలా నుంచున్నాడు. అసలు అలాంటి మాట వస్తుందని ఆతను కలలోకూడా అనుకోలేదు. వంటింటి తలుపు గొళ్లెం ఒకమాటు మోగింది, కాని అదెవరూ వినిపించుకోలేదు. తెల్లపోయిన రమేశుని ముఖం వంక చూస్తూ రమ పినతల్లి మళ్ళీ అన్నది:

"ఏమైనా కానీ. నేను బ్రాహ్మలబ్బాయిని నౌకర్లచేత గెంటించలేను।—పో! ఇక ముందు కాస్త జ్ఞానమున్నపనులు చేయి. పసిపిల్లవాడివన్నా కాదే—పెద్దమనుషుల ఇళ్లల్లో జొరబడి ఒలిపిచేష్టలు చేస్తూ తిరగటానికి! అసలు మీ యింట్లో కాళ్ళు కడుక్కోటానికికూడా రాదు మా రమ—ఆ మాట ముందుగానే చెప్పుతున్నాను."

హఠాత్తుగా నిద్రవించి మేల్కొన్నట్టు మేలుకొన్నాడు రమేశుడు. అతని విశాల వక్షంలోంచి దీర్ఘమైన నిట్టూర్పొకటి వెలువడింది, ఆ చప్పుడుకు అతనే చకితుడయ్యాడు. రమ తలుపు సందువించి చూస్తూనేవుంది. రమేశు డొకమాటు తటపటాయించి తర్వాత వంటయింటివంక చూస్తూ—"రావటానికి వీలులేనప్పుడు చేసేదేముంది!—కాని దీనికింత గ్రంధముందని నాకు తెలియదు. ఎరగక చేసిపోతున్న ఈ ఉపద్రవాన్ని క్షమించు రాణీ!" అని మెల్లగా వెళ్లిపోయాడు. ఇంట్లోనించి చడీ

చప్పుడూ లేదు. ఎవరిని తను క్షమించమని కోరాడో, ఆమె తలుపు సందునించి తనవంకనే చూస్తున్నదని రమేశుడికి తెలియదు.

వేణీ వెంటనే తిరిగివచ్చాడు. అతనెక్కడికీ పోలేదు. బయటే పొంచివుండి అంతా వింటున్నాడు. పిన్నమ్మవంక చూడగానే అతని ముఖం సంతోషంతో వికసించింది. దగ్గరికి వచ్చి—"బాగావడ్డించావు, అత్తయ్యా! అలా మాట్లాడటం మావల్లనవుతుందా? నౌకర్లవల్ల నవుతుందా? నేను చాటునుండి చూశానుగా—వెళ్ళి పోయేటప్పుడు వాడి మొహం నల్లగా బొగ్గల్లే అయిపోయింది! ఏమంటావు—శాస్తి సరిపోయిందా?" అన్నాడు.

తన మర్యాదకు భంగం కలగటంచేత ఆవిడ కొంచెం తిరస్కారంగా "సరిపోయిందని నాకూ తెలుసు. కాని; ఈభారం ఆడంగులమీద వేసి తప్పుకోకుండా నువ్వే అన్నట్లయితే ఇంకా బాగుండేది! పోనీ. నువ్వు అనలేకపోయావనుకో. విలబడైనా నే నేమన్నానో వినెందుకు పోలేదూ? అలా తప్పుకు పోవడంమాత్రం ఏమీ బాగా లేదు" అన్నది.

ఆమె మాటల ధోరణికి వేణీ ముఖంమీది నవ్వు మాయమైంది. ఈ నేరానికేమి సమాధాన మివ్వాలో అతనికి తోచలేదు. కాని యెక్కువసేపు ఆలోచించవలసిన అవసరం లేకుండా పోయింది అతనికి. ఇంతవరకు మాట్లాడకుండా వున్న రమ హఠాత్తుగా—"అసలు మంచిలోకెల్లా మంచి నువ్వు నోరువిప్పటమే! నీకంటే బాగా మాట్లాడేవాళ్లుంటారేమో గాని, విషం కక్కేవాళ్లుమాత్రం లేరు" అని జవాబిచ్చింది.

పిన్నమ్మ కాస్త గుక్క తిప్పుకుని—"ఏమన్నావల్లా?" అన్నది.

"ఏమీలేదు. జపందగ్గర కూర్చుని పదిసార్లు లేచావు. పోయి స్నానం చేయరాదూ? ఇక వంటాగింటా...." అంటూ రమ బయటికివచ్చి యెవరితోనూ యేమీ మాట్లాడకుండా యింకో గదిలోకి వెళ్లిపోయింది.

వేణీ వెలవెలబోయిన ముఖంతో—"సంగతేమిటి, పిన్నీ?" అన్నాడు.

"నా కెలాతెలుస్తుంది బాబూ? ఆ రాణీగారి తత్వం తెలుసుకోటం మనబోటి దాసదాసీల వశా?" అని కోపంతోనూ, క్షోభతోనూ ముఖం మాడ్చుకుని పూజాసనం పైన కూర్చుంది. బహుశా మనస్సులో భగవంతుని స్మరిస్తున్న దనుకోచ్చు వేణీ మెల్లగా వెళ్లిపోయాడు.

## 2

ఈ గ్రామంపేరు శివాపురం. ఈ ఊరి జమీందారీ యెలా వీరిచేతి కొచ్చిందీకూడా



తెలుసుకోవటం మనకు అవసరం. అదిప్పుడే చెప్పుతున్నాను. దాదాపు నూరు సంవత్సరాల కిందట మహాకులీనుడైన బలరామముఖర్జీ తన ప్రాణమిత్రుడైన గోపాల గోషాలును వెంటబెట్టుకుని విక్రమపురంనుంచి ఈ గ్రామం వచ్చాడు. ముఖర్జీ ఉత్త కులీనుడే కాదు—తెలివి తేటలున్నవాడు కూడా. వివాహం చేసుకునైతేనేం. బర్ధ్వాన్ మహారాజాగారి దగ్గర ఉద్యోగం చేసైతేనేం ఈ జమీందారీని చేజిక్కించుకొన్నాడు. ఘోషాలు కూడా ఈ ప్రాంతంలోనే వివాహం చేసుకున్నాడు; కాని, అతనికేమీ లాభించలేదు. ఈ వివాహం వల్ల అతనికి పితృఋణం మాత్రం తీరింది. కటాకటిగా సంసార యాత్ర సాగిస్తున్నాడు. పైగా ఈ వివాహం మూలానే మిత్రులిద్దరికీ చెడింది. ఆ చెడటం యెంతదాకా పోయిందంటే ఒక్క గ్రామంలో ఉంటూకూడా, యిరవై సంవత్సరాల వరకు వొకరి మొహం ఒకరు చూచుకోలేదు. ఆఖరికి

బలరామముఖర్జీ చనిపోయిన నాడుకూడా ఘోషాలు వాళ్ళింట్లో అడుగుపెట్టలేదు. కాని మర్నాడు మహా ఆశ్చర్యకరమైన విషయం ఒకటి బైట పడింది. ముఖర్జీ తన ఆస్తినంతా వెంట్రుకవాసికూడా తేడాలేకుండా తన కొడుక్కీ, మిత్రుని కొడుకులకీ పంచిపోయాడు. అప్పటినుంచే ఈ జమీందారీ ముఖర్జీ వంశీయులూ, ఘోషాలు వంశీయులూ అనుభవిస్తూ వస్తున్నారు. ఈ సంగతి ఘోషాలు వంశీయులే గౌరవంగా చెప్పుకుంటారు—గ్రామస్తులుకూడా కాదనరు.

మన కథాకాలంనాటికి ఘోషాలు వంశం కలవటం, వేరుపడటంకూడా అయింది. వీరిలో చిన్నాయన తారిణీఘోషాలు ఏదో వ్యాజ్యముండి జిల్లాకోర్టుకుపోయి, హియరింగయిన కేసుల తీర్పులనుకూడా లెక్కచేయకుండా, ఎక్కడో ఎరగని కోర్టునుంచి వచ్చిన సమను తీసుకుని, చెప్పాపెట్టకుండా వెళ్ళిపోయాడు. ఈవార్త కువాపురంలోనూ, చుట్టుప్రక్కల గ్రామాల్లోనూ మహా అందోళన కలిగించింది. పెద్దవారి తరపున ఇప్పుడున్న వారసుడు వేణీఘోషాలు. కక్కాయిదావుతో పీడ వదలిపోయిందని చాటుగా నిట్టూర్చి, ఇంటికొచ్చి కక్కాయి శ్రాద్ధం ధ్వంసం చేయాలని రహస్యంగా ముఠాకట్టనారంభించాడు. పది సంవత్సరాలనించి ఇతనూ కక్కాయి మాట్లాడుకుని ఎరగరు. అంటే తారిణీభార్య చనిపోయినప్పటినుంచీ; తారిణీభార్య పోగానే కొడుకును మేనమామలింటికి పంపివేశాడు. అప్పటినుంచీ ఇంట్లో దాసదాసీలతోనూ బయట వ్యాజ్య సాజ్యాలతోనూ కాలంగడుపుతూ వస్తున్నాడు. ప్రెసిడెన్సీ కాలేజీలో చదువుతున్న రమేశుడు ఈ దుర్వార్త విని, తండ్రికి తాను నెరవేర్చవలసిన చివరి కర్తవ్యం నిర్వహించటానికిగాను విన్ననే అంటే పదిసంవత్సరాలకుగాను వచ్చాడు. అసలే శ్రాద్ధపుకొంప. పైగా తనవాళ్లెవరూ లేరు. పొరుగూరువాళ్లుమాత్రం ఒకరూ అరా వస్తూపోతూవున్నారు. ఊళ్లోవాళ్లు ఎవ్వరూ రావటంలేదు. ఈసంగతి రమేశుడు గమనించాడు. బహుశా ముందుకూడా రారని అనుకున్నాడు. శ్రాద్ధం గురువారంనాడే, ఇంకా రెండురోజులుంది. భైరవాచారిమాత్రం ఇంటిల్లపాదీ వచ్చి పనిపాటల్లో సహాయపడుతున్నాడు. ఊళ్లో బ్రాహ్మలువచ్చి గృహాన్ని పావనంచేస్తారనే ఆశ లేకపోయినా, రమేశుడు ప్రయత్నాలు మాత్రం విరివిగానే చేస్తున్నాడు. ఇవ్వాళ రమేశునికి యింట్లో పనులే తెమలలేదు. ఇప్పుడే మధ్యలో యేదోపనుండి బయటికొచ్చేసరికి కచేరిచావిటిలో పెద్దకారు మనుషులిద్దరు తివాసీలమీద కూర్చుని హుక్కా పీలుస్తున్నారు. రమేశుడు వారిదగ్గరకుపోయి పరామరిక చేద్దామనుకుంటూవుండగా వెనక ఏదో చప్పుడు వినపడి తిరిగిచూశాడు. పిల్లా జల్లా ఐదారుగుర్ని వెంటబెట్టుకుని ఒక వందు




ముసలి దగ్గుకుంటూ దగ్గుకుంటూ ప్రవేశించాడు. ఆతని భుజంమీద అంగోస్త్రం. ముక్కుమీద చవుకబారుకళ్ళజోడు-దారంతో వెనకకట్టివుంది. నెరసినగడ్డం. మీసాలూ పొగతగిలి గోధుమరంగుకు తిరిగినవి. అతను రమేశునికి దగ్గరగావచ్చి ఆ చిత్రమైన కళ్లజోడులోంచి ఒకక్షణం రమేశుని వంక చూసి భోరున ఏడ్చాడు. ఈయన ఎవరో రమేశుడెరగడు; అయినా రమేశుడు ఆతని చేయి పట్టుకున్నాడు.

వృద్ధుడు యేడుపుతగ్గించి డగ్గుత్తికతో—"నాయనా రమేశ్! తారిణీ యిలా మోసపుచ్చి పోతాడని నేను కల్లోకూడా అనుకోలేదు! చూడు, అబద్ధాలు చెప్పటానికి నేను భటర్జీవంశంలో పుట్టలేదా? నేను వచ్చేటప్పుడు వేణీఘోషాలు ముఖానే 'అబ్బాయి! మా రమేశుడు శ్రాద్ధంచెయ్యబోతున్నాడు. చూడు: ఇంత భారీగా చుట్టుప్రక్కల పద్నాలుగు గ్రామల్లో ఎవ్వరూ చేయలేదు సరికదా కంటితో చూచికూడా యెరగరు' అనివచ్చాను. అని కాస్త అగి మళ్ళీ అన్నాడు — "నామీద చాలా మంది ముండాకొడుకులు నీదగ్గర యేమేమో పితుర్లు చెప్పుతారు. కాని నువ్వొక్క వంగతి మాత్రం గుర్తుపెట్టుకో. ఈ ధర్మదాసు ఒక్క ధర్మానికే దాసుడు. ఇక నెవ్వరికీకాదు," అంటూ వృద్ధుడు తన సత్యసంధతను తానే చాటుకుని, గోవింద గంగూలీ చేతిలోంచి హుక్కాలాగి, పెద్దపీల్పు పీల్చి దగ్గాడు.

ధర్మదాసు చెప్పినదాంట్లో అతిశయోక్తియేమీలేదు. ఇంత ఆడంబరంగా ఈ వైపున శ్రాద్ధంచేసినవారెవ్వరూలేరు. కలకత్తానించి తీపిసరకు చేయటానికి బొందిలీ

లను పిలిపించాడు. వాళ్లు మెల్లాగానే వాతవైపున పొయ్యిలు తీసి కళాయీలు ఎక్కించారు. ఊళ్ళో పిల్లలు చాలామంది వాళ్ళచుట్టూ ఈగలమాదిరి ముసురుకున్నారు భైరవావారి పంచసాలలో కూర్చుని పైనుతానులు చించుతున్నాడు అలగా జనానికి పంచిపెట్టటానికి. అక్కడ విశ్రాంతిగా కూర్చుని చూస్తున్న కొంతమంది యీ దుబారాఖర్చును లెఖ్ఖవేసి, మనసులో రమేశుని తెలివితక్కువను నిందిస్తున్నారు. ఇంకా రైతులూ, పనిపాటలవాళ్ళూ మెల్లా అంతా కమ్ముకుని వాళ్లల్లోవాళ్లు కీచులాడుకుంటూ అల్లరిచేస్తున్నారు. ఈ వార్త తెలిసి బిచ్చగాళ్ళూ, అలగావాళ్ళూ దూరమారాల్నుంచి రాసాగారు.

ఇక్కడ చుట్టూ జరుగుతున్న దుబారాఖర్చు చూసేవరకు ధర్మదాసుకు దగ్గింకా యెక్కువైంది. రమేశునికేమీ పాలుపోలేదు. ఏదో సమాధానమిద్దామని నోరు తెరవగానే ధర్మదాసు రమేశుని చేత్తో వారించి బడబడ యేదో అన్నాడు. కాని దగ్గుతూ వుండటంవల్ల ఒక్క అక్షరంకూడా యెవ్వరికీ తెలియలేదు.

నిజానికి యిక్కడికి అందరికంటే ముందొచ్చింది గోవిందగంగూలీ. కాని, ఏమి లాభం? ఈ ధర్మదాసు చెప్పిన నాలుగుమాటలు తనే ముందు చెప్పటానికి వీలుండికూడా పాడుచేసుకున్నాడు; ఇలాంటి మంచి అవకాశం చేయిజారి పోయినందుకు మనసులో దుఃఖించి, ఇకముందు ఆ పొరపాటు పడకూడదని నిశ్చయించుకుని ధర్మదాసు నుద్దేశించి అన్నాడు:

“నిన్న ఉదయం... జ్ఞాపకముందిగా, ధర్మదా? ఇక్కడికొద్దామని బయలుదేరాము కదూ?.... వేణీ దోవలోనే అడ్డుతగిలి—గోవిందమామా, హుక్కా ఒకపట్టు పట్టిపో”మ్మని పిలిచాడు. నేను మొదట పోవద్దనుకున్నాను, కాని తర్వాత అతనిధోరణెలావుంటుందో చూద్దామని వెళ్లాను. వేణీ యేమన్నాడో విన్నావూ, రమేశ్:— ‘మామా! మీరంతా వాడికొమ్ము వేశారు కామాలు! ఇంతకూ యెవరన్నా వచ్చి తింటారా?’ అన్నాడు. అప్పుడు నేనుమాత్రం వొదులుతానా? అతనెంత కలవాడైనా మా రమేశుని ముందు ధూపానికి పనికిరాడు. అతని ఇంటిముందుకు పోయి గుప్పెడు గింజలు తెచ్చుకున్న పాపాన యెవ్వడూ పోలేదు—‘వేణీ బాబూ! ఈ దోవనే గదా జనం రాకపోకలు కాసేపు బయటవుండి చూడకూడదో?’ అన్నాను. నిజానికి ఏళ్ళకు చిన్నయినా యీవికి రమేశునే చెప్పుకోవాలి! ఇన్నేళ్లు వచ్చినై నాకు. ఇలాంటి సన్నాహాలు నే నెక్కడా చూడలేదు బాబూ! అసలు ధర్మదా, యిలాంటి పనులు మన వల్ల నేమవుతై! ఇదెవరి కార్యమో ఆయన పైనుండి చేయించుకొంటున్నాడు. తారిణీ దాదా మామూలుమనిషి కాదు—శాపవశాన భూలోకంలో పుట్టిన దేవత!’



ధర్మదాసుకు తెర ఆగలేదు—దగ్గుతూనే వున్నాడు. తనయెదటే గంగూలీ ఈ ప్రపంచానుభవం లేని కుర్ర జమీందారుకు తియ్యతియ్యని మాటలు చెప్పటం చూసి, ధర్మదాసు ఇంకా మంచివి చెప్పాలని ప్రయత్నించి ఉక్కిరిబిక్కిరై పోతున్నాడు. గోవిందగంగూలీ ఆగలేదు. చెప్పుకుపోతున్నాడు :

"నువ్వు నాకు పరాయివాడివి కాదు, నాయనా—సొంతవాడివే! మీ అమ్మ మా మేనమామ పెళ్లానికి సయాము వదినెకూతురు. రాధానగరంలో బెనర్జీల ఆడపడుచు... ఈ సంగతులన్నీ మన తారిణీకి తెలుసు. అందుకనే అశుభానికీ శుభానికీ, సాక్ష్యానికీ శాప్పానికీ నన్ను పిలుస్తూవుండేవాడు."

ధర్మదాసుకు మంటెక్కుతూ వుంది. ప్రాణాలన్నీ వొడ్డి దగ్గునాపుకుని భగ్గుమన్నాడు: "ఎందుకోయ్ ఆ తప్పుడుకూతలు, గోవింద్! క్ష—క్ష—క్ష—నేను ఈనాటివాడనా; నాకు తెలియదూ? గోదతగువుల్లో సాక్ష్యానికి రమ్మంటే 'నాకు చెప్పుల్లేవు. ఉత్తకాళ్ళతో ఎలా నడవగల'నని చెప్పలా?—క్ష—క్ష—క్ష—తారిణీ అప్పుడే నీకు రెండురూపాయలు పెట్టి చెప్పులు కొనిపెట్టలా? అవి తొడుక్కునిపోయేగా నువ్వు

వేణీ తరపున సాక్ష్యం చెప్పవచ్చింది: క్ష-

"చెప్పవచ్చానూ?" అని గోవిందుడు కళ్లెర్రచేశాడు.

"చెప్పిరాలా?"

"ఫో, తప్పుడాడా!"

"తప్పుడాణ్ణి నేనుకాను, నువ్వూ, నీ బాబూ!"

"ఆఁ! దొంగముండాకొడకా!" అని గోవిందుడు విరిగిపోయిన గొడుగు తీసుకుని పైకొచ్చాడు. ధర్మదాసు చేతిలో వెదురుకర్ర పైకెత్తి హుంకరించి పెద్దగా దగ్గాడు. రమేశుడు వ్యాకులపాటుతో ఇద్దరి మధ్యకూ వచ్చి స్తంభించిపోయాడు. ధర్మదాసు కర్రదించి కింద కూలబడి—"ఆ ముండాకొడుక్కి నేను వరసకి అన్న నవుతాను, చూడూ వాడి పొగరు!" అన్నాడు.

"ఈ రండాకొడుకు నా కన్న అవుతాడట!" అంటూ గోవిందుడుకూడా గొడుగు దించి కూర్చున్నాడు.

పట్నంనించి మిఠాయి వండటానికొచ్చిన బొందిలీలు బాణలి వదలిపెట్టి తొంగి చూడ నారంభించారు. మెల్లాలో ఇంకా యితరపనులు చేసేవాళ్ళంతా పనులొదిలి వింత చూడ నారంభించారు. రమేశుడు సిగ్గుతోనూ, విస్మయంతోనూ దిగ్భ్రమచెంది నుంచున్నాడు. అతని నోటివెంట ఒక్కమాటకూడా వెలువడలేదు—ఇద్దరూ ఘనానా మనుష్యులు; పెద్దవారు; బ్రాహ్మలు! ఇంత స్వల్ప కారణానికి అలగా వాళ్లమాదిరి తిట్టుకోగలరా?

వరండాలో కూర్చుని గుడ్డలు చింపుతున్న భైరవుడు ఈ తగువంతా వింటూనే వున్నాడు. అతనేమీ ఆదుర్దాకనబరచలేదు. చింపాడగా గుడ్డలు పోగువేసి రమేశుని వద్దకువచ్చి తాపీగా—"నాలుగొందలు చింపాము, ఇంకా కావాలా?" అని అడిగాడు.

రమేశుడు చప్పున సమాధానం చెప్పలేకపోయాడు భైరవుడు రమేశుని వెంబేలుతనంచూసి గోవిందుని మందలిస్తున్నట్టుగా—"ఛీ, గంగూలిగారూ! చినబాబు చూడు, ఎలా బిత్తరపోయాడో!....మీరేమి పెట్టుకోకండి, చినబాబుగారూ! ఇలా రోజూకు వందలొతూ ఉంటై. పెద్ద కార్యాలు చేస్తూవున్న ఇళ్ళల్లో అప్పుడప్పుడూ నెట్టులాటలూ, కొట్లాటలుదాకా రావటంకద్దు—పెళ్ళి వాటంతట అవేసమసిపోవటం కద్దు....లేండి. చటర్జీగారూ—చూడండి, ఇంకా తాను చింపాల్సి ఉంటుందా?" అన్నాడు.

ధర్మదాసు జవాబు చెప్పకముందే గోవిందుడు ఉత్సాహంతో లేచినుంచుని, తల

ఎగురవేసి—"ఎందుకురావూ? ఎందుకు సమిసిపోవూ! లేకపోతే పెద్దకర్మవి యెందు కొచ్చిందీ? మాటమీదమాట. లక్షమాటలు జరగంది పెళ్ళికాదని శాస్త్రాల్లోనే ఉంది. నీకాయేటిసంగతి జ్ఞాపకమున్నదా, భైరవ్? ముఖర్జీగారవామ్మాయి రమ చెట్టుకు పెళ్ళి చేసినప్పుడు భోజనాలదగ్గర రాఘవభట్టాచారీ, హారాన్ చటర్జీలు తలలు పగుల గొట్టుకోలేదా? ఏముంది, అందులో బ్రహ్మాండం!....సరే, గుడ్డల విషయంలో నా అభిప్రాయమేమంటే రమేశుడు తప్పుదోవ తొక్కాడని! అలగావాళ్ళకి గుడ్డలివ్వడం బూడిదలో నెయ్యిపోయటం సమానం. అంతకంటే ద్విజులకు జతా, బ్రహ్మవారులికి ఒక్కటీ చొప్పున యిస్తే చాలా కీర్తివస్తుంది. ఇలాగే చేయమని నేను మన రమేశుని కోరుతున్నాను. నువ్వేమంటావు ధర్మదా!" అన్నాడు.

ధర్మదాసు ఆమోదిస్తూ—"గోవిందుడు చెప్పింది ఆలోచించతగ్గదే అబ్బాయీ! ఆ ముండాకొడుకులికి ఎంతిచ్చినాసరే పేరుప్రతిష్టలు రావు. లేకపోతే వాళ్ళని అలగా వాళ్ళని యెందుకంటారు?" అన్నాడు.

రమేశుడింతవరకు మెదలకుండా ఉన్నాడు. ఈమాటలు అతని మనస్సును చాలా నొప్పించినై. అతనిమనస్సు నొవ్వటానికి కారణం వాళ్ళిచ్చిన సదుపదేశ దురుపదేశాలు కావు; ముఖ్యంగా వీళ్లు యెవళ్ళనైతే అలగావాళ్ళని ఎద్దేవాగా మాట్లాడారో అలాంటివాళ్ళ ఎదుట—పేలమంది ఎదట ఈ సిగ్గుచేటయినపని చేశారు! పైగా చేసినందుకు వీరిలో యెవరికీ పశ్చాత్తాపంగానీ, సిగ్గుగానీ లేదు!

భైరవుడు తనవంకనే చూస్తూవుండటం కనిపెట్టి, రమేశుడు—"ఇంకా రెండు వందలు చింపండి" అన్నాడు క్లుప్తంగా.

"అంతమాత్రం లేకపోతే యెలా? పద, భైరవ్ నేనుకూడా వస్తున్నాను—నువ్వొక్కడివి ఎన్నని చింపుతావు?" అని ఒకరి అనుమతి అవసరంలేకుండానే గోవిందుడు లేచి గుడ్డల పొత్తులదగ్గరకుపోయి కూర్చున్నాడు.

రమేశుడు యింట్లోకి పోదామని బయలుదేరగానే ధర్మదాసు అతన్ని ఒకప్రక్కకు పిలుచుకెళ్లి మెల్లగా యేమేమో చెప్పాడు. రమేశుడు వాటికి జవాబుగా తలయెగర వేసి, ఆమోదం తెలుపుతూ యింట్లోకి పోయాడు. గుడ్డలు చింపుతున్న గోవిందుడు యిదంతా ఓరకంట చూస్తూనే ఉన్నాడు.

"ఏడీ? చినబాబు యెక్కడున్నాడు?" అంటూ వడలిపోయిన ఒక ముసలి బ్రాహ్మడు ప్రవేశించాడు. ఆయనవెంట ముగ్గురుపిల్లలు. అందరిలోకీ పెద్దది ఆడ పిల్ల. ఆమె కట్టుకున్న దోరియాపరికిణీ బొత్తిగా చివిగిపోయింది. కుర్రవాళ్లిద్దరికీ

పిరుదులు దిగని చడ్డీ అంతే. యిక వంటిమీద యేమీలేదు.

అక్కడ కూర్చున్నవాళ్లంతా తలయెత్తి వీళ్ళని చూశారు. గోవిందుడు ఆయన్ని ఆహ్వానించాడు: "రా, దీనూదా కూర్చో! మీ రాకవల్ల మా అదృష్టం పండింది. మనబ్బాయి ఒక్కడూ నానా తిప్పలు పడుతుంటే మీరు—" ధర్మదాసు గోవిందుని వంక ఉరిమి చూశాడు. అతనని లెక్కచేయకుండానే—"ఒక్కరూ ఈ చాయలకు రాలేదు!" అంటూ పూర్తిచేసి హుక్కా అందిచ్చాడు.

దీనూ భట్టాచారి కూర్చుని, ఆరిపోయిన హుక్కా అనవసరంగా రెండు మూడు పీల్పులు పీల్చి—"నేనిక్కడ లేనురా అబ్బాయి! కోడల్ని తీసుకు రావటానికి వియ్యంకు డింటికెళ్లాను. చినబాబేడీ? చాలా పెద్ద ప్రయత్నాలే చేస్తున్నాడటగా— నేను దోవనొస్తూ ఆవూరి సంతలో విన్నాను—షడ్రసోపేతంగా భోజనాలు పెట్టి, చిన్నా పెద్దా తేడాలేకుండా ఒక్కొక్కళ్ళకు రెండు జోళ్ళ మిఠాయిఉండలూ, జోడు కోవాముద్దలూ ఇస్తారటగా?" అన్నాడు.

గోవిందుడు గొంతు తగ్గించి—"ఇంకా ధోవతులు కూడా దొరక వచ్చు దీనూదా!" అని వస్తున్న రమేశుని చూపించి—"ఇతనే మన రమేశుడు. ఏదో తమబోటి పెద్దలు నలుగురి ఆశీర్వాదంతో నే నెలాగో ఈ ప్రయత్నాలన్నీ చేయించు కుంటూ వస్తున్నాను. కాని, ఈ వేణీ నావెంట పడుంకట్టుకుని పడ్డాడు గదా! రెండు సార్లు మనిషిని పంపాడు! పోనీ నా సంగతి వదులుదాము. ఎందుకంటే నాకూ రమేశునికీ రక్తసంబంధం ఉంది. ఎలానూ నేను పైన వేసుకోక తప్పదు" అని రమేశునితో—"కాని, ఈ దీనూదా ధర్మదాసు మాత్రం నిన్ను వదలి వెడతా రను కున్నావా? దీనూదా దోవలోనే యీ కబురువిని పరిగెత్తుకుంటూ వచ్చారు.... ఒరేయ్ షష్ఠీ! హుక్కాలో పొగాకు వేసి పోరా!—నాయనా రమేశ్! ఒక్కమాటిలారా. నీతో ఒక మాట చెప్పాలి" అని రమేశుని చాటుకు పిలుచుకుపోయి—"ధర్మదాసు భార్య యింటోకి వస్తుందా?....అలాంటి పొరపాటెప్పుడూ పడబోకు నాయనా! వాడు గజటక్కరి. నిన్ను సులభంగా మైదుపుచ్చాలని చూస్తున్నాడు. వాడి భార్యకు సరకుల కొట్టు తాళంచెవి గాని ఇచ్చేవు సజ్జా! బియ్యమూ, పిండీ, నెయ్యీ, నూనే, ఉప్పూ, పప్పూ సగానికి పైచిలుకు దాటేస్తుంది. అసలు నీకావిషయమై దిగులెందుకు నాయనా! నేవెళ్ళి మీ అత్తయ్యను పంపుతాను. ఆమె వచ్చి చిల్లర మల్లర పనులు చూస్తూ వస్తువులు కనిపెట్టి వుంటుంది. ఎంత జాగర్తమనుకున్నావు? ఆలా కాటి కావలి యెవ్వరూ కాయలేరు!"

"చిత్తం!" అన్నాడు రమేశుడు తల ఎగురవేసి. ఇకేమీ మాట్లాడలేదు. అతనికి




పెద్ద ఆశ్చర్యం వేసింది—ధర్మదాసు తన భార్యను పంపుతానని ఇంత గోప్యంగా చెప్పేనే, గోవిందు దది యెలా ఊహించగలిగాడు? అని.

దినవాంటితో వున్న పిల్లలిద్దరు పరుగెత్తుకుంటూ వచ్చి దీనూ భుజాల మీద యెక్కుతూ—"తాతా! మిఠాయి పెట్టవూ?" అని అన్నారు.

దీనూ ఒకమాటు రమేశునివైపూ, గోవిందునివైపూ చూసి—"ఎక్కడుందిరా మిఠాయి?" అన్నాడు.

"అదిగో అక్కడ చేస్తున్నారు" అని వాళ్లు బొందిలీలవైపు చూపారు.

"మాక్కూడా తాతయ్యా!" అని ముక్కుతో ఏడుస్తూ యింకా ముగ్గురు నలుగురు పిల్లలు పరుగెత్తుకుంటూ వచ్చి ధర్మదాసు చుట్టూమూగారు.

"సరే, ఏడవకండి" అంటూ రమేశుకు ముందుకొచ్చి—"ఆచారిగారూ! పిల్లలంతా యింటినుంచి వేళమిగిలి వచ్చినట్టుగా వుంది. ఏమీ తినిరాలేదనుకుంటాను." అని మిఠాయి వండేవాళ్ల వంకచూసి—"ఏయ్! నీ పేరేమిటి? ఆ పళ్లెమిలా పట్టుకురా" అని కేకవేశాడు.

బొందలీ మిఠాయి పళ్లెం తీసుకురాగానే పిల్లలంతా ఒక్కమాటుగా దానిమీద విరుచుకు పడ్డారు. పంచి పెట్టడానికూడా అవకాశ మివ్వలేదు. పిల్లలు రెండు చేతులతో బొక్కుతూవుంటం చూసేవరకు దీనూ నోట్లో నీరూరింది. "ఒసే ఖేందీ! ఊరక బొక్కుతున్నావు గాని మిఠాయి యెలా వుంది?" అన్నాడు.

"బాగావుంది తాతా!" అని ఖేంది నమలసాగింది.

దీనూ మందహాసంచేసి, తల అడ్డంగా తిప్పుతూ—"మీకేం తెలుసూ రుచి, తియ్యగా వుంటే సరిపోయె....సరేగాని మేస్త్రీ! ఆ కళాయి యే పాకంలో దింపావు?....ఏమి గోవిందూ, ఇంకా పొద్దెంత వుంది?" అన్నాడు.

"చిత్తం, చాలావుంది. ఇంకా సందెకృత్యాలు—" అన్నాడు బొండిలీ.

"ఐతే మా గోవిందు కొంకటివ్వు, కొరికి చూస్తాడు! నీ కలకత్తా పనితన మేమిటో తేలాలి!....ఉహూఁ నా కెందుకు? ఆఁ—ఐతే సగం—సగానికెక్కువ వద్దు!.... ఒరేయ్ షష్ఠీ! కాసినినీళ్లు పట్టుకురా! చేతులు కడుక్కోవాలి!"

"విస్తళ్లుకూడా నాలుగు పట్టుకురా!" అని రమేశుడు కేక వేశాడు. దొరగారి ఆజ్ఞప్రకారం షష్ఠి విస్తళ్లూ, నీళ్లగ్లాసులూ తెచ్చాడు. చూస్తూ వుండగానే పెద్ద పళ్లెంలో సగం మిఠాయికి పైచిలుకు, మలేరియాతో కృశించిపోయిన ముగ్గురు వృద్ధుల ఫలహారంకిందా వెళ్ళిపోయింది.

"ఊఁ, కలకత్తా పనివాడని ఒప్పుకోవచ్చు! ఏమంటావు ధర్మదా?" అని దీనూ నిట్టూర్చాడు. ధర్మదాసు పనింకా పూర్తికాలేదు. అంచేత, గొంతుకు అడ్డంవున్న మిఠాయిని భేదించుకుని అతని సమాధానం బయటికి రాలేదు. అయినప్పటికీ ఈ విషయంలో తన కభిప్రాయభేదం లేదని ఏదోవిధంగా వ్యక్తం చేయగలిగాడు.

గోవిందుడు అందరికంటే వెనక పూర్తిచేసి—"ఆ, మొనగాడి చెయ్యే" అని చెయ్యి కడుక్కోబోతూ వుండగా బొండిలీ వినయంతో—"ఇంత శ్రమ యెలానూ పడ్డారు. కాస్త జిలేబీకూడా రుచిచూడండి" అన్నాడు.

"జిలేబా? ఏదీ తీసుకురా చూద్దాం?"

జిలేబీ వచ్చింది. ఇంత మిఠాయి తిని ఉన్నమీదటకూడా ఇంత జిలేబి సద్వినియోగం కావటం రమేశుడు మెదలకుండా చూస్తూ ఉండిపోయాడు.

దీనూ మనమరాలివంక చూసి—"ఖేందీ! ఇవిగో, ఈ రెండు జిలేబీలూ పట్టుకో!" అన్నాడు.

"నేనిక తినలేను తాతా!" అన్నది ఖేంది.

"బాగానే తినగలవులే! కాస్తె గొంతు తడుపుకో—తీపికి మొహం కొట్టి వుంటుంది, లేకపోతే చెంగున కట్టుకోరాదూ. రేపు ప్రొద్దున తిందువు గాని....ఆఁ! బాబూ! తృప్తిగా పెట్టావు! అమృతంలాగా వుంది! సరే గాని, తీపి రెండు రకాలేనా చేయించింది?"

రమేశుడు జవాబివ్వ నవసరం లేకపోయింది. బొండిలియే ఉత్సాహంతో

"క్షీరమోహన్—రసగుల్లా—" ఏకరువు పెట్టాడు.

"ఆఁ! రసగుల్లా? ఏదీ, తీసుకురాలేదే?" అని దీనూ విస్తుపోతున్న రమేశునివంక చూసి—"ఒక్కసారిమాత్రం నేను రాధానగరంలో బోసుగా రింట్లో తిన్నాను. అదిప్పటికికూడా నోట్లో ఉన్నట్టుంటుంది. చెపితే నువ్వు నమ్మవుగాని, అబ్బాయీ! నాకు రసగుల్లాలంటే భలే ప్రాణం!" అన్నాడు.

రమేశుడు నవ్వుతూ తల ఎగురవేశాడు. ఈ మాట నమ్మటం అతనికంత కష్ట మనిపించ లేదు. ఇంతలో ఏదో పనిమీద గొల్లతను బయటికిరాగా రమేశుడు అతన్ని పిలిచి—"లోపల ఆచారి వున్నట్టుగా వుంది. పోయి, నేను రసగుల్లాలు తీసుకు రమ్మన్నానని చెప్పు!" అన్నాడు.

పొద్దు కూకవచ్చింది. అయినా బ్రాహ్మలు రసగుల్లాలమీది ఆశతో యెదురుచూస్తూ కూర్చున్నారు! కాసేపటికి గొల్లతను తిరిగొచ్చి — "ఇవ్వాళిక భండారగృహం తెరవరట బాబుగారూ!" అన్నాడు

రమేశునికి మనస్సులో విసుగేసింది; "పోయి నేను తెమ్మన్నానని చెప్పు!" అన్నాడు. గోవిందగంగూలీ రమేశుని విసుగుదల కనిపెట్టి—"చూశావా దీనూదా! భైరవుడి తెలివి? ఇదే కన్నమ్మకంటే పిన్నమ్మకి నొప్పెక్కువనటం! అందుకనే నేను చెప్పేది—"

అతను చెప్పేదేమీ వినకుండానే గొల్లతను అన్నాడు: "ఆచారిగారేమి చేస్తారు! పెద్దమ్మగారొచ్చి భండారానికి తాళం వేసిరి!"

ధర్మదాస గోవిందులు చకితులై—"ఏ పెద్దమ్మగారూ?" అన్నారు.

"పెద్దమ్మ వచ్చిందా?" అన్నాడు రమేశుడు ఆశ్చర్యంతో.

"చిత్తం. బాబయ్యా! వారొచ్చే భండార గృహాలు రెంటికీ తాళాలు వేశారు" అన్నాడు గొల్ల.

ఆశ్చర్యంతో ఇకేమీ మాట్లాడలేక రమేశుడు చకచక ఇంట్లోకి వెళ్లాడు.

## 3

"పెద్దమ్మా!"

కేకవిని విశ్వేశ్వరి భండార గృహంలోనించి బయటి కొచ్చింది. వేణీ ప్రాయంతో పోల్చి చూసుకుంటే ఈమెకు యాభై సంవత్సరాలకు తక్కువ వుంట వని అనుకోము. కాని చూపులకు నలభై దాటినదానిలా కనపడుతుంది. ఇప్పుడు కూడా అదే పచ్చి పసుపుకొమ్ము రంగు. ఈమె చక్కదనం ఒకప్పుడు ఈ

ప్రాంతంలో ప్రసిద్ధి. నేడుకూడా ఆ లోటులేని సౌందర్యం ఆమెను వదిలిపెట్టి పోలేదు. తల వెంట్రుకలు కురచగా కత్తిరించటంచేత ముందువైపు జూలునొకటిమీద పడుతున్నది. గడ్డమూ, చెక్కిళ్ళూ, పెదవులూ, నొసలూ అన్నీ యేదో గొప్ప శిల్పి చేసిన ఎంతో సాధనకు ఫలితమా అన్నట్లున్నాయి. అన్నిటికంటే ఆశ్చర్యమైనవి ఆమె కళ్లు. ఒక్కక్షణం వాటివైపు చూసేటట్టయితే ఎవరి హృదయమైనా సమ్మోహిత మవుతుంది!

ఈమె రమేశుని, ముఖ్యంగా చనిపోయిన ఇతని తల్లిని వున్నప్పుడు చాలా ప్రేమించేది. కోడరికంలో—అప్పటికి వీరికంతా సంతానం కలుగలేదు—అత్తా, ఆడుబిడ్డల బాధలకు సహించలేక తోడుకోడళ్ళిద్దరూ స్నేహసూత్రంతో కట్టబడ్డారు. తర్వాత రెండు కుటుంబాలూ వేరుపడటం, వ్యాజ్యసాజ్యాలూ—ఇలాంటి తుపానులెన్నో ఈ రెండు కుటుంబాలమీదుగా వీచినై. ఈ తగువులలో వీరిద్దరికీ మధ్యనున్న స్నేహబంధం సడలిందిగాని తెగిపోలేదు. ఇప్పుడు యెంతో కాలానికి, తోడుకోడలి భండారగృహంలో ప్రవేశించి, ఎప్పుడో తను చక్కబెట్టిపోయిన పురాతన పాత్రసామగ్రివంక చూసేవరకు ఆమె కళ్ళవెంట నీరు కారసాగింది. ఆమె కళ్లు తుడుచుకొని గదిలోనించి బయటికిరాగానే రమేశుడు తడిగానూ, ఎర్రగానూ వున్న ఆమె కళ్ళవంక చూసి ఆశ్చర్యపోయాడు. విశ్వేశ్వరి ఇది గ్రహించిందనుకుంటాను. ఈ తండ్రిలేని నా అనేవారులేని రమేశుని చూడగానే ఆమె హృదయం అవురుమన్నది. కాని ఆమె దాన్ని బయటికి రానివ్వలేదు. పైగా మందహాసం చేస్తూ—"గుర్తించావా రమేశ్" అన్నది.

జవాబియ్యబోయేవరకు రమేశుని పెదవులు వణికినై. తల్లి చనిపోయిన పిమ్మట ఇతను మేనమామల ఇంటికి పోయేవరకూ ఈ పెత్తల్లే ఇతన్ని ప్రాణపదంగా పెంచింది. ఏమాత్రం యేమరేదికాదు. రమేశునికది జ్ఞాపకంవచ్చింది. ఇంకా, మొన్నవారింటి కెళ్ళితే పనిమనిషిచేత లేరని చెప్పించి, ముఖం తప్పించటంకూడా జ్ఞాపకమొచ్చింది. తర్వాత రమ యింటికిపోవటం, రమ పినతల్లి వేసే ఉంకగానూ లేనప్పుడూ తిట్టినతిట్లూ చూసి ఇక ఈగ్రామంలో తనవారెవరూలేరని రమేశుడు నిశ్చయించుకున్నాడు.

విశ్వేశ్వరి ఒక్కక్షణం రమేశుని ముఖంవంక చూచి "ఛీ, ఇలాంటి సమయంలో బేజారు కావచ్చునా? గుండెదిటవు తెచ్చుకోవాలి నాయనా!" అన్నది.

ఆమె గొంతులో ఏమాత్రం మెత్తదనంలేదు రమేశుడు తన్నుతాను సంబాళించుకున్నాడు. అభిమానానికి విలువలేనిచోట అభిమానం చూపబోవటం (అలగటం.



కంటే తెలివితక్కువ ఈ ప్రపంచంలో మరొకటి లేదనికూడా గ్రహించాడు.)

"నేను బాగానే గుండెనిబవు తెచ్చుకున్నాను, పెద్దమ్మా! అందుకనే నాచేత నైనమట్టుకు నేనే చేసుకుంటున్నాను. మళ్ళీ నువ్వు ఎందుకొచ్చావూ?"

విశ్వేశ్వరి నవ్వి—"నువ్వు నన్ను పిలుచుకురాలేదుగా, రమేశ్! నీకు నేను సంజాయిషీ యివ్వటానికి? సరే, నేను చెప్పేదివిను, కర్మకాకముందు ఈ ఇంట్లోనించి తినుబండారాలేవీ నేను బైటికి పోనివ్వను! కావాలంటే, నేనింటికెళ్ళే టప్పుడు తాళంచెవి నీకిచ్చి మళ్ళీ ఉదయంరాగానే తీసుకుంటాను. తాళంచెవి ఇకెవ్వరిచేతికీ యివ్వకు!....సరేగాని ఆవాళ మీ అన్నాయి కనపడ్డాడటరా?" అన్నది.

ఈ ప్రశ్న రమేశుని సందిగ్ధంలో పడవేసింది. తన కొడుకు సంగతి ఆమెకు తెలుసునోలేదో కూడా, ఇతను సరిగ్గా ఊహించలేకపోయాడు. అందుకనే, కాస్తై ఆలోచించి—"అన్నాయి అప్పుడింట్లో లేడుగా" అన్నాడు.

విశ్వేశ్వరి ఏహోమాట వరుసకు ఆ ప్రశ్న వేసిందేగాని చాలా కళవళపడింది. ఆ సంగతి ముఖలక్షణాలనుబట్టి రమేశుడు గ్రహించాడు. ఇప్పుడీ సమాధానంతో ఆ కంగారు పోవటంకూడా కనిపెట్టాడు

విశ్వేశ్వరి నవ్వుముఖంతో బ్రతిమాలుతున్నట్టుగా—"పాడు రాత! ఇదేనా నీకు తెలిసింది? కనపడలేదని మళ్ళీపోవటం మానుకుంటారటరా ఎక్కడైనా? నీమీద వాడికంత ఇష్టంలేదని నాకు తెలుసు. ఐనా నీపని నువ్వు చెయ్యాలిగా! ఒకమాటుపోయి కాస్తై తీరిగ్గా అడిగిరా. పో! ఎలాగైనా వాడు పెద్దవాడు. వాడి దగ్గర లొంగినా నీకు చిన్నతనంలేదు. అదీకాక, ఇవి మనకు మంచిరోజులుకావు నాయనా! అయినవాళ్ళనీ, కానివాళ్ళనీ కాళ్ళావేళ్ళాపడి పిలుచుకొచ్చుకోవాలి. దీంట్లో సిగ్గెందుకూ? పో. మా నాయనవుకదూ! వాడిప్పుడింట్లోనే ఉంటాడను కుంటాను" అన్నది.

రమేశుడు మాట్లాడలేదు. ఇంతగా బతిమాలటానికి ఆమెకేం అవసరమోకూడా ఇతని కంతుపట్టలేదు—మనసులోని సందేహంకూడా తీరలేదు.

విశ్వేశ్వరి యింకా దగ్గరకువచ్చి, మెల్లగా—"అదిగో, అక్కడ కూర్చున్న వాళ్లని నేను నీకంటే బాగా యెరుగుదును. వాళ్ళ మాటలు వినకు! రా నావెంట. మీ అన్నయ్య దగ్గరికి వెళ్ళి వద్దాం" అన్నది.

రమేశుడు రానన్నట్టు తల ఊపుతూ—"కాదు, పెద్దమ్మా, రావటానికి వీల్లేదు. ఆ బయట కూర్చున్నవాళ్లు ఎలాంటివాళ్ళయినా సరే, వాళ్ళే నాకందరికంటే దగ్గరి వాళ్లు—" అని, ఇంకా యేమో అనబోతూ విశ్వేశ్వరి ముఖం చూసి విస్తుపోయి మెదలకుండా ఊరుకున్నాడు. పెత్తల్లిముఖం ఈ సందెచీకటికంటేకూడా నల్లబడిందని అతనికి తోచింది.

విశ్వేశ్వరి కాసేపుండి నిట్టూర్చి—"సరే, అంత రావటానికి వీల్లేనప్పుడు, వాడిని గురించి మాట్లాడిమాత్ర మేమి లాభం? నువ్వేమీ దిగులుపడమాకు నాయనా. ఏమీ దిగుబడిపోదు. రేపు పొద్దున్నే మళ్ళీ నే నొస్తాను" అని దాసీని వెంటబెట్టుకుని వెనక వాకిలిగుండా మెల్లగా వెళ్ళిపోయింది. వేణీ, రమేశుడూ యీమధ్య కలిశారనీ, ఏదో జరిగికూడా వుంటుందనీ ఆమె గ్రహించింది.

ఆమె వెళ్లినవైపే కాసేపు నిశ్చబ్దంగా చూస్తూ నిలబడి, వాడిపోయిన ముఖంతో రమేశుడు బయటికి రాగానే గోవిందుడు ఆదుర్దాగా—"అబ్బాయీ! ఆ వచ్చింది పెద్దావిడే కదూ?" అని అడిగాడు.

రమేశుడు అవునన్నట్టు తల తిప్పాడు.

"భండారగృహం తాళపుచెవులు తీసుకెళ్లిందటగా?"

రమేశు డలాగే మళ్ళీ తల తిప్పాడు. కారణం, వెళ్ళేటప్పుడు ఏమనుకున్నదో, తాళపుచెవు లివ్వకుండానే పట్టుకెళ్ళింది విశ్వేశ్వరి.

"చూశావా ధర్మదా! నేను చెప్పినంతా అయింది. ఇప్పటికైనా సంగతి సంద ర్భాలు గ్రహించావా, అబ్బాయి!" అన్నాడు గోవిందుడు.

రమేశుడు లోలోపల ఉడికిపోయాడు. కాని, తన అసహాయ స్థితిని తలుచుకుని మెదలకుండా ఊరుకున్నాడు.

దీనూ భట్టాచారి యింకా ఇంటికి పోలేదు. అతను లౌక్యం తెలిసిన వాడుకూడా కాదు. ఎవరి దయవల్ల పిల్లా జెల్లాతోసహా తను కడుపునిండా మిఠాయితిన్నాడో వారిని మనఃపూర్వకంగా ఆశీర్వదించకుండా, అందరి యెదటా వారి వంశప్రతిష్ఠను కీర్తించ కుండా ఇంటికి పోలేకపోయాడు. అందుచేతనే విష్కపటంగా—"గ్రహించటం ఏమంత కష్టం బాబూ? తాళంవేసి చెవి తీసుకుపోయిందంటే, ఇక భండారగృహంలో యెవరిచెయ్యీ పడకూడదని. అంతా తెలుసామెకు!" అన్నాడు.

గోవిందుడు విసుక్కున్నాడు. ఇతని తెలివితక్కువ మాటలకు కోపంకూడా వచ్చింది. దీనూను గద్దిస్తూ—"తెలియదూ పెట్టమా, ప్రతిదానికీ మాట్లాడతావు! నీకీ సంగతు లేమి తెలుసునని అర్థాలు తీయటానికొచ్చావు."

మందలింపుతో దీనూ తెలివితక్కువ యింకా యెక్కువైంది. అతనూ మండి పోతూ—"అది కాదోయ్! ఇందులో తెలియటానికేముంది? ఆమె స్వయంగా వచ్చి తాళంచెవి తీసుకెళ్ళిందని వింటిని! ఆమెను కానవేవా రెవరూ?" అన్నాడు.

గోవిందు డిక కోపం ఆపుకోలేకపోయాడు:—"పోరాదటయ్యా ఇక యింటికి? నువ్వొచ్చినపని అయె! పిల్లా జెల్లా కలిపి తింటిరి—మూటలుకూడా కట్టితిరి! ఇంకెందుకూ? పదండి. మాకు బోలెడు పనులున్నయి రసగుల్లాలు ఎల్లుండి తిన వొచ్చు—ఇవ్వాళ కిక లాభంలేదు, పదండి!"

దీనూ సిగ్గుతో కుంగిపోయాడు, రమేశునికి బాగా కోపమొచ్చింది. గోవిందుడింకా ఏమేమో అనబోతూవుండగా రమేశుడు పరుషంగా అన్నాడు: "మీకేమన్నా పూనిందా ఏమిటి, గంగూలీగారూ! ఇతర్ల నలా అవమానిస్తా రెందుకు?"

ఈ మందలింపుకు మొదట గోవిందుడు విస్మితుడైనాడు. కాని తక్షణమే నవ్వు తెచ్చుకుని—"నే నెవర్ని అవమానించా నబ్బాయీ! కావాలంటే అతన్నే అడిగి చూడు. నే నబద్ధం చెప్పానేమో? నేనేం తక్కువవాడినా! అతనేటికి లాగితే నేను కోటికి లాగుతాను! చూశావా ధర్మదా, ఈ దీనూ స్పర్ధ? సరే—" ధర్మదాసు ఏం చూశాడో అతనికే తెలియాలి! రమేశుడుమాత్రం గోవిందుని స్పర్ధా బైపిమాలితనం చూసి ఆశ్చర్యపోయాడు.

దీనూ రమేశునివంక చూసి—"నిజమే నాయనా! గోవిందుడు చెప్పింది యథార్థం.

నేను బీదవాణ్ణని అందరూ ఎరుగుదురు. వాళ్ళమావిరి నాకు భూమీ పుట్రా లేదు. అందుకనే గొప్పవాళ్ళ ఇళ్ళల్లో అశుభమొచ్చినా, శుభమొచ్చినా పిల్లల్ని వెంటబెట్టుకెళ్ళి వాళ్ళ పోరు తీరుస్తాను. నువ్వు వేరే మనసులో ఏమీ పెట్టుకోకు నాయనా! నాకు పెట్టడమంటే తారిణికి చాలా సంతోషం. ఇవ్వాళ నేను తృప్తి తీరేటట్టు తినటం ఆయన పైనుండి చూసి సంతోషిస్తాడని నేను గట్టిగా చెప్పగలను."

హఠాత్తుగా దీనూ కళ్లు రెండూ నీళ్లతో నిండినై. టపటప రెండుమూడు బొట్లు కూడా కింద రాలినవి. దీనూ చిరిగిపోయిన ముతకి అంగోస్త్రం కొనతో కన్నీళ్ళు తుడుచుకుని—"నేనే కాదు నాయనా! ఈ ప్రాంతంలోని బీదా బిక్కీ ఎవ్వరుకూడా తారిణీ అన్నాయిదగ్గర చేయిచాపి ఊరక తిరిగిపోలేదు. కాని ఈ సంగ తెవరికి తెలుసు నంటావు? ఆయన కుడిచేత్తో చేసిన దానం ఎడమచేతికి తెలియనిచ్చేవాడు కాదు. పోనీయి! ఇక నా గొడవ చెప్పి నిన్ను వేధించను—లే, అమ్మా ఖేందీ! ఒరే, హరీ, పదరా నాయనా, ఇంటికి పోదాం మళ్ళీ రేపు పొద్దున వద్దాం లే—ఇంకా ఏమి చెప్పేది నాయనా, రమేశ్! నూరేళ్లు బతికి తండ్రిమాదిరిగా కీర్తి తెచ్చుకో!" అని ఆశీర్వదించాడు.

రమేశుడు అతన్ని కొంతదూరం సాగనంపటానికొచ్చి—"భట్టాచారిగారూ, ఈ రెండురోజులూ మా ఇంటికి దయచేస్తూ ఉండండి. ఇంకా అడగటానికి సందేహిస్తున్నాను గాని. హరి తల్లికూడా మా ఇంటికొస్తే సంతోషిస్తాను" అన్నాడు తడి గొంతుకతో.

భట్టాచారి తొట్రుపాటుతో రమేశుని రెండుచేతులూ పట్టుకొని ఏడ్పు పర్యంతమై—"నేను చాలా దీనుణ్ణి నాయనా! అలా అంటే సిగ్గుతో చచ్చిపోతాను" అని పిల్లలను వెంటబెట్టుకుని మెల్లగా వెళ్లిపోయాడు.

రమేశుడు తిరిగొచ్చి తను పరుషంగా మాట్లాడినందుకు గోవిందునికి క్షమాపణ చెప్పబోతుండగా గోవిందుడు అతన్ని ఆపి—"ఇది మా సొంత పని రమేశ్! నువ్వు పిలవకపోయినా మా అంతట మేమొచ్చి చేసుకోక తప్పదు. అందుకనే వచ్చాంకూడా. మా అన్నదమ్ములిద్దరం—ధర్మదా, నేనూ నీ పిలుపుకోసం ఎదురుచూడలేదు" అన్నాడు ఆవేశంతో.

ధర్మదాసు హుక్కా పీల్చి దగ్గుతూ వున్నాడు. కష్టమ్మీద ఊతచేసుకుని లేచి నుంచు న్నాడు. దగ్గు నాపటానికి ప్రయత్నించటంవల్ల అతని ముఖమూ కళ్ళూ యెర్రబడ్డవి. చేతులు తిప్పుతూ—"మే మిప్పుడే చెప్పుతున్నాం, విను రమేశ్! మేము వేణీ ఘోషాలు కాము, మా కొక్కడే అబ్బ" అన్నాడు.

ఈ నీచపుకూతకు రమేశుడు చకితుడైనాడు. కాని కుపితుడు కాలేదు. అభ్యాసం వల్లా, అజ్ఞానంవల్లా వాళ్లు యెంత నీచపుమాటలు మాట్లాడేదీ వాళ్లకే తెలీటం లేదని ఈ స్వల్ప పరిచయానికే రమేశుడు గ్రహించాడు.

పెత్తల్లిముఖమూ, బతిమాలటమూ తలపుకువచ్చి రమేశుడు లోలోపల చాలా కష్టపడుతున్నాడు. పెత్తల్లిమాట తోసివేసినందుకు చాలా వ్యథపడ్డాడుకూడా. అందుకనే, అంతా వెళ్లిపోయినమీదట అన్నయ్యదగ్గరికి బయలుదేరాడు. అప్పుడు రాత్రి యెనిమిదిగంటలైంది.

రమేశుడు వేణీ కచేరీచావడి దగ్గరకు వచ్చేవరకు లోపల యెవరో పోట్లాడుకుంటున్నట్టుగా తోచింది. గోవిందగంగూలీ కేకలే యెక్కువగా వినిపిస్తున్నై. రమేశుడు మెల్లాలోకి పోయేవరకు గంగూలీ పందెంపెట్టి అంటున్నాడు: "చూడు, వేణీబాబూ! వాడుగనక రెండురోజుల్లో దివాలా తీయకపోతే నన్ను మారుపేరుపెట్టి పిలవండి! వాడి నవాబుదర్జా విన్నావుగా? తారిణీ చస్తూ దమ్మిడీకూడా మిగిల్చిపోలేదని అందరికీ తెలుసాయె! మరి ఈ ఆర్భాటమంతా యెందుకు? చేతిలో వుంటే చెయ్యి. విన్నెవడూ ఆక్షేపించడు. అంతేగాని, ఆస్తి తాకట్టుపెట్టి, ఇంత తగలేసి తండ్రి శ్రాద్ధం చేయడం నేనెక్కడా వినలేదు! నేను చెప్పేది నిజమనుకో, వేణీబాబూ! ఆ వెధవ నందీగారి దగ్గిరినించి కనీసం మూడువేలైనా అప్పుతీసుకుని వుంటాడు."

"సంగతెలా బైటికిలాగావు కక్కాయ్?" అన్నాడు వేణీ ఉత్సాహంతో.

గోవిందుడు గొంతు తగ్గించి—"కాస్తై అగు బాబూ! వాటి బాబుల్ని బయటికి లాగుతాను. ముందు వాడింటికి బాగా చేరవివ్వు. తర్వాత—ఎవరా బయట నిలబడింది? రమేశ్ బాబయ్యేనా! మేముండగా నీ పీ రాత్రిపూట రావటమెందుకు నాయనా?" అన్నాడు.

రమేశు దతనికేమీ సమాధానం చెప్పకుండా, వాళ్లదగ్గరికొచ్చి—"మీకోసమే వచ్చా, అన్నయ్యా" అన్నాడు.

వేణీ ఉక్కిరిబిక్కిరై చప్పున జవాబివ్వలేకపోయాడు. గోవిందుడు వెంటనే అందుకుని—"ఎందుకురావు నాయనా లక్షసార్లొస్తావు! ఇదీ మీ ఇల్లేగా, ఇక అన్నయ్యంటే తండ్రితో సమానుడాయె. అందుకనే, నేను వేణీతో చెప్పటానికొచ్చాను. కక్కయ్యతో వున్న కీచులాటేమో అతనితోనే పోయె. ఇంకా ఎందుకు? మీ అన్నదమ్ములిద్దరూ యేకమైతే మేము చూసి సంతోషిస్తాము!" అని—"ఏమంటావు హవల్దార్ మామా?—అదేమిటి యింకా నిలబడేవున్నావు?—ఎవడురా అక్కడ? తంబళాన్ని తీసుకు రారేమిటి?—అదికాదు వేణీబాబూ. నువ్వు పెద్దవాడివి, మంచీ

చెడూ చూడాల్సినవాడివి. నువ్వే తొలగివుంటే పనులెలా జరుగుతై! అదీగాక, అమ్మగారేమో వెళ్ళిరి! ఇక—'' అని చెప్పుకుపోతున్నాడు.

''అమ్మ వెళ్ళిందా?'' అన్నాడు వేణీ చకితుడై.

వేణీలో మార్పు కనిపెట్టి గోవిందుడు లోలోపల సంతసించాడు. కాని, ఆ భావాన్ని బయటికి రానివ్వకుండా, చాలా పెద్దమనిషి తరహాగా తాను వినిపించే వార్తను ఇంకా పదును పెట్టి ప్రయోగించాడు:—''ఊరక వెళ్ళటమేనా! పనిపాటల అజమాయిషీ, అంతా ఆమే చేస్తున్నది. నిజానికి ఆమె పూనుకోకపోతే ఇంక చేసే వారుమాత్రం యెవరు?''

అంతా మాట్లాడకుండా ఊరుకున్నారు. గోవిందుడు దీర్ఘంగా నిట్టూర్చి—''ఈ గ్రామంలో తల్లిగారివంటి ఇల్లాలు వుందా, ఇక ఉండబోతుందా? ఎదుట చెపితే ఖుషామత్ చేస్తున్నాననుకుంటావు గాని, ఈ ఊళ్ళో లక్ష్మిగనక వున్నట్టయితే ఆమె మీ తల్లే—ఎవరెవ్వరి అనుకుంటే మనకేం! ఇలాంటి తల్లి అందరికీ దొరుకుతుందా?'' అని, ఇంకోమాటు నిట్టూర్చి గంభీరంగా కూర్చున్నాడు.

వేణీ చాలాసేపు మౌనంగా వుండి—''సరే''—అని అస్ఫుటంగా ఏమో చెప్ప బోతుండగా గోవిందుడు మధ్యనే అడ్డి—'సరే, కాదు వేణీబాబూ! నువ్వు వెళ్ళకా తప్పదు; పనిపాటలు చేయించకా తప్పదు. ఈ భారమంతా నీ మీదనే!—సరే అంతా ఇక్కడే ఉన్నారు. ఎవరెవర్ని పిలవాలో నిర్ణయం చేస్తే బాగుండదూ? ఏమంటావు రమేశ్ బాబూ?—మంచి మాటంటావా, కాదా హవల్దార్ మామా?—ఏం ధర్మదా, మెదలకుండా కూర్చున్నావేం? ఎవర్ని పిలవాలో ఎవర్ని వదలాలో అందరికీ తెలుసుగా!'' అన్నాడు.

రమేశుడు లేచి నిలబడి సహజ వినయంతో అన్నాడు—''అన్నయ్యా, మవ్వొక మాటు దయచేస్తే—''

''అమ్మ వచ్చినాక నేను రావటం, రాకపోవటం....ఏమంటావు కక్కయ్యా?'' అన్నాడు వేణీ గోవిందునితో గంభీరంగా.

గోవిందుడు మాట్లాడక ముందే రమేశుడు—'నిన్ను నేను పీడించ దలచలే దన్నయ్యా. నీకేమీ ఆక్షేపణ లేకపోతే ఒకమాటొచ్చి చూపిపొమ్మని కోరుతున్నాను'' అన్నాడు.

వేణీ మాట్లాడలేదు. గోవిందుడేదో మాట్లాడబోవటం చూసి రమేశుడు వెళ్ళి పోయాడు. గోవిందుడు మెడచాచి రమేశుడు పోయాడో లేదో చూసి మెల్లగా—''చూశావా వేణీబాబూ, మాటల చాతుర్యం?'' అన్నాడు.




వేణీ పరధ్యానంగా యేదో ఆలోచిస్తున్నాడు. జవాబివ్వలేదు.

రమేశుడు ఇంటికి పోతూపోతూ గోవిందునిమాటలు తలచుకుని అసహ్యించుకున్నాడు. అతని మనస్సు యేవగింపుతో నిండిపోయింది. సగందూరం పోయి మళ్ళీ తిరిగొచ్చి వేణీ యింట్లో ప్రవేశించాడు. కచేరీ చావిడిలో అప్పుడు చర్చ మహా తీవ్రంగా జరుగుతోంది. కాని అది వినాలనే కుతూహల మతనికి కలగలేదు. తిన్నగా యింట్లోకి పోయి—"పెద్దమ్మా" అని పిలిచాడు. విశ్వేశ్వరి తన గదిముందు వరండాలో, చీకట్లోనే కూర్చునివుంది. ఇంత పొద్దుపోయి రమేశుడు పిలవటం చూసి ఆమెకు ఆశ్చర్యంవేసి—"ఏమిటిరా నాయనా!" అంది.

రమేశుడు లోపలికి వచ్చాడు. విశ్వేశ్వరి ఉత్తలపాటుతో "కాస్తై ఆగు నాయనా! లోపలికిపోయి దీపం తీసుకొస్తాను" అని లేవబోయింది.

"అమ్మా! నువ్వు లేవమాకు" అని రమేశుడు ఆ చీకట్లోనే ఒక పక్కన కూర్చున్నాడు.

"ఇంత పొద్దుపోయా?" అన్నది విశ్వేశ్వరి.

"ఎవరెవర్ని పిలవాలో ఇంకా నిర్ణయించుకో లేదు. నిన్ను కనుక్కు పోదామని వచ్చాను" అన్నాడు రమేశుడు నెమ్మదిగా.

"ఐతే నన్ను చిక్కులో పడేశావు నాయనా! వాళ్ళేమన్నారు? గోవింద గంగూలీ, ధర్మదాస ఛటర్జీ—"

రమేశుడు మధ్యనే అడ్డి—"వాళ్ళేమంటారో నాకు తెలియదు పెద్దమ్మా! తెలుసుకో

వాలనికూడా లేదు—నువ్వు చెప్పిందే చేస్తాను'' అన్నాడు.

రమేశుని మాటలలోని వెట్టకు విశ్వేశ్వరి విస్మితురాలైంది. కాసేపుండి — ''ఇందాక వీళ్ళే నా కందరికంటే దగ్గరి వాళ్ళంటివిగా!—సరే. ఆ సంగతి పోనిద్దాము. కాని, నాబోటి ఆడవాళ్ళ మాటలతో యేమవుతుంది నాయనా? ఈ ఊళ్ళో—ఈ ఊరేమిటి? ఏ ఊళ్ళోనూ ఒకరిపంక్తి నొకరు కూర్చోరు; ఒకరు మాట్లాడిన వాళ్ళతో యింకొకరు మాట్లాడరు. ఇక యిలాంటి కార్యాలొచ్చిన వంటే చెప్పేవు—ఎన్ని తిప్పలో పెడతారు. ఎవర్ని పిలవాలో ఎవర్ని వదలాలో తెలుసుకునే కంటే కష్టమైన పని ఈ వూళ్ళో యింకొకటి లేదు నాయనా! ' అంది.

రమేశునికి అంత ఆశ్చర్యం కలగలేదు. ఎందుకంటే, ఈ నాలుగు రోజుల్లోనే వీళ్ళను గురించి చాలా తెలుసుకున్నాడు. ఐనా ఇంకా తెలుసుకోవాలనే ఉద్దేశంతో ''ఎందుకని పెద్దమ్మా యిలా వుండటం'' అని అడిగాడు.

''దానికి చాలా గొడవుంది నాయనా! కొన్నాళ్ళిక్కడ వుంటే నీకే తెలుస్తుంది. నిజంగా తప్పుచేసినవాళ్ళు కొంతమంది లేకపోలేదు. కొంతమందిమీద ఉత్త అభాం డాలు వేశారు—పైగా వ్యాజ్యాలూ. తప్పుడు సాక్ష్యాల మూలాన అన్నీ కథలే! నేనే గనక రెండు రోజుల కిందట నీయింటి కొచ్చినట్లయితే నిన్నిన్ని ప్రయత్నాలు చేయ నిచ్చే దాన్ని కాను. ఆనాళకు ఏమవుతుందోనని నాకు దిగులుగా వుంది'' అని విశ్వేశ్వరి నిట్టూర్చింది.

ఆ నిట్టూర్పులోని మర్మం రమేశుడు ఊహించుకోలేక పోయాడు. నిజంగా తప్పు చేసిన వారెవరో, అభాండాలు నెత్తిన వేసుకున్న వారెవరోకూడా నిశ్చయించుకోలేక పోయాడు.

''కాని నాకు వాళ్ళతోయేమీ తగువుల్లేవుగా పెద్దమ్మా! ఒక విధంగా నన్ను పొరుగూరి వాడనవచ్చు. అందుకని నేను చెప్పేదేమంటే వాళ్ళ కక్షలతో నేనేమీ సంబంధం పెట్టుకోను. అన్ని వర్ణాలవారినీ, అందరినీ పిలుస్తాను. కాని నీ అనుజ్ఞ లేంది యేపనీ చెయ్యను. నువ్వు సెలవివ్వు పెద్దమ్మా'' అన్నాడు రమేశుడు కొంచెం ఉద్రేకంతో.

విశ్వేశ్వరి కాసేపు నిశ్శబ్దంగా యేమో ఆలోచించి ''అలాంటి అనుమతి నేనివ్వను రమేశ్! దానివల్ల పెద్ద గంద్రగోళం జరుగుతుంది. కాని, నీమాట నబబు కాదని నేననటం లేదు. అసలిక్కడ వుంది నబబూ, బేనబబుల ప్రశ్నకాదు! సమాజం ఒకళ్ళని వెలివేసి శాస్తిచేసిన తర్వాత వాళ్ళని మనం బలవంతాన కలపటానికి వీలు లేదు. సమాజం యెటువంటిదైనా కానీ మనం గౌరవించాల్సిందే. లేకపోతే మనకు


యు[illegible]

మంచిపని చేయటానికూ్కడా బలముండదు. దాన్ని బాగు చెయ్యటానికి కూడా సాధశ్య పడదు. మనమూ ముందు కడుగు వేయలేము'' అన్నది.

రమేశుడు కాస్తె తాపీగా ఆలోచించి చూస్తే ఈ మాటలు కాదనేవాడు కాదు. కాని ఇంతకు ముందే ఈ కుల పెద్దల కుట్రలూ, నీచపు బుద్ధులూ చూపి రావటంచేత అతని గుండె భగభగ మండిపోతున్నది. అందుకనే ఏవగింపుతో—''సమాజమంటే ఈ వూళ్లో గోవిందుడూ, ధర్మదాసూ మొదలైనవాళ్లేగా! ఇలాంటి సమాజానికి పటుత్వం లేక పోవటమే మంచిది పెద్దమ్మా!'' అన్నాడు.

విశ్వేశ్వరి రమేశుని వెట్ట కనిపెట్టి శాంతంగా—''వీళ్లేకాదు రమేశ్ మీ అన్నాయ వేణీకూడా యీ సమాజంలో పెద్దే'' అన్నది.

రమేశుడు మాట్లాడలేదు. ఆమె మళ్ళీ అన్నది:

''అందుకనే నేను వీళ్ళమాట తీసుకుని చెయ్యమంటున్నాను రమేశ్! మొన్న ఊళ్లోకి వచ్చావోలేదో అప్పుడే వాళ్ళకి ఎదురు తిరగటం మంచిదికాదు.''

విశ్వేశ్వరి యెంత దూరమాలోచించి యీ సలహా యిచ్చిందో రమేశుడు గ్రహించ లేదు. అతను మంచి కాకలో వున్నాడు.

''అనేక కారణాలవల్ల యిక్కడ కక్షలు బలుస్తున్నవని ఇంతకుముందేగా నువ్వు చెప్పింది. బహుశా యిందులో వ్యక్తిగత విరోధాలే యెక్కువనుకుంటాను. అదీకాక, ఎవరు నిజంగా తప్పుచేశారో, ఎవరు చేయలేదో నాకు తెలియదుగదా! అలాంటప్పుడు ఒకళ్ళను పిలవకుండా వదలి అవమానించటం నాది అన్యాయం కాదా?''

విశ్వేశ్వరి మందహాసంచేసి అంది.—''ఒరే పిచ్చివాడా! నేను పెద్దదాన్ని తల్లితో సమానురాల్నికదా. నామాట వినకపోవటం నీది అన్యాయంకాదా?''

''ఏంచేసేది పెద్దమ్మా! నేనందర్నీ పిలవటానికి నిశ్చయించుకున్నాను.''

అతని పట్టుదలచూసి విశ్వేశ్వరి ముఖం అప్రసన్నమైంది. బహుశా లోలోపల విరక్తికూడా చెందిందనుకుంటాను. ''ఐతే నా అనుజ్ఞ తీసుకోటానికి కొచ్చాననటం వంచించటాని కన్నమాటేగా'' అన్నది.

రమేశుడు పెత్తల్లి విసుగు కనిపెట్టాడు. కాని పట్టుదల వీడలేదు. కాసేపుండి అన్నాడు:—''సక్రమమైన పనులకు నువ్వు మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తావని నాకు తెలుసు పెద్దమ్మా! నా—''

అతని మాట పూర్తికాకముందే విశ్వేశ్వరి—''కాని, రమేశ్! నా బిడ్డకు విరుద్ధంగా నేను నడవవనికూడా నువ్వు తెలుసుకుని వుండవలసింది'' అన్నది.

ఈమాట రమేశుని చాలా నొప్పించింది. ఎందుకంటే పైకి అతనేమంటున్నా, పెత్తల్లి సంతానమని చెప్పుకోటానికి తనకూ హక్కున్నదని, విన్నటివించి అతని అంతఃకరణ చెప్పుతోంది. ఇప్పుడు తన హక్కుకు చాలా పైగా అసలు సంతానపు హక్కున్నదని తెలుసుకున్నాడు. అతనొక క్షణం మెదలకుండా ఊరుకుని లేచి నిలబడి, అభిమానపూరిత స్వరముతో—"నిన్నటివరకూ అలాగే అనుకున్నాను, పెద్దమ్మా! అందుకనే, నాచేతనైందేమిటో నేనే చేసుకుంటానని నీ కప్పుడే చెప్పాను. నిన్ను పిలిచే సాహసంకూడా లేకపోయింది నాకు!" అన్నాడు.

విశ్వేశ్వరి అతను అలిగాడని తెలుసుకుంది గాని యేమీ మాట్లాడలేదు. కాసేపుండి రమేశుడు పోవటానికి బయలుదేరగానే—"ఐతే, కాస్తై అగు నాయనా! కొట్టు తాళపుచెవి తెచ్చి యిస్తాను" అని ఇంట్లోకిపోయి చెవి తెచ్చి రమేశుని కాళ్ళముందు వేసింది. రమేశుడు కాసేపు స్తబ్ధుడై నిలబడి పోయాడు. తర్వాత నిట్టూర్చి తాళపుచెవి తీసుకని నెమ్మదిగా వెళ్ళి పోయాడు. ఒక్క గంట క్రితం "నాకేమిభయం—అన్నిటికీ మా పెద్దమ్మ వుంది" అనుకున్నాడు మనస్సులో. కాని ఒక్క రాత్రికూడా గడవక ముందే నిట్టూర్చి—"ఊఁహుఁ—నా కెవ్వరూలేరు. పెద్దమ్మకూడా వదిలి పెట్టింది" అనుకోవలసి వచ్చింది.

ఇప్పుడే శ్రాద్ధం పూర్తి అయింది. రమేశుడు పీటమీదినించి లేచి వచ్చిన అతిథులతో పరిచయం చేసుకుంటున్నాడు. లోపల విస్తళ్లు పరుస్తున్నారు. ఇలాంటి సమయంలో గంద్రగోళం విని రమేశుడు లోపలికి ఆదుర్దాతో వచ్చాడు. అతనివెంట ఇంకా చాలామంది లోపలికి వచ్చారు. వంటింటి వాకిట్లో పాతిక సంవత్సరాల విధవమ్మాయి సగంచచ్చి పక్కకు తిరిగి నిలబడి వుంది. ఆ పిల్లను వెనకేసుకుని వదికారాబిడై ఒకతె కళ్ళూ ముకమూ ఎర్ర చేసుకుని నిప్పులు కక్కుతూ వుంది. తగువు పరాణ్ హవల్దారుతో.

ఆ ప్రౌఢ రమేశుని చూడగానే, బిగ్గరగా—"నాయనా, నువ్వుకూడా ఈ ఊరి కొక జమీందారువేగదా! చెప్పు. తప్పులన్నీ మా అమ్మాయివేనా? మాకు తలగల వాడెవడూ లేక పోవటం చేతనేగా ఇష్టమొచ్చినన్నిసార్లు శాస్తి చేయటం!" అని గోవిందుని చూపుతూ—"ఈయన్నడగండి, ముఖర్జీల వారమ్మాయి చెట్టుకు పెళ్ళి చేసినప్పుడు ఇస్కూలు పేరుమీద జరిమానా వేసి నాదగ్గర పదిరూపాయలు వసూలు చేశారో లేదో! ఊళ్ళో జాతర చేసినప్పుడు నాలుగు వేటపోతులకి డబ్బు నేనుకాదా

యిచ్చిందీ? ఇలా ఇంకా ఎన్నిసార్లు ఆ పేరుపెట్టి వేధిస్తారో చెప్పమనండీ?'' అన్నది.

రమేశుని కనలు సంగతేమిటో అర్థం కాలేదు. పీటమీద కూర్చున్న గంగూలీ తగువు పరిష్కారం చేయటానికి లేచి నుంచుని ఒక మాటు రమేశుని వంకా, ఆ స్త్రీ వంకా చూసి గంభీరంగా....''నా పేరెత్తావు కాబట్టి. కాంతం పిన్నీ నేను ఉన్న యదార్థం చెప్పుతున్నాను. ఈ గోవిందగంగూలీ, మనిషిదగ్గర మనిషి మాటలు చెప్పేవాడు కాదని ఊరందరికీ తెలుసు! నీకు ప్రాయశ్చిత్త మయిన మాటా నిజమే. సమాజం జరిమానా వేసిన మాటా నిజమే. ఈ సంగతి అందరికీ తెలుసుకూడా? అంతమాత్రంచేత దానికి కుండల్లో చెయ్యి పెడతానికి అధికారం రాలేదు. చస్తే కొమ్ము పడతాము కాని—''

కాంతంపిన్ని చీత్కారం చేసింది—''చచ్చేటట్లయితే మీ అమ్మాయికి కొమ్ముపట్టి తగలేసిరారా? మా అమ్మాయి సంగతి నీకక్కర్లేదు—సరే గాని, గోవిందూ? నీసంగతి చెప్పుకోవేమిటీ నీ మరదలు—అదిగో ఆ గదిలో కూర్చుని అకూవక్కా పొత్తి పెడుతున్నదే—ఏరుడు రెండుమాసాలు కాశీలో వుండి పచ్చగా పసిమై వచ్చిం దెందుకనీ? అది పెద్దారి బండార మేమిటీ? జాగర్త, బాబూ! ఎక్కువ కెలక మాకు— మీ అందరి బతుకులూ బయట పెడతాను—నా కళ్ళలో దుమ్ము కొట్టటమే!''

గోవిందుడు పిచ్చివాడిలాగా పైకి దూకాడు—''ఉండు. పీటి ముండ కానా?—''

కాని పీటి ముండేమీ భయపడలేదు. పైగా ఇంకొక అడుగు ముందుకేసి చేతులూ కళ్లూ తిప్పుతూ—''కొడతావటరా? జాగర్త! నన్నుగనక కదిలించేటట్టయితే ఊరి కంపంతా బయట పెడతాను. మా అమ్మాయి తిన్నగా వాకిట్లోకి వచ్చిందో లేదో హవల్దార్ ఉత్తమణ్యానికి పరాభవం చేశాడు. కాని వాళ్ళ వియ్యపురాలికీ సాలిసెట్టికీ లంకెవున్నదని ఊళ్ళో అనుకోవటం లేదూ? ఏమంటారు?—ఇంకా చెప్పేదా, ఇవి చాలా? నే నీనాటిదాన్ని కాను, నా కందరి బతుకులా తెలుసు!'' అన్నది.

రమేశుడు కొయ్యబొమ్మలాగా నిలబడిపోయాడు. భైరవాచారి వ్యాకులపాటుతో వచ్చి దాదాపు కాంత చేయిపట్టుకుని బ్రతిమాలుతూ—''చెప్పినంతవరకు చాలుపిన్నీ! ఇక అక్కర్లేదు. రా, సుకుమారీ; నా వెంటరా, తల్లీ! ఆ గదిలో కూర్చుందువు గాని'' అని పిలిచాడు.

హవల్దారు ఉత్తరీయం పైనవేసి పీటమీదనించి లేచినుంచుని ''నేను ముందుగానే చెప్పుతున్నామ—ఆ చెడుముండని ఈ ఇంట్లోనించి వెళ్ళ గొట్టితే గాని నేనిక్కడ అవుపోసన పట్టను. గోవింద్—కాశీచరణ్!—మీకు మామగనకే కావలసి వుంటే

నావెంట లేచిరండి! వేణీ ఘోషాలు అప్పుడే చెప్పాడు—మామా, అక్కడికి పోవద్దని! ఈ గుడిసె వేటు ముండలు వస్తారంటే నేనీ గడపకూడా తొక్కేవాణ్ణి కానుగా! ఒకపూట తిండికోసం కులమెవడు పోగొట్టు కుంటాడు? కాశీ, లేచిరా!" అన్నాడు.

మామ పదేపదే పిలిచినా కాశీవరణుడు తలవంచుకునే కూర్చున్నాడు. ఇతను గోగునార వర్తకుడు. రెండేళ్ళ క్రిందట కలకత్తానించి గోగునార వర్తకుడు ఒకడొచ్చి ఇతని విధవచెల్లెల్ని లేవదీసుకుపోయాడు. ఈ సంగతి వెంటనే బయటికి పొక్కింది. వీళ్లమాత్రం కొన్నాళ్ళు అత్తగారింటికి పోయిందనీ, అక్కడనించి కొన్నాళ్ళు తీర్థ యాత్రలకు పోయిందనీ దాచారు. ఇప్పుడా సంగతెక్కడ బయటకొస్తుందోనని కాశీ తలయెత్తలేకపోయాడు. కాని, గోవిందుని మంట తగ్గలేదు. అతను మళ్లీ లేచి నుంచుని బిగ్గరగా—"ఎవరు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా ఈ ఊళ్ళో పెద్దలు వేణీ ఘోషాలూ, ముఖర్జీగారమ్మాయీ, హావల్దారుమామ! వాళ్ళని మేమెవ్వరమూ వదులుకోలేము! రమేశుడు గ్రామపెద్దల ఇష్టం లేకుండా ఈ ముండలిద్దరినీ ఇంట్లో ఎందుకు చేరనిచ్చాడో, ముందు సంజాయిషీ యివ్వంది యిక్కడ నీళ్ళు తాగము" అన్నాడు.

చూస్తూవుండగానే ఒక్కొక్కరే పదిమందిదాకా ఉత్తరీయాలు పైనవేసుకుని లేచి నుంచున్నారు. వీరంతా గ్రామస్థులే. ఇలాంటి సామాజిక వ్యవహారాల్లో యెక్కడ ఏ యెత్తువేస్తే బాగా పారేదీ వీరికి బాగా తెలుసు.

భోజనాలకొచ్చిన బ్రాహ్మలు ఎవరి నోటికొచ్చినట్టు వారు మాట్లాడసాగారు. భైరవాచారీ దీనూ భట్టాచారీ, ఏడుపు పర్యంతమై కాంతనీ, ఆమెకూతుర్నీ, గంగూ లీనీ హావల్దారునూ బతిమాలసాగారు. కాళ్ల పట్టుకునే పర్యంతంకూడా అయారు. చుట్టూ జరుగుతున్న అల్లరిచూస్తే చేసిన ప్రయత్నమంతా ధ్వంసమయ్యేటట్టు కనపడ సాగింది. కాని, రమేశుడు ఒక్కమాటకూడా మాట్లాడలేకపోయాడు. అసలే ఆకలి దప్పులతో బేజారైవున్నాడు. పైన తలవని తలంపుగా ఈ కాండ! వెలవెలపోయిన ముఖంతో మతిపోయినవాడిలా చూస్తూ ఉండిపోయాడు.

"రమేశ్!"

హఠాత్తుగా పిలుపు విని అంతా విస్మయంతో విశ్వేశ్వరివంక చూశారు. ఆమె వరుకుగది వాకిట్లోకొచ్చి నిలబడింది. తలమీద ముసుగున్నది కాని, ముఖం కనపడు తూనే వున్నది. రమేశుని ముఖానికి నెత్తురొచ్చింది. పెత్తల్లి అతన్ని వదిలిపెట్టలేదు—ఎప్పుడో వచ్చేసింది!




పల్లెటూళ్లల్లో పట్టణాల్లో ఉన్నంత ఘోరంగా వుండదు ఘోషా. ఐనప్పటికీ, విశ్వేశ్వరి జమీందారిణి కావటంవల్లనైతేనేం, ఇంకా ఏ కారణంవల్లనైతేనేం ఎవరి యెదటికి వచ్చేదికాదు. ఆమెకు ప్రాయంకూడా చాలా మిగిలిపోయింది. ఇదివరకు ఈమెనుగురించి విని, కంటితో చూడనివాళ్లు ఆమె కళ్ళవంక చూసి చకితులైనారు. బహుశా ఆమె ఆ క్షణిక ఆవేశంలో, కోపంతో బయటికొచ్చి వుంటుంది. అంతా తనవంక చూస్తున్నారని తెలియగానే ఆమె చప్పున తలుపుచాటుకు పోయింది.

స్పష్టంగానూ తీవ్రంగానూవున్న పిలుపుతో రమేశుని విహ్వలత పోయింది. అతను తలుపుదగ్గరికి పోయి నుంచున్నాడు. విశ్వేశ్వరి తలుపుచాటునే వుండి అలాగే, స్పష్టంగానూ బిగ్గరగానూ అన్నది :

"గంగూలీగారితో చెప్పు—బెదరించవద్దని! నేనే అందరినీ మర్యాదగా ఇక్కడికి పిలిచాను. సుకుమారిని అవమానించే జరూ రెవరికీ లేదు. కార్యంపట్ల ఇంట్లో తిట్లూ తిమ్మలూ, కేకలూ బొబ్బలూ నేను సహించను. ఎవరి కిష్టంలేకపోతే వారిని ఎడంగా పోయి కూర్చోమను!"

ఈమె ఉత్తరువు అంతా స్వయంగా విన్నారు. వేరే రమేశుడు నోరు తెరవవలసిన అవసరం లేకుండాపోయింది. బహుశా అలాంటి పనిపడితే అతనివల్ల నయ్యేదికూడా కాదు. రమేశుడు దీనికి ఫలిత మెలా పరిణమించిందోకూడా అక్కడవుండి చూడలేకపోయాడు. పెత్తల్లి బాధ్యతంతా తనమీద వేసుకోవటం చూసి అతని కళ్లల్లో నీరు తిరిగింది. బలవంతాన ఎలాగో కన్నీరు ఆపుకుని గదిలోకి పోయి టొటటొటకార్చాడు. ఇవ్వాళ పొద్దుటినించీ పనుల్లో మగ్నుడై ఉండటంచేత యెవరు వచ్చారో యెవరు రాలేదోకూడా అతను చూడలేదు. ఎవరు వచ్చినా పెత్తల్లిమాత్రం వస్తుందని అతను కలలోకూడా అనుకోలేదు.

విస్తళ్ళదగ్గరనించి లేచినవాళ్ళంతా ఒక్కొక్కళ్ళే కూర్చోబడ్డారు. గంగూలీ, పరాణహవల్దార్ మాత్రం మేకులమల్లే నిలబడిపోయారు. ఆ గుంపులోనించి ఎవరో కొంటెకాయ వాళ్ళ నుద్దేశించి అస్ఫుటంగా—"కూర్చోరాదా, కక్కయ్యా! పూరీలూ, లడ్లూ తిన్నన్ని తిని ఇంటికూడా తీసుకుపోటాని కెక్కడ దొరుకుతై!" అన్నాడు.

హవల్దార్ మెల్లగా బయటికి వెళ్ళిపోయాడు. చిత్రమేమంటే గోవింద గంగూలీ కూర్చోబడ్డాడు. కాని ముఖంమాత్రం ఇంతలావుని పెట్టుకున్నాడు. వడ్డన ప్రారంభం కాగానే లేచి పైన అజమాయిషీ చేయాలనే నెపంతో తప్పుకున్నాడు—నలుగురితో పాటు కూర్చోలేదు. అతని ఈ కిటుకు కనిపెట్టినవాళ్ళు గోవింద గంగూలీ తమ పని పడతాడనీ, ఊరకనే వదలడనీ గ్రహించారు. తర్వాత ఏ గోలా జరగలేదు. బ్రాహ్మలు ఎంత ఆహారం సద్వినియోగం చేసిందీ కళ్ళతో చూడకపోతే నమ్మటం కష్టం పైగా ప్రతివ్యక్తి ఇంట్లోలేని "బుల్లి. బోడి. చిట్టి. పాప" మొదలైన పిల్లలపేర్లు చెప్పి మూటలు కట్టుకుపోయింది కొద్ది అని చెప్పటానికి వీలే లేదు.

సందెవేళకు పనులన్నీ అయిపోయినవి. రమేశుడు తలవాకిట్లో చెట్టుక్రింద పరధ్యానంగా నిలబడివున్నాడు. అతని మనస్సు సరిగాలేదు. ఇంతలో దీనూ భట్టాచారి పిల్లల్ని వెంటబెట్టుకుని పూరీ, లడ్లూ వగైరా తినుబండారాలు పెద్దమూటలు కట్టుకుని—ఒకవిధాన చాటుగానే అనవచ్చు—పోతున్నాడు. మొట్టమొదట రమేశుని చూసింది, ఖేందీ. ఆ పిల్ల దొంగతనంచేస్తూ పట్టుబడ్డదానిలాగా గాభరాపడి ఎండుకుపోయిన గొంతుతో—"తాతా! బాబుగా రరుగో!" అన్నది.

అందరి కాళ్ళూ పాతుకుపోయినట్టయినవి. రమేశుడా పిల్లమాటతోనే సంగతంతా గ్రహించాడు. ముఖం తప్పించాలనుకున్నాడు కాని మార్గం లేకపోయింది. గత్యంతరం లేక నవ్వుతూ వాళ్ళదగ్గరికి వచ్చి—"ఖేందీ! ఎవరికోసమే తీసుకపోతున్నారు" అన్నాడు.

ఖేందీ వాళ్ళదగ్గరున్న మూటలన్నిటికీ సరైన సమాధానం ఇస్తుందో లేదోనని సంకోచించి, బలవంతాన నవ్వుతూ దీనూ అన్నాడు: "మా పొరుగున చాలామంది పిల్లలున్నారు నాయనా! ఏదో మిగిలినవి తీసుకుపోతే తలా ఒకటీ రెండూ యివ్వవచ్చు. సరేగాని నాయనా! అవిణ్ణి దొరసానిగారని యెందుకంటారో యివ్వాళ నాకు తెలిసింది."

రమేశుడు దానికేమీ సమాధానమివ్వకుండా వాకిటిదాకా వారివెంట వచ్చి, హఠాత్తుగా—"అది సరే భట్టాచారిగారూ! తమకీ ప్రాంతం సంగతులన్నీ తెలుసుగదా. ఈ ఊళ్ళో యిన్ని తగువు లెందుకున్నాయో చెప్పగలరా!" అని అడిగాడు.

దీనూ నోటితో విచిత్రమైన చప్పుడుచేసి తల రెండుసార్లు ఆడించి—"అయ్యో బాబయ్యా! మనఊరింకా నయంకాదూ? మొన్నీమధ్య నేను మా వియ్యంకుడిగారి ఊరు పోయివచ్చాను. వింటా, ఇరవై కొంపలు లేవు బ్రాహ్మలవి—నాలుగు ముఠాలు! హరనాథవిశ్వాస్‌ను మీ రెరిగివుండరనుకుంటాను. రెండు మారేడుకాయలు కోసినందుకు మేనల్లుణ్ణి జైలుకి పంపించిగాని వదలలేదు. అన్నిగ్రామాలూ యిలాగే తగలబడ్డాయి. బాబయ్యా! వ్యాజ్యాలతో సాజ్యాలతో అంతా చితికిపోయారు—ఖేందీ! హరిచేతిలో మూట కాస్తే తీసుకో తల్లీ" అన్నాడు.

"దీనికేమీ విరుగుడు లేదా భట్టాచారిగారూ?"

"ఇంకా విరుగుడేముంది బాబయ్యా! కలికాలమొచ్చి కూర్చునె" అని దీనూ నిట్టూర్చి అన్నాడు—"ఐతే యింకో సంగతికూడా వుంది బాబయ్యా! యాయవారానికి చాలాచోట్లకి పోతూవుంటానా, నేను కనిపెట్టిందేమంటే యింకా మీలాంటి కుర్రవాళ్ల దగ్గరే దయాధర్మాలున్నాయి—ఈ ముసలిముండాకొడుకులే కాటిపాపలు! కాస్తె సందుచిక్కిందంటే చాలు, గొంతుమీదెక్కి కూర్చుంటారు, నాలిక బయటికిలాగిగాని వదలరు!"

ఈ మాటలు చెప్తూ దీనూ చిత్రమైన భంగిమపెట్టి నాలుక బయటికి వెళ్ళపెట్టాడు. రమేశుడికి నవ్వొచ్చింది. కాని దీనూ నవ్వులో పాల్గొనలేదు; అన్నాడు:—

"నవ్వుతాలుకాదు బాబయ్యా! నేను చెప్పింది ముప్పాతిక మూడువీసాలూ సత్యం. నేనుమాత్రం ముసలివాణ్ణి కానా? కాని—చీకట్లో చాలాదూరమొచ్చాను బాబయ్యా!"

"ఫర్వాలేదు, మీరు చెప్పుకుపదండి భట్టాచారిగారూ!" అన్నాడు రమేశుడు.

"ఇంకా ఏమిచెప్పేది నాయనా! పల్లెటూళ్లన్నీ ఇదే మచ్చు. ఈ గోవింద గంగూలీనే చూడండి—ముండాకొడుకు పేరు తలిస్తే నోరు కడుక్కోవాలి. కాంత చెప్పింది అబద్ధం కాదు. ఐతేయేం? వాడంటే అందరికీ భయం. ఫోర్జరీలు చేయించటంలోనూ, దావాలు వేయించటంలోనూ, తప్పుడు సాక్ష్యం పోగుచెయ్యటంలోనూ వాడికి సాటిలేదు. వాడికి వేణీబాబు అసరావుంది, అందుకనే వాడి జోలికెవరూ పోవటంలేదు. పైగా వాడే అందర్నీ వెలివేస్తూ మొగాడై తిరుగుతున్నాడు!"

రమేశుడు చాలాసేపటిదాకా యేమీ ప్రశ్నించలేదు. దీనూ వెంబడే నడిచాడు. అతని శరీరమంతా కోపంతో ఉడికిపోతున్నది. దీనూ మళ్లీ చెప్పసాగాడు:

"ఇదిగో, నామాట జ్ఞాపకంపెట్టుకో బాబయ్యా! కాంతకి తిప్పలున్నాయి. గోవింద గంగూలీ పరాణ హవల్దారూ రెండూ రెండు కండిరీగలు. వాటిని కదిలిస్తే వూరకపోదు! ఎవరేమనుకుంటే యేంగాని బాబయ్యా ఆముండకి గుండెవుంది! ఐనా ఎందు

కుండదులే? మరమరాలమ్ముతూ యింటింటికి పోతుందాయె. అందరి బాకులూ తెలుసుకుంటుందాయె! బాబయ్యా, దాన్నిగనక కదిలిస్తే తప్పక అందరి గబ్బూ బైట పెడుతుంది. అనాచారం యెవరింట్లో లేదంటా! వేణీబాబు——''

రమేశుడు భయంతో అడ్డి——''చాలు వూరుకో. అన్నయ్య సంగతి మన కక్కర్లేదు'' అన్నాడు.

దీనూ చిన్నబోయాడు. ''సరే నాయనా! బీదవాడికి నాకు ఒకళ్ల సంగతెందుకు!—ఎవరైనా యీమాట వేణీబాబు చెవినేశారంటే తెల్లారేసరకు మాయిల్లు భగ్గుమన్నదే!——''

రమేశుడు మళ్ళీ అడ్డువచ్చి——''భట్టాచారిగారూ! మీ యిల్లింకా యెంత దూరముంది'' అని అడిగాడు.

''ఎక్కువదూరం లేదు నాయనా! ఆ వంతెన అవతలే మా పూరిల్లు. ఎప్పుడన్నా అటు——''

''ఎందుకురాను? తప్పకుండా వస్తాను'' అని రమేశుడు యింటిముఖమై—— ''రేపుదయం మళ్లీ కనబడండి. తర్వాత అప్పుడప్పుడూ దయచేస్తూ వుండండి'' అని వెళ్ళిపోయాడు.

''నూరేళ్లు బతుకు నాయనా! తండ్రిమాదిరిగా కీర్తితెచ్చుకో!'' అని దీనూ ఆతన్ని హృదయపూర్వకంగా ఆశీర్వదించి పిల్లల్ని వెంటబెట్టుకుని వెళ్లిపోయాడు.

## 5

ఈ ఊళ్ళో మధుపాల్‌ది ఒక్కటే చిల్లర దుకాణం. రమేశుడు శ్రాద్ధానికి పదిరూపాయలదాకా ఆ కొట్టులో చిల్లరవెచ్చాలు తెచ్చాడు. శ్రాద్ధమైన పదిరోజులైనా యెవరూ డబ్బుకోసం రాకపోయేసరకు రమేశుడు తనేపోయి ఇచ్చేద్దామని ఒకనాటి ఉదయం పోయాడు. మధుపాల్ చాలా ఆదరంతో పీటని అరుగుమీద వావేసి కూర్చోబెట్టి రాకకు కారణం అడిగాడు. రమేశుడు చెప్పిన కారణం అతనికి చాలా ఆశ్చర్యం కలిగించింది. చప్పున మాట్లాడలేకపోయాడు. అప్పు తీసుకున్నవాళ్లు కొట్టుదగ్గరకొచ్చి తీర్చిపోవటం మధుపాల్——ఇంత వయస్సు వచ్చినా——ఎప్పుడూ చూడలేదు, సరికదా విననుకూడా లేదు. తర్వాత కాసేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్నాక రమేశుడు ''బేరమెలా వుం''దని అడిగాడు.

''ఏం బేరం లెండి, బేడా, పావలా, రూపాయీ, ఇలా యాభై అరవై రూపాయలదాకా చిల్లరమల్లర అప్పులు పడ్డాయి. ఇదిగో యిస్తామని తీసుకపోతారు——నాసాలు




తరబడిదాకా వసూలుకావు! ఇలాగైతే బేరమెలా నడుస్తుంది?- -ఎవరూ? బెనర్జీగారా! ఎప్పుడు దయచేశారు? నమస్కారం స్వామీ!"

బురదకాళ్ళతో బెనర్జీగారు ప్రవేశించారు. ఆయన కుడిచేతిలో మరచెంబు. ఎడమ చేతి చేమాకులో నాలుగుజల్లులు, చెవిమీద జంధ్యం. ఆయన నిట్టూర్చి—"రాత్రే వచ్చాను. హుక్కా యిలా యివ్వు మధూ!" అని చెంబు కిందపెట్టి, ఆకులో జల్లల్ని మాత్రం గుప్పిటపట్టి—"పల్లెదాని పొగరుచూశావా మధూ! కటిక్కన నా చెయ్యి పట్టుకుంది ఒకళ్ళననే లేముందిలే—కాలమలా తిరగమారింది. లేకపోతే యివి కానీ జెల్లలా? బ్రాహ్మణ్ణి దగాచేసి యీ ముండ యెంతకాలం తింటుంది? హాత మారి పోదూ?" అన్నాడు.

"తమ చెయ్యే పట్టుకున్నదండీ?" అన్నాడు మధు విస్మయంతో.

బెనర్జీ అసలే ఉడికిపోతున్నాడు. ఈ మాటతో యింకా ఉత్తేజితుడై, ఒకమాటు చుట్టుప్రక్కలా కలయజూసి—"దానికివ్వాల్సింది రెండు డబ్బులు! ఆ భాగ్యానికి సంతలో అందరి యెదటా నా చెయ్యి పట్టుకుంటుందా? అక్కడెవరు చూడలేదంటావో చెప్పు? నేను బహిర్దేశానికివెళ్లి నదిలో కాళ్లు కడుక్కొని, చెంబు తోముకుని ఒకమాటు సంత చూసివద్దాము గదా అని పోతిని. ముండ గంపెడుజల్లలు పెట్టుకు కూర్చుని నన్ను చూడగానే "అన్నీ అయిపోయినై స్వామీ" అంది. అన్నీ అయిపోయినై గాని రెక్కలొచ్చి యెగిరిపోయానై కామాలు! ముండ నా కళ్లల్లో న్ను

కొట్టా లనుకుంది. పోయి చప్పున మూతతీశాను. ఇంకేం టక్కున్న చెయ్యి లంకించుకుంది. ఇదివరకు రెండు డబ్బులూ, ఇవ్వాళ కానీ మొత్తం దమ్మిడీతక్కువ అణాకి యీ వూరొదిలి పారిపోతా ననుకుంది. ఏమంటావు మధూ, పారిపోతానా?''

''అంతకాక!'' అన్నాడు సమర్థిస్తూన్నట్టు.

''అట్లాచెప్పు! ఈ ఊళ్ళో ఒక పెత్తన మేడ్చిందంటావా? లేకపోతే చాకలి మంగళ్ళచేత కట్టుకట్టించే పనికాదూ? అప్పు డాముండా, దాని మొగుడూ కాళ్ళదేరావి కొచ్చేవాళ్ళు!'' అని అకస్మాత్తుగా రమేశునివంక చూపి—''ఈ బాబెవరు మధూ?'' అన్నాడు.

''మన చిన జమీందారుగా రబ్బాయి!'' అన్నాడు మదు గర్వంతో—''ఆవాళ వదిరూపాయల పెచ్చాలు తీసుకుని తీర్చటానికి స్వయంగా వచ్చారు.''

బెనర్జీగారికి చేపలగొడవ వదలిపెట్టి, ఆశ్చర్యంతో—''ఎవరూ! రమేశ బాబయ్యా! నూరేళ్ళు బ్రతుకు నాయనా!—నాలుగు కాలాలపాటు చెప్పుకునే పని చేశావు! వచ్చినా కనే తెలిసింది నాకు—ఇంత యెత్తుభారీగా ఈ ప్రాంతంలో యెవరూ భోజనాలు పెట్టలేదు. నాకు కంటితోనన్నా చూడకపోతినే అని దిగులుగా వుంది. ముండా కొడుకుల మాయమాటలకి మోసపోయి ఉద్యోగంకోసం కలకత్తా వెళ్లాను. ఏం చెప్పేది? అక్కడ పెద్దమనుషులుంటానికి వీలుందా—బరికెల యానాములు తప్ప!''

రమేశుడు అతని ముఖంవంక చూస్తూ వుండిపోయాడు. కాని ఆ దుకాణందగ్గ రున్నవాళ్ళంతా వీరి కలకత్తా చరిత్ర వినాలని చాలా కుతూహల పడ్డారు. మధు హుక్కాలో పొగాకువేసి వెలిగించి బెనర్జీగారి చేతికిచ్చి—''ఆ తర్వాత సంగతి? దొరికిందా?'' అన్నాడు.

''దొరకదా? నా చదువు పూచిక పుల్లకుకూడా పనికిరాదనుకున్నా వేమిటి?—ఐతేమాత్ర మేమి లాభం? అక్కడెవరుండగలరో చెప్పు! ఉత్త పొగా. బురదా! బజారికిపోయి బళ్ళకింద పడకుండా తప్పించుకు రాగలిగితే పెద్దల చలవమకో వలసిందే''

మధు కలకత్తా యెప్పుడూ పోలేదు. సాక్ష్యమివ్వటానికి ఒకమాటు మిద్నపూరు మాత్రం పోయాడు అందుకనే ఆశ్చర్యంతో—''ఏమిటీ?'' అన్నాడు.

బెనర్జీ మందహాసం చేసి—''కావాలంటే మీ రమేశబాబు నడిగిచూడు. నిజమో అబద్ధమో! తిండికి లేకపోయినా హాయిగా గుండెమీద చేతులు పెట్టుకుని యింట్లో వస్తాను గాని, ఊరొదిలిపెట్టమని యెవరన్నా నా దగ్గర చెపితేమాత్రం నే నొప్పుకోను. చెపితే మీరు నమ్మరుగాని అక్కడ తోటకూరా, దొండకాయలూ, అరటికి అరటికాయ

కూడా కొనుక్కు తినవలసిందే! ఈ మాసంరోజులూ సరిగా తిండిలేక బోనులోపడ్డ యెలికెలాగా అయాను. రాత్రింబగళ్లు ఒకటే గడబిడ కడుపులో. గుండెల్లో మంట! ఆఖరికి ప్రాణాలు పోయేటట్టుగా వుంటే చచ్చి చెడి తప్పించుకొచ్చి బ్రతికాను. అక్కడ లాభం లేదోయ్! ఇంట్లో ఒకపూట దొరికినా చాలు. కూర్చుని తింటాను. అంతేగాని ఊరుమాత్రం యిక చచ్చినా వదలను. అసలు బ్రాహ్మణబిడ్డకు బిచ్చ మెత్తటం యేమి తప్పు?" అన్నాడు.

వారి చరిత్ర విని అంతా దిగ్భ్రమ చెందివుండగా బెనర్జీగారు లేచి డబ్బాలోంచి గరిటెతో పటాకు నూనె తీసి చేతిలో పోసుకుని, సగం ముక్కుల్లోనూ చెవుల్లోనూ పోసుకుని మిగతాది తలకు పట్టిస్తూ—"వేళ మిగిలిపోయిందోయ్—ఒక మునక వేసి యింటికి పోతాను! ఒక కానీ ఉప్పు కట్టూ. సాయంత్రం మిచ్చేస్తాను డబ్బులు" అన్నాడు

"మళ్ళీ సాయంత్రమా?" అన్నాడు మధు మొహం మాడ్చుకుని ఉప్పు కొలుస్తూ.

బెనర్జీ మెడచాచి కొలవడం చూసి, విస్మయమూ విరక్తీ ఉట్టిపడే స్వరంతో "మీ అందరికి ఏమొచ్చింది, మధూ? లెంపలువాయించి డబ్బులు తీసుకునేటట్టున్నారే!" అని ముందుకుపోయి పొట్లం లాక్కుని గుప్పెడు ఉప్పుతీసి అందులో వేసుకుని, చెంబు చేతబట్టి రమేశునివంక చూసి మందహాసం చేస్తూ—"అందాకా నేనూ వస్తాను. రా, బాబయ్యా. మాట్లాడుకుంటూ పోదాం" అన్నాడు.

"పదండి" అని రమేశుడు లేచి నిలబడ్డాడు.

"బెనర్జీగారూ, ఆ మైదా డబ్బు లైదణాలూ—" అన్నాడు మధు బతిమాలుతూ.

బెనర్జీ ఒండిపడి—"ఏమోయ్ నీ కళ్లు పోయినయ్యా! రెండుపూటలూ నీకు కనపడటంలే! ముండాకొడుకుల మాటలు విని నేను కలకత్తాలో పదరూపాయలు వృధాగా ధారబోసి వచ్చాను. నీకూ ఇప్పుడేనా వర్తించేయటానికి తీరింది? కరువులో అధిక మాసమన్నట్టు! ఒకడికి లబలబలైతే మరొకడికి పకపకలు! చూశావుగా బాబయ్యా, వీళ్ళ సంగతి చూశావుగా!" అన్నాడు.

మధు సగం చచ్చి, గొణిగాడు—"చాలాకాలం—"

"అయితే ఏం? ఇలా అందరూ వెంటపడితే నేనీ ఊళ్లోనే ఉండనొల్లకాదు!" అని బెనర్జీ.... ఒకవిధంగా కోపంతోనే అనొచ్చు—సామాను చక్క బెట్టుకుని వెళ్ళిపోయాడు.

రమేశుడు ఇంటికి తిరిగి వచ్చేవరకు యెవరో పురానామనిషి హుక్కా పీలుస్తున్న వాడల్లా కిందపెట్టి రమేశుని కాళ్ళదగ్గిరకొచ్చి నమస్కరించి, లేచి— "నేను తమ స్కూలు హెడ్మాష్టర్ని—వనమాలిని. రెండురోజులనించి వస్తున్నాను. తమ దర్శనం

కాలేదు'' అన్నాడు.

రమేశుడు ఆదరంతో ఆయన్ని కుర్చీమీద కూర్చోబెట్టబోయాడు. కాని అతను చాలా కంగారుపడి—''అయ్యా, తమ సేవకుణ్ణి —'' అన్నాడు.

వనమాలి వయసులో పెద్దవాడేకాక విద్యాలయానికి ప్రధానోపాధ్యాయుడు. అతని ఈ అతివినయమూ, సంకోచమూ రమేశుని మనస్సులో ఒక విధమైన అశ్రద్ధనే కలిగించినవి. ఎంత చెప్పినా అతను కూర్చోలేదు. చెప్పవలసిందంతా నుంచునే చెప్పాడు:

''ఈ స్కూలును ఘోషాల్లూ — ముఖర్జీలూ కలిపి పెట్టించారు. పిల్లలు ముప్ఫయి, నలభై మంది ఉంటారు. గవర్నమెంటు సాయంకూడా కొద్దిగా వుంది. అయినా స్కూలు పెటపెటల మీద నడుస్తున్నది.'' రమేశుడు చిన్నప్పుడు ఈ స్కూల్లో కొంతకాలం చదివాడు. ఆ సంగతి అతనికి జ్ఞాపకం వచ్చింది. వనమాలి చెప్పుకు పోతున్నాడు:—''ఈ సంవత్సరం గనక కప్పు వేయించకపోతే వానాకాలం పిల్లలు బళ్ళో కూర్చోటానికి వల్లకాదు. సరే, ఆ సంగతి నిమ్మళంగా చూచుకోవచ్చు ననుకుంటే ఇప్పుడింకో చిక్కు వచ్చింది. మూడు మాసాలనించీ పంతుళ్ళకు జీతాలు ముట్టటం లేదు. ఇలా ఇంట్లోతిని వెట్టిచాకిరి చెయ్యటాని కెవ్వరూ ఒప్పుకోటం లేదు ''

అంతా రమేశుడు చెవులు దొరగించి విన్నాడు. తర్వాత వనమాలిని కచేరీ చావిడి లోకి తీసుకుపోయి ఒక్కొక్కటిగా వివరాలన్నీ తెలుసుకున్నాడు. మొత్తం ఇంగ్లీషు చెప్పే ఆయనతో సహా పంతుళ్లు నలుగురు. వీళ్లు తమ శక్తి నంతా ధారబోసి చదువు చెపితే ఇద్దరు విద్యార్థులు మాత్రం ఫస్టుఫారంలో చేరగలిగారు. వాళ్ళ పేర్లు ఫలానా ఫలానా. కుర్రవాళ్ళ దగ్గిరినించి వసూలయ్యే జీతం చిన్నపంతుళ్ళిద్దరికీ బొటాబొటీగా సరిపోతున్నది. గవర్నమెంటిచ్చే డబ్బు మూడోఆయనకి చాలీ చాలకుండా ఉంది. నాలుగోఆయన చందాలమీద బతకాలి. ఈ చందాలు వసూలుచేసే భారంకూడా పంతుళ్ళమీదనే. గత నాలుగు మాసాలనించీ వాళ్లు కాళ్ళకు బొబ్బలు కట్టేటట్టు ఇంటికి పదిసార్లు చొప్పున తిరిగినా ఏడుంబావలాకంటే వసూలు కాలేదు.

రమేశు డీమాటవిని స్తంభించి పోయాడు. చుట్టుపక్కల అయిదారు గ్రామాలకినీ ఒకటే స్కూలై—మూడుమాసాలు విడవకుండా ఈ ఊళ్ళన్నీ తిరిగితే వసూలైంది ఏడుంబావలా!

''తమకు జీతమెంత?'' రమేశుడు ప్రశ్నించాడు.

''రసీదివ్వటం ఇరవైయారు రూపాయలు. కాని చేతికొచ్చేది అంతా తక్కువ

యు వ




పద్దానుగు రూపాయలు.''

ఈ కిటుకేమిటో రమేశునికి అర్థంకాదు. అతనివంక చూస్తూ ఉండిపోయాడు. వనమాలి అది గ్రహించి తెలియజెప్పాడు:—''చిత్తం. గవర్నమెంటు ఉత్తర్వులంది కదండీ. స్కేలు ప్రకారం ఇరవైయారు రూపాయలకూ రసీదురాసి ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్సుకు చూపించాలి — లేకపోతే గవర్నమెంటు గ్రాంటివ్వదు. ఇది అందరికీ తెలిసిన రహస్యమే. కావాలంటే తమరు ఏక్కురవాణ్నడిగినా, నేనబద్ధం చెప్పలేదని తెలుస్తుంది.''

రమేశుడు చాలాసేపు మాట్లాడలేదు. తర్వాత—''మీరు పిల్లల దగ్గర చులకనై పోరా?'' అని అన్నాడు.

వనమాలి సిగ్గుపడి—''ఏం చెయ్యమంటారు. బాబుగారూ! ఈ దబ్బివ్వటం కూడా వేణీబాబు కిష్టంలేదు'' అన్నాడు.

''ఈ స్కూలుమీద పెత్తనం వారిదేకాదూ?''

వనమాలి కొంచెం వెనకా ముందాడాడు. కాని, అతనికి చెప్పక తప్పలేదు. అందుకనే చల్లగా బయటపెట్టాడు—''సెక్రటరీగారు వారే కాని, చేతిది దమ్మిడీ కూడా ఖర్చుపెట్టరు. యదుముఖర్జీగా రమ్మాయి ఉందే—మాతల్లి మహాలక్ష్మి—ఆమె దయ లేకపోతే ఈ స్కూలెప్పుడో ఎగిరిపోయేది. ఈ సంవత్సరం పాకా కప్పిస్తానని చెప్పికూడా ఎందుకనో హఠాత్తుగా సహాయం చెయ్యటం మానేసింది. కారణమేమిటో ఎవ్వరికీ అంతుబట్టలేదు.''

రమేశుడు కుతూహలంతో రమ విషయమై ఇంకా కొన్ని ప్రశ్నలు వేసి— "ఆమె తమ్ముడుస్కూల్లో చదువుతున్నాడు కదూ?" అని చివరకు అడిగాడు.

"యతీనా? ఎందుకు చదవటంలేదూ?" అన్నాడు వనమాలి.

"సరే, మీకు స్కూలువేళ అయిందను కుంటాను, ఇక వెళ్ళండి. రేపు నేనే స్కూలు కొస్తాను."

"చిత్తం" అని వనమాలి ఇంకోమాటు నమస్కారంచేసి, బలవంతాన రమేశుని పాదధూళి తీసి నెత్తిన వేసుకుని వెళ్ళిపోయాడు.

# 6

విశ్వేశ్వరి సంగతి ఆనాడే అంతటా పాకిపోయింది.

వేణీ యెవ్వరినీ ముఖాన పరుషంగా మాట్లాడలేదు. అందుకనే అతను పోయి రమ పిన్నమ్మను తీసుకొచ్చాడు. వెనకటికాలంలో తక్షకుడు రావిచెట్టును కరచి భస్మం చేశాడని శాస్త్రాల్లో వుంది. ఈ పిన్నమ్మకూడా ఆవాళ వీరింటిమీదికొచ్చి కక్కిపోయిన విషానికి విశ్వేశ్వరి దేహం కొయ్యకాక రక్తమాంసాలతో కూడినది కావటం వల్లనో, లేక ఆ కాలం యీ కాలం కాకపోవటంవల్లనో తగలబడి భస్మం కాలేదు. విశ్వేశ్వరి మెదలకుండా ఈ అవమానమంతా దిగమింగింది. కోపం తెచ్చుకుని జవాబిస్తే యీ మెనోట, ముందు తన కొడుకుసంగతే వస్తుందనీ, ఆ సంగతి రమేశునికి తెలుస్తుందనీ ఆమె భయపడింది; సిగ్గుకూడా పడింది. అందుచేతనే ఊరికే కూర్చుండిపోయింది.

పల్లెటూళ్ళో ఏమాటా దాగదు. ఈ సంగతి రమేశునికికూడా తెలిసింది. పెత్తల్లిని గురించి అతని మనస్సులో మొదటినించీ అపర్ధాగానే వుంది. ఈ విషయమై తల్లీ కొడుకులకు తగువుకూడా రావచ్చని అతను సందేహించాడు. కాని, పరాయిమనిషిని ఇంటికి తీసుకొచ్చి, వేణీ తన తల్లినిలా అవమానం చేయిస్తాడని రమేశుడు కలలో కూడా అనుకోలేదు. అతనికిది ప్రపంచంలో ఎక్కడా జరగని ఘటనగా తోచింది. ఈ మాట తలుచుకున్నకొందికీ అతనికి అరికాలిమంట నెత్తికెక్కసాగింది. అప్పుడే వాళ్ళింటిమీదికి పోయి నోటికొచ్చినట్టు తిట్టిపద్దా మనుకున్నాడు. తన తల్లినిలా అవమానించినవాడి నవమానించటానికి ముందువెనకలు ఆలోచించవలసిన అవసరంకూడా వుండదని అతని నమ్మకం. కాని మళ్ళీ అప్పుడే అతని కది మంచిదికాదని తోచింది. ఈ పనివల్ల పెత్తల్లికి అవమానం ఎక్కువవుతుందే గాని తగ్గదని అతననుకున్నాడు. ఆవాళ దీనూ దగ్గరా, చిన్న మాష్టరుగారి నోటా రమ ప్రశంస వినటంవల్ల రమేశుని

కామెమీద కొంచెం శ్రద్ధా, గౌరవమూ కలిగింది. ఈ గ్రామంలో ఎక్కడ చూచినా అతనికి మూర్ఖతా, స్వార్థపరతా కనిపించింది. ఒక్క పెత్తల్లి హృదయం తప్ప ఈ గ్రామమంతా అంధకార బంధురంగా ఉన్నదని రమేశునికి నమ్మకం కలిగినప్పుడు అతనికి ముఖర్జీగారింటిలో కొద్ది వెలుగు కనపడింది—అదెంత కొద్దదైనప్పటికీ అతని మనస్సుకు ఆనందం కలిగించింది. కాని, మళ్ళీ ఈ ఘటన రమమీద అస హ్యమూ, ఆక్రోశమూ కలిగించింది. ఈ బైసిమాలిన పని తప్పక వేణీ, రమా, ఆమె పినతల్లీ కలిసే చేసివుంటారని అతనికి నమ్మకం కలిగింది. కాని రమేశు దాష్టీల నేమిచేయగలడు? వేణీకిమాత్రమేమి శాస్తివేస్తాడు?—ఎంత ఆలోచించినా అతని కేమీ పాలుపోలేదు.

ఇలాంటి సమయంలో ఒక ఘటన జరిగింది. ముఖర్జీ ఘోషాలులకు యింకా కొంత ఆస్తి ఉమ్మడిగానే వుంది, పంపిణీ కాలేదు. ఈ తాలూకుదే ఒక గుంట ఆచారిగారింటి వెనక వుంది. ఒకప్పుడిది పెద్దదే; కాని, దానిమీద శ్రద్ధ తీసుకోక పోవడంవల్ల పూడిపోయి ఇప్పుటి స్థితికి వచ్చింది. పెద్ద చేపల్ని దాంట్లో వదలరు. బురదమట్టలూ పక్కెలూ పగైరా గాలికిపుట్టేవి కొద్దిగా వున్నాయి. ఒకనాటి ఉదయం భైరవాచారి తత్తరబిత్తరగా రమేశునింటికి పరుగెత్తుకొచ్చి, కచేరీచావిట్లో కూచుని పద్దులు రాసుకుంటున్న గుమస్తా గోపాలసర్కారుతో ఆదుర్దాగా "సర్కారుగారూ! ఇంకా మనిషిని పంపలేదా? ఉమ్మడి గుంటలో చేపలు పట్టుకుంటున్నారు!" అన్నాడు.

సర్కారు కలం చెవిమీద పెట్టి, తలెత్తి—"ఎవరా పట్టేది?" అన్నాడు.

"ఇంకెవరు? వేణీబాబు నౌకరక్కడ నుంచున్నాడు. ముఖర్జీల దర్వాన్‌కూడా వున్నాడు. ఇక లేంది మీ మనిషే! త్వరగా పంపండి."

గోపాలుదేమాత్రం ఆదుర్దా చూపించలేదు. తాపీగా—"మా బాబయ్య మత్స్య మాంసాలు తినడుగా!" అన్నాడు.

"తినకపోయినా భాగం తీసుకోవాలిగా?"

"ఈ ఆదుర్దా మనకేగా! పెదబాబు బ్రతికున్నా భాగం కావాలనేవాడే. మన రమేశ బాబు అనోకరకం మనిషి!" అని భైరవుని ముఖంమీద విస్మయచిహ్నాలు చూసి నవ్వుతూ, శ్లేషగా అన్నాడు: "అదెంత భాగ్యం ఆచార్లుగారూ, అనా చేప బుండవు అవాళ తూర్పు పొలాన పెద్ద ఉమ్మడి తుమ్మచెట్టు కొట్టుకొచ్చి వారిద్దరే పంచు కున్నారు. మాకు ఒక్క పుల్లకూడా యివ్వలేదు. నేను ఆదరాబాదరా వచ్చి యిదంతా బాబుగారితో చెప్పాను. ఆయన పుస్తకం చదివేవాడల్లా విని, నవ్వి మళ్ళీ పుస్తకం చదువుకోసాగాడు. నేను "ఏమి చేయమంటారు బాబూ!" అని

అడిగాను. ఆయన మళ్లీ తలెత్తలేదు. నేను వదలకుండా పీడించగా పుస్తకం బోర్లవేసి, అవులించి—కట్టెపుల్లలా? ఇక తుమ్మచెట్లు లేవా యేమిటి?" అన్నాడు. విన్నావుగా ధోరణి! అప్పుడు నేను "ఎందుకులేవు బాబూ? అలాగని మన హక్కు మనమెందుకు వదులుకోవాలి? ఈ ప్రపంచంలో ఎవరన్నా అలా వదులుకున్నారా." అని అడిగాను. అప్పుడు రమేశ్‌బాబు మళ్ళీ పుస్తకం తీసుకుని నాలుగైదు నిముషాలు మెదలకుండా వూరుకుని—"ఆమాట నిజమే; కాని వెధవ కట్టెపుల్లలకోసం తగుపెక్కడ పెట్టుకు కూర్చుంటావు?" అన్నాడు.

"ఏమిటి!" అన్నాడు భైరవుడు విస్మయంతో.

గోపాలుడు మందహాసంచేసి, తలతిప్పి—'ఏమి చేముంది అచారిగారూ! వారు చెప్పింది మంచిమాటే! ఇంకా దాపరికమెందుకు? ఈ యింటిలక్ష్మి తారిణీఘోషాలుతోనే తరలిపోయిందని నేనప్పుడే అనుకున్నాను' అన్నాడు.

భైరవుడు కాసేపు ఊరుకుని—"ఆ గుంట మాయింటి వెనకాలేనామె. తర్వాత నామీదికొస్తుంది—చెప్పటం మంచిదేమో!" అన్నాడు.

"ఐతే పోయి చెప్పిరండి? దాయాదులకు జడుస్తూ, రాత్రింబగళ్లు పుస్తకాలు ముందేసుకుని కూర్చుంటే ఆస్తి నిలుపుకోగలమా? యదుముఖర్జీ కూతురు ఆసంగతి విని పగలపడి పోయిందట! గోవింద గంగూలిని పిలిచి తమాషాగా 'నెలకింతని మనవర్తి తీసుకుని, ఆస్తి నాకప్పచెప్పమని శరమేశబాబుతో చెప్పు' అనికూడా అన్నదట! ఇంతకంటే సిగ్గుచేటేముంది?" అని గోపాలుడు కోపంతో ముఖం మాడ్చుకుని పనిలో మగ్నమయ్యాడు.

భైరవుడు ఇంట్లోకి పోయాడు. అడదిక్కులేని యిల్లు—దుమ్మూదూళీ బెత్తెడెత్తున పేరుకునివుంది. రమేశుడు ఈజీచేరులో పండుకునివున్నాడు.

ఆనాడు యుద్ధవిముఖుడైన అర్జునుకి గీతోపదేశం చేసి కృష్ణుడు యుద్ధానికి పురికొల్పినట్టుగా, గోవిందుడు రమేశునికి ముందు భూమికగా అతను కర్తవ్యమ్యుతుడు కాకూడదనీ, ఆస్తిని సంరక్షించుకోవాలనీ ఉపదేశించి, అసలు సంగతి ఎత్తగానే రమేశుడు గుండుదెబ్బతిన్న పెద్దపులివలె—"ఏమిటి? రోజా ఇదొక వేళాకోళమా!—భుజావా!" అని కేకపెట్టాడు.

ఆతనికోపం చూసేవరకు భైరవునికి గాభరా పుట్టింది. ఈ వేళాకోళం ఎవరిదో అతని కర్థంకాలేదు? ఈ భుజావా రమేశుని నౌకరు, హిందూస్తానీవాడు; మాంచి బలవంతుడు. విశ్వాసపాత్రుడు, గరిడీలో రమేశునికి శిష్యుడు. రమేశుడు తను స్థాధన చేసుకోవటంకోసం వీడిక్కూడా సాము నేర్పాడు.

యు వ



ఈమధ్య వెంకటేశ్వరుని సోయగం ఎక్కువయి పోతోంది! - వామహస్తాన్ని అలంకరించటానికి 8లక్షల రూపాయల వజ్రాలు కావలసొచ్చాయి!!

భుజావా రాగానే రమేశుడు కఠినంగా ఆజ్ఞాపించాడు:— ‘చేపలన్నీ లాక్కురా. ఎవరన్నా అడ్డువస్తే వాళ్ళనికూడా జుట్టుపట్టుకూని యీడ్చుకురా! అదీ సాధ్యపడక పోతే కనీసం వాళ్ళ పళ్ళన్నా రాలగొట్టి తీసుకురా!’’

భుజావాకి కావలసింది యిటువంటి ఉత్తరువే. కిక్కురుమనకుండా వాడు, నూనె రాసి చేవతేల్చిన, కర్రను తెచ్చుకుంటానికి గదిలోకి పోయాడు.

భైరవునికాళ్ళు వణకటం మొదలుపెట్టినై. ఇతను బంగాళాదేశపు నీళ్ళతో పెరిగిన మనిషి. తిట్లూ, తిమ్మలూ, తర్జనభర్జనలకేమీ భయపడడు. కాని, ఆ దృఢంగా బొట్టిగావున్న హిందూస్తానీవాణ్ణి చూసేసరికి భయమేసింది. వాడు మాట్లాడకుండా తలవంచుకుపోవటం భైరవణ్ణి మరింత గాభరా పెట్టింది; మొరిగేకుక్క కరవదని ఆయనకి తెలుసు. పాపం ఆయన గొంతెండిపోయింది. భైరవుడు నిజంగా రమేశుని శుభచింతకుడు. అందుచేతనే ముందుగా పిరికొచ్చి చెప్పాడు. అభాగ్గైతే సకాలంలో అక్కడికి పోయి యేదో రంకెలువేసి, కాపిని చేపలు తెచ్చుకుంటాననుకున్నాడు. అవసరమైతే యీ పనిలో తనుకూడా సహాయం చేద్దామనుకున్నాడు. కాని యిప్పుడు వ్యవహారం పెడతిరిగింది. తిట్లూ తిమ్మలవేపు కెవరూ పోలేదు. యజమాని కాస్తె హుంకరించాడు, గాని భృత్యుడు పెదవికూడా కదిలించలేదు—తిన్నగా కర్ర తేవటానికి పోయాడు. భైరవుడు చాలా బీదవాడు. దొమ్మిలాట కేసులో ఇరుక్కునే తాహతు అతనికి లేదు—అసల లాంటి సంకల్పమే లేదు అతనికి.

ఒక్క క్షణంలో భుజావా పొడుగాటి కర్ర చేతపట్టి గదిలోంచి బైటికొచ్చి కర్ర తలకానించుకుని నమస్కారంచేసి పోవటాని కుపక్రమించగానే భైరవుడు ఒక్కమాటుగా అవురుమని ఏడ్చి, పోయి రమేశుని రెండు చేతులూ పట్టుకుని—"ఒరే భుజావా పోమాకు....నాయనా రమేశ్! నన్ను రక్షించు. ముసలివాణ్ణి. పిల్లలుగలవాణ్ణి. ఒక్క క్షణంకూడా బతకలేను" అన్నాడు.

రమేశుడు విరక్తితో చెయ్యి వదిలించుకున్నాడు. అతని ఆశ్చర్యానికి హద్దు లేదు. భుజావా మాట్లాడలేదు—వెనుదిరిగాడు. భైరవుడు రోదన స్వరంతో అన్నాడు: "ఈ సంగతి బయటికి పొక్కకుండా ఉండదు. నాయనా! వేణోబాబు తెలుసుకుంటే నన్నొక్కనాటికి బతకనివ్వడు! నా ఇల్లూ వాకిలీ తగలబడిపోతుంది. త్రిమూర్తులొచ్చినా కూడా అడ్డుపడలేరు!"

రమేశుడు తలవంచుకుని స్తబ్ధుడై కూర్చున్నాడు. గోల వినపడగానే గోపాల సర్కారు ఖాతాపుస్తకం వదిలిపెట్టి అక్కడికి వచ్చాడు. ఈ మాట అతనూ సమర్థిస్తూ—"ఆమాట నిజమే, బాబూ" అన్నాడు మెల్లగా.

రమేశుడు దీనిక్కూడా యేమీ జవాబివ్వలేదు. భుజావాని పొమ్మని చేతితో సైగ చేసి గదిలోకి వెళ్ళిపోయాడు. భైరవాచారి రాతకోతలు తుపాను మాదిరిగా రమేశుని హృదయాన్ని ఎంత కలస్తున్నాయో ఒక్క అంతర్యామికే తెలుసు.

# 7

"ఏంరా, యతీన్! ఆటలాడుతూ కూర్చున్నావు. స్కూలుకు పోవా?" అన్నది రమ.

"మాకు రెండు రోజులు సెలవుగా, అక్కయ్యా!" అన్నాడు యతీన్.

పిమ్మట ఈ మాట విని అసలే వికారంగా వున్న ముఖాన్ని యింకా వికారంగా పెట్టుకుని—"ఏ ఇస్కూలు బండలు కాను. నెలకు పదిహేను రోజులు సెలవులే—ఇల్లాంటి ఇస్కూలు కోసమేగా నువ్వు చేచిలము వదలించుకుంటున్నది! నేనైతే నిప్పు పెట్టేదాన్ని" అని తనపనిమీద తాను వెళ్లింది.

ఈమె చెప్పేదంతా అబద్ధమేనని ప్రచారం చేసేవారిలో కొంత పొరపాటున్నది. అప్పుడప్పుడూ ఈమె ఒకటి రెండు నిజమాటలు కూడా చెప్పటం కద్దు—అవసరమైతే చెప్పుతుంది కూడా.

రమ తమ్ముణ్ణి దగ్గరికి తీసుకుని "సెలవెందుకనిరా?" అని అడిగింది.

యతీను అక్కయ్య ఒడిలో కూర్చుని—"మా స్కూలు తిరగ కప్పుతున్నారుగా.



తర్వాత సున్నం కొడతారట—యెన్ని పుస్తకాలొస్తున్నయ్యనుకున్నావు! నాలుగు కుర్చీలూ—మేజాలూ, ఒక బీరువా, పెద్ద గడియారమూ అన్నీ వస్తున్నాయి. నువ్వొకమాటొచ్చి చూడగూడదక్కయ్యా!" అన్నాడు.

రమ మహా ఆశ్చర్యంతో—"నిజమే నటరా!" అన్నది.

"ఆఁ నిజమే నక్కయ్యా! రమేశు బాబుగా రొచ్చారు కదూ—వారే ఇవన్నీ ఇప్పించారు—" అని యతీన్ ఇంకా ఏమేమో చెప్పబోతుండగా, పినతల్లి తమవైపు రావడంచూసి రమ తమ్ముణ్ణి తనగదిలోకి తీసుకుపోయి బుజ్జగించి అనేక సంగతు లడిగి తెలుసుకున్నది. అన్నీ రమేశునికీ, స్కూలుకీ సంబంధించినవే. ఇకముందు రమేశుడు రోజుకు రెండు గంటలు పిల్లలకు పాఠాలు చెప్పుతాడనికూడా తెలుసు కున్నది—"ఏంరా, యతీన్? వారు నిన్ను గుర్తుపట్టారా?" అని హఠాత్తుగా అడిగింది.

"ఆఁ—" అన్నాడు కుర్రవాడు గర్వంగా తలతిప్పుతూ.

"ఏమని పిలిచావు వారిని?"

ఈ మాట యతీన్ కొంచెం చిక్కులో పడ్డాడు. కారణం, వారిని పిలిచేటంత

స్వతంత్రంగానీ, సాహసంకానీ అతని అదృష్టంలో ఇంకాపట్టలేదు. వారొచ్చి నిలబడితే హెడ్‌మాస్టరు పర్యంతం గడగడలాడటం చూసి పిల్లల విస్మయానికీ భయానికీ, హద్దుండేది గాదు. పిలవట మలావుంచి ధైర్యంగా వారి ముఖంవంక చూడటానికికూడా పిల్లలకు గుండె ఉండేదికాదు. కాని ఈ సంగతి అక్కయ్యదగ్గర ఒప్పుకోవటంకూడా కష్టమే. మాస్టర్లంతా రమేశుని చినబాబుగారని పిలవటం పిల్లలంతా విన్నారు. అందుకనే అతను బుద్ధినంతా వినియోగించి — 'చినబాబుగా రంటాను'' అన్నాడు. కాని వాడి ముఖాన్ని బట్టి రమ అంతా కనిపెట్టి వ్రతవాణ్ణి గుండె దగ్గరికి లాక్కుని నవ్వుతూ— చినబాబేమిటిరా? వారు నీకు బావగారవుతారు. వేణీ బాబుని బావ అని ఎలా పిలుస్తావో వారినికూడా అలాగే బావా అని పిలవలేవూ?''

యతీన్ విస్మయంతోనూ, ఆనందంతోనూ చంచలుడై—''ఏమిటీ, ఆయన నాకు బావ అవుతాడూ! నిజంగానేనా అక్కయ్యా?'' అన్నాడు.

''నిజంగా!'' అని రమ మళ్ళీ నవ్వింది.

ఇక యతీనక్కడ ఉండలేకపోయాడు. ఈ వార్త మిత్రుల్లో ప్రచారం చేస్తేగాని అతని కడుపుఉబ్బు తగ్గదు. కాని అదెలా సాధ్యం? స్కూలు మూసివుంది. ఈ రెండు రోజు లెలాగో వాడు ఓపికపట్టక తప్పదు. ఐనా చుట్టుప్రక్కలనున్న ఇద్దరు ముగ్గురు పిల్లల చెవినైనా వేద్దామని అక్క చేతుల్లోంచి వదలించుకోటానికి ప్రయత్నిస్తూ— ''ఇక పోతానక్కయ్యా!'' అన్నాడు.

''ఈవేళప్పుడే ఎక్కడికి పోతావురా?'' అని రమ వాడిని గట్టిగా పట్టుకుంది.

తనను పోనివ్వనందుకు యతీన్ కాసేపు ముఖంమాడ్చుకు కూర్చుని, తర్వాత— ''ఇన్నాళ్ళనుంచీ ఆయనెక్కడున్నా దక్కయ్యా?'' అని అడిగాడు.

రమ మెల్లగా—''ఇన్నాళ్ళనించీ వారు కలకత్తాలో చదువుతున్నారు. నువ్వు కూడా పెద్దవాడివైతే కలకత్తా పోవాలి, నన్నొదిలిపెట్టి ఉండగలవా, యతీన్?'' అని తమ్ముణ్ణి ఇంకోమాటు గుండెకు కరిపించుకుంది.

యతీన్ కుర్రవాడయినా అక్కయ్య గొంతులో ఏదో మార్పు కనిపెట్టి ఆమె ముఖంవంక ఆశ్చర్యంతో చూస్తూ వుండిపోయాడు. రమ తమ్ముణ్ణి ప్రాణంతో సమానంగా ప్రేమించేది. కాని ఆ ప్రేమను మాటలతోగానీ, చేష్టలతోగానీ ఈ విధంగా, ఆవేశంతో ఎప్పుడూ వెల్లడించలేదు.

''బావ చదువంతా పూర్తయిందా, అక్కయ్యా?'' అన్నాడు యతీన్.

''ఆc, ఐపోయిందిరా?'' అన్నది రమ అలాగే స్నేహపూరిత స్వరంతో.




"నీకెలా తెలుసు?" అని అడిగాడు మళ్ళీ యతీన్.

జవాబుగా రమ నిట్టూర్చింది. నిజానికి అతని చదువునుగురించి ఈమెకే కాదు, గ్రామస్థు లెవ్వరికీ తెలియదు. తను ఊహించింది నిజం కావచ్చని ఈమె నమ్మకం. ఎందుకంటే, వచ్చిన కొద్దికాలానికే ఇతరుల పిల్లల చదువుకి ఇంత శ్రద్ధతీసుకునే వ్యక్తి తను మూర్ఖుడై వుండడని ఈమె విశ్వసించింది. యతీన్ మళ్ళీ ఈ విషయమై అడగలేదు. కారణం, ఈ మధ్యలోనే అతని బుర్రలో ఇంకో ప్రశ్న ఉద్భవించింది.

"సరేగాని, అక్కయ్యా! వేణీబావ ఇక్కడికి రోజూ వస్తాడే, రమేశబావ రాడెందుకని?" అని అడిగాడు.

ఈ ప్రశ్న రమ శరీరంలో ఏదో నొప్పిమాదిరిగా విద్యుద్వేగంతో ప్రవహించింది. అయినా నవ్వుతూ—"వారిని పిలుచుకు రాగలవా?" అన్నది.

"ఇప్పుడు పొమ్మంటావా, అక్కయ్యా?" అంటూ యతీన్ వెంటనే లేచి నుంచున్నాడు

"ఒరే, నువ్వెంత పిచ్చివాడివిరా!" అని రమ కనురెప్పపాటులో కుర్రవాణ్ణి పట్టుకుని—"జాగర్త, యతీన్! అలాంటి పని ఎప్పుడూ చెయ్యమాకు!" అని గుండెప కరిపించుకున్నది. ఆమెగుండె దడదడ కొట్టుకోవటం గ్రహించి, యతీన్ కుర్రవాడైనా, ఆశ్చర్యంతో ఆమెవంక చూస్తూ వుండిపోయాడు. ఒకటి, ఆమె ఎప్పుడూ ఇలా ప్రవర్తించలేదు. పైగా రమేశబాబు "బావ" అవుతాడని చెప్పి, వాడెంతో సంతోషిస్తూ వుండగా ఈ విధంగా భయపెట్టడం వాడిని మరింత గాభరా

పెట్టింది.

ఈ సమయంలో పినతల్లి పిలుపు చెవినిపడి రమ తమ్ముణ్ణి వదిలి నుంచుంది. కాసేపట్లోనే ఆమె వాకిట్లోకొచ్చి—"నేనింకా నువ్వు స్నానం చెయ్యటానికి పోయావనుకున్నాను. ఎంత ఏకాదశి ఐతేమాత్రం ఈవేళదాకా మునకవేసి రాకుండా వుంటారా, ఎవరన్నా? ముఖం చూడూ ఎలా వాడి నల్లబడిపోయిందో!" అన్నది.

"నువ్వు పో, పిన్నీ, నేనిప్పుడే పోతా" అన్నది, రమ బలవంతాన నవ్వుతూ.

"ఇంకా ఎప్పుడు పోతావు?—ఇలా బైటికిరా, వేణీ. చేపలు పట్టించుకొచ్చాడు. భాగం వేసుకుందాము" అన్నది పినతల్లి.

చేపలమాట వినగానే యతీన్ పరిగెత్తుకుంటూ వెళ్లాడు. రమ చాటుగా ముఖం తుడుచుకుని పినతల్లివెంట బయటికి వచ్చింది. ఇంటి ముంగిలిలో గోలగా వుంది. చేపలు బాగానే పడినవి—ఇంచుమించు పెద్ద తట్టెడు. భాగాలు వేయించటానికి వేణీ స్వయంగా వచ్చాడు. ఊళ్ళో పిల్లలంతాకూడా పల్లెకారుల వెంటబడి వచ్చి చుట్టుముట్టి గోలచేస్తున్నారు.

బయట దగ్గు వినపడింది. ఆ తర్వాత—"ఏ రకంవి పడ్డవోయ్, వేణీ!" అంటూ ధర్మదాసు కర్ర కొట్టుకుంటూ ప్రవేశించాడు. వేణీ ముఖం మాడ్చుకుని—"ఏదో కాసిని చిల్లలుపడ్డయి" అని పల్లెకారులతో—"ఎందుకోయ్ ఆలస్యం చేస్తారు త్వరగా రెండు భాగాలు వేయండి" అన్నాడు.

పల్లెకారులు భాగాలు వేస్తున్నారు.

"ఎందుకు తీర్థాలలాగా పోగయ్యారు, రమా? నేను చాలా రోజులనించి వచ్చి చిన్నా చూసిపోదామనుకుంటూ వుంటే ఇంతవరకు పడనేలేదు" అంటూ గోవింద గంగూలీ వెల్లాలో అడుగుపెట్టాడు.

"రండి." అని రమ పెదవులు బిగబట్టి నవ్వింది.

"ఏమిటంతా చోద్యం చూస్తున్నారు!" అని గంగూలీ వారిదగ్గరకు వచ్చి హఠాత్తుగా ఆశ్చర్యం తెచ్చుకుని—"ఓస్, ఇదా సంగతి! బాగానే పడ్డాయే—పెద్ద చెరువులో వల వేశారేమిటి!" అన్నాడు.

ఈ ప్రశ్నలకు జవాబులివ్వటం అనవసరమని ఎవ్వరూ ఇవ్వలేదు. చేపలు భాగాలు వేశారు. వేణీ తన భాగానికి వచ్చినవన్నీ నౌకరు నెత్తికెత్తి, పల్లెకారులకేదో కన్నుకలిపి సైగచేసి ఇంటికి బయలుదేరబోతున్నాడు. ఇక ముఖర్జీగారింట్లో తినేవారెవరూలేరు కాబట్టి, వారి భాగంలోవి అందరూ తలా కాసిని యోగ్యతానుసారంగా పంచుకుని ఇళ్లకెళ్లబోతుండగా రమేశుని హిందూస్తానీ నౌకరు తన ఎత్తు లాఠీ చేత

బట్టి ఇంటి ముంగిలిలో అడుగుబెట్టాడు. వీడి ముఖం ఎంతమందిలో వున్నా కళ్ళ బడకుండానూ వుండదు; కళ్ళబడితే మరపుకూడా రాదు! ఈ గ్రామంలో పిన్న మొదలు పెద్దవరకు అందరూ వీణ్ణి ఎరుగుదురు. అంతేకాదు, వీణ్ణి గురించిన కల్పనా కథలుకూడా కొన్ని అక్కడ ప్రచారంలో వున్నవి.

అక్కడ వోగయినవారందరిలో వాడు రమను ఎలా గుర్తించాడో వాడికే తెలియాలి. దూరానవుండే, వాడు రమకు సలాముపెట్టి—"అమ్మగారూ" అని దగ్గరకు వచ్చి నుంచున్నాడు. వాడి ముఖం ఎలాగున్నా గొంతుమాత్రం భయం గొల్పేటట్టు వుంది—కటువుగా వుండటమే కాదు, బొంగురుగా కూడా. వాడు మళ్ళీ ఇంకోసారి సలాంపెట్టి కలగాపులగపు భాషలో "తను రమేశుని నౌకరనీ, చేపల్లో మూడో భాగం తీసుకుపోటానికి వచ్చాననీ" చెప్పుకున్నాడు. రమ విస్మయంవల్లనైతే ఏం, వాడు అడిగిందానికి జవాబు సిద్ధంగా లేకపోవటంవల్లనయితే ఏం—వెంటనే సమాధానం చెప్పలేకపోయింది. హిందుస్తానీవాడు తట్ట తీసుకుని పోబోతున్న వేణీ నౌకర్ని "ఎయ్, పోమాకు!" అని గద్దించాడు. నౌకరు భయంతో రెండడుగులు వెనక్కివేశాడు వేణీ అప్పుడు కాస్త సాహసించి, తను ఉన్నచోటినుంచి కదలకుండానే—"ఏం భాగం?" అని అడిగాడు.

భుజావా వెంటనే వేణీకొక సలాంపెట్టి—"మిమ్మల్ని అడగలేదు బాబుగారూ!" అన్నాడు.

రమ పినతల్లి ఎక్కడో పంచపాళీలో వుండి—"ఏంరా నాయనా! కొడతావేమిటి?" అన్నది. భుజావా కాసేపు ఆమె ముఖంవంక చూసి, బొంగురు గొంతుతో పకపక నవ్వాడు. తర్వాత కాసేపటికి నవ్వు ఆపుకుని, పిగ్గుపడ్డవాడి మాదిరిగా—"అమ్మగారూ!" అని పిల్చాడు మళ్ళీ. వాడి మాటల్లోనూ, ప్రవర్తనలోనూ అతి వినయమే కాకుండా నిర్లక్ష్యంకూడా కనపడుతున్నది. రమ అది గ్రహించి విసుగుతో "ఏం కావాలి మీ బాబుకి?" అన్నది.

రమ విరక్తి చెందటం చూసి భుజావా ముడుచుకుపోయాడు. తన కర్కశ కంఠాన్ని వాడు శక్తికొద్దీ మృదువుగాచేసి మళ్ళీ వెనుకటి మాటనే చెప్పాడు. ఇప్పుడు చెపితేమాత్రం ఏమి లాభం? చేపలు పంచిపెట్టటంకూడా అయిపోయె. ఇంతమంది ఎదట రమ చిన్నబోతుందా? అందుకనే కొంచెం కటువుగా అన్నది:

"మీ బాబుకు ఇందులో భాగంలేదు పోయి చేసుకోమను. చాలనైంది!"

"చిత్తం, అమ్మగారూ!" అని భుజావా ఇంకోమాటు సలాంపెట్టి, వేణీనౌకర్ని పొమ్మని చేతితో సైగచేసి, తను పోవటానికి ఉపక్రమించాడు. వీడి ప్రవర్తన చూస్తే

అక్కడ వున్నవారంతా ఆశ్చర్యపడుతుండగా మళ్ళీ రమవైపుకు తిరిగి కలగా పులగపు భాషలో ఇలా చెప్పాడు:—"అమ్మగారూ! ఊళ్ళోవారు ఎవరో చెప్పితే మా బాబుగారు నన్ను చెరువుదగ్గరికి పోయి చేపలు తెమ్మని పంపారు. నిజానికి నేనుగానీ, మా బాబుగారు గానీ చేపలు తినము. కాని—" అని భుజావా ఒకమాటు గుండెమీద చరుచుకొని—"బాబుగారి ఆజ్ఞప్రకారం ఈ ప్రాణాల్ని చెరువుదగ్గరే విడిచేవాణ్ని. ఎందుకనో బాబుగారికోపం తగ్గిపోయింది, నన్ను వెనక్కి పిలిపించి— "భుజావా! పోయి ఆ చెరువులో మనకు భాగముందో లేదో అమ్మగారిని కనుక్కురా" అన్నారు. అని వాడు కర్రతో సహా రెండు చేతులూ తలపైకెత్తి రమకు నమస్కరించి "ఒరే భుజావా, ఎవరెన్ని చెప్పినా అమ్మగారి నోటివెంట మాత్రం అబద్ధంరాదు. ఇతర్లసొత్తుకు ఆమె ఎప్పుడూ ఆశపడదు అన్నారు మా బాబుగారు నాతో!" అని వాడు సంభ్రమంతో నమస్కరించుకుంటూ వెళ్ళిపోయాడు

వాడు వెళ్ళిపోగానే వేణి ఆడంగిగొంతుతో కేకలువెయ్య మొదలు పెట్టాడు: "ఇలా అయితే వాడు ఆ స్థిని వాడే కాపాడుకుంటాడు! చూడు రమా! నేను నీ ముందే ప్రతిజ్ఞ చేస్తున్నాను. ఇవ్వాళనించి వాడిని ఆ గుంటలో ఒక్క పక్కెను కూడా పట్టనివ్వను" అని ఆనందంతో ఉబ్బిపోయి హి—హి—హి అని సాగదీసి నవ్వ నారంభించాడు. కాని ఆమాటలేవీ రమ చెవికెక్కలేదు. "అమ్మగారి నోటినించి అబద్ధ మెప్పుడూ రాదు" అని భుజావా చెప్పినమాటే లక్ష చప్పట్లు కొట్టుకున్నట్టుగా ఆమె చెవిలో ప్రతిధ్వనిస్తున్నది! ఆమె పచ్చని ముఖం ఒక్క మాటుగా ఎర్రబడి వెంటనే తెల్లబడిపోయింది—ముఖంలో ఎక్కడా రక్తపుబొట్టు లేదన్నట్టుగా. ఆమెకున్న జ్ఞానమల్లా తన ముఖాన్ని ఇతర్లకు కనపడనివ్వకూడదనే. అందుకనే, ఆమె తలమీదకి ముసుగులాక్కుని చప్పున లోపలికి వెళ్ళిపోయింది.

# 8

"పెద్దమ్మా"

"ఎవ్వరూ! రమేశా! రా, నాయనా, లోపలికిరా!" అని విశ్వేశ్వరి ఆదరాబాదరా బావతెచ్చి పరిచింది. రమేశుడు ఇంట్లోకి వచ్చి చకితుడైనాడు. కారణం, విశ్వేశ్వరి దగ్గర ఇంకో స్త్రీ కూర్చునివుంది. ఆమె ముఖం కనపడక పోయినా రమ అయి ఉంటుందని రమేశుడు ఊహించాడు. అతనికి కోపంకూడా వచ్చింది—పిన్నమ్మ ద్వారా తిట్టించి, మళ్ళీ ఆమె దగ్గరే చాటుగావచ్చి కూర్చున్నందుకు. అకస్మాత్తుగా రమేశుడు రావటంవల్ల రమకూడా చిక్కులోపడింది. ఆమెకూ రమేశునికీ ఉన్న



సంబంధానికి ముసుగు వేసుకుందామంటే సిగ్గు; వేసుకోకపోతే ఉండలేదు. అదీకాక, మొన్న చేపల దగ్గర వాడలా అని పోయాడు! అందుకనే, ఆమె ఇవన్నీ ఆలోచించి సాధ్యమైనంత వరకు చాటు చేసుకుని కూర్చున్నది. రమేశుడు కూడా అటువైపు చూడలేదు. ఇంట్లో ఇంకొకళ్లు ఉన్నారని కూడా గమనించనట్టు చాపమీద కూర్చుని "పెద్దమ్మా!" అన్నాడు.

"హఠాత్తుగా మధ్యాహ్నంపూట వచ్చావెందుకు?" అంది విశ్వేశ్వరి.

"మధ్యాహ్నం తప్పితే నీదగ్గర కాసేపు కూర్చోటానికి వీలుండదు. నీకెప్పుడూ పనులు తీరవుగా!" అన్నాడు రమేశుడు. విశ్వేశ్వరి అతని మాటకు ఎదురు చెప్పలేదు; మందహాసం చేసింది. రమేశుడు కూడా నవ్వుతూ—"చిన్నప్పుడు ఒకమాటు నీదగ్గర సెలవు తీసుకుని వెళ్లాను. ఇప్పుడు ఇంకోమాటు సెలవు తీసుకోటానికి వచ్చాను. ఈ తఫా ఒకటే పోక!" అన్నాడు. అతను ఎంత నవ్వుతున్నప్పటికీ గొంతులో వేదన కనపడుతూనే ఉన్నది. అది గ్రహించి, శ్రోతలిద్దరూ విస్మయంతోనూ, వేదనతోనూ చకితులైనారు.

"శివ! శివ! అవేమిమాటలురా నాయనా!" అంది విశ్వేశ్వరి. ఆమె కళ్లలో నీరు తిరిగింది. రమేశుడు మళ్ళీనవ్వాడు. విశ్వేశ్వరి స్నేహపూరిత స్వరంతో—"ఒంట్లో బాగాలేదా, నాయనా!" అని అడిగింది. రమేశుడొకమాటు పుష్టిగల తన శరీరంవంక చూసుకుని అన్నాడు: "ఇది గోధుమ రొట్టెతో పెరిగిన దేహం, పెద్దమ్మా కాస్తే కూస్తే జబ్బుల్ని లెక్కచెయ్యదు. అసలు జబ్బుగాకూడాలేను నాకు ఇక్కడ ఉంటానికే బాగా లేదు."

జబ్బుగాలేదని తెలుసుకుని విశ్వేశ్వరి కొంత తృప్తి పడింది. "ఇది నీజన్మభూమి కదా, ఇక్కడే ఉండలే నంటున్నావు, ఎందుకని?" అంది నవ్వుతూ.

"కారణం నేను చెప్ప దలచుకోలేదు. పెద్దమ్మా! బహుశా నీకంతా తెలుసు ననుకుంటాను."

విశ్వేశ్వరి ఒకక్షణం మాట్లాడకుండా గంభీరంగా ఉండిపోయింది. తర్వాత "అంతా తెలియక పోయినా కొంతవరకు నాకు తెలుసు. అందుకనే నువ్విక్కడనించిపోతే జరగదని చెప్పుతున్నాను. రమేశ్!" అన్నది.

"ఎందుకు జరగదు, పెద్దమ్మా? ఇక్కడ నన్ను కావాలి అనే వాళ్ళు ఒక్కరూ లేరుగా!"

"ఎవ్వరూ కావాలనటం లేదని, నిన్ను ఇక్కడినించి పోనిస్తానా? ఈ రొట్టెతో పెంచిన శరీరాన్ని పారిపోవటానికే ఉపయోగిస్తావా?"

రమేశుడు మాట్లాడలేదు. ఇవ్వాళ అతనికి ఈ గ్రామంమీద ఇంత కోపం కలగటానికి కారణంకూడా ఉంది. ఊళ్లోనించి రైలుస్టేషనుకు పోయే మట్టిరోడ్డు ఏడెనిమిది సంవత్సరాల క్రిందట వర్షం కురిసి గండి పడింది. అప్పటినించి అది ప్రతి సంవత్సరం కాస్తే కూస్తె పెరుగుతూ ఇప్పుడది కాలవై కూర్చుంది. ఎప్పుడూ నీళ్ళు ఉంటున్నై. మిగతా కాలాల్లో పంచలు పైకి తీసిపోవటానికి వీలు పడుతున్నది. కాని వర్షాకాలంలో మరీ ఇబ్బంది. ఈమధ్య దానిమీద తాటిచెట్టు వేశారు. దానిమీద నడుస్తూ కాళ్లు జారిపడి చాలామంది దెబ్బలు తింటున్నారు. ఇన్ని కష్టాలు పడుతున్నా గ్రామస్థులకు అది పూడ్పించాలని తట్టలేదు. బహుశా డబ్బు ఖర్చు అవుతుందని ఎవ్వరూ పూనుకోలేదేమో! రమేశుడు ఈ భారం వహించి గత పది దినాలనించీ గ్రామంలో చందాలకోసం తిరుగుతున్నాడు. కాని వదిశ స్లుకూడా వసూలు కాలేదు, ఇంతటితో ఊరుకున్నా ఫరవాలేదు. ఇవ్వాళ రమేశుడు చందాలకోసం ఊళ్ళో తిరిగి ఇంటికి వస్తూవుండగా అంగట్లో కూర్చొని కొంచరు తన్నుగురించి మాట్లాడుకోవటం విని ఆగిపోయాడు. లోపల కూర్చున్నవాడొకడు ఇంకొకరితో అంటున్నాడు: "తిరగనీ

పాపం, ఒక్కడుకూడా వీడికి దమ్మిడీ ఇవ్వడు. చూశావంటోయ్, లాభంలేని సెట్టి వరదను పోతాడా? అయ్యగారు బూట్లువేసుకు తిరగాలి కదూ, టకటక! అందుకనే ఇన్ని తిప్పలు పడుతున్నాడు. మనం ఇవ్వకపోయామంటే వాడే వేయించుకుంటాడు. అదీగాక, ఇన్నాళ్ళనించీ మనం స్టేషనుకి పోవటంలేదు కామాలు?" ఇంకొకడు అంటున్నాడు:—"కాస్తై ఓర్చుకోవోయ్! మొన్ననే చటర్జీగారు చెప్పారు, ఇతనిచేత మారెమ్మకి గుడి కట్టిస్తానని. పాలున్నగొడ్డు, కాస్తై పొగిడామంటే ఉబ్బి తబ్బిబ్బులై డబ్బు అవతల పారవేస్తాడు!" పొద్దున ఈ మాటలు విన్నకాడినించీ రమేశునికి అసలే కారం రాచుకున్నట్టున్నది. పైన పెద్దమ్మ ఆ ప్రసంగమే తెచ్చింది:— "నువ్వా గండీ పూడ్పించటానికి తిరుగుతున్నావు కామాలు, ఏమయిందీ?" అన్నది.

"అది నెరవేరదు, పెద్దమ్మా! ఎవ్వరూ ఒక్క దమ్మిడీ ఇచ్చేటట్టు లేరు." అన్నాడు రమేశుడు విసుగుతో. విశ్వేశ్వరి నవ్వుతూ అన్నది:—"ఇవ్వక పోయనంతమాత్రంచేత నెరవేరదంటా వెందుకురా! మీ తాత ఇచ్చిపోయిన డబ్బు చాలా ఉందె. కొద్దిగా ఖర్చుపెట్టి పూడ్పించకూడదూ?"

రమేశుడు మండిపడ్డాడు:—"ఎందుకిస్తాను? నాకు తెలియక ఇదివరకే వీళ్ళ స్కూలుకు చాలాడబ్బు తగలేశాను. ఈ గ్రామస్థులకోసం ఒక్క దమ్మిడీకూడా ఖర్చుపెట్టకూడదు" అని రమవంక ఒకమాటు చూసి అన్నాడు: "వీళ్ళకి దానం చేస్తే తెలివితక్కువ వాడికింద కడతారు; మంచి చేస్తే స్వలాభం ఉన్నదనుకుంటారు; వీళ్ళని క్షమించటంకూడా తప్పే—మనకు భయపడ్డాడనుకుంటారు!"

విశ్వేశ్వరి పకపక నవ్వింది. కాని రమ ముఖమూ కళ్ళూ ఎర్రబడ్డవి—రమేశుడు కోపంతోనే—"ఎందుకు పెద్దమ్మా, నవ్వుతావు?" అన్నాడు.

"నవ్వక ఏం చేయమంటావు, నాయనా?" అని విశ్వేశ్వరి నిట్టూర్చి అన్నది:— "అందుకనే నువ్విక్కడ ఉండటం అవసరమని నేను చెప్తున్నాను. నువ్వు కోపంతో స్వగ్రామాన్ని వదిలిపెట్టి పోవాలనుకుంటున్నావు గదా. నేను ఒక్కమాటు అడుగుతున్నాను—ఇక్కడ నువ్వు కోపించతగ్గ వ్యక్తులెవరున్నారో చెప్పూ?" అని కాసేపుండి మెల్లగా తనలో అనుకున్నది:—"వాళ్ళెంత పీడితులో, దుర్బలులో నువ్వు గ్రహించినట్లయితే వాళ్ళమీద కోపించటానికి నువ్వు సిగ్గుపడేవాడివి. రమేశ్! భగవంతుడు అనుగ్రహించి నిన్ను ఇక్కడికి పంపాడు; నువ్వు వీళ్ళని వదిలిపెట్టి పోకు, నాయనా!"

"వీళ్ళు నన్ను కావాలనటం లేదుగా, పెద్దమ్మా?"

"దాన్నిబట్టే గ్రహించుకోవచ్చుగా, నాయనా! వీళ్ల కోపానికిగానీ, అలకకుగానీ

ఎంత అయోగ్యులో! వీళ్ళేకాదు. అన్ని గ్రామాలవారూ ఇంతే. కావాలంటే నీకిష్ట మొచ్చిన గ్రామం ఒకటి చూపిరా'' అని విశ్వేశ్వరి రమ వంకచూపి ''నువ్వు మాట్లాడకుండా తలవంచుకు కూర్చున్నా వెందుకమ్మా—ఏమిరా! రమేశ్! మీరిద్దరూ మాట్లాడుకోరూ!—కాదు. రమా! నువ్వు మాట్లాడకపోవటం భావ్యం కాదు. వాడి తండ్రికీ నీకూ ఉన్న విరోధం ఆయనతోటే పోయింది. ఇంకా అది మనస్సులో పెట్టుకుని మీరిద్దరూ ఎడమొఖం పెడముఖంగా ఉండటం మంచిదికాదు'' అన్నది.

రమ తల ఎత్తకుండానే మెల్లగా అన్నది:—''నేను విరోధం పెట్టుకోవాలని అనుకోవటంలేదు. అత్తయ్యా! రమేశదా—''

హఠాత్తుగా రమేశుని గొంతు రమమాట వినపడ నివ్వకుండా చేసింది రమేశుడు లేచి అంటున్నాడు: ''నువ్వు వీళ్ళతో సంబంధం పెట్టుకోవూకు, పెద్దమ్మా! ఆవాళ ఎలాగో వాళ్ళ పిన్నమ్మ బారినించి తప్పించుకున్నావు. ఈతడవ వెళ్ళి మళ్ళీ వంపించ దంటే నిన్ను తినిగాని పోదు!'' అని వాదానికి గానీ, జవాబుకు గానీ ఎదురు చూడకుండనే చప్పున బయటపడ్డాడు. ''పోమాకు, రమేశ్! వినిపో!'' అని విశ్వేశ్వరి కేక వేసింది. రమేశుడు బయటనుండే—''కాదు, పెద్దమ్మా! నిన్ను అవమానించిన వాళ్ళ తరపున నువ్వుమాట్లాడ మాకు! వాళ్ళ అహంకారం—'' అంటూ వెళ్ళిపోయాడు.

రమ కాసేపు విహ్వలవలె విశ్వేశ్వరివంక చూపి—''ఈ అపవాదు నా మీద ఎందుకు, అత్తయ్యా! నేను మాపిన్నికి నేర్పి పంపానా, నన్ను అనటానికి!'' అంటూ ఏడ్చింది.

విశ్వేశ్వరి రమ చేయిపట్టి దగ్గరికి లాక్కుని, ఓదార్పుగా—''నువ్వు నేర్పి పంపకపోవట నిజమేగాని ఆ బాధ్యత నీమీదా కొంత ఉంటుంది తల్లీ'' అన్నది.

రమ రెండో చేత్తో కళ్ళు తుడుచుకుంటూ, అలిగినట్టుగా—''నా మీద ఏమి ఉందదు! నాకా సంగతి ఏమీ తెలియదు. అత్తయ్యా! అలాంటప్పుడు ఆయన ఉత్త పుణ్యానికి నన్నెందుకు అవమానించి పోవాలి?'' అన్నది. విశ్వేశ్వరి ఇక ఈ విషయమై ఏమీ తర్కించ లేదు. మెల్లగా అన్నది:

''అసలు సంగతి అందరికీ తెలియదుగా, తల్లీ! కాని వాడు నిన్ను అవమానించా లనే ఉద్దేశంతో అనలేదని మాత్రం నేను గట్టిగా చెప్పగలను. నీకు తెలియదుగాని, నేను వాళ్ళ గమాస్తా చెప్పితే విన్నాను—నీమీద వాడి కెంతో నమ్మకమూ, శ్రద్ధా నట. అప్పుడు చెట్టుకొట్టుకుని రెండు భాగాలు వేసుకున్నప్పుడు కూడా వాడితో ఎందరో నీకూ భాగమున్నదని చెప్పారట. కాని వాడు వాళ్ళతో ''మనేమీ పరవాలేదు, రమ ఉంది—నాకు భాగమంటే తప్పక వస్తుంది. అదెప్పుడూ ఇతర్ల సొత్తు




అంటుకోదు'' అన్నాడట. మీకు ఎన్ని తగువులున్నా వాడికి నీమీద చాలా నమ్మకముంది. మొన్న చేపలు—'' అని విశ్వేశ్వరి హఠాత్తుగా ఆగి, రమ వంక కాసేపు చూసి మళ్ళీ అన్నది:—''నే నివ్వాళ ఒకొక సంగతి చెప్పదలచుకున్నాను, తల్లీ! నీ ఆస్తిని రక్షించుకోవటం ఎంత అవసరమో, రమేశుడు ప్రాణాన్ని కాపాడటం కూడా అంతకంటే ఎక్కువ అవసరం—ఎక్కువ విలువ. ఒకరి మాటల్నిబట్టిగానీ, ఒకరి లాభంకోసంగానీ వాడిని హింసించి చంపకూడదు! దానివల్ల దేశాని కెంత నష్టమో సరిగా నేను చెప్పలేను. గాని ఏమిచ్చినా ఆనష్టం తీరదని మాత్రం గట్టిగా చెప్పగలను.''

రమ మెదలకుండా కూర్చున్నది ఒక్కమాటకు కూడా జవాబు చెప్పలేదు. కాసేపున్న తర్వాత రమ మెల్లగానూ, అస్పష్టంగానూ—''పొద్దు తిరిగింది. ఇంటికి వెళ్తా'' నని నమస్కారం చేసి పాదధూళి తీసుకుని వెళ్ళిపోయింది.

రమేశుడు అక్కడ ఎంత మండిపడినా రానీ, ఇంటికి వచ్చేవరకు మాత్రం చల్లబడ్డాడు. అతను మాటిమాటికీ లోపల అనుకోసాగాడు:—''ఇంత మామూలు విషయాన్ని అర్థం చేసుకోలేక నే నెంత కష్టపడ్డాను! నిజానికి, ఎవరిమీదా నా కోపం? తమకు నిజమైన మేలు ఏదో కూడా కళ్ళు తెరచి చూడలేని గుడ్డివాళ్ళమీదనూ, ఏ విధంగానైనా పొరుగువారి నాశనమే తన క్షేమమనుకునే అజ్ఞానుల మీదనూ, మంచి చేయబోతే సందేహించే తెలివితక్కువ పెద్దమ్మల మీదనూ నా అభిమానమూ, అలుకా, కోపమూ!'' దూరాన పట్టణాల్లో ఉండి అతను పుస్తకాలు చదివి, చెప్పుడు మాటలు

విని "మనజాతి పట్టణాల్లో ఎంత చెడిపోయినా ఇంకా పల్లెల్లో న్యాయమూ, ధర్మమూ, శాంతీ ఉంది. అల్పసంతోషులూ, అమాయకులూ, ఐన గ్రామస్థుల్లో ఇతర్ల పట్ల సానుభూతి ఇంకా ఉంది. ఇతర్ల కష్టాలు తనవిగా నెత్తిన వేసుకుంటారు. ఒకరి సుఖానికొకరు ఉత్సవం చేసుకుంటారు. ఒక్క గ్రామాల్లోనే మనదేశీయుల నిజమైన పరిచయం లభిస్తుంది" అని అనుకున్నాడు. కాని, అదెంత భ్రాంతి! అతనికి పట్టణాల్లో కూడా ఇన్ని తగువులూ, ఇతర్లను చూచి ఓర్చలేక పోవటం కనబడలేదు! ఇవ్వాళ అవన్నీ తలచుకుంటూ ఉంటే అతని ఒంటిమీద జెర్రులు ప్రాకినట్టయింది. అతను పట్టణంలో వుండగా, ఏదైనా పాపకార్యం కళ్ళ బడ్డప్పుడు స్వగ్రామం పోతే ఇక ఇవన్నీ కళ్ళ పడవని తృప్తి పడేవాడు. అరి భగవంతుడా! ఎక్కడుంది, ఆ ప్రవర్తన! ఎక్కడుంది ఆ వెనకటి జీవమున్న ధర్మము! ధర్మానికి ప్రాణమెప్పుడో తీశారు. ఇంకా కట్టెను పారవేయకుండా ఉంచా రెందుకు? ఈ వికృతమూ, వివర్ణమూ ఐన శవాన్నే నిజమైన ధర్మమని నమ్మి పల్లీయులు దాని విషక్రిములూ, కుళ్ళు గాలీ పీలుస్తూ అనుక్షణమూ అధోలోకానికి పోతున్నారా! పైగా, చిత్రమేమంటే ఈ పల్లీయులు పట్టణవాసుల్ని జాతీ, నీతీ లేదని ఆక్షేపిస్తూ, నిర్లక్ష్యంగా చూస్తారు!

రమేశుడు ఇంట్లో అడుగు పెట్టగానే ఒక మధ్యకారు స్త్రీ పది పన్నెండేళ్ళ కుర్రవాడూ అతన్నిచూసి కూర్చున్నవారల్లా లేచి నుంచున్నారు. వాళ్ళ సంగతి యేమీ తెలియకపోయినా కుర్రవాని ముఖం చూడగానే రమేశుని హృదయం అవురుమన్నది. కచేరిచావిట్లో కూర్చుని లెక్కలు రాసుకుంటున్న గోపాల సర్కారు ఇతన్ని చూడగానే లేచి వచ్చి—"ఈ అబ్బాయి దక్షిణపు బజారులో ఉండే ద్వారకనాథ చక్రవర్తి కొడుకు. మీ దగ్గరికి యాచనకి వచ్చాడు" అన్నాడు.

యాచన అనేమాట వినేవరకు రమేశుడు మండిపడ్డాడు. "నేనిక్కడికి దానాలు చేయటానికే వచ్చానా, సర్కారుగారూ? ఇక ఈ ఊళ్ళో ఎవ్వరూ లేరా?" అన్నాడు.

సర్కారు చిన్నబోయాడు:—"ఆ మాట నిజమే బాబూ! పెద్దబాబు ఎవర్నీ ఊరకే పంపేవారు కారు. అందుకనే కష్టాల్లో పడ్డవారంతా ఇక్కడికి పరుగెత్తుకుంటూ వస్తారు." అని కుర్రవాడివంక చూచి స్త్రీని ఉద్దేశించి అన్నాడు:—"ఏమమ్మా! వీళ్ళు మాత్రం తక్కువ వాళ్లా? బతికి వుండగా ప్రాయశ్చిత్తం చేసుకో కూడదూ! ఇప్పుడు చచ్చినాక ఎవ్వరూ శవాన్ని అంటుకోమంటే పరుగెత్తుకుంటూ తిరగకపోతే! ఇంట్లో కంచం బిందె కూడా లేవేమిటి?"

వచ్చిన మనిషి గొల్లది. వీరి ఇంటిపక్కనే ఉంటుంది—"మీకు నమ్మకం లేకపోతే వచ్చి చూసిపోండి బాబూ! ఏమైనా ఉంటే శవాన్ని అలా పారవేసి పిల్లవాణ్ణి వెంటబెట్టుకుని ఇలా ఇంటింటికి తిరుగుతానా! నాకు ఉన్న కాస్తైకూడా ఈ ఆరు మాసాలనించీ వీరికే పెట్టాను. ఇంటి పొరుగున బ్రాహ్మలు వస్తులుంటూ వుంటే

ఎలా ఊరుకోగలము బాబూ!" అన్నది.

రమేశుడు యిప్పటికి కొంతవిషయం గ్రహించాడు. మిగతాది గోపాల సర్కారు చెప్పాడు:—"ఈ కుర్రవాడి తండ్రి ద్వారక చక్రవర్తి ఆరు మాసాలనుంచి ఉగ్గా జ్వరంతో తీసుకుని యివ్వాళ ఉదయమే చచ్చిపోయాడు. ఆతనికి ప్రాయశ్చిత్తం కాలేదని శవాన్ని ఎవరూ అంటుకోవటం లేదు—ఇప్పుడు చెయ్యక తప్పదు. ఈ గొల్లావిడ తనకున్నది యావత్తూ గత ఆరు మాసాలనుంచీ యీ బీదబ్రాహ్మలకే పెట్టింది. ఇప్పుడామెదగ్గర కూడా యేమీలేదు. అందుకనే, కుర్రవాణ్ణి వెంట వేసుకుని యిలా వచ్చింది."

రమేశుడు కాసేపు మెదలకుండా ఊరుకుని "ఇప్పుడు రెండు ఘంటలైంది కదా, ప్రాయశ్చిత్తం కాకపోతే శవం అలా వుండవలసిందేనా!" అన్నాడు.

గోపాల సర్కారు నవ్వుతూ—"మరోమార్గ మేముంది బాబూ! శాస్త్ర ప్రకారం నడవక తప్పదాయె దీనికి వూళ్ళో వాళ్ళని కూడా యేమంటాము? ఏమైనాగానీ, శవాన్ని మాత్రం అట్టేపెట్టరు. చందాలువేసి అయినా....ఏమమ్మా! ఏమాత్రం పోగైంది డబ్బు?" అన్నాడు.

కుర్రవాడి గుప్పిటవిప్పి ఒక పావులా, నాలుగు కానులూ చూపిస్తూ గొల్లావిడ అన్నది:—"ఈ పావులా ముఖర్జీ బావారిచ్చారు. ఈ నాలుగు కానులూ హవల్దారుగారిచ్చారు. ఎలాగైనా రెండురూపాయలా పోగుకాందీ ఖర్చులు సరిపోవు. బాబుగారు—"

రమేశుడు మధ్యనే—"మీరు యింటికి పొండి. ఎక్కడా తిరగ నక్కర్లేదు. నేను బందోబస్తు చేస్తాను." అని వాళ్ళని పంపి సర్కారును ప్రశ్నించాడు—"ఇలాంటి కుటుంబాలు ఇంకా యీ గ్రామంలో యెన్ని ఉన్నాయి?"

"రెంటి మూటికంటే యెక్కువ వుండవు. వీరికీ పూర్వం తినటానికేమీ లోపం లేదు. బాబూ! తిని కూర్చోలేక సరిహద్దునున్న చెట్టుకోసం ఈయనా సనాతన హాజరా వ్యాజ్యాలు వేసుకుని యిద్దరూ నాశనమై పోయారు" అని గొంతు తగ్గించి— "అసలింతదూరం వచ్చేదికాదు బాబూ! మన వేణీబాబుగారూ, గోవిందగంగూలి గారో కొమ్ము వేసుకుని వాళ్ళని ఆడించారు!"

"తర్వాత?"

"తర్వాత, ఇల్లూ పొలమూ అంతా తాకట్టు పెట్టుకుని డబ్బిచ్చారు. విరుదే వేణీ బాబుగారూ అంతా విక్రయం చేయించుకున్నారు. కాని గొల్లదైనా కామినినే చెప్పుకోవాలి. ఆపదలో ఆ బ్రాహ్మల కెవ్వరూ అంత సహాయం చేసివుండరు."

రమేశుడు దీర్ఘంగా నిట్టూర్చి వూరుకున్నాడు. తర్వాత గోపాల సర్కారును వాళ్ళకి సహాయ పడటానికి పంపి మనస్సులో ఇలా అనుకున్నాడు: "నీ ఆజ్ఞనే శిరసావహించాను పెద్దమ్మా! ఇక్కడ చావనన్నా చస్తాను గాని; ఇక ఈ దౌర్భాగ్యపు వూరును మాత్రం వదలి పెట్టి పోను!"

# 10

రెండుమూడు మాసాలు గడిచినాక ఒక నాటి ఉదయం తారకేశ్వరపు కొలను మెట్ల మీద రమేశునికి ఒక స్త్రీ ఎదురు పడింది. ఒక్క క్షణకాలం రమేశుడు మంత్రముగ్ధుడిలాగ ఆమె ముఖం వంక చూస్తూ వుండిపోయాడు. అలా చూడటం మర్యాదకాదు. తప్పుకు పోవాలని కూడా అతనికి తోచలేదు. ఆమె వయస్సు ఇరవై సంవత్సరాలకు ఎక్కువ వుండదు. స్నానం చేసి పైకి ఎక్కివస్తున్నది. ఆమె ఆదరా బాదరా బిడెపెంచి, చేతులు రెండూ రొమ్ముల మీద పెట్టుకుని, తడికొంగు పైకి లాక్కుని తల వొంచుకుని మెల్లిగా "మీ రెప్పుడు వచ్చారు?" అని అడిగింది.

రమేశునికి ఆశ్చర్యం ఎక్కువైంది కాని భయం పోయింది. పక్కకు తప్పుకుని "మీరు నన్ను ఎరుగుదురా?" అని అడిగాడు.

"ఎరుగుదును. మీ రెప్పుడొచ్చారు యిక్కడికి?" అన్నది ఆమె.

"ఇవ్వాళ ఉదయమే. మామగారి ఇంటిదగ్గరనించి ఆడంగులు వస్తామన్నారు. ఎందుకనో ఇంకా రాలేదు?"

"మీరు ఎక్కడ దిగారు?"

"ఎక్కడా లేదు. నేనిదివరకెప్పుడూ ఇక్కడికి రాలేదు. ఇవ్వాళ కెక్కడో ఒక చోటవుండి వాళ్ళకోసం ఎదురు చూడాలి."

"వెంట నౌకరున్నాడా?"

"ఊహుం. నే నొక్కడ్నే వచ్చాను."

"సరే" నని ఆమె నవ్వుతూ తల ఎత్తింది. ఇంకోమాటు ఒకర్నొకరు చూచుకున్నారు. ఆమె మళ్ళీ తలవంచుకుని, కొంచెం సంకోచిస్తూనే—"అయితే నా వెంట రండి" అని, బిందె తీసుకుని ముందు నడవ నారంభించింది.

రమేశుడు కూడా ఒక్కక్షణం ఆగాడు. సంకోచిస్తూ—"మీ వెంట రావటానికి నాకేమీ అభ్యంతరంలేదు—అలాంటిదేమైనా ఉంటే మీరు నన్ను పిలిచేవారే కారు. అదీ కాక మీరు నాకు బాగా తెలిసిన వారిలాగానే కనపడుతున్నారు కాని జ్ఞాపకం రావటం లేదు. మీ పరిచయం తెలుపుతారా?" అన్నాడు.

"అయితే కాసేపు ఈ గుడిలోపల ఉండండి. నేను పూజచేసి వస్తాను. తర్వాత దోవనుపోతూ నా పరిచయం తెలుసుకుందురు గాని" అని ఆమె గుళ్ళోకి పోయింది.

రమేశుడు ముగ్ధుడి మాదిరిగా ఆమెవంక చూస్తూ ఉండిపోయాడు. ఆమె నిండు యౌవని. ఆమె ముఖమూ, శరీర నిర్మాణమూ, ఆమె వేసే ప్రతి అడుగూకూడా



రమేశునికి పరిచితమైనదానిలాగానే తోస్తున్నది. కాని ఎంత జ్ఞాపకం చేసుకోవాలనుకున్నా ఎంతో కాలం క్రిందట చూచిన వ్యక్తి కాబట్టి జ్ఞాపకం రాలేదు.

అరగంట అయిన తర్వాత ఆమె పూజ ముగించి బయటికి వచ్చింది. రమేశుడు ఇంకోమాటు ఆమెను తేరిపార చూశాడు. కాని అతనికి జ్ఞప్తికి రాలేదు. దోవను నడుస్తూ రమేశుడు:—"మీ వాళ్ళెవరూ లేరా, వెంట?" అని అడిగాడు.

"లేరు. దాసీమాత్ర మున్నది—దగ్గర వసతి చూస్తూ. ఇక్కడికి నేను తరచుగా వస్తూవుంటాను; అందుచేత నాకు కొత్త ఏమీలేదు" అన్నది ఆమె.

"మరి నన్ను వెంటబెట్టుకు పోతున్నారెందుకూ?"

ఆమె కాసేపు మాట్లాడకుండా నవ్వి—"లేకపోతే మీరు భోజనానికి ఇబ్బంది పడరా?—నేను రమణి" అన్నది.

* * *

ఎదట కూర్చుని భోజనం చేయించి, తాంబూలం ఇచ్చి, విశ్రమించటానికి తన చేత్తో

దాప పరిచి రమ ఇంకో గదిలోకి వెళ్ళిపోయింది. పక్కమీద పండుకుని కళ్ళు మూసేవరకు రమేశునికి గత ఇరవై మూడు వత్సరాల జీవితమూ ఒక్కమాటుగా మారిపోయినట్లయింది. చిన్నప్పటి నుంచీ అతను పొరుగూళ్ళలో ఇతర్ల ఆశ్రయంలోనే గడిపాడు. భోజనం చేయటంలో ఆకలి తీరటంతప్ప ఇంకొకటి ఉంటుందని అతనికి తెలియదు. ఇవ్వాళ అతను భావించని విధంగా తృప్తి పడటంచేత అతని మనస్సు విస్మయంతోనూ, మాధుర్యంతోనూ నిండిపోయింది. రమ అతనికోసం కొత్త పదార్థాలేవి సేకరించలేక పోయింది. మామూలు కూరా నారతోనే భోజనం పెట్టింది. ఇవి అతను భోంచేయడేమో ఇతర్లకు చెప్పుతాడేమోనని కూడా భయ పడింది....అందుచేతనే వంటకాలు లేనిలోపం ఆదరంతో తీర్చాలని ఎదటికివచ్చి కూర్చున్నది. భోజనం నిర్విఘ్నంగా పూర్తి అయినాక తృప్తిగా నిట్టూర్చింది కూడా. అది రమేశుడు కనిపెట్టలేక పోయినా, అంతర్యామికి మాత్రం తెలియకుండా పోలేదు.

పగటి నిద్ర రమేశునికి అలవాటు. అతను యెదటి కిటికీలోనించి వర్షపు మేఘాలను చూస్తూ పండుకున్నాడు. తన చుట్టాల సంగతి అతనికి జ్ఞాపకమే లేదు. హఠాత్తుగా రమ వాకిట్లోకివచ్చి—"ఇవ్వాళ ఎలాను ఇంటికి పోరుగదా, ఇక్కడే ఉండండి" అన్నది.

రమేశుడు ఆదరాబాదరా లేచికూర్చుని—"ఇంటివా రెవరూ కనపడలేదు. వారు వుండమనందీ యెలా వుండగలను?" అన్నాడు.

"ఇంటావిడ వుండమనే చెప్పుతున్నది. ఈ ఇల్లు నాదే!" అన్నది రమ.

"ఇక్కడెందుకున్నది మీ ఇల్లు?" అన్నాడు రమేశుడు విస్మయంతో.

ఈ ఊరు నాకు బాగావుంటుంది, అందుకనే తరచుగా వస్తూ వుంటాను. ఇక్కడిప్పుడు జనం ఎక్కువలేరు గాని, ఒకోమాసంలో ఇనక వేస్తే రాలదు."

"అలాంటి సమయంలోనే రాలేక పోయావా?" అన్నాడు రమేశుడు.

రమ మందహాసం చేసింది! రమేశుడు మళ్ళీ అడిగాడు:—"తారకనాథుని మీద నీకు మంచి భక్తి అనుకుంటాను?"

"అంత భక్తి యేమీ లేదు. కాని బ్రతికి వున్నన్నాళ్ళూ ఏదో ప్రయత్నించక తప్పదుగా."

రమేశుడిక ఏమీ అడగలేదు. రమ గడపకు ఆనుకుని కూర్చుని ప్రసంగం మార్చింది:—"రాత్రిపూట మీరేమి తింటారు?"

"ఏది దొరికితే అదే. విస్తరిదగ్గర కూచునేవరకూ ఏమి తినబోతున్నానో నాకే తెలియదు. అందుకనే వంటబ్రాహ్మడు యేది పెడితే దానితోనే తృప్తిపడతాను."








"ఇంత వైరాగ్య మెందుకూ?"

రమేశుడు యీ మాట వెటకారంగా అన్నదో, పరిహాసంగా అన్నదో గ్రహించ లేక, క్లుప్తంగా—"వైరాగ్యంగాదు, సోమరితనం" అన్నాడు.

"కాని, ఇతర్ల పనులకు మీకు పాలుమాలిక ఉండదే?"

"దానికి కారణం ఉంది. ఇతర్ల పనికి పాలుమాలితే భగవంతుడికి సమాధానం చెప్ప వలసి ఉంటుంది. సొంత పనులకు కూడా చెప్పవలెనేమో కాని, అంత దండన ఉండదనుకుంటాను."

"మీకు డబ్బున్నది కాబట్టి పరులకు సహాయం చేయటానికి పూనుకుంటున్నారు. మరి డబ్బులేనివారో?"

"ఆ సంగతి నాకు తెలియదు రమా! ఎందుకంటే, డబ్బు ఇంత ఉండాలనిగానీ ఈ విధంగా ప్రజలకి తోడ్పడాలనిగానీ నియమమేమీ లేదు. ఆ లెఖ్ఖలన్నీ ఇహపర భారాలు వహించిన భగవంతునికే తెలియాలి."

"కాని పరలోకాన్ని గురించి చింతించవలసిన ప్రాయమింకా మీకు రాలేదుగా! నాకంటే మీరు మూడేళ్ళే పెద్దవారు."

రమేశుడు నవ్వుతూ—"అంటే, మీకింకా పరలోక చింత లేదనేగా భగవంతుడు మీకలాటి బుద్ధే ఇవ్వాలని కోరుతున్నాను. నూరేళ్ళు బ్రతుకు, కాని నేనుమాత్రం ఈ రోజు నాకు చివరి రోజు కాదని అనుకోకుండా ఉండలేను."

అతని మాటలోవున్న ఎత్తిపొడుపు వృథాపోతే దనుకుంటాను. రమ కాసేపు ఊరుకుని అడిగింది:—"మీరు దేవుడిగుడి చూడలేదు సరే. భోజనానికి కూర్చునే అప్పుడు సంధ్యావందనం కూడా చేసుకోలేదేం? మరిచి పోయరా?"

"మరిచిపోలేదు. కాని మరిచిపోయినా పెద్ద లోపం అని అనుకోను!—ఎందుకూ ఈ సంగతి అడిగావు?"

"మీకు పరలోకాన్ని గురించిన చింత ఎక్కువకదూ? అందుకని."

రమేశుడేమీ సమాధానం చెప్పలేదు. ఇద్దరూ కాసేపు మెదలకుండా ఊరుకున్నారు. తర్వాత రమ అన్నది:—"చూడండి నన్ను నూరేళ్లు బ్రతకమనటం దీవించటం కాదు, శాపమివ్వటం. మన హిందూ విధవను ఎక్కువ కాలం బ్రతకమని శ్రేయోభిలాషు లెవరూ కోరరు" అని కాసేపు మెదలకుండా ఊరుకుని మళ్ళీ—"నేను కాటికి కాళ్లుచాచి కూర్చున్నానని చెప్పలేను. కాని ఎక్కువకాలం బ్రతకట మనేసరికి మాకు భయమేస్తుంది. మీ సంగతి వేరు మేము మీకేదైనా చెప్పినా ప్రగల్భాలుగానే జమకడతారు. ఎప్పుడైనా మీకు ఈ ప్రపంచంలో పరులకోసం బుర్ర బద్దలు కొట్టుకోవటం వెర్రితనమని తెలిసి వచ్చినప్పుడు నామాట జ్ఞాపకం తెచ్చుకోండి" అని నింపాదిగా చెప్పింది.

రమేశుడు జవాబుగా నిట్టూర్చి, కాసేపున్నాక అదేవిధంగా అన్నాడు—"జ్ఞాపకం తెచ్చుకునే చెప్పుతున్నాను, రమా! నేను నీకు మేలేమీ కాను, పైగా నీ మార్గంలో కంటకాన్ని. ఇవ్వాళ నేను పొరుగువాడిలాగా నీదగ్గర యెంత ఆదరం పొందానో అదేగనక ఇంటివారిదగ్గర ఇంకొకరికి లభిస్తే, ఆ వ్యక్తికి పరుల కష్టాలు చూస్తే ఎంత వెర్రి యెత్తుతుందో చెప్పగలమా? ఇంతకుముందే నేను కూర్చుని అనుకుంటున్నాను—నా జీవితమంతా యీ ఘడియలో మారిపోయిందని. ఇలా ఆదరంతో నాకెవరూ భోజనం పెట్టలేదు. భోంచేయటంలో ఇంత ఆనందముందని నాకు తెలియటం ఇదే మొదలు!"

ఈ మాటలు వినేవరకు రమ శరీరమంతా గగుర్పొడిచింది:—"ఇది మర్చిపోవటం మీకు ఎక్కువరోజులు పట్టదు. అధవా ఎప్పుడన్నా జ్ఞాపకంవచ్చినా చాలా స్వల్పవిషయంలాగా తోస్తుంది" అన్నది మామూలుస్థితికి వచ్చి. రమేశుడేమీ మాట్లాడలేదు.

"ఊళ్ళోకిపోయి నిందించకపోతే చాలు, పొగిడినంత భాగ్యం" అంది రమ.

"లేదు రమా! నేను నిందించను, పొగడనుకూడా. ఈరోజు నాకు నిందకూ పొగడ్తకూకూడా అతీతమైంది!" అన్నాడు రమేశుడు నిట్టూర్చి.




రమ కాసేపు మెదలకుండా కూర్చుంది. తర్వాత తన గదిలోకి వెళ్ళిపోయింది. అక్కడ యేకాంతంలో ఆమె కళ్ళనుంచి అశ్రువులు టపటప క్రిందపడ నారంభించినవి.

## 11

రెండురోజులనించి జోరున వర్షం కురిసి ఇవ్వాళ మధ్యాహ్నమే తెరిపి యిచ్చింది.

రమేశుడు కచ్చేరీ చావిట్లో కూర్చుని గోపాల సర్కారుతోపాటు జమీందారీ లెఖ్ఖలు చూస్తున్నాడు. ఇంతలో అకస్మాత్తుగా ఇరవైమంది రైతులువచ్చి—''చిన్నబాబు గారూ! ఈమాటు మమ్మల్ని రక్షించండి. మీరు సహాయపడకపోతే మేము పిల్లల చేతులు పట్టుకుని బిచ్చమెత్తుకుంటూ తిరగాలండీ!'' అంటూ ఏడ్చారు.

''సంగతేమిటి?'' అన్నాడు రమేశుడు ఆశ్చర్యంతో.

''వంద ఎకరాల పొలం మునిగిపోయిందండి. నీళ్ళు బైటికి పోకపోతే పైరంతా మురిగిపోతుందండి. ఊళ్ళో ఒక్కళ్ళకికూడా తిండి ఉండదండి, బాబూ!'' అన్నారు రైతులు.

రమేశునికి ఏమీ అర్థంకాలేదు. గోపాల సర్కారువాళ్ళను రెండుమూడు ప్రశ్నలు వేసి రమేశునికి తెలియజెప్పాడు:—ఆ గ్రామస్థులకు ఈ వంద యెకరాల పొలమే మాగాణి. అందరి భూమీ ఉన్నది అక్కడ. తలా కాస్తా—పొలానికి ఉత్తరమూ పడమటా గ్రామం. మెరక కాబట్టి అటు నీళ్లు పోవు. తూర్పు రైలుకట్ట. దక్షణాన

వీరి ఉమ్మడి బాదవ ఉంది. అక్కడ సంవత్సరానికి రెండువందల రూపాయల చేపలు దొరుకుతవి. అందుకనే వేణీబాబు దానిచుట్టూ కట్టవేయించి కాపలా పెట్టాడు. రైతులు ఇవ్వాళ ఉదయంనించి ఆయనదగ్గరపడి ఏడ్చి ఏడ్చి ఇప్పుడే ఇక్కడికి వచ్చారు.

రమేశుడిక ఏమీ వినకుండానె తొందరగా బయటికి వెళ్లిపోయాడు. పొద్దు కూక బోతూ వుంది. వేణీ దింపుమీద చేరబడి హుక్కా పీలుస్తున్నాడు. ఆయనదగ్గరే హవల్దారుగారు కూర్చుని, బహుశా ఈ సంగతులే మాట్లాడుకుంటూ ఉన్నారను కుంటాను.

రమేశుడిక ఏమీ భూమికలేకుండా, వస్తూనే—"అక్కడ కట్టవేసి కూర్చుంచే ఇక కుదరదు, ఇప్పుడే తెగగొట్టి చాలి" అని అన్నాడు.

"ఏ కట్ట?" అన్నాడు వేణీ. హుక్కా హవల్దారు చేతికిచ్చి.

రమేశుడు అసలే ఆవేశంతో వచ్చాడు:—"ఎన్ని కట్టలున్నయ్. అన్నాయ్? ఆ పొలమంతా మునిగిపోతున్నది. కట్ట తెగగొట్టుకోడానికి అనుమతివ్వండి" అన్నాడు కోపంతో.

"అది తెగగొడితే రెండు మూడు వందల రూపాయల చేపలు నీళ్ళవెంట పోతా యని నీకు తెలుసా? ఆ నష్ట మెవరిస్తారు? నువ్వా, రైతులా?"

రమేశుడు కోపం చంపుకుని—"రైతు లేమిస్తారు బీదవాళ్లు! ఇక నేనెందు కివ్వాలో నాకు అర్థంకావటం లేదు" అన్నాడు.

"ఐతే మేముకూడా ఇంత నష్టమెందుకు పడాలో నా కర్థంకావటం లేదు." వేణీ హవల్దారువంక చూసి—"కక్కాయ్! చూచావుగా మావాడు ఇలాచేసి విలపాలంటాడు జమీందారీ! కాదోయ్, రమేశ్! ఆ ముండాకొడుకులు పొద్దుటినించీ ఇక్కడ శవం దగ్గర కూర్చుని ఏడ్చినట్టు ఏడ్చిపోయారు. నాకు వీళ్ళ టక్కులన్నీ తెలుసు. మీ వాకిట్లో దర్వాజా లేదా—చెప్పులు కరువైనాయా? పో. ఇంటికిపోయి అపని చేయి, వీళ్ల చప్పున తీస్తని" అని వేణీ హవల్దారుతోపాటు తను చమత్కారంగా మాట్లాడి నందుకు తానే నవ్వనారంభించాడు. ఇటు రమేశుని సహనశక్తి పోతూవుంది. అయినా వినయంగానే అన్నాడు:

"కొంచెం ఆలోచించిచూడు. అన్నయ్యా! మనకి రెండు మూడు వందలు నష్ట మైనా పరవాలేదు—వాళ్ళకి సంవత్సరం గ్రాసం పోతున్నది. కనీసం అయిదారు వేలన్నా వాళ్ళకి నష్టముంటుంది."

'వాళ్ళది ఐదువేలుపోతే మనకేం, యాభై వేలుపోతే మనకేం—వాళ్ళకోసం మన మెందుకు నష్టపడాలి, రెండువందలు?



రమేశుడు చివరిప్రయత్నం చేశాడు:—"సంవత్సరం పొడుగునా వాళ్ళేమి తింటారు?"

ఇది చాలా నవ్వుపుట్టించే ప్రశ్నయినట్టుగా వేణీ అటూ యిటూ పొర్లబడి నవ్వి, ఛూ, ఛూ అని వుమ్మివేసి—"ఏమి తింటారా? ముండాకొడుకులు పొలం తాకట్టు పెట్టుకుని డబ్బివ్వమని మనదగ్గరికి పరిగెత్తుకు వస్తారు. తమ్ముడూ! నువ్వు కాస్త లోకంచూసి నడువు. మన పెద్దలు ఏదో సంపాదించి, పెంచి మనకు పారవేసి పోయారు, ఈ ఎంగిలి! మళ్ళీ మనం దీన్ని తరగకుండా ఖుచ్చపెట్టుకుని పిల్లలికి యిచ్చిపోవాలి. లేకపోతే వాళ్ళేమి తింటారు?—ఇక ఆ ముండాకొడుకులు యెలా తింటారంటావా? అప్పుచేసి తింటారు!" అన్నాడు.

అసహ్యంతోనూ, కోపంతోనూ, క్షోభతోనూ రమేశుని ముఖం కందిపోయింది. కాని గొంతులో కాఠిన్యం రానివ్వకుండా—"మీరంత గట్టిగా స్థిరపరుచుకున్నాక ఇక మీతో తర్కించేమాత్రం లాభ మేముంటుంది? నేను రమదగ్గరకి పోతున్నాను—ఆమె ఇష్టపడిందంటే మీ ఒక్కరిమాటా సాగదు" అన్నాడు.

"మరీ మంచిది. అలాగే పోయి చూడు. మాకు అభిప్రాయభేదం వున్నదేమో. అది తెలివితక్కువది అనుకుంటున్నావేమో తమ్ముడూ! దాన్ని మైమపున్నలేవు. మీ నాయన అంతటివాణ్ణి ముప్పతిప్పలుపెట్టి మూడుచెరువుల పిల్ల త్రాగించింది!—ఏమంటావు కక్కాయ్?"

రమేశునికి కక్కాయి అభిప్రాయం తెలుసుకోవాలనే కుతూహలం కలగలేదు. వేణితో ఇక మాట్లాడటానికికూడా అతని మనస్సు పోలేదు. అతను మెదలకుండా బయటికి వచ్చాడు.

ఇంటి ముంగిలిలో తులసికోటదగ్గర సందెదీపం వెలిగించి నమస్కరించి నిలబడగానే రమకు రమేశుడు కనబడ్డాడు. ఆమెకు ఆశ్చర్యం వేసింది. ఆమె తలమీద ముసుగులేదు—కొంగు మెడకు చుట్టుకుని వున్నది; సరిగ్గా రమేశునికే నమస్కారం చేసి నుంచున్నదా అన్నట్టు వుంది! ఇక్కడివించి వచ్చిన కోపంలో వెనక రమ పినతల్లి అన్న మాటలు అతనికి జ్ఞాపకంలేవు. అందుకనే యకాయకీని అతను లోపలికి వచ్చి రమను ఆ స్థితిలో చూసి ఏమీ మాట్లాడలేకపోయాడు. ఇద్దరూ కలుసుకుని నెల అయింది.

తర్వాత కాసేపటికి రమేశుడన్నాడు:—"నువ్వు తప్పక అంతా విన్నావను కుంటాను. పిల్ల పోనివ్వటానికి అనుమతి తీసుకుందామని వచ్చాను."

రమకు విస్మయం తగ్గిపోయింది కొంగు తలమీదికి లాక్కుని—"నేనెలా వొప్పుకునేది? పెద్దబావ ఇష్టపడటం లేదు."

"ఆ సంగతి నాకూ తెలుసు. అతని ఒక్కడి ఇష్టంతో ఆగిపోదుగా!"

రమ కొంచెం ఆలోచించి "పిల్ల పోనివ్వటం మంచిదే. కాని చేపలు పోనివ్వకుండా ఏమి చేయగలం?" అని అడిగింది.

"అంత నీరు వున్నప్పుడు మనమేమీ చేయలేము. ఈ సంవత్సరం మనం నష్టానికి వొప్పుకోవలసిందే. లేకపోతే ఆ గ్రామస్తులంతా నాశనమైపోతారు." రమ మాట్లాడలేదు. రమేశుడు మళ్ళీ అన్నాడు: "ఐతే ఒప్పుకున్నట్లేనా?"

"ఊహుఁ. అంత నష్టానికి నేను వొప్పుకోను" అన్నది రమ మెల్లిగా.

రమేశుడు విస్మయంతో మాటాడలేకపోయాడు. ఇలాంటి జవాబు వస్తుందని అతను ఊహించనేలేదు. తనమాట రమ తోసివేయలేదని అతను గట్టిగా విశ్వసించాడు. రమ తల ఎత్తకుండానే రమేశుని స్థితి అంతా గ్రహించి చెబుతుంటాను. "అదీగాక ఈ ఆస్తి నా తమ్ముడిది. నేను చేసేది పెత్తనమే" అన్నది.

"ఇందులో నీకూ సగంభాగం వున్నదిగా?"

"పేరుకే. ఈ ఆస్తి అంతా యతీనుకే చెందుతుందని నాన్నకు తెలుసు. అందుకనే సగం నాపేర రాసిపోయాడు."

(ఇంకా వుంది)




[ గత సంచిక తరువాయి ]

రమేశుడు వెనకటి మాదిరిగానే నవ్వి అన్నాడు:– 'నా శరీరమంత హీనమైందని నేను చెప్పను. కాని ఈ శరీరంకంటే కూడా విలువగలవను ఉన్నవని నీవు గ్రహించలేవు రమా !'

రమ తల అడ్డంగా తిప్పుతూ–'గ్రహించాలనికూడా లేదు నాకు. కాని మీరెటో వొకటు పోక తప్పదు. గోపాల సర్కారుతో చెప్పిపొండి. నేనుకూడా పైనుండి

అతని పనిపాటులు చూస్తూ సహాయపడుతుంటాను' అన్నది. రమేశునికి విస్మయం వేసింది.

"నువ్వు చూస్తావా, మా వ్యవహారాలు! కాని—"

"ఇంకా 'కాని' యేమిటి?"

"కాని, నిన్ను నే నెలా నమ్మగలను, రమా?"

రమ నిస్సంకోచంగా అన్నది :—'ఇతర్లయితే చెప్పలేనుగాని, మీరు నమ్మ గలరు.'

రమ ఇలా అంటుందని అతను అనుకోలేదు. అతనికి విస్మయంకలిగింది. కాసేపు మౌనంగా వూరుకుని—'సరే! ఆలోచించి చూస్తాను' అన్నాడు.

"ఉహూఁ, ఆలోచించి చూసేదాకా వ్యవధిలేదు. ఈరాత్రే మీరు వెళ్ళిపోవాలి. లేకపోతే—" అని చెప్పుతుండగానే రమేశుడు మారిపోవటం ఆమె స్పష్టంగా గ్రహించింది. రమేశుడుకూడా, పారిపోకపోతే తన కేదో ఆపద రానున్నదని వూహించి, తాపీగా—'సరే, అలాగేపోతాను. కాని నేను పోయినందువల్ల నీకేం లాభం? నువ్వుకూడా ఒకప్పుడు నన్ను చిక్కుల్లో పడదోయాలని చూచిన దాని వేగా? ఇవ్వాళ నన్ను తప్పించటానికి కారణం? పోనీ అవి మరిచిపోయా ననుకుంటానికి ఎక్కువరోజులు కూడా కాలేదాయె! అంతకంటే నేను వెళ్ళిపోతే, ఫలానిలాభం నీకు కలుగుతుందని స్పష్టంగా విప్పి చెప్పితే, నేను వెళ్ళటానికి ఒకవేళ ఒప్పుకోవచ్చు" అని అతను రమవంక చూస్తూ వుండిపోయాడు. కాని అతనికి కావలసిన జవాబు ఆమె దగ్గరనించి రాలేదు. అభిమానం ఆమె హృదయాన్ని ఆవరించి వేసిందని అతనికి తెలియలేదు. ఇతను హేళనగా మాట్లాడిన మాటకు ఆమె ముఖమెంత పాలిపోయిందో కూడా ఆ చీకట్లో అతనికి కనబడ లేదు. రమ కాసేపు స్థిరంగావుండి తన్నుతాను సంబాళించుకుని — 'సరే, విప్పే చెప్పుతున్నాను. మీరు వెళ్లితే నాకేమీ లాభంలేదు. కాని వెళ్ళకపోతే చాలా నష్టముంది. నేను సాక్ష్యం చెప్పవలసి వుంటుంది' అన్నది.

"ఇంతేనా! ఒకవేళ సాక్ష్యం చెప్పకపోతే?"

రమ మళ్ళీ కాసేపు ఆగి అన్నది :— 'సాక్ష్యం చెప్పకపోతే మా యతీన్ వడుగుకు, యెవ్వరూ రారు—నా వ్రతాలకీ, పూజలకీ—'

ఇలాంటి దుర్ఘటన తలుచుకునే వరకే రమ కంపించి పోయింది. ఆపైది వినకపోయినా రమేశునికి మునిగిపోయే దేమీ లేదు. కాని అడగకుండా వూరుకో లేదు :—'ఆ తర్వాత?'

రమ వ్యాకులపాటుతో—'ఆ తర్వాతా ?—ఉహుఁ, మీరు వెళ్ళండి. నన్ను అన్ని విధాలా నాశనం చేయకండి. నా ప్రార్థన వినండి.—ఈ వూరినించి వెళ్ళిపోండి' అన్నది.

కాసేపు వుభయులూ మెదలకుండా వూరకున్నారు.

ఇంతకుపూర్వం రమేశుడు రమను ఎక్కడ చూసినా, యే స్థితిలో చూసినా అతని రక్తంలో ఒక విధమైన ఉద్రేకం కలిగేది. మనస్సును ఎన్నోవిధాల సమాధాన పర్చాలని చూసేవాడు, కాని నెగ్గలేకపోయాడు. విశేషించి ఇవ్వాళ, రమ వొంటరిగా గదిలోకి రావటం చూసేవరకు అతని హృదయం విద్రోహం చేసింది—దానికి మొన్నటి ఘటన కూడా కొంత తోడ్పడింది. కాని రమ చివరి మాట అతనిస్థితిని తారుమారు చేసింది. వ్యాకులపాటుతో వున్న రమ ముఖం, ఆమె స్వార్థపరత్వం చూసేవరకు రమేశుని గుడ్డి హృదయానికి కూడా కళ్ళు తెరుచుకున్నవి. అతను దీర్ఘంగా నిట్టూర్చి 'సరే. అలాగే పోతాను. కాని, ఈ రాత్రికికాదు. నేను పారిపోవటం నీకెంత అవసరమో, అంతకంటే కూడా అవసరమైనవని ఈ రాత్రి నాకొకటుంది. నేనిప్పుడే బయటికి పోవాలి; మీ దాసీని పిలుపు' అన్నాడు.

"ఏవిధంగానైనా ఈరాత్రి పోవటానికి వీలుండదా?' అన్నది రమ.

"ఊహుఁ. మీ దాసీ యెక్కడికి పోయింది ?"

"ఎవ్వరినీ వెంటబెట్టుకు రాలేదు !"

రమేశునికి ఆశ్చర్యం వేసింది:—'అఁ! ఇక్కడికి వొంటరిగా యే ధైర్యంతో వచ్చావు ?—దాసీకూడా వెంట లేకుండానా ?"

"ఉంటేకూడా ఏం లాభం ? అదిమాత్రం నన్ను నీ చేతిలోనించి రక్షించ గలిగేదా ?"

"నాచేతినించి కాకపోయినా, లోకాపవాదంనించయినా తప్పించ గలిగేదిగా! ఇప్పుడు చాలా పొద్దు పోయింది రాణీ !"

ఎంతకాలం క్రిందటో మర్చిపోయిన పేరు! రమ ఆవేగంతో ఏమో చెప్పబోయింది; కాని తమాయించుకుని—'ఆ సహాయమూ చేయలేదు, రమేశదా! నేను హాయిగా వెళ్ళగలను—ఇది చీకటిరాత్రి కూడా కాదు!' అని జవాబుకు ఎదురు చూడకుండా మెల్లగా వెళ్ళిపోయింది.

# 15

రమ ప్రతిసంవత్సరమూ చాలా ఖర్చుపడి మహర్నవమికి దేవీపూజ చేస్తూ వుంటుంది. సప్తమినాటినించి గ్రామంలో వున్న రైతులకీ అలగావాళ్ళకీ భోజనాలు పెట్టుతూ ఉంటుంది. రాత్రి పదిగంటలదాకా ఆ ఇంట్లో, తినిపోయే వాళ్ళతోనూ, తినటానికి వచ్చేవాళ్ళతోనూ సందడిగా వుంటుంది. ఒక్క హిందువులేకాదు, పీర్పురంనించి మహమ్మదీయులు కూడా దేవీ ప్రసాదం కోసం వచ్చేవారు. ఈ సంవత్సరం ఆమె ఒంట్లో బాగాలేకపోయినా చేసే ప్రయత్నాల్లో లోపమేమీ చేయలేదు. మండపంలో దేవీ ప్రతిమను స్థాపించటమూ, పూజాసామగ్రి సమకూర్చటమూ అయింది. ఇవ్వాళ సప్తమి. పూజ అయిపోదా చాలా సేపయింది. మామూలుగా ఈ వేళకు వారింటిముందు మెల్లాలో పాటకజనం క్రిక్కిరిసి ఉండేవారు. ఒక్కరుకూడా లేరు — కొద్దిమంది గ్రామపెద్దలు తప్ప. పొద్దు బాగా ఏటవాలింది. ఆకాశంలో సప్తమిచంద్రుడుకూడా కనబడుతున్నాడు. ఇల్లు బావురు మంటోంది! చేసిన పదార్థాలు చల్లారిపోతున్నవి. ఊహూ, ఒక్క పురుగు కూడా అటు తొంగిచూడ లేదు! వేణికి కాలు ఆనటంలేదు. పాక్కా చేతపట్టుకుని కడజాతిముండాకొడుకులికి ఇంత పొగరా? వీళ్ళని అట్లాచేస్తాను, ఇట్లాచేస్తాను అంటూ ఇంట్లోకీ బయటికీ తిరుగుతున్నాడు. గోవిందుడూ, ధర్మదాసూ, మొదలైన వాళ్ళంతా ముఖాలు మాడ్చుకుని తిరుగుతున్నారు—ఇక్కడికి రైతుల్ని రానీకుండా ఎవ్వరు ప్రోద్బలం చేస్తున్నారో జాడ తీద్దామని—చిత్రమేమంటే ఈ విషయంలో హిందువులూ మహమ్మదీయులూ అంతా కట్టు కట్టారు! ఇక, ఇంట్లో రమ పినతల్లి పేలిపోతూఉంది. ఇంత హడావిడిలోనూ మెదలకండా కూచున్నది ఒక్క రమే! ఆమె ఎవ్వరిపీ వల్లెత్తి ఒక్కమాట అనలేదు——ఎవ్వరి మీదా నెపం వేయలేదు. ఆమె వెనకటి రమేనా? ఆమెకు జబ్బుగా వున్నమాట నిజమే—కాని ఆమె ఒప్పుకోదు. నవ్వి ఏమీ లేదంటుంది! జబ్బు అందాన్ని పోగొట్టితే పోగొట్టవచ్చు. కాని ఇప్పుడామెలో వెనకటి అభిమానమూ లేదు, పట్టుదలా లేదు. ఆమెకళ్లు రెండూ జ్యోతిహీనమై—వేదనతోనూ, కరుణతోనూ నిండివున్నవి. కొంచెం జాగ్రత్తగా చూసేటట్లయితే—వాటిలో రోదనసముద్రం దాగివుందనీ, కొంచెం వీలు చిక్కిందంటే అది పొంగి ప్రపంచాన్ని ముంచివేస్తుందనీ గ్రహించవచ్చు.

రమ దేవిదగ్గరికివచ్చి నుంచుంది. ఆమెను చూడగానే హితైషులు ఒక్క






మాటుగా పాటకజనాన్ని తిట్ట నారంభించారు. వీళ్ళశాపాలు విని రమ మందహాసం చేసింది—తొడిమెనించి తుంపితే పువ్వు మనచేతిలో యెలా నవ్వుతుందో సరిగ్గా అలా వున్నదా నవ్వు. అందులో కోపంగాని, ద్వేషం గాని, మంచిగాని, చెడుగాని, ఆశగాని, నిరాశగాని యేమీ వ్యక్తం కాలేదు. ఆ నవ్వుకు అర్థమున్నదో లేదోకూడా యెవ్వరికి తెలుసు !

వేణికి కోపంవచ్చింది—"ఇది నవ్వి తోసిపారవేసే విషయంకాదు, రమా! కొంపముంచే విషయం! దీనికి మూలమెవరో తెలిస్తేనా?" అని రెండువేళ్ళు దగ్గరపెట్టి గుడ్డచించినట్టు చించుతూ— "వాళ్ళడొక్కలు చించుతాను" అన్నాడు. రమ లోలోపల కంపించింది. వేణీ చెప్పుకు పోతున్నాడు — 'దొంగముండాకొడుకులు! ఎవరి కుమ్మక్కుతో వీళ్ళింత పెచ్చుమీరారో వాడిప్పుడు జైలులో రాళ్ళు పగలగొడుతున్నాడని వీళ్ళు మరిచిపోయారు ! తొత్తు కొడుకులు! మనం కళ్ళు తెరిస్తే వీళ్ళు యేమైపోతారు ?"

రమ ఏమీ మాట్లాడలేదు. తను వచ్చిన పని చూసుకుని వెళ్ళిపోయింది.

రమేశుడు జైల్లోపడి మాసంనర అయింది. కత్తి చేతపుచ్చుకుని దొమ్మీగా భైరవాచారి ఇంటిమీదికి పోయాడని శిక్ష విధించారు। ఫిర్యాది కేసు రుజువు చేయటానికి యెక్కువ శ్రమకూడా పడనక్కరలేక పోయింది. ముద్దాయికి ఇటు

వంటివి చేయటమంటే. లెఖ్ఖలేదని కొత్తగా వచ్చిన మేజిస్ట్రేటుకు ఎలాగో తెలిసిపోయింది. బందిపోట్లలోకూడా ఉంటున్నాడా లేదా, అనే సందేహంకూడా కలిగింది! ఆయనకు ఈకేసులో పోలీసుడైరీ చాలా సహాయపడింది. ఇలాంటి నేరాలు ఇదివరకే చాలా చేశాడనీ, ఇంకా సందేహించదగిన పనులు చాలా చేస్తున్నాడనీ అందులో వుంది. ఇంకేం, మేజిస్ట్రేటు తీర్పులో ఇకముందు పోలీసులు ఇతనిమీద నిగా ఉంచాలనికూడా రాసిపారవేశాడు!

ఎక్కువ సాక్ష్యాలూ ప్రమాణాలూ అక్కర్లేకపోయినవని ఇదివరకే తెలిసింది. కాని, రమమాత్రం సాక్ష్యమివ్వక తప్పలేదు. ఆమె చెప్పినదానికి సారాంశం :

"రమేశుడు ఆచారిగారిని కొట్టటానికి ఇంటిమీదికి వచ్చినమాట నిజమేను. కాని, చేతిలో కత్తి ఉన్నదీ లేనిదీ ఆమెకు జ్ఞాపకం లేదు."

ఇది యదార్థమేనా ?— జిల్లాకోర్టులో రమ దేవునియెదుట ప్రమాణంచేసి యీ సత్యం చెప్పవచ్చింద; కాని ప్రమాణం చేయించే రివాజులేని కోర్టులో యేమి చెప్పుతుంది! రమేశుని చేతిలో కత్తి కాదు, ఆఖరికి గడిపరకకూడా లేదని ఆమెకు తెలియదా ? ఆమెకు యేమి జ్ఞాపకం వుండదో కోర్టువారు అడగ కూడదా! కాని, ఇక్కడి కోర్టులో ఆమె నిజం చెప్పటానికి వీల్లేదు! వేణీ చేలి కిందవున్న పల్లీ సమాజానికి నిజం అక్కర్లేదు. నిజానికి ఆమె సత్యం చెప్పి నట్లయితే దానికి ఫలితంగా ఆమె కళంకకాలిమ ముఖానికి పూసుకుని, సమాజా నికి వెలికావలసి వచ్చేది— ఇందులో ఆశ్చర్యంకూడా యేమీలేదు; ఇలా చాలా మందికి జరిగింది. అదీకాక, ఇంత పెద్దశిక్ష పడుతుందని రమ యెప్పుడూ అనుకోలేదు మహావేస్తే రెండువందల రూపాయల జరిమానా వేస్తారనుకున్నది. ఆమె యెంతగా ప్రార్థించినా రమేశుడు పారిపోక పోయేవరకు కోపంతో 'జరి మానా పడవలసిందే. లేకపోతే తెలిసిరాదనికూడా అనుకున్నది! అతని కీ విధంగా తెలిసివస్తుందనీ, అతని పాలిపోయిన ముఖం చూసినాకూడా అధికారికి దయ కలగదనీ, అరునెలల కఠిన శిక్ష పడుతుందనీ ఆమె కలలోకూడా వూహించలేదు! తను సాక్ష్యం చెప్పేటప్పుడు రమ రమేశుని ముఖంవంక చూడలేదు. కాని, అతను ఆమెవంకే చూస్తూవున్నాడని తర్వాత ఆమెతో యెవ్వరో చెప్పారు. తీర్పు అయినాక గోపాలసర్కారు అపీలుచేద్దామంటే, రమేశుడు—"వద్దు! నాకు కలెక్టరు యావజ్జీవ శిక్ష విధించినా నేను అపీలు చెయ్యను. బయటకంటే నాకు జైలే హాయి" అన్నాడట!

అతనిమీద కేసుపెట్టి అతని ఋణ మిలా తీర్చుకుంటేనూ, రమ బోనుయెక్కి– అతనిచేతిలో కత్తి వున్నదో లేదో కూడా జ్ఞాపకం తెచ్చుకోలేకపోతేనూ—— ఇంకా అపీలుచేసి విడుదల కావటం యెందుకూ ? ఎవరికోసం ? రమేశుని ఈ విరాగమూ, యేవగింపూ రమ గుండెమీద పెద్దరాయి పెట్టినట్లయింది. దాన్ని తీయాలన్నా, కదిలించాలన్నా కూడా ఆమెవల్ల కావటంలేదు. ఎంత ఖారమది ! తను అబద్ధం చెప్పలేదు——అని సమాధానం చెప్పుకోవాలనుకున్నా ఆమె అంత రంగం వొప్పుకోవటం లేదు. రమ అబద్ధం చెప్పనిమాట నిజమే, కాని నిజమూ చెప్పలేదుగా! నిజం చెప్పకపోవటం ఇంతపెద్ద అపరాధమనీ, అది తన్నీవిధంగా రాత్రింబగళ్ళు దహిస్తుందనీ, ఆమె కిదివరకు తెలిసివుంటే! ఆమెకు వుండివుండి యీ సంగతికూడా జ్ఞాపకం వచ్చేది :– భైరవుడు యెంత తప్పుచేసినా రమేశుడు తనమాట ప్రకారం అతన్ని క్షమించి యింటికి వెళ్ళిపోయాడు. తన మాటను యింత గౌరవంగా యిదివరకెవరు శిరసావహించారు!– తనలో తానిలా దగ్ధమై ఆమె ఇదివరకు చూడని సత్యాలు కొన్ని చూడగలిగింది. ఏ సమాజానికి భయపడి ఆమె ఇంత నీచకార్యంచేసిందో, ఆ సమాజమేదీ? వేణీ, ఇంకా కొంతమంది సంఘపెద్దల స్వార్థమూ, హింసా తప్ప దాని అస్తిత్వ మెక్కడుంది ? గోవిందుని విధవ మరదలికీ వేణీకీ సంబంధ మున్నదని యీ వూళ్ళో యెవ్వరికి తెలియదు? కాని, ఈ సమాజం అతన్నేమీ అనదు. సమాజానికి పెద్ద వేణీయే నాయె. వీళ్ళ శాసనం క్రిందనే సమాజం వుండాలి! ఇదే హిందూత్వం!

కాని రమకు భైరవాచారి మీదకూడా కోపం రాలేదు–ఇన్ని అనర్థాలకు మూలమతనే అయినా ! పాప మతనుమాత్ర మేమి చేస్తాడు? పిల్ల పెళ్ళియీడుకొచ్చింది. అనేక ఇబ్బందులు పెడతారు. వెలికూడా వేస్తారు. వెలి అంటే భయపడని హిందువులెవరున్నారు! తనకింత డబ్బువుండీ భయపడిందే–బీద భైరవాచారి ఏమి చేయగలడు ! అతను వేణీని ఎదుర్కోవటమంటే కష్టాల్ని కోరి వరించటమేనని రమకు తెలుసు.

ముసలి సనాతన హాజరా రమ యింటిముందుగా పోవటంచూసి, గోవిందుడు వాడిని కేకవేశాడు. వాడు రాలేదు. గోవిందుడు బతిమాలి, ఆఖరికి బలవంతాన వాణ్ణి పట్టుకువచ్చి, వేణీముందు నిలబెట్టాడు. వేణి మండిపడ్డాడు :

"ఆ, అంత పొగరెక్కిందిగా, సనాతన్! కళ్ళు నెత్తికెక్కినయ్యేంటి ?"

"కళ్ళు నెత్తికెలా యెక్కుతై బాబూ? తమబోటి ప్రభువులకే నెత్తినుండవే, మాబోటి బీదవాళ్ళ కెలా ఉంటై !"

"ఏమన్నావురా!" అని పొలికేకవేసి, వేణీ ఇక కోపంతో ఏమీ మాట్లాడలేక పోయాడు. ఒకప్పుడు, వీడి ఆస్తిఅంతా వేణీదగ్గర తాకట్టు వున్నప్పుడు, రోజూవచ్చి వేణీకాళ్ళు వత్తిపోతూ వుండేవాడు. అలాంటివాడి నోట ఈమాటా?

"కళ్ళు ఎవ్వరికీ నెత్తినవుండవని చెప్పాను బాబుగారూ" అన్నాడు సనాతనుడు.

ఒరేయ్! మీకు పొగరెక్కకపోతే దేవీప్రసాదం కోసం ఒక్కళ్ళన్నా రాని పోయే వారటరా?" అన్నాడు గోవిందుడు.

సనాతనుడు నవ్వుతూ – 'మాకింకా పొగరెక్కడిది, బాబూ! ఉన్న దేదో మీరే అణిస్తిరి! సరే! ఆసంగతి పోనియ్యండి. ఇక మావాళ్ళెవరూ మీ బ్రాహ్మల ఇళ్ళకి భోజనాలకు రారు' అని వాడు నిట్టూర్చి రమవైపుకు తిరిగి – 'కొంచెం జాగర్తగా ఉండండి అమ్మగారూ! సాయిబుల కుర్రవాళ్ళు పిచ్చిఎక్కినట్టుగా తిరుగుతున్నారు. ఇక చినబాబుగారు తిరిగివస్తే ఏమవుతుందో దేవుడికే తెలి యాలి. ఈమధ్యనే వాళ్ళు వేణీబాబుగారికోసం నాలుగైదుసార్లు తిరిగిపోయారు. రోజులుకూడా బాగావున్నట్టు కనబడటం లేదు!" అని వేణీవంక చూశాడు.

కనురెప్పపాటులో ఆ కోప మెక్కడికిపోయిందో వేణీ ముఖం నల్లబడి పోయింది. సనాతనుడు చెప్పుకుపోతున్నాడు: "ఈదేవత యెదట చెప్పు తున్నాను, పెదబాబుగారూ! మీరు కాస్త కనిపెట్టి తిరగండి. రాత్రిపూట బయటికి రాకండి, ఎక్కడెవడు కాపువేసుకుని ఉంటాడో చెప్పలేము."

వేణీ యేదో చెప్పబోయాడు, గాని అతని నోటినుంచి మాట పెగులలేదు. అతనిలాంటి పిరికివాడు బహుశా ఈ ప్రపంచంలో మరొకడు ఉండ డను కుంటాను.

ఇంత సేపటికి రమ మాట్లాడింది: "ఏమిరా, సనాతన్! చినబాబును గురించేనా మీకింత కోపం?" అన్నది. ప్రేమతోనూ, జాలిగానూ, సనాతనుడు వొకమాటు ప్రతిమవంక చూసి – "ఇంకా అబద్ధంచెప్పి పురుగులుపడి చస్తామండీ, అమ్మ గారూ? తమరన్నది యదార్థమే! కాని మా అందరికంటే సాయిబులు ఎక్కువ మండిపోతున్నారు. చినబాబుగారంటే వాళ్ళకి పైగంబరని నమ్మకం! దానికి దృష్టాంతరం చూడండి :– జాఫరాలీ ఎంత పీనాసివాడో లోకానికంతా తెలుసు గదండీ! అలాంటివాడు చినబాబుగారు జైల్లో పడగానే వారుపెట్టిన స్కూలుకు వెయ్యి రూపాయలు ఇచ్చాడు! మసీదులో ఆవాళ చినబాబుగారిపేర నమాజుకూడా చేశారట' అన్నాడు.



వాడిపోయిన రమ ముఖం అవ్యక్త ఆనందంతో వికసించింది. ఆమె మెరుస్తున్న కళ్ళతో సనాతనుని ముఖంవంకా, చేతులవంకా చూస్తూ వుండిపోయింది. వేణీ హఠాత్తుగా సనాతనుని చెయ్యి పట్టుకుని—'సనాతన్! నువ్వొకమాటు పోలీసుల యెదుట ఈమాటలు చెప్పాలి! నువ్వు కోరిందిస్తాను. నీకు నీరాండెకరాల పొలంకూడా వదలిపెడతాను. ఈ దేవత దగ్గర ప్రమాణపూర్తిగా చెప్పుతున్నాను—నా మాట నమ్ము' అన్నాడు.

సనాతనుడు విస్తుపోయిన వాడిలాగా కాసేపు వేణీ ముఖంవంక చూసి—'నేనింకా ఎన్నాళ్ళు బతకబోతాను, బాబుగారూ! దీనికి లోభించానంటే, చస్తే అవతల పారవేయటం అలావుంచి, నన్ను కాలుతోకూడా యెవ్వడూ అవతలికి నెట్టడు! చినబాబుగా రంతా తల్లకిందులు చేసి పోయారు' అన్నాడు.

"ఐతే బ్రాహ్మడినూట వినవన్నమాటేగా?" అన్నాడు గోవిందుడు.

"నావల్లకాదండి. అంటే మీకు కోపమొస్తుందిగాని ఆవాళ చినబాబుగారు పీర్‌పురం స్కూల్లో ఏమి చెప్పారో విన్నారా?—రెండు నాలుపోగులు వేసు

కున్నంత మాత్రంచేత 'ఎవ్వరూ బ్రాహ్మలు కారట—నిజానికి మీరు చేస్తున్న పనులు బ్రాహ్మలు చేసేవే నటండి?—అమ్మగారూ, మీరు చెప్పండీ, నిజం?"

రమ మాట్లాడలేదు. తల వొంచుకుంది. సనాతనుడు ఉత్సాహంతో మనస్సులోని ఆక్రోశమంతా తీర్చుకున్నాడు:—'ముఖ్యంగా ఈ రెండు గ్రామాల్లోని కడజాతి కుర్రవాళ్ళంతా ప్రొద్దుకూకేవరకు జాఫరాలీ ఇంటికి చేరుతున్నారు. వాళ్ళు జమీందారుగారంటే చినబాబుగారే, మిగతా వాళ్ళంతా దోపిడుగాళ్లు! అదీ కాక మేము పన్నులుకట్టి భూములు పండించుకుంటున్నాము—ఒకరికెందుకు భయపడాలి? బ్రాహ్మల మాదిరిగా నడుచుకుంటే మేమూ వాళ్ళని బ్రాహ్మల మాదిరిగానే చూస్తాము. లేకపోతే వాళ్ళకు మేమెంతో మాకు వాళ్ళూ అంతేనని బహిరంగంగా అంటూ తిరుగుతున్నారు.

"సనాతన్! వాళ్ళకి నామీదే యింత కోపమెందుకో చెప్పగలవా?" అన్నాడు వేణీ, భయంచేత యెండుకుపోయిన గొంతుతో.

"బాబుగారూ! నేనన్నానని మీరు కోపించకండి. ఈ అనర్థాలన్నిటికీ మూలం మీరేనని వాళ్ళకి తెలిసిపోయింది."

వేణీ మెదలకుండా కూలబడ్డాడు. శూద్ర సనాతనుని నోటినుంచి ఈ మాటలు వెలువడ్డా అతనికి కోపంరాలేదు. అసలు అతను కోపించే స్థితిలోలేడు—భయంతో అతని గుండెలు పీచుపీచు మంటున్నవి.

"ఐతే, అందరూ పొద్దుకూకినాక జాఫరాలీ ఇంటికి చేరుతున్నా రన్నమాట. అక్కడేమి చేస్తుంటారో నీకు తెలుసునా?" అన్నాడు గోవిందుడు.

సనాతనుడు కాసేపు గోవిందుని ముఖంవంక చూసి—'ఏమి చేస్తుంటారో నాకు తెలవదు. రెండుజాతులవారూ అన్నాదమ్ముల సంబంధం స్థాపించుకున్నారట. కాని మీరుమాత్రం వాళ్ళ జోలికి పోకండి! చినబాబుగారు జైలుకి పోయినప్పటినించీ వాళ్ళసలే తుపాకిమందులాగా వున్నారు, ఏమన్నా వొరిపిడి తెచ్చారా, పేలి పూరుకుంటారు' అన్నాడు.

సనాతనుడు వెళ్ళిపోయిన తర్వాత చాలా సేపటివరకు ఎవ్వరు మాట్లాడలేదు. రమ లేచి ఇంట్లోకి వెళ్ళబోతుండగా – 'సంగతులు విన్నావుగా, రమా?" అన్నాడు వేణీ.

రమ మందహాసం చేసింది, మాట్లాడలేదు. ఆ నవ్వు చూసేవరకు వేణీకి వొళ్లు మండింది:—'ఆచారిగాడి మూలానే ఈ ఉపద్రవాలన్నీ! ఆవాళ నువ్వు పోయి వాణ్ణి వదిలించకపోతే ఇవేమీ వుండేవి కావుగదా?...నీకేం రమా! అద

దానివి, ఇంట్లోనించి బయటికి వచ్చేపని వుండదు గనక నీకు నవ్వుగా ఉంటుంది. కాని మాగతి ఏమిటో చెప్పు నిజంగా, యెక్కడైనా పట్టుకుని బుర్ర బద్దలు కొడితే? ఆడవాళ్ళతో కలిసి వ్యవహారాలుచేస్తే, ఆఖరికి యెవ్వడి గతైనాయిలాగే పట్టుతుంది.' అని వేణీ భయంతోనూ, కోపంతోనూ, ఆక్రోశంతోనూ ముఖం అదోవిధంగా పెట్టుకుని కూర్చున్నాడు.

రమ స్తంభితు రాలైంది. వేణీని ఆమె బాగా యెరుగు. కాని, ఇంత సిగ్గు విడిచి మాట్లాడతాడని అమె ఎప్పుడూ అనుకోలేదు. జవాబివ్వకుండా ఆమె కాసేపు అలానే నిలబడి యింటిలోకి వెళ్ళిపోయింది.

వేణీ ఆ తర్వాత కేకలూ బొబ్బలూ పెట్టి, రెండుమూడు లాంతర్లూ, ఐదారుగురు మనుష్యుల్ని వెంటబెట్టుకుని నాలుగువైపులా జాగ్రత్తగా చూసుకుంటూ వెళ్ళిపోయాడు.

## 16

'ఇవ్వాళ యెలావుంది, రమా?' అన్నది విశ్వేశ్వరి రమ దగ్గరికివచ్చి రోదన స్వరంతో.

రమ విశ్వేశ్వరివంక చూస్తూ మందహాసం చేసి-'బాగానే వుంది, అత్తయ్యా' అంది. విశ్వేశ్వరి రమ తలవైపున కూర్చుని మెదలకుండా తల నిమురుతున్నది.

నేటికి మూడు మాసాలైంది, రమ మంచమెక్కి. గుండెలు పగిలిపోయే దగ్గూ, మలేరియా జ్వరమూ. ఊళ్ళో నాటువైద్యుడు అతని శక్తికొలదీ ఆమెకు వృధా చికిత్స చేస్తున్నాడు. కాని అసలు జబ్బు అతనికి అంతు పట్టలేదు! విశ్వేశ్వరికి మాత్రం యీ విషయమై అనుమానం ఎక్కువ కాజొచ్చింది. రమను ఆమె సొంతకూతురులాగా ప్రేమిస్తున్నది. అందుచేతనే రమను జాగ్రత్తగా పరిశీలింప సాగింది. ఇతర్లు ఆమెను సరిగా అర్థంచేసుకోకుండా, తప్పు చికిత్సలు చేస్తూ వుండటం చూస్తే ఆమె హృదయం పగిలిపోయేది. రమ కళ్ళు రెండూ ఎక్కడికో పీక్కుపోయినా చూపులో మాత్రం చురుకుదన మున్నదని ఆమె గ్రహించింది. ఎక్కడో దూరపు వస్తువును దగ్గరగా చూడటానికిగాను అవి ఇంత చురుకుదనం వహించాయా అన్నట్టుగా వున్నవి

"రమా?" అన్నది విశ్వేశ్వరి నెమ్మదిగా.

"ఏమిటి, అత్తయ్యా?"

"నేను నీకు తల్లిలాంటి దాన్ని—"

రమ అడ్డువచ్చి—"అసలు తల్లి నేనువ్వు, అత్తయ్యా!" అంది.

విశ్వేశ్వరివొంగి రమ నొసలు ముద్దుపెట్టుకుని —"ఐతే, నిజంచెప్పు తల్లీ! నీకేం జబ్బు?" అని అడిగింది.

"చలిజ్వరమేను, అత్తయ్యా!"— ఈ మాటలు అంటూ వుండగా రమ పాలిపోయిన ముఖం క్షణమాత్రం ఎర్రబడటం విశ్వేశ్వరి చూచి మహాప్రేమతో రమ జుట్టులాగి—"ఆ సంగతి నా ఈతోలు కళ్ళకే కనపడుతున్నది. పీటికి కనబడనిది యేదైనావుంటే నాదగ్గర దాచమాకు, తల్లీ! దాస్తే రోగం పెరుగుతుంది. 'రోగం రట్టూ, సంసారం గుట్టూ' అన్నారు పెద్దలు" అన్నది.

బయట ఉదయపుఎండ ఇంకా వేడి యెక్కలేదు. కిటికీలోంచి చల్లని గాలి కూడా వస్తున్నది. రమ కాసేపు అటువైపుచూసి — "పెద్దబావ ఎలా వున్నాడు, అత్తయ్యా?" అని అడిగింది.

"బాగానే వున్నాడు. నాలుగైదు రోజుల్లో ఆస్పత్రినించి వచ్చేస్తాడు. కాని గాయం మానటానికి ఇంకా కొన్నాళ్ళు పట్టుతుందట" అని, రమ ముఖంమీద వేదనా చిహ్నాలు చూసి—'దుఃఖించకు తల్లీ, ఇలా జరగవలసిందే. ఇది వాడికే మంచిది!' అని, విశ్వేశ్వరి రమవంక చూసి, ఆమె ఆశ్చర్యపడుతున్నదని గ్రహించి—"కొడుకు ఇంత ఆపదలో వుంటే తల్లి ఇలా మాట్లాడుతున్నదేమో అని నువ్వు అనుకుంటున్నావని అనుకుంటాను. కాని, నీకు నేను నిజం చెప్పు



తున్నాను, తల్లీ. ఇందులో నాకు దుఃఖం యెక్కువ కలిగిందో సంతోషం ఎక్కువ కలిగిందో నేను చెప్పలేను. ఎందుకంటే, అధర్మానికీ, లోకలజ్జకూ వెరవని వాళ్ళకు ప్రాణభయం ఎక్కువ ఉంటుందని నా నమ్మకం– వారికి అదికూడా లేకపోతే ఈ ప్రపంచమెప్పుడో ధ్వంసమై పోయేది. అందుకనే, వేణీకి ఈ తెలికల అబ్బాయిచేసిన మేలు వాడి బంధువులుకూడా యెవ్వరూ చేయలేరని నేననుకుంటూ వుంటాను. కడిగితే బొగ్గుకు నలుపుపోతుందా తల్లీ! దాని నలుపు పోవాలంటే నిప్పులోవేసి కాల్చ వలసిందే" అంది.

"అప్పుడింట్లో ఎవ్వరూ లేరా, ఏమిటి?" అని అడిగింది రమ.

"ఎందుకు లేరూ? అంతా ఉన్నారు. ఆ తెలికల అబ్బాయి జైలుకి పోవటానికి సిద్ధమయ్యే, నూనెఅమ్మే నెపంతో వచ్చికొట్టాడు. వాడికి వ్యక్తిగతకోపంకూడా ఏమీలేదు. మొదటిదెబ్బకు వేణీ సృహతప్పి పడిపోగానే, వాడు మెదలకుండా చూస్తూ నుంచున్నాడు. మళ్ళీ కర్ర ఎత్తలేదు. వెళ్ళేటప్పుడు వేణీ ఇకముందైనా



సక్రమంగా నడవకపోతే, తను జైల్లో పడ్డప్పటికీ, ఇదే ఆఖరుదెబ్బకాదని అనుకోమని చెప్పి పోయాడు."

"అంటే, ఇంకా వీడివెనకకూడా చాలామంది ఉన్నారనేగా! కాని, అత్తయ్యా! మనఊళ్లో అలగాజాతులవాళ్లు ఇంతపెచ్చుమీరడం ఎప్పుడూ లేదు. వాళ్లకింత సాహసం ఎక్కడనుంచి వచ్చింది?" అంది రమ మెల్లగా.

విశ్వేశ్వరి మందహాసంచేసి అన్నది—— 'అది నీకు తెలియదు రమా! వీళ్ళకింత సాహసం ఎవళ్లవల్ల కలిగిందీ? నిప్పు ఒకమాటు రాజిందంటే ఊరకనే ఆరిపోదు. దాన్ని బలవంతాన ఆర్పాలన్నా పక్కవాటిని కాల్చిగాని మరీచల్లారదు. రమేశుడు క్షేమంగా తిరిగివస్తే చాలు—వేణికి కష్టాలు వచ్చాయని నే నెప్పుడూ దిగులు పడటంలేదు!'—పైకి ఈమాట అనగలిగిందేగాని లోపల దిగులులేకపోలేదు. ఈ సంగతి రమ గ్రహించింది. విశ్వేశ్వరి మళ్లీ అన్నది—'రమా! ఏకైకసంతానం [illegible] సౌఖ్యమేమిటో తల్లికే తెలియాలి. స్పృహతప్పిపోయిన వేణిని పాలకీలో

పెట్టి ఆస్పత్రికి తీసుకుపోయినప్పుడు నాస్థితి ఎలాఉన్నదో నీకు నేను చెప్పలేను. కాని, అప్పుడుకూడా నేనెవ్వరిమీదా నెపం వేయలేకపోయాను. నాకు ఒక్కడే కొడుకని ధర్మం తన కర్తవ్యం నెరవేర్చకుండా నా ముఖంవంక చూస్తూ ఊరు కుంటుందా, తల్లీ!"

"నీతో నేను తర్కించాలని అడగటంలేదు గాని, ఒక సంగతి చెప్పు, అత్తయ్యా! రమేశదా ఏంపాపాలుచేశాడని ఈకష్టాలు అనుభవిస్తున్నాడు? మేము అన్యాయంగా జైలులో పెట్టించామని లోకానికంతకీ తెలుసుగదా!"

"వాడేమీ పాపంచేయలేదు, తల్లీ! అందుకనే వేణీ ఇప్పుడు ఆస పడిఉండటం. మీ—" అని విశ్వేశ్వరి, పెదవిమీదికి వచ్చిన మాటను దిగమింగి అన్నది:—"ఏపనికూడా యెప్పుడూ వృధాపోదు తల్లీ! దాని ఫలితం యెక్కడో వొకచోట కనపడుతూనే వుంటుంది. కాని, యెలా కనపడుతుందో మనం కని పెట్టలేము. కనకనే ఆ సమస్యను మనమింకా పరిష్కరించలేకుండా వున్నాము! ఒకరి పాపాని కొకరు ప్రాయశ్చిత్త మెందుకు చేసుకుంటున్నారు? అంటే, మనం యెందుకో చెప్పలేము. కాని చేసుకుంటూనే వున్నారు."

రమ తన సంగతి తలుచుకొని మెదలకుండా వూరుకుంది. విశ్వేశ్వరి మళ్లీ ప్రారంభించింది:— "ఇదంతా చూసినమీదట నాకళ్లుకూడా తెరుచుకున్నవి. మనం వొకరికి మంచిచేయాలనుకున్నంత మాత్రంచేత యెవ్వరికీ మంచి చెయ్యలేము. ఓర్పుతో కిందనుంచి మనం అనేకమెట్లు ఎక్కిపోవాలి. ఒకనాడు రమేశుడు నా దగ్గరికి వచ్చి 'పెద్దమ్మా! వీళ్ళని బాగుచేసినందువల్ల నాకేమీ లాభంలేదు. నేను వెళ్ళిపోతాను' అన్నాడు, నేనప్పుడు 'కాదు రమేశ్, వీళ్ళని బాగుచేసే భారం నువ్వు నెత్తిన వేసుకున్నావు. మధ్యనే వదలిపెట్టిపోమాకు' అన్నాను. నా మాట ప్రకారం వాడు పోకుండామానుకున్నాడు. వాడికి శిక్షపడిందన్న కబురువిన్నప్పుడు 'నేనే వాణ్ణి పట్టుకొని జైల్లో వేయించాను' అంతకన్న కష్టం వేసింది నాకు. కాని, వేణీని ఆస్పత్రికి తీసుకుపోయినాక, నేను వెనకపడింది పొరపాటనీ, వాడు జైలుకు వెళ్లడమే అవసరమని అనుకున్నాను. అదీకాక, ఎక్కడనించో వరి గెత్తుకుంటూవచ్చి ఇతర్లకు మేలుచేస్తానని బయలుదేరటంలో ఇన్ని అడ్డంకులుం టవని అప్పుడు నాకు తెలియదు. కొంతకాలంపాటు అభానికీ శుభానికి వాళ్ళతో పాటు కలిసి వుండాలి. వాడు ఇక్కడికి వచ్చినప్పటినుంచీ విద్యలోనూ, సంస్కా రంలోనూ, బలంలోనూ ఎవ్వరికి అందకుండా పోయాడు. చిట్టచివరి వరకూ వాడిని ఎవ్వరూ అర్థంచేసుకోలేదు. ఆఖరికి నేనుకూడా!' రమ ఏదో చెప్పబోతు

న్నదని గ్రహించి మళ్ళీ అన్నది :- 'వాడిని అర్థం చేసుకోనందుకు నేనేమీ పశ్చాత్తాప పడడంలేదు, రమా! నేను అన్నానని కోపించకుగాని, నిజానికి మీరే వాడిని కిందికి దించి నలుగురిలో కలిపారు. దీనివల్ల ఎంత అధర్మంజరిగినప్పటికీ వాడు తిరిగివచ్చి సత్యం గ్రహిస్తాడని నేను గట్టిగా చెప్పగలను.'

రమకు ఏమీ అర్థం కాలేదు.— 'అతనెందుకు కిందికి దిగుతాడు, అత్తయ్యా! మా అన్యాయలవల్లా, అక్రమాలవల్లా అత నెన్నిబాధలు పడినప్పటికీ మాదుష్కర్మాలకు ఫలితం మేమే అనుభవిస్తాము. మాపాపం అతనికెందుకు అంటుకుంటుంది?' అన్నది.

"ఎందు కంటదు, తల్లీ! లేకపోతే పాపమంత భయంకరమైన దెందుకని? ఉపకారానికి ప్రత్యుపకారం చేయటం అలావుంచి అపకారమే ఎక్కువమంది చేస్తూవుంటారు. ఆ అపకారం దాతగుణాన్ని మార్చితే! నువ్వే చెప్పు తల్లీ, ఈ తఫా రమేశుడు తిరిగివస్తే వెనకటిలాగా వుంటాడేమో? వాడు ఏ చేత్తో ఇదివరకు దానంచేస్తూ తిరుగుతున్నాడో ఆ చేతిని భైరవాచారి విరగగొట్టాడు" అని, కాసేపు ఆగి మళ్ళీ అన్నది:—"ఎలా చెప్పగలం— ఒకవేళ ఇదీ వాళ్ళ మంచికే జరిగిందేమో! బలయుతంగా వున్నవాడిచేతిదానం గ్రామస్తులు స్వీకరించలేకపోయారు; ఇక ఈ కుంటిచేతి దానమే వాళ్ళకు వుపయోగపడుతుందేమో!" అని నిట్టూర్చింది.

రమ కాసేపు మెదలకుండా విశ్వేశ్వరి చేయి వదిలిస్తూ వుండింది. తర్వాత "సరే, అత్తయ్యా! తప్పుడు సాక్ష్యం చెప్పి నిరపరాధిని శిక్షకు గురిచేసినందుకు నాకు శాస్తి ఏమిటి?" అని మెల్లగా కరుణాపూరితంగా అడిగింది.

విశ్వేశ్వరి రమ తల నిమురుతూ కాసేపు కిటికీవంక చూసింది. తర్వాత రమ కళ్ళు తుడుస్తూ—'ఇందులో నీ తప్పేమీలేదు తల్లీ! అపవాదు వేస్తామని నిన్ను భయపెట్టి, నీచేత సాక్ష్యం చెప్పించినవారిదే ఈ తప్పంతా. ఈ దోషం నీకేమీ అంటదు" అని, తన కళ్ళుకూడా కొంగుతో తుడుచుకున్నది. ఈ ఓదార్పుతో రమ ఇక అశ్రువులు ఆపుకోలేకపోయింది. కట్టతెగిన ప్రవాహంలాగా ఆమె కళ్ళవెంట నీళ్ళు బొటబొట కారినవి.

"అతని విరోధులు 'శత్రువును ఏ విధంగా లొంగదీసినప్పటికీ తప్పులేదు' అని చెప్పుతారు. కాని, ఎందుకనో నా మనస్సు దానితో తృప్తిపడటంలేదు, అత్తయ్యా!" అన్నది కాసేపుండి రమ.




"ఎందుకు తృప్తిపడటంలేదు, రమా ?" అని ఆమె ముఖంవంక చూడగానే విశ్వేశ్వరికి మెరుపులాగా ఒక భావం కలిగింది. ఎంతకాలంనించో ఆమె మనస్సులోవున్న ఒక సందేహం తీరినట్లయింది. ఇవ్వాళ రమను పూర్తిగా అర్థం చేసుకోగలిగి విశ్వేశ్వరి వేదనతోనూ, ఆశ్చర్యంతోనూ స్తంభితురాలైంది. రమ మనోవేదన ఆమెకు అర్థంకాకపోలేదు.

"అత్తయ్యా !" అంది రమ కళ్ళు మూసుకునే.

విశ్వేశ్వరి చకితురాలై "ఊఁ" అన్నది.

"ఇవ్వాళ నీకొక సంగతి చెప్పతాను, అత్తయ్యా ! జాఫరాలీ ఇంట్లో పీర్‌పురం కుర్రవారంతాచేరి రమేశదా చెప్పినట్లు రోజూ సాయంత్రం మంచి సంగతులు మాట్లాడుకుంటూవుండేవారట. వాళ్ళని పోలీసులచేత పట్టించాలని ఒక ఆలోచన జరిగింది. నేను మనిషినిపంపి వాళ్ళని జాగర్తపడమని హెచ్చరించాను."

"ఏమిటీ ? వేణీ పోలీసుల్నికూడా పిలిపించాలని చూశాడూ ! ఒక మాటు వాళ్ళచేతిలోపడితే ఇంకా తప్పించుకోటానికి మార్గముందీ ?" అన్నది విశ్వేశ్వరి ఆశ్చర్యంతో.

"ఆ కారణంచేతనే వాళ్లు వేణీదాని కొట్టివుంటారని నా నమ్మకం, అత్తయ్యా! నా తప్పు క్షమించవూ ?" విశ్వేశ్వరి వంగి రమ నొసలు ముద్దుపెట్టుకుని

—"వాడి తల్లినైవుండి నేనే క్షమించలేకపోతే ఇంకెవరు క్షమిస్తారు, రమా! దీనికి బహుమానంకూడా భగవంతుడు నీకిస్తాడని నేను నిన్ను ఆశీర్వదిస్తున్నాను."

రమ వొరచేత్తో కళ్ల తుడుచుకుని— "ఆయన బతికివచ్చి, తను తయారు చేసిపోయిన క్షేత్రం విస్తృతానికి సిద్ధంగా వుందని అనుకుంటే చాలు, అత్తయ్యా! నాకదే తృప్తి. అతను కోరిన విధంగా గ్రామాల్లోని ప్రజలూ పాటక జనమూ నిద్రనించి మేలుకొన్నారు. ఆయన్ని గ్రహించారు; ప్రేమిస్తున్నారు. ఈ ఆనందంలో ఆయన నా అపరాధం మర్చిపోలేదా, అత్తయ్యా?" అంది. విశ్వేశ్వరి మాట్లాడలేకపోయింది. ఆమె కంటినించి అశ్రువొకటి రమ చెంపమీద పడింది. కాసేపు ఇద్దరూ మౌనం.

తర్వాత "అత్తయ్యా!" అని పిలిచింది రమ.

"ఎందుకు, తల్లీ?"

"ఒక్క విషయంలోమాత్రం మేమిద్దరమూ ఏకీభవించాము— నిన్ను ప్రేమించటంలో." విశ్వేశ్వరి వంగి రమ నుదురు ముద్దుపెట్టుకున్నది:— "ఆ చొరవతోనే నేను నిన్నొక సహాయంచేయమని అడుగుతున్నాను. నేను లేనప్పుడుకూడా ఆయన నన్ను క్షమించకపోతే నా తరఫున ఆయనతో ఈ మాటలు చెప్పు— నేనెంత దుర్మార్గురాలనని ఆయన అనుకుంటున్నాడో అంత దుర్మార్గురాలిని నేను కాను. అతన్ని నేనెంత కష్టపెట్టానో అంతకంటే యెక్కువ బాధపడ్డాను. ఈ మాటలు నీ నోట వింటే ఆయన తప్పక నమ్ముతాడని నేననుకుంటాను."

విశ్వేశ్వరి రమమీద బోర్లగాపడి యేడుస్తూ అన్నది:—"పద, తల్లీ, మన మేడన్నా తీర్థానికి పోదాము. అక్కడ మనకు చేసే వుండకూడదు; దమ్మిడీ వుండకూడదు—తల ఎత్తితే దేవాలయం శిఖరం కనిపిస్తూ వుండాలి. నేనంతా గ్రహించాను రమా! అక్కడికి వెళ్ళినాకకూడా ఇలాంటి విషయాలు మనస్సులో పెట్టుకుని దహించుకు పోతూవుంటే ప్రయోజనం వుండదు. మనం బ్రాహ్మణ కన్యలం. అక్కడికి వెళ్ళేటప్పుడు వారిలాగానే వెళ్ళగలగాలి."

రమ కాసేపు మెదలకుండా వూరుకుని, తర్వాత నిట్టూర్చి— "నేనూ అలాగే రావాలని అనుకుంటున్నాను, అత్తయ్యా" అన్నది.



# 17

త్రనుపడ్డ కష్టాలు యిలా సార్థకమవుతవని రమేశుడు కలలోకూడ తలచలేదు. అతను జైలు ప్రహరీదాటి బయటికి రాగానే తనకోసం వేచివున్న వారిని చూసి విస్తుపోయాడు: వేణీ అందరికంటే ముందు నుంచున్నాడు, తలకు గుడ్డకప్పుకుని: అతనివెనుక రెండు స్కూళ్ళ పంతుళ్ళూ, విద్యార్థులూ, గ్రామస్థులూ. అందులో హిందువులూ, మహమ్మదీయులుకూడా వున్నారు. వేణీ రమేశుని చూడగానే గట్టిగా కౌగలించుకుని రోదన స్వరంతో - "తమ్ముడూ, రమేశ్! రక్తసంబంధ మింత గాఢమైనదని నాకు ఇదివరకు తెలియదురా! యదుముఖర్జీకూతురు ఆ భైరవాచారిగాడిచేత ఇంతపని చేయించి, సిగ్గూ శరమూవిడిచి బోనెక్కి ఇలా తప్పుడుసాక్ష్యం చెప్పుతుందని తెలిసికూడా అప్పుడు నేను తెలియనట్టు వూరుకున్నారా! అలా వూరుకున్నందుకు నాకు భగవంతుడు శాస్తికూడా చేశాడురా! జైల్లో ఇంకా నువ్వు బాగా వున్నావుగాని, బయట నేను నరకబాధ పడ్డానురా!'

అని చెప్పుకుపోతున్నాడు. రమేశునికి ఏమి అనాలో కూడ తోచలేదు—మతిపోయిన వాడిలాగా నుంచున్నాడు. వేణీ వెనక వున్న వాళ్ళుకూడా ముందుకువచ్చి, అతనికి వూపిరి సలపకుండా, ఆశీర్వదించనూ, సలాములు పెట్టనూ, నమస్కారాలు చెయ్యనూ సాగించారు. అతన్ని ఒక్క అడుగుకూడా ముందుకు సాగనివ్వలేదు. పాపం వేణీకి దుఃఖం ఆపుకోవాలన్నా ఆగటంలేదు. అశ్రుగద్గదస్వరంతో—"అన్న మీద అలగమాకు, తమ్ముడూ! ఇంటికివచ్చి, అమ్మని చూసి చూసి కళ్ళు పోతున్నవి!" అన్నాడు.

అతనికోసం గుర్రపుబగ్గీ వేచివుంది. ఇక యేమీ మాట్లాడకుండా అందులో ఎక్కాడు. వేణీ ఎదురు సీటుమీద కూర్చుని తలమీది ముసుగుతీశాడు. అతని తలమీది గాయం మానిపోయింది గాని మచ్చ ఇంకా స్పష్టంగా కనపడుతున్నది. రమేశుడు ఆశ్చర్యంతో—"అదేమిటి అన్నాయ్?" అన్నాడు.

వేణీ దీర్ఘంగా నిట్టూర్చి—"నా పాపాలకు ప్రాయశ్చిత్తం! ఒకరికి చెప్పు కుంటే మాత్రం ఏంలాభం?" అని తలవంచుకుని గంభీరంగా చెప్పున్నాడు. అతను తప్పులిలా ఒప్పుకునే వరకు రమేశుని గుండె దిగిపోయింది. ఏదో జరిగి వుంటుందని అతను ఊహించాడు. విషయం చెప్పమని బలవంతపెట్టలేదు. ఇటు వేణీ యేవిషయం చెప్పటానికై యాభూమిక మొదలుపెట్టాడో, అది చెప్ప టానికి వీలుపడనందుకు మనస్సులో చాలా వ్యాకులపడ్డాడు. ఇలా రెండు నిమి షాలు ఊరుకుని, రమేశునిదృష్టి తనవైపు తిప్పుకోటానికై ఇంకొకమాటు నిట్టూర్చి చెప్పనారంభించాడు :

"నాకు చిన్నప్పటినుంచీ వొక రోగముంది తమ్ముడూ—కుండపగలగొట్టినట్టు మాట్లాడటం! నలుగురి మాదిరిగా లోపల వొకటిపెట్టుకుని పైకొకటి మాట్లాడలేక పోవటంచేతనే, అనేక ఇబ్బందులుకూడా పడ్డాను. నా ఖర్మమేమిటో, నాకింత వరకూ బుద్ధిరాలేదు!" రమేశుడు మెదలకుండా వింటున్నాడు. వేణీ గొంతు ఇంకా తగ్గించి గంభీరంగా చెప్పుకుపోతున్నాడు :—"ఆవాళ నాతప్పు యేమిటో తెలుసునా? దుఃఖంపట్టలేక యేడుస్తూ రమ దగ్గరికిపోయి 'మేము నీకేం అపకారం చేశామని మాకొంప ఇలా ముంచావు? శిక్ష పడిందని తెలిస్తే మా అమ్మ ప్రాణాలు విడుస్తుంది. ఆస్తికోసం ఒకవేళ మాలో మేము తగువు లాడుకొన్నా, అన్న దమ్ములమేగా! నీవు ఒక్కదెబ్బతో మా అమ్మనూ, తమ్ముణ్ణీకూడా చంపేశావు. కాని, న్యాయం విచారించటానికి దేవుడు ఉన్నాడులే!' అన్నాను" అని బండిలో నించి ఆకాశంవంక చూశాడు—భగవంతుడితో మొరపెడుతున్నాడో అన్నట్టు!

రమేశుడు అతనితో కలవలేదు, మొరపెట్టటానికి—కాని, వింటూ ఊరుకున్నాడు. కాసేపుండి మళ్లీ వేణీ మొదలుపెట్టాడు.

"రమేశ్? అప్పటి రమ ఉగ్రరూపం తలుచుకుంటే నాకిప్పుడుకూడా గుండెలు పీచుపీచు మంటవి. పళ్లు పటపట కొరికి, 'రమేశుడి తండ్రి మానాన్నను జైలులో పెట్టించాలని చూడలేదా? చాతనైతే వదలిపెట్టేవాడా?' అంది. ఆడది ఇంత పొగరుగా మాట్లాడటం సహించలేకపోయాను, రమేశ్! అప్పుడు నేను కోపంతో, సరే, వాణ్ణి విడుదలైరానీ, నీసంగతేమిటో అప్పుడే తేలుతుంది, అన్నాను!"

అంతవరకు వేణీ చెప్పిన మాటలమీద రమేశుడు అంతగా మనస్సును పోనివ్వలేదు. తన తండ్రి రమ తండ్రిని జైలులో పెట్టించటానికి ప్రయత్నించినట్లు అతనెప్పుడూ వినలేదు. కాని సరిగ్గా ఈమాటే అతను మొట్టమొదట ఊళ్ళోకి వచ్చినప్పుడు రమ పినతల్లి అన్నది. ఆసంగతి అతనికి జ్ఞాపకంవచ్చి మిగతా సంగతులు వినటానికి కుతూహలం కనపర్చాడు. అతని కుతూహలం గమనించి వేణీ చెప్పనారంభించాడు:—"నెత్తురు కళ్లచూడటం దానికి అలవాటేగా! నీకు జ్ఞాపకంలేదూ, అక్బరును నీమీదకు పంపటం? కానీ నీదగ్గర వాళ్ళఆటలు సాగలేదు—బుద్ధి చెప్పి పంపించావు! మరి నాదో? ఒక్క ప్రాణం—" అని వేణీ కొంచెం ఆలోచించి, తెలికలకుర్రవాడు తన్ను కొట్టిన ఘటనను కొంతమార్చి, కొంత కల్పించి తన మాటలలో చెప్పాడు.

"తర్వాత?" అన్నాడు రమేశుడు శ్వాస బిగబట్టి.

"తర్వాత ఇంకేముంది, తమ్ముడూ? నన్ను ఆస్పత్రికి యెవరు తీసుకెళ్లారో, అక్కడేమిజరిగిందో యెవ్వరికి తెలుసు? పదోరోజున తెలివివచ్చి చూద్దునుగదా, ఆస్పత్రిలో ఉన్నాను. అమ్మ కడుపు చల్లగావుండి యీగండమెలాగో గడిచింది. అందరికి ఇలాంటి అమ్మ దొరుకుతుందా, రమేశ్?"

రమేశుడు కొయ్యలాగా కూర్చున్నాడు. అతను కోపంతోనూ, ఏవగింపుతోనూ ఉడికిపోతున్నాడు. తనకు తెలియకుండానే చేతివేళ్లను బిగించాడు. అతనికియెంత కోపంవచ్చిందో అంచనా వేయటానికికూడా వీలులేదు. వేణీ యెంత చెడ్డవాడో అతనికి తెలుసు. అతను చేయలేని దుర్మార్గంఅంటూ ఒకటిలేదనికూడా రమేశుడు ఎరుగు. కాని, ఇంత అసత్యాన్ని ఇలా నిస్సంకోచంగా, ఇంత అనర్గళంగా చెప్పగలవాడు ఈప్రపంచంలో ఉండవచ్చని అతను ఊహించనుకూడా లేకపోయాడు. అందుకనే, రమను గురించిన తను విన్న మాటలన్నీ నిజంకావచ్చని అతను అనుకున్నాడు.

రమేశుడు తిరిగి వచ్చినందుకు ఊళ్లోవాళ్లకి పండుగగా వుంది. ప్రతిరోజూ పూటవేళ అని లేకుండా రమేశుని దగ్గరికి వచ్చేవారిలోనూ పోయేవారితోనూ ఇల్లు కళకళ లాడుతున్నది. సానుభూతి చూపించే ఆత్మీయులను రమేశుడు తను కారాగారంలో పడ్డదుఃఖంకూడా-కొద్దో-గొప్పో-ఉంటే, మర్చిపోయాడు. తను లేనప్పుడు ఈ గ్రామస్తుల్లో సామాజిక సంబంధం దృఢమైందని రమేశుడు గ్రహించాడు. కాని ఈకొద్దిమాసాలలో ఇంతమార్పు ఎలావచ్చిందో అతనికి అంతుపట్టలేదు. ఆలోచించిచూస్తే అతనికిలాతోచింది. వేణీ అడుగడుగుకూ యెదుర్కొంటూవుండడం వల్లనే వీరిశక్తిఅంతా అణిగివున్నదనీ,ఇప్పుడు అతను అనుకూలంకాగానే రెట్టింపుగా విజృంభించిందనీ అనుకున్నాడు. వేణీని ఇప్పుడు బాగా గ్రహించగలిగానను కున్నాడు. అతనితో వైరం పోయినందుకు సంతోషించాడు కూడా. అంతేకాదు. గ్రామస్తులందరుకూడా రమేశునికి యీ అన్యాయం జరిగినందుకు పగవారు. వీరి సానుభూతికీ, వేణీ తనపక్షానికి వచ్చినందుకూ రమేశుని హృదయం ఉత్సాహం తోనూ, ఆనందంతోనూ పొంగిపోయింది. ఏకార్యం సాధించలేక కొన్నాళ్ల క్రితం అతను గ్రామం వదలిపెట్టి పారిపోవాలనిచూశాడో, దాన్ని కొంతవరకు సాధించ గలిగామని, అతను ద్విగుణీకృతోత్సాహంతో ప్రజలకష్టసుఖాలూ,మంచిచెడ్డలూ ఇంటింటికిపోయి విచారిస్తూ ఆ ఆనందంలో కొన్నాళ్లు గడిపాడు. ఒక్క రమను గురించి మాత్రం అతను పట్టించుకోవడం లేదు. ఆమెకు జబ్బుగావుందని అతను జైలునుంచి వచ్చేటప్పుడే విన్నాడు. కాని, ఇప్పుడా జబ్బు ఏ స్థితిలోవుందో తెలుసుకోవాలని కూడా అతనికి బుద్ధిపుట్టలేదు. ఆమెతో తనకున్న సంబంధం యెప్పటికీ తెంచుకున్నానని అతని నమ్మకం. గ్రామంలోకి వచ్చినారకూడా తన కష్టాలకు కారణం రమేనని గ్రామస్తుల నోట అతను విన్నాడు. అందుచేతనే, ఈ విషయంలోమాత్రం వేణీ తనకు అబద్ధం చెప్పలేదని అతను అనుకున్నాడు। నాలుగైదు రోజులు గడిచాక వేణీ రమేశుడి దగ్గరికి వచ్చాడు. పీర్‌పురంలో వీరికీ రమకూ కొంత ఆస్తివుంది. అది యెప్పుడో భాగాలుకూడా పంచుకున్నారు. కాని రమకూ అతనికీ భాగాల్లో కొంచెం పేచీ వచ్చింది. ఇప్పుడు పరిస్థితులు తనకు అనుకూలంగా ఉన్నవనీ అది ఎలాగైనా కలుపుకోవాలనీ అతని ఉద్దేశం. వేణీ పైకి ఎన్నిబీరాలు మాట్లాడినా మనసులో రమ అంటే చెడ్డ భయం. ఇప్పుడామె మంచంలోఉంది! వ్యాజ్యం సాజ్యం వెయ్యలేదు. పైగా మునల్మాను రైతులు రమేశుడెలా చెప్పితే అలా వింటారు. ఆ తర్వాత సంగతి తర్వాత చూసుకోవచ్చు ముందు ఆమె ఆస్తి స్వాధీనం చేసుకుందాము పట్టమని వేణీ రమేశుని పట్టు



పట్టాడు. రమేశునికి ఆశ్చర్యంవేసి ఒప్పుకోలేదు. వేణీ తనకు చాతనైన యుక్తులన్నీ ఉపయోగించి చూసి చివరికిలా అన్నాడు:— "ఎందుకు కుదరదు? సమయం చిక్కినప్పుడు రమ నిన్నెప్పుడైనా వదిలిందా, ఇప్పుడు దానికి జబ్బుగా వుందని నువ్వు సందేహించటానికి? నిన్ను జైలుకి పంపినప్పుడు నువ్వు మాత్రం మహా ఆరోగ్యంగా వున్నావేమిటి?"

ఆ మాట నిజమే. రమేశుడు దాన్ని కాదనలేకపోయాడు. కాని ఎందుకనో అతని మనస్సు ఆమెతో విరోధం తెచ్చుకోటానికి ఇష్టపడలేదు. వేణీ యెంత పురిఎక్కించినప్పటికీ లాభంలేకపోయింది. ఆమె అసహాయస్థితి, జబ్బు తలచుకోగానే రమేశుని కోపం చల్లారేది—దీనికి హేతువేమిటో తెలుసుకోవాలనుకున్నా అతనికి తెలియలేదు. రమేశుడేమీ సమాధానం చెప్పలేదు. వేణీ పని జరుగుతుందని తెలిస్తే వోర్పువహించటంలో మొనగాడు. అందుకనే ఇక రమేశుని వేధించకుండా ఆవాళకు ఇంటికి వెళ్ళాడు.

ఈమాట ఇంకొక విషయం రమేశునిదృష్టి నాకర్షించింది. విశ్వేశ్వరికి ప్రపంచముమీద యెప్పుడూ ఆసక్తిలేదని అతనికి తెలుసును; కాని ఈమాట అతను జైలునుంచి రాగానే ఆమె ఈ అనాసక్తి అసహ్యం కిందికి మారిందా? అని అతనికి సందేహం కలిగింది. విడుదల కాగానే అతను వేణీవెంట ముందు పెదతల్లి దగ్గరకే పోయాడు. ఆమె చాలా ఆనందించింది. గద్గదకంఠంతో అనేక సార్లు ఆశీర్వదించిందికూడా. కాని యెందువల్లనో అతనికి ఆమె ధోరణి ఆనందం కలిగించలేదు—వ్యధ కలిగించింది. ఇవ్వాళ మాటల సందర్భంలో—విశ్వేశ్వరి కాశీ పోటానికి నిశ్చయించుకొన్నదని, ఇక తిరిగిరాదని విని చకితుడైనాడు. అతనికి ఈ సంగతి ఇదివరకు తెలియదు! ఈ నాలుగైదు రోజులనుంచీ పనులతొందరలో ఆమెను కలుసుకోవటం పడనేలేదు; అదివరకు కలుసుకున్నప్పుడు ఆమె ఈమాట చెప్పలేదు. ఇతర్ల సంగతిగానీ, తనసంగతిగానీ వొకళ్ళదగ్గర చర్చించడం ఆమెకు యిష్టం ఉండదని రమేశునికి తెలుసు. కాని, వెనుకటి విషయాలు వొక్కమాటు సింహావలోకనం చేసుకునేవరకు పెత్తల్లి వైరాగ్యానికి అర్థంఅతనికితెలిసివచ్చింది. ఇక ఆమె వెళ్లడంలో సందేహమేమీలేదనికూడ అతనికి తోచింది. ఆమె లేకపోవటం యెంతలోటో తలచుకోగానే రమేశుని కళ్లలో నీరు తిరిగింది. క్షణంకూడా ఆలస్యంచేయకుండా పెత్తల్లి ఇంటికెళ్ళాడు. అప్పుడు ఉదయం పదిగంటలవుతోంది. ఆమె యింట్లోలేదు. కనుక్కుంటే ముఖర్జీగారింటికి పోయిందని దాసీది చెప్పింది. రమేశునికి ఆశ్చర్యంవేసి—"ఈ వేళగాని వేళనా?" అన్నాడు.

చాలాకాలంనించి వున్న దాసీది మందహాసంచేసి—"అమ్మగారికి వేళగాని వేళని వొకటుందా? అదీకాక, యివ్వాళ వాళ్ల చిన్నబ్బాయిగారి వడుగు" అన్నది.

యతీన్‌కు వడుగా? రమేశునికి ఇంకా ఆశ్చర్యంవేసింది:—"ఆ, ఈ సంగతి ఎవ్వరికీ తెలియదే!" అన్నాడు.

"వారు యెవ్వరికీ చెప్పలేదండి. చెప్పినాకూడా ఎవ్వరూ భోజనాలకు పోరు. చిన్నమ్మగారిని వూళ్ళో పెద్దలు వెలివేశారుగా!"

రమేశుని ఆశ్చర్యానికి హద్దులేదు. కాసేపు మెదలకుండా వూరుకుని కారణం అడగగానే దాసీది సిగ్గుతో ముఖం పక్కకు తిప్పుకొని—"నాకేమి తెలుసు, చిన బాబుగారూ! చిన్నమ్మగారి మీద పాడు అపవాదులన్నీ వున్నాయిగా—ఏదో మేము బీదవాళ్లం, బాబూ—మాకేంతెలుస్తవి అవన్నీ?" అంటూ వెళ్ళిపోయింది.

రమేశుడు కాసేపు అలానే నిలబడి యింటికి తిరిగివచ్చాడు. ఇది వేణీ చేసిన పనే నని వొకర్ని అడగకుండానే అతనికి తెలిసిపోయింది. కాని, ఆమెమీద ఈ

కోపమెందుకో, ఏ పగ తీర్చుకోటానికి ఆమెమీద ఇలాంటి నీచమైన నిందలు మోపబడ్డాయో అతనికి అంతు పట్టలేదు. అవి యేరకంలో వూహించాలన్నా అతనికి అలవికాని పనే!

# 18

ఆనాటి మధ్యాహ్నం యెవ్వరూ తలచని ఘటన వొకటి జరిగింది. మంగలి కైలాసుడూ, షేక్ మోతీలాలూ సాక్షుల్ని వెంటబెట్టుకొని రమేశుని దగ్గరికి వచ్చారు. వారిద్దరికీ వొక వ్యవహారముంది. కానివాళ్లు కోర్టుకెక్కలేదు. రమేశుని ఆశ్రయించారు. రమేశునికి చాలా ఆశ్చర్యంవేసి—"నాతీర్పు మీరెందుకు వొప్పుకుంటారు?" అన్నాడు.

వాది ప్రతివాదు లిద్దరూ -"ఎందుకు వొప్పుకోము, బాబూ! అధికారికంటే మీరు విద్యలో తక్కువవారా? తెలివిలో తక్కువవారా? ఆ అధికార్లుమాత్రం మీబోటి పెద్దవారు కారా? రేపు వొకవేళ మిమ్మల్నే సర్కారువారు అధికారిగా నియమిస్తే మీ తీర్పుకు మేము బద్ధులంకామా?—కాదన్నా చెల్లుతుందా?" అన్నారు.

ఈ మాటలు వినేవరకు రమేశుని హృదయం గర్వంతోను సంతోషంతోనూ వుబ్బిపోయింది. కైలాసుడు అన్నాడు:—

"తమకైతే మేమిద్దరమూ వున్నయదార్థమేమిటో దాచకుండా చెప్పగలము. కాని కోర్టులో అది కుదరదు. అంతేకాక, ప్లీడర్లకు డబ్బు ధారపోయంది యేపనీ జరగదు. ఇక్కడ వొక్క దమ్మిడీకూడా ఖర్చులేదు; ప్లీడర్లను పొగడాల్సిన అవసరం లేదు; కాళ్ళీడ్చుకుంటూ అంతదూరం పోవలసిన శ్రమావుండదు! బాబుగారూ! దేవుడు మాకు సద్బుద్ధినిచ్చాడు, అందుకనే కోర్టునుంచి వచ్చి మీ పాదాలని ఆశ్రయించాము. మీ యిష్టమొచ్చిన తీర్పుచెప్పండి. అది మంచికానీ, చెడుకానీ ఇద్దరమూ తలవొగ్గి మీ పాదధూళి తీసుకొని వెళ్ళిపోతాము."

బోదెకాలవ దగ్గర వీరిద్దరికీ తగాదా. దానికి సంబంధించిన స్టాంపులూ, రికార్డులు రమేశునికిచ్చి, రేపుదయం వస్తామనిచెప్పి వాళ్లు వెళ్ళిపోయారు. రమేశుడు చలనంలేకుండా కూర్చున్నాడు. ఇది అతని కల్పనకుకూడా అందని విషయం. ఇలా యెప్పుడో ముందు జరగవచ్చనికూడా అతను ఆశించలేదు. అతని తీర్పుకు వాళ్లు బద్ధులైనా, కాకపోయినా, ముందు కోర్టుకు పోయేవారల్లా మధ్యదోవలోనించే తనదగ్గరకు తిరిగివచ్చారని వినేవరకు అతని హృదయంలో ఆనందవాహిని వెల్లి

విరిసింది. నిజానికి యిది గొప్పవిషయం కాదు, మామూలుగా గ్రామస్తులు పోట్లా డుకునే స్వల్పవిషయం. కాని, ఈ స్వల్పవిషయాన్ని ఆధారంచేసుకొని, అతని చిత్తంలో బ్రహ్మాండమైన తలపు వొకటి ఆకాశకుసుమంలాగా వికసించ నారం భించింది. తన దౌర్భాగ్యజన్మభూమికి భవిష్యత్తులో తాను యేమి చేయగలడో, ఏమి చేయలేడోకూడా అతను అంచనా వేసుకోలేక పోయాడు.

వసంత ఋతువు, బయట వెన్నెల పిండి ఆరబోసినట్టుగా వుంది. అటువైపు చూడగానే రమేశునికి రమ జ్ఞాపకం వచ్చింది. ఇతరదినాల్లో ఐతే అతనికి ఆ తలపుతోపాటు వొళ్ళుకూడా మండిపోయేది. కాని ఇవ్వాళ అతనికా మంటలేదు సరిగదా—కాస్తై వెట్టగాకూడాలేదు. లోలోపల నవ్వుకుని రమ నుద్దేశించి అన్నాడు —"నీద్వారా భగవంతుడు నా కింత మేలు చేకూరుస్తాడనీ, నీ విచ్చిన విషం నాకు అమృతమవుతుందనీ తెలిసివుంటే—బహుశా నువ్వు నన్ను జైలుకుపంపించి వుండవు, రమా!— ఎవరామనిషి?"

"నేను రాధనండీ, బాబుగారూ! రమ అక్కయ్య మిమ్మల్ని వొకమాటు కనపడి పొమ్మంది."

తన్ను వచ్చి చూసిపొమ్మని రమ దాసీని పంపించింది!—రమేశునికి ఆశ్చర్యం వేసి చూస్తూ వుండిపోయాడు. అతన్ని పరిహసించటానికి ఏదేవతైనా అతనితో యివ్వాళ ఇలా సరసమాడటం లేదుకదా!

"దయయుంచి వొకమాటు—" అన్నది దాసీ.

"ఎక్కడుంది ఆమె?"

"ఇంటిలో పండుకుని వుంది" అని కాసేపు ఆగి—"రేపిక తీరిక వుండదు. అందుకని యిప్పుడే వొకమాటు—"

"పద వస్తున్నాను" అని రమేశుడు లేచి నుంచున్నాడు.

రమేశుని పిలుచుకు రమ్మని దాసీని పంపి రమ తగుజాగ్రత్తతో అతనికోసం ఎదురుచూస్తూ మంచంమీద పండుకుని వుంది. రమేశుడు దాసి చూపిన గదిలో ప్రవేశించి కుర్చీవొకటి లాక్కుని కూర్చోగానే – రమ తన మనోబలాన్నంతా వినియోగించి అతని కాళ్ళదగ్గరికి వచ్చి కూలబడింది. గదిలో వొకమూలను మినుకుమినుకుమని దీపం వెలుగుతున్నది. దాని గుడ్డివెలుతురులో రమేశుడు రమను అస్పష్టంగా చూడగలిగాడు. అందుచేతనే ఆమె శరీరస్థితి స్పష్టంగా గ్రహించలేకపోయాడు. ఇంతకుముందు అతను దోవనువస్తూ ఆలోచించుకు వచ్చినవన్నీ, రమవచ్చి ఎదట కూర్చోగానే తారుమారై పోయినవి. కాసేపు



మెదలకుండా వూరుకుని, కోమలస్వరంతో—"ఇప్పు డెలావుంది, రాణీ?" అని అడిగాడు. రమ అతని కాళ్ళదగ్గరినించి కొంచెం వెనక్కు జరిగి—"నన్ను మీరు రమ అనే పిలవండి" అన్నది.

రమేశుని వీపుమీద ఎవ్వరో కొరడాతో కొట్టినట్లయింది. అతను మరుక్షణం లోనే కాఠిన్యం వహించి అన్నాడు :—"మంచిది, అలాగే!—నీకు జబ్బుగావుందని విని ఇప్పుడెలా వున్నదోనని అడిగాను. లేకపోతే, నిన్ను పేరుపెట్టి పిలవ వలసిన అవసరమూలేదు నాకు—పిలవాలన్న కోరికాలేదు."

రమ అంతా గ్రహించింది—"బాగానేవున్నాను" అని, కొంచెం ఆగి – "నేను మిమ్మల్ని పిలిచినందుకు మీకు చాలా ఆశ్చర్యంకలగవచ్చు. కాని—"

రమేశుడు మధ్యనే అడ్డి – "ఊహుఁ! కలగలేదు, నువ్వుచేసే పనులు చూసి ఆశ్చర్యపడే రోజులు గతించిపోయాయి. సరే, ఇప్పుడు పిలిపించింది ఎందుకో చెప్పు" అన్నాడు.

ఈమాట రమ హృదయంలో శూలంవలె గుచ్చుకని ఆమెను యెంత బా పెట్టిందో రమేశుడు తెలుసుకోలేకపోయాడు. ఆమె తలవంచుకుని కాసేపు మౌనంగా కూర్చుని అంది :—"రమేశదా! అవసరమైన పనులు రెండుండి నిన్నింతశ్రమపెట్టి పిలిపించాను. నీముందు నేనెంత అపరాధినో నాకు తెలుసు. ఐనా, నువ్వు వస్తావనీ, నా ఈ చివరి కోరికలు రెండూ తృణీకరించవనీ నేను అనుకున్నాను!"

అశ్రుభారంతో ఆమెకు డగ్గుత్తిక పడింది. రమేశుడుకూడా ఆమెస్థితి గ్రహించాడు. ఒక్కక్షణంలో అతనికోపమంతాపోయి వెనకటి స్నేహం వుప్పొంగింది. ఇన్ని అడ్డంకులూ, సంఘర్షణలూ జరిగినా అతని వెనకటి స్నేహం చచ్చిపోలేదని, శవప్రాయంగాపడివున్నదనీ తెలిసేవరకు అతనికి ఆశ్చర్యంవేసింది. ఒక క్షణంవూరుకుని "ఏమిటీ, నీకోరికలు" అని అడిగాడు.

రమ చకితురాలైనట్లు తలయెత్తి, మళ్లీవంచుకొని—"వేణీ ఏ ఆస్తినైతే నీ సహాయంతో స్వాధీనపర్చుకోవాలని చూస్తున్నాడో అది సొంత ఆస్తి. పదిహేనణాల భాగం నాదీ, ఒక్క అణా మీ యిద్దరిదీ. అది నీ కిచ్చి పోవాలని అనుకుంటున్నాను" అన్నది.

రమేశునికి మళ్ళీ కొంచెం కోపమొచ్చింది:—"మరేమీ భయంలేదు! నీఆస్తిని దొంగతనంగా కాజేయటానికి నేను వెనకా ఎవ్వరికి సహాయపడలేదు, ఇప్పుడూ సహాయపడను. ఇక దానం చేయదల్చుకున్నావా—దానికి చాలామంది వున్నారు— నేను దానం పట్టను!" అన్నాడు.

వెనక అయినట్లయితే రమ వెంటనే— "ముఖర్జీలదానంపట్టటం ఘోషాలు వంశానికి మామూలే, ఇందులో అవమాన మేమీలేదు!" అని అని వుండేది. కాని ఇవ్వాళ ఈమాట ఆమె అనలేక పోయింది.

"నువ్వు దొంగతనం చేసేవారికి సహాయ పడవనీ, ఊరక తీసుకున్నా సొంతానికి ఉపయోగించుకోవనీ నాకు తెలుసు. రమేశ్‌దా! అసలావిధంగా తీసుకోవటమెందుకు? తప్పుచేస్తే దండన ఉంటుంది. నేను చేసినతప్పులకు జరిమానాగా అది తీసుకోకూడదా?" అన్నది రమ వినయంగా.

రమేశుడొక నిముషం మెదలకుండా ఊరుకుని—"నీ రెండోకోరిక?"అన్నాడు.

"మా యతీన్‌ను నీకు వప్పగించి పోతున్నాను. వాడిని నీలాంటివాడిగా తయారుచెయ్యి. పెద్దవాడయినాక వాడూ నీలాగా నవ్వుతూ స్వార్థత్యాగం చెయ్యగలిగి వుండాలి."

రమేశుని మనసులో వున్న కాఠిన్యమంతా కరిగిపోయింది.

కళ్లు తుడుచుకొని అంది:—"ఇది కళ్ళతో చూసిపోయే యోగ్యత నాకు లేదు. ఐనా, పూర్వీకుల రక్తంవుంది, వాడి శరీరంలో, త్యాగం వాడి ఎముకలలో కూడా జీర్ణించి వుంటుంది—కొంచెం నేర్పితే వాడూ నీమాదిరిగా నలుగురిలో తల యెత్తుకు నిలబడగలడని నా నమ్మకం''.

రమేశుడు వెంటనే జవాబివ్వలేదు; కిటికీలోంచి వెన్నెలలో స్నానమాడుతున్న ఆకాశంవంక చూస్తూ ఉండిపోయాడు. అతని మనస్సులో అతను ఎన్నడూ అనుభవించనటువంటి బాధ కలుగుతూ వున్నది. చాలాసేపు మౌనంగావుండి తర్వాత ఆమెవైపుకు తిరిగి—"చూడు, మళ్ళీ నన్నీ రొంపిలోకి దించమాకు. ఎన్నోకష్టాలుపడ్డమీదట నేను కొంచెం జ్యోతి చూడగలిగాను. అదికూడా ఈ జంఝాటాలలో ఇరుక్కుంటే చల్లారిపోతుందేమోనని నాభయం" అన్నాడు.

"ఆ భయ మక్కర్లేదు, రమేశ్‌దా! ఇక ఈ జ్యోతి చల్లారదు. ఆ వాళ అత్తయ్య చెప్పింది:—మీరు దూరాన్నుంచివచ్చి ప్రజల కందకుండా ఎక్కడో పైన కూర్చొని పనులు చేయతలపెట్టారు గనకనే యిన్ని అడ్డంకులూ, విఘ్నాలూ కలిగినవట. మాదుర్మార్గాలవల్ల నిన్ను పైనుంచి కిందికి దించి, కూర్చోవలసిన చోట కూర్చోపెట్టాము. ఇప్పుడు మాలో నీవూ ఒకడివి కాబట్టి ఇంత భయపడు తున్నావు—వెనక అయినట్లయితే ఈ సందేహం నీ మనస్సులో కలిగేదికాదు. అప్పుడు నువ్వు పల్లీయులకు అతీతుడివి—ఇప్పుడు వారిలో నువ్వూ ఒకడివి. అందుచేతనే ఈ జ్యోతి మందం కాదు—నానాటికీ ఉజ్వలంగా ప్రకాశిస్తుంది."

పెత్తల్లి పేరు వినేవరకు రమేశునికి ఉద్దీపన కలిగింది —"ఈ జ్యోతి చల్లారదని నీకు ఘట్టిగా తెలుసునా, రమా?" అని అడిగాడు.

"ఆఁ. ఇది నామాటకూడాకాదు. అన్నీ తెలిసిన అత్తయ్యమాట. ఈ భారం నీదే. యతీన్‌ను దగ్గరకు తీసుకొని, నా తప్పులన్నీ క్షమించి, నన్నాశీర్వదించి పంపు—నేను నిశ్చింతగా నా భర్తను పోయి కలుసుకునేటట్టు."

పిడుగుల్ని పొట్టలోదాల్చిన మేఘాలమాదిరిగా రమేశుని హృదయం వుండి, వుండి మెరవసాగింది; కాని, అతను తలవంచుకుని స్తబ్ధుడై కూర్చున్నాడు.

"నామాట ఒకటి మీరు నిలపాలి. చెప్పండి, నిలుపుతారా?'' అంది రమ.

"ఏం మాట?'' అన్నాడు రమేశుడు మృదువుగా.

"నా విషయమై వేణీతో యెప్పుడూ తగువు లాడకండి.''

'అంటే, అర్థం?''

"దీనికర్థం మీకెప్పుడన్నా తెలిస్తే, నేను ఇదంతా మౌనంగా సహించి పోయాననీ, ఒక్క మాటకు కూడా యెదురు చెప్పలేదనీ జ్ఞాపకం పెట్టుకోండి. ఒకనాడు నాకు మరీ అసహ్యం వేసి పోయేవరకు అత్తయ్య వచ్చి—'మిధ్యను కెలికినకొద్దీ దానికి ఆయువు పెరుగుతూ వుంటుంది, తల్లీ! తాయి వహించలేక దాని ఆయువు పెంచటంకంటే మహాపాపం మరొకటిలేదు' అన్నది. నే నామె వుపదేశాన్ని మనసులో పెట్టుకునే నా దుఃఖమయ దౌర్భాగ్య జీవితం వెళ్లబుచ్చానని కూడా మరచిపోమాకు, రమేశదా!"

రమేశుడు మాట్లాడకుండా ఆమె ముఖంపంక చూస్తూ వుండిపోయాడు. రమ కాసేపు వుండి అన్నది:—"ఇప్పుడు నువ్వు నన్ను క్షమించలేక పోయినందుకు నీ మనస్సులో యేమీ కష్టపడమాకు, రమేశదా! ఇవ్వాళ నీకేది కష్ట సాధ్యంగా కనపడుతున్నదో రేపది సులభసాధ్యం అవుతుందని నాకు గట్టిగా తెలుసు. ఆ రోజున నువ్వు నాఅపరాధాలన్నీ చాలా తేలికగా క్షమిస్తావనికూడా నాకు విశ్వాస ముంది; అందుకనే నామనస్సులో దుఃఖమేమీలేదు. రేపునేను వెళ్ళిపోతున్నాను."

"రేపా?" రమేశుడు విస్మితుడై—"రేపు యెక్కడికి?" అన్నాడు.

"అత్తయ్య యెక్కడికి తీసుకెళ్ళితే అక్కడికి."

"కాని, ఆమె యిక తిరిగిరాదని విన్నానే."

"నేనూ రాను, నాజీవితాంతంవరకూ నీపాదాలదగ్గర యిప్పుడే సెలవు తీసుకుంటున్నాను" అని రమ వంగి నేలమీద తలపెట్టింది.

రమేశు డొకక్షణం ఆలోచించి, తర్వాత దీర్ఘంగా నిట్టూర్చి "సరే,పో. కాని, యెందుకుపోతున్నావో నేను తెలుసుకోవచ్చునా?" అన్నాడు. రమ మాట్లాడలేదు. రమేశుడు మళ్లీ అన్నాడు:—"నువ్వు సంగతులన్నీ దాచి యెందుకు పోతున్నావో నీకే తెలియాలి. నిన్ను యెప్పటికైనా మనస్ఫూర్తిగా క్షమించగలిగేటట్టు చూడమని నేను భగవంతుని అంతఃకరణశుద్ధిగా ప్రార్థిస్తాను. నిన్ను క్షమించలేక పోవటంవల్ల నాకెంతబాధగావుందో నా అంతర్యామికే తెలుసు."

రమ కళ్ళ వెంట బొటబొట నీరుకార నారంభించింది. కాని, ఆగుడ్డి వెలుతురులో రమేశు డదిచూడలేకపోయాడు. రమ ఇంకోమాటు దూరానవుండే అతనికి నమస్కరించింది. రమేశుడు యింట్లోనుంచి బయటపడ్డాడు. అతని భవిష్యత్తూ, పనిపాటలమీద వుండే అతని ఉత్సాహమూ ఒక్కక్షణంలో ఈ గుడ్డివెన్నెల మాదిరిగానే అస్పష్టంగా ఛాయామయమై పోయిందని దోవను పోతూవుండగా అతనికి తోచింది.




మర్నాడు వుదయం రమేశుడు వారింటికి వెళ్ళేవరకు విశ్వేశ్వరి యాత్రకు సిద్ధమై మేనాలో కూర్చుంటూవుంది. రమేశుడు తలుపుదగ్గర ముఖంపెట్టి అశ్రువ్యాకుల కంఠంతో —"ఏం తప్పు చేశామని పెద్దమ్మా, మమ్మల్నిలా మధ్యలో వదలిపెట్టి పోతున్నావు?" అన్నాడు.

విశ్వేశ్వరి కుడిచెయ్యి చాచి రమేశుని తల స్పృశించి—"తప్పులు ఎంచుతూ కూర్చుంటే ఎప్పటికీ తేలదు నాయనా, వాటిని తలవక పోవటమే మంచిది" అని తర్వాత ఇలా అంది—"నేనిక్కడ చచ్చిపోయినట్లయితే వేణీ నాకు తలకొరివి పెడతాడు. రమేశ్! అలాగైతే నాకు ముక్తేలేదు. ఇహమంతా కుళ్ళికుళ్ళిచచ్చాను. ఇక పరంకూడా పాడవుతుందేమోననే భయంతో పారిపోతున్నాను!"

రమేశుడు పిడుగుపడ్డవాడిలాగా స్తంభితుడైనాడు. ఈవొక్కమాటలో అతను పెత్తల్లి హృదయంలోని మాతృజ్వాలనంతా చూడగలిగాడు. ఆమె లోలోపల ఇంత వేదనపడిందని అతను ఎప్పుడూ అనుకోలేదు. కాసేపు స్థిరంగా వుండి —"రమ ఎందుకుపోతున్నది పెద్దమ్మా?" అన్నాడు.

విశ్వేశ్వరి నిట్టూర్పును ఆపుకుని గొంతుతగ్గించి అన్నది:—"ఈప్రపంచంలో దానికి చోటులేదు, నాయనా! అందుకనే దాన్ని భగవంతుడి పాదాలదగ్గరికి తీసుకుపోతున్నాను. అక్కడికిపోయినాకూడా అది బతుకుతుందో, లేదో నమ్మకంలేదు.

ఒకవేళ బతకటట్టయిత దానిజీవితమంతా. ఈ కఠినప్రశ్నకు సమాధానంకోసం వినియోగించమని కోర్తాను:—'భగవంతుడు దానికింత చక్కదనమూ, ఇన్ని గుణాలూ, ఇంతజీవమూ ఇచ్చి ఈ ప్రపంచలోనికి ఎందుకు పంపాడు? మళ్ళీ దాని దోషమేమీ లేకపోయినా ఇంత దుఃఖభారం నెత్తినవేసి దాన్ని ప్రపంచానికెందుకు ఎడం చేశాడు? ఈమేలు దానికి భగవంతుడు చేకూర్చిందా— లేక సమాజందానితో చెర్లాటలాడిందా? ఒరే, రమేశ్ : దానిలాంటి దురదృష్టురాలు ఈ ప్రపంచంలో లేదురా!" ఇలా వెల్లడించటం ఎన్నడూ చూడలేదు. రమేశుడు స్తబ్ధుడై కూర్చున్నాడు. విశ్వేశ్వరి కాసేపాగి అన్నది :

"నీకు నేనిదే చెప్పుతున్నాను—దాన్ని తప్పర్థం చేసుకోమాకు. నేను వెళ్లే ముందు ఎవ్వరిమీద ఫిర్యాదులు చేయదలంచుకోలేదు. కాని, రమ కంటే నీమేలు ఎక్కువ కోరేవారు ఎవ్వరూ లేరు; నా ఈ మాట నువ్వు పొరపాటునకూడా అవిశ్వసించకు."

"కాని, పెద్దమ్మా—" అని రమేశుడు ఏదోచెప్పబోయాడు విశ్వేశ్వరి మధ్యనే అడ్డువచ్చి—"ఇందులో 'కాని' వుంటానికి తావులేదు, రమేశ్ : నీవు విన్నదంతా అబద్ధం; నీవు తెలుసుకున్నదంతా పొరపాటు. ఈ తగు వింతటితో తెగిపోనివ్వు. నీకార్యాలు సమస్తమైన అన్యాయాల్నీ, హింసల్నీ, ద్వేషాల్నీ, తుచ్ఛంగాచూస్తూ ఇలాగే చిరకాలమూ నిరాటంకంగా సాగిపోవాలని దాని రవసారి కోరిక. ఇందుకోసమే అది నోరుమూసుకుని అన్నీ సహించింది. ప్రాణం ఇవ్వటానికైనా ఒప్పుకుంది, గాని నోరుతెరవలేకపోయింది, రమేశ్ !"

రాత్రి రమ చెప్పిన విషయాలుకూడా ఒకటి రెండు జ్ఞాపకం వచ్చేవరకు రమేశునికి దుఃఖం పెదవులమీదికి వచ్చింది. అతను తలవొంచుకొని తన శక్తినంతా వినియోగించి—"దానితో అలాగే జరుగుతుందని చెప్పు, పెద్దమ్మా !" అని చేయిచాపి ఏదోవిధంగా ఆమె పాదధూళి తీసుకొని చకచక ఇంటిలోనించి బయటికి వెళ్లిపోయాడు.




బిడ్డ పుడతుందంటే ఎవళ్ళకయినా సంతోషమే. కాని, అమ్మాయి పుట్టిందని కబు రో ప్రేమట్టుకి మగవాడికా వార్త శుభవార్త కాదు. భయంకర వార్త. ఆ బరువు బాధ్యతలు పురుషుడికి మోసినట్టు పరాయాళ్ళకి మొయ్యవు. అందుకనే అంత బాధ. వేదన. ఇప్పు డలాంటి ఆపదనే ఎదుర్కోవల్సొచ్చింది గురుచరణుడు—నెలకి అరవై టింగులు తెచ్చుకునే బ్యాంకి గుమాస్తా అతగాడు.

అసలీ వార్త పొద్దుటే మూటగట్టుకు వచ్చింది. అతడి మూడో కూతురు పదేళ్ళ అన్నాకాళీ. "రా నాన్నా, చెల్లాయిని చూతువుగాని!" అంటూ ఎంతో ఉత్సాహంతో ఆప్యాయంగా తండ్రిని పిలవ్వొచ్చింది, ఆ పిల్ల.

ఆయిదోసారికూడా తన భార్య మళ్ళీ ఆడపిల్లనే కన్నదని ఇప్పుడు పురిటిగదినించి కబురు రాగానే గురుచరణుడి ముఖం తీరని విచారంతో నల్లబడిపోయింది.

అద్దెకు తోలే జట్కాబండి గుర్రం చూశారు కదూ—ఆ అస్థిపంజరం అదీను.

సరిగా అలాంటి స్వరూపమే ఇప్పుడు గురుచరణుడిది. శుష్కించి కళ్యావశిష్టమై బెంగతో విచారంతో పీక్కుపోయిన కళ్ళూ ముఖమూ, మన చైతన్యం, ఈ లోకపు గొడవా ఏమీ లేకుండా నిర్లిప్తతగా కనబడతాడు.

పురిటి కబురు చెవిని పడగానే చేతిలో హుక్కాగొట్టం అమట్టునే ఉండిపోయింది. తాతలనాటిది ఒరిగిన జాటీసొకటి గోడకి చేరగిలవేసుకూర్చున్నా డతడు. గట్టిగా నిట్టూర్చుదామంటేకూడా ఇప్పుడు వంట్లో ఓపిక లేదు.

కూతురు అన్నాకాళీ వచ్చి. రమ్మని పిలవగానే గురుచరణుడు ఆమె ముఖంకేసి చూసి. "కాసిన్ని మంచినీళ్లు తెచ్చిపెట్టు తల్లీ!" అన్నాడు. వెంటనే మంచినీళ్ళకోస మని వెళ్లింది పిల్ల.

కాళీ వెళ్ళిపోగానే అతడి మనస్సులో ఏనాటివో లక్ష సంగతులు గభీమని గుబులు కొచ్చాయి. అలా గుబులుకు రావటంతో బుర్రలో ఎన్నెన్నో దురాలోచనలుకూడా ప్రవేశింపసాగినై:

తొలి పురిటికయిన ఖర్చెంత? అనేది మొట్టమొదటి జ్ఞాపకం. నిరుడీ రోజుల్లో రెండో అమ్మాయి పెళ్ళికోసమని చౌ బజారులో ఉండే రెండంతస్థుల మేడ కుదువ పెట్టడం జరిగింది. దాని తాలూకు వడ్డీ బాకీ ఆర్నెల్లుగా అలానే బకాయి ఉండిపోయింది. ఈ సంగతి గుర్తుకొచ్చింది.

పోతే దసరా పండగలు దగ్గరికొచ్చాయ్. అప్పటికి చీరే సారే సిద్ధం చెయ్యాలి. అవి పెట్టి చిన్నమ్మాయిని అత్తారింటికి పంపాల్సిన పని ఒకాటి నెత్తిమీద వున్న దింకా. ఇవన్నీ ఎవళ్ళతోనూ చెప్పకూడని గృహచ్ఛిద్రాల్లో కొన్ని.

ఇహ ఆఫీసు గొడవలు—రాత్రిరి ఎనిమిది తొమ్మిది గంటలు దాటినా, తల పగిలిపోతూందే గాని, 'డెబిట్' 'క్రెడిట్' కాలమ్స్ ఎంతకూ సరిపోవడం కనబడదు. ఈ లెఖ్ఖలన్నీ ఇవాళ మధ్యాన్నం పన్నెండింటికల్లా 'ఆడిట్' కోసం చేత పట్టుకెళ్లాలి. పట్టుకెళ్లి తీరాలి.

నిన్ననే పై ఆఫీసరు పెద్దాయన దిగాడు. వచ్చి ఏమన్నాడో తెలుసా?—"ఎవ్వరూ కూడా ఇహానించి మురికిగుడ్డలతో ఆఫీసుకి రాకూడదు. అలా వస్తే జరిమానా పడుతుంది" అని చెప్పి కఠినమైన ఆర్డరువేసి మరీ వెళ్లాడు.

మరో విషయం—ఈ రేవుకి ఇంటెడు గుడ్డలూ ఓ పెద్ద మేటగా వేయించుకుపోయాడు చాకలి. వాడేమైపోయాడో యేమో వారంరోజులాయె వస్తాలేదు. ఇవన్నీ చూడగా మనస్సు బేజారైపోయింది గురుచరణుడికి. హుక్కాగొట్టం చేత్తో అలానే ఎత్తిపట్టుకుని ప్రార్థన ప్రారంభించాడు:

"భగవాన్! ఈ కలకత్తా మహాపట్నంలో రోజూ ఎంతమంది కార్లకింద పడి చావటంలేదు? వాళ్ళంతా నాకంటే అపరాధులా? దేవుడా, నీ దయవల్ల పెద్ద కారొకటి నా గుండెమీదినుంచి పోతే ఎంత బాగుండును!"

అంటూండగా జన్నాకాలీ వచ్చి, "లే నాన్నా! ఇదిగో మంచినీళ్ళు!" అన్నది. ఆ గ్లాసెడు నీళ్ళూ ఒక్కగుక్కలో తాగేసి, "ఆ—వెళ్ళమ్మా! గళాసు పట్టుకపో!" అని మళ్ళీ పడుకున్నాడు.

ఇంతలో లలిత వచ్చి, "మామయ్యా, టీ పట్టుకొచ్చా, లే!" అని లేపింది. 'టీ' అనగానే అతడికి ప్రాణం లేచివచ్చినట్లయింది. "రా అమ్మా, రా, నా దగ్గిరకొచ్చి కూర్చో!" అన్నాడు. కూర్చున్నాక పిల్లదాని తల నిమురుతూ, "మా తల్లిని ఓ జమీందారింట పడవెయ్యగలిగానంటే, నా జీవితంలో ఒక గొప్ప పని నెరవేరినట్టే!" "ఆ దరిద్రుడు....మీ మామ ఇంటో వడటంమూలాన రాత్రింబవళ్ళు ఏకచాకిరీయే, అవునా!" అన్నాడు. తల తిప్పుతూ చెప్పింది లలిత: "అందరూ చెయటంలే? అలానే నేనూ ..." "అయితే ఇవాళ వంట సంగతి?" అనడిగాడు. "నే చేస్తాగా, మామయ్యా"

"నువ్వే వండుతావా? నీకు వంటకూడా చేతనవునా?"

"తెలును మామయ్యా. అన్నీ అత్తదగ్గిర నేర్చుకున్నా," నన్నది లలిత. గురుచరణ దామెను మనస్సులోనే ఆశీర్వదించాడు. అతడికో పెద్ద బెంగ తీరిపోయింది

కిటికీలోంచి చూస్తూ, "అరె, శేఖర్‌లా వున్నాడే!" అని గురుచరణుడు పలకరించేప్పటి ల్లా ఆజానుబాహు, అందగాడూ అయిన ఒక యువకుడు లోపటకొచ్చాడు.

"రావోయ్, కూర్చో! ఇవాళ పొద్దుట మీ పిన్ని ఎంత పనిచేసిందో విన్నావా? ఆడపిల్లని కన్నది!" అంటూ నిట్టూర్చి, ముఖం అదోలా పెట్టాడు, "అందులో ఎంత ఇదివుందో నా ఒక్కడికే తెలుసు" నన్నాడు.

"అలా అనకు బాబాయ్! పిన్ని వింటే కష్టపడుతుంది. అంతా దేవుడి దయ! అయినా మగబిడ్డ అయితేనేం, ఆడబిడ్డ అయితేనేం?"

"నాకూ తెలుసునయ్యా బాబూ, ఆ మాత్రం. కాని భగవంతుడు వెనకా ముందూ ఆలోచించడు. కాకపోతే, నేను పేదవాణ్ణి కదా. నాకింతమంది దేనికి? ఈ యిల్లు కూడా మీ నాన్నకి తనఖా పెట్టేశానాయె. దానికేంలే, నేనేం విచారపడను.

"కాని, ఇదిగో ప్రత్యక్షంగా చూడరాదూ? ఈ బంగారపు బొమ్మ, మా లలిత, జమీందారీ కుటుంబాల్లో పడాల్సిన పిల్ల! చూస్తూ చూస్తూ ఎవరి చేతిలోనో ఒకరి చేతిలో ఎలా పెడను చెప్పు. దీనికి పదమూడేళ్ళు వెళ్ళాయి. కాని....నా చేతిలో

పదమూడు పైసాలుకూడా లేక. ఇంతదాకా సంబంధం కుదరలే."

గురుచరణుడి కళ్ళలో గిర్రున నీళ్లు తిరిగినై. శేఖర్ మౌనంగా వున్నాడు. గురుచరణుడింకా ఇలా చెప్పాడు—

"చూడు నాయనా! మీ బంధువర్గంలో ఏదయినా సంబంధం కుదురుతుందేమో చూద్దూ. అన్నట్టు—ఈ కాలపు కుర్రాళ్ళు కట్నం లేకుండానే పెళ్ళి చేసుకుంటున్నారటగా, పిల్ల నచ్చితే. అలాంటిదేదైనా ఒకటి చూసిపెట్టుమా, బాబూ! నే నాశీర్వదిస్తున్నా నిన్ను—నువ్వు మహారాజా వవుతావ్. నిజానికి, మీ ఆశ్రయం చూసుకునే నే నీ వాకిట్లులో ఉండగల్గుతున్నా. మీ నాన్న నన్ను సొంత తమ్ముడులా చూసుకుంటున్నాడు సుమా!"

"సరే, చూద్దాం!" అన్నాడు శేఖర్.

"మరిచిపోకు నాయనా! చిన్నప్పట్నించీ లలిత నీ దగ్గరేగా చదువుకుంది! ఎంత దొడ్డబుద్ధి, ఎంత వినయం, చూస్తూనే ఉన్నావుగా! ఇంత చిన్నవయస్సులో మా ఇంటి వంటా, పెట్టూ అంతా అదే. మా సంసారభారమంతా అదే మోస్తూందంటే నమ్ము!

"వాళ్ళ నాన్నమాత్రం ఏం తక్కువ ఉద్యోగం చేశాడనా? సంపాదనంతా దానం చేసేశాడు. పిల్లదానికేమీ మిగల్చకుండా పోతే పోనీలే. ఆ పుణ్యమే, ఆ పురుషార్థమే దాన్ని కాపాడుతూంది. ఆ బలం గాకుంటే, ఇంత చిన్నపిల్ల అన్నపూర్ణ ఎలా కాగలుగుతుంది నువ్వే చెప్పు, శేఖర్!"

శేఖర్ ఏం చెప్పలే. కాని నవ్వుకున్నాడు. అతడు లేవాలనుకుంటుండగా, చటుక్కున అడిగేశాడు గురుచరణుడు—"ఇంత పొద్దుటే ఎక్కడికి నాయనా బయల్దేరావ్?"

"ఓ కేసు విషయమై బారిష్టరుగారితో మాటాడాలి...." అని లేచి నిలబడగానే, గురుచరణుడు మళ్ళీ—

"నే చెప్పిన సంగతి మనసులో పెట్టుకో బాబూ! అది కొత్త ఛామనచాయ అన్నమాట నిజమే అనుకో. అయితేనేం, చూడు ఆ కన్ను ముక్కు తీరూ, తొణికిసలాడే ఆ చిరునవ్వూ. ఇలాంటి రత్నంపిల్ల లోకమంతా గాలించినా దొరకదని నమ్ము!"

నవ్వు ముఖంతో శేఖర్ తలవూపుతూ బయటికి వెళ్ళిపోయాడు. అతడికి ఇరవై అయిదేళ్ళ ప్రాయం. ఎం.ఎ. ఇప్పటిదాకా అప్రెంటిస్ చేస్తూ, నిరుడే 'అటర్నీ' అయ్యాడు.

అతడి తండ్రి నవీన్‌రాయ్‌కి బెల్లపు వ్యాపారం. అందులో లక్షలు గడించాడు.



ఇప్పుడా ఒడిసుట్లు పడలేక ఇంట్లోనే కూర్చుని వడ్డీవ్యాపారం సాగిస్తున్నాడు.

పెద్దకొడుకు అవినాశుడు వకీలు. చిన్నవాడే ఈ శేఖర్‌నాథ్. ఐ స్ట్రీ మధ్యన మంచి వనరులో వాళ్ళకో మూడంతస్థుల మేడ వుంది. వీళ్ళ డాబా. గురుచరణుడిగారి డాబా కలిసేవున్నాయి. అందుచేత రెండు కుటుంబాలవాళ్ళూ ఎంతో చేరికగా ఉంటారు. ఇంట్లో ఆడపిల్లలందరూ ఈ డాబామీదినించే వస్తూపోతూ వుంటారు.

## 2

చాలా రోజులై శేఖర్‌కు శ్యాంబజార్లో ఒక గొప్పయింటి సంబంధం నలుగుతూ వుంది. పిల్లతాలూకువాళ్లొచ్చి పెళ్ళికొడుకుని చూసుకున్నారు. వచ్చే మాఘంలో ముహూర్తం పెట్టాలని ఉద్దేశం. అయితే, కుర్రవాడు స్వయంగా పిల్లను చూసుకుని ఇష్టపడితేగాని వీల్లేదన్నది శేఖర్ తల్లి భువనేశ్వరి. నవీన్‌రాయ్ దృష్టి అంతా డబ్బు మీదనే. ముందుగా నిశ్చయం అనుకుంటే, తాంబూలాలు పుచ్చుకునేప్పుడు మళ్ళీ చూసుకోవచ్చునంటాడు. భార్యాభర్తల మధ్యని మాటపొందిక కుదరలే. ఆయన

క్యాన్వం వచ్చింది. భోజనం కాగానే పీధిగదిలోకి పోయి పడక వేశాడు.

అయిదార్రోజుల తరవాత—మూడో అంతస్థులో తన ముచ్చటయిన గదిలో నిలువుటద్దం ముందర నిలబడి, పిల్లని చూపిరావటానికని శేఖర్ ముస్తాబవుతున్నాడు.

అంతలో వచ్చింది లలిత : "పిల్లని చూడ్డానికిలాగుందే .. ?" "అవును, నన్ను శీగ్గా ముస్తాబుచేస్తా!" అన్నాడు శేఖర్. లలిత నవ్వి. "ఇప్పుడు తీరికలేదు నాకు. డబ్బుకోసం వచ్చా!" నంటూ, బీరువాతాళం తీసి కావలసిన రూపాయిలు తీసుకుని చెంగున ముడేసుకుంది. "అవసరమైనప్పుడల్లా డబ్బు తీసుకెళుతున్నా. ఇదంతా తీరే దెలాగో! ' అని తనలో తను అనుకున్నట్టుగా అన్నది.

బూట్ తొడుక్కుంటూ "అదే తీరుతుంది" అని అనేసి, శేఖర్ వెళిపోయాడు.

* * *

రాత్రి శేఖర్ సోఫాలో పడుకునుండగా తల్లి భువనేశ్వరి వచ్చింది. "పిల్లని చూపివచ్చావు గదా, ఎలా వుందిరా?" "భేషగ్గా వుం"దన్నాడు. తల్లి నవ్వి "అంటే ఎలా వుంటుంది? ఛాయ పసిమేనా? ఎవరిలా వుంటుంది? మన లలితలా...."

"లలిత నలుపు కదూ, అంతకన్న ఎరుపే."

"కళ్లూ, ముఖం....?"

"అన్నీ బాగానే వున్నాయ్."

"మరైతే చదువుకుందా?"

"ఆ మాట నే నడగనే లేదమ్మా! జ్ఞాపకం లేకపోయింది."

"వరస చూస్తే, నువ్వా పిల్లని చేసుకోవల్లే వుందే?" శేఖర్ బదులు చెబుదా మనుకుంటూండగా లలిత మెల్లిగా గదిలోకి వచ్చి, భువనేశ్వరి వెనకాల నించుంది. ఎందుకొచ్చావంటే, "ఏమీలేదు అమ్మా!" అన్నది. భువనేశ్వరిని లలిత 'అమ్మా' అనే పిలుస్తుంది. "అటయితే నన్నేమాటు ఊరికే చూపిపోదామని వచ్చావా?" అనడిగింది, మాటాడలే లలిత.

శేఖర్ అన్నాడు : "చూడటానికయితే వచ్చింది. మరి వంట ఎప్పుడు చేస్తుంది?" తల్లి చెప్పింది : "అది వంట చెయ్యటం దేనికిరా?" ఆశ్చర్యపోయాడు శేఖర్. "అయితే మరి వాళ్ళకి వంట ఎవరు చేస్తారమ్మా? లలితే వంటా పనులూ అన్నీ చేస్తూందని అనాడు మామే అన్నాడుగా?"

"వాళ్ల మామయ్య అంతేలే. అలానే అంటూ వుంటాడు. దానికి పెళ్లి కాలేదు గదా, దాని చేతివంట ఎవరు తింటార్రా? మన వంటబ్రాహ్మణ్ణే అక్కడికి పంపించా, ఆయన చేస్తాడు. మనింటో పెద్దమ్మ చేస్తుంది. రెండుపూటలా నే వెళ్ళి వాళ్ళింటోనే



ఫోంచేసి వస్తున్నా" అన్నది.

సరే, ఈ పేద కుటుంబం తాలూకు భారాన్ని తన తల్లి అడుకుంది కదా అని శేఖర్ గ్రహించాడు. తృప్తి అయిన మనస్సుతో ఒక్కసారి నిట్టూర్చి. ఊరుకున్నాడు.

*　　　　*　　　　*

నెల్లాళ్ళ తరవాత ఓనాడు—శేఖర్ నవల చదువుకుంటున్నాడు. గబగబలాడుతూ వచ్చి లలిత బీరువా తెరిచింది. ఇవాళ ఆమె చక్కా అలంకరించుకుంది. "పది రూపాయిలు తీసుకున్నా, శేఖర్‌దా!" అని చెప్పింది. "సరేలే!" అన్నా డతడు.

లలిత వెళ్ళటానికి తొరట్లాడుతూంది. మళ్ళీ తిరిగివచ్చి తలుపు చాటున నిలబడి, "ఇవాళ నాటకానికి వెళ్ళాలి" అన్నది. మాటాడలే శేఖర్. "మేం నాటకం చూట్టాని కెళుతున్నాం" అంది

"మే మంటే ఎవరెవరూ?"

"నేనూ, అన్నాకాళీ, చారుబాలా, వాళ్ళ మావయ్యా."

"మావఁయ్యెవరూ?"

"ఆయనే గిరీన్‌బాబు. ముంగేరునించి వచ్చాడు నాలుగురోజుల కిందట. ఇక్కడ బి.ఏ. చదువుతాడు. భలేవా డాయన...."

"ఓఁ—ఇంకేం? ఊరూ పేరూ, కథా ఖమామిషూ చాలా జరిగిందల్లే వుందే! అందుకనేనా ఎక్కడా కంటి కగపడటమే మానేశావ్? పేకాటలో మునిగిపొయ్యావ్ కాబోలు!" అన్నాడు శేఖర్.

శేఖర్‌లో హఠాత్తుగా మారిన ఈ ధోరణికి భయపడింది లలిత. "ఇన్నాళ్ళనించీ పేకాట జోరుగా సాగుతూంది కమా?" అనడిగాడు. గుటకలు మింగుతూ, లలిత "చారు చెప్పిందా యేం?"

"చారు చెప్పిందో, మరెవరు చెప్పారో. ఏకంగా చీరే అదీ కట్టుకు రెడీగానే వచ్చేశావుగా? సరే. వెళ్లూ!"

వెళ్ళలేకపోయింది లలిత. మాటాడక అక్కడే నించునివుంది.

## 3

పక్కింటి చారుబాల లలిత నేస్తురాలు. ఇద్దరూ ఒహా ఈడువాళ్ళే. ఆ అమ్మాయిది బ్రహ్మసమాజ మతం. వాళ్ళందరినీ శేఖర్‌కు తెలుసు. గిరీన్ తప్ప గిరీన్ ఇప్పటి దాకా బంకింపూర్‌లో చదువుతున్నాడు. కలకత్తా ఎప్పుడూ రాలేదు. అందుకనే అతన్ని శేఖర్ ఎరగడు.

లలిత అలానే నిలబడివుండటం చూసి శేఖర్ "ఎందుకలా నించున్నావ్. వెళ్లూ!" అనేసి మళ్ళీ పుస్తకం ముఖానికి అడ్డుపెట్టుకున్నాడు.

లలిత మళ్ళీ మెల్లగా "వెళ్ళనా?"

"చెప్పాగా లలితా, వెళ్ళమనీ!"

శేఖర్ ధోరణి అదోలా వున్నది. కనుక వెళ్ళాలనిపించలే లలితకు. కాని, వెళ్ల కుండా ఉండటానికీ వీల్లేకొచ్చింది. ఏమీ?—సగం ఖర్చు ఈమెదీ, తక్కిన సగం చారుబాల మామదిన్నీ. ఇదీ ఇవాల్టి ఏర్పాటు. వాళ్ళంతా లలితకోసం ఆత్రంగా ఎదురుచూస్తున్నారు. ఉపాయం తోచక మళ్ళీ అడిగింది లలిత: "వెళ్లనా?—ఇవాళ ఒక్కరోజుకే!"

పుస్తకం ఓ పక్కకి విసిరేశాడు శేఖర్. "నన్ను విసిగించకు లలితా! ఇష్టముంటే వెళ్లూ, మంచి చెడ్డలు గ్రహించగల వయస్సే నీది!" అని గద్దించాడు

తుళ్ళిపడింది లలిత. ఈ మధ్య ఇంత తీవ్ర ధోరణిలో శేఖర్ మాటాడ్డం వినలే.




నిజానికి, అతడిచ్చిన చనువును బట్టే ధైర్యంతో ఏకంగా దుస్తులు మార్చుకు తయారై వచ్చేసింది. ఆ స్వాతంత్ర్యం లోపించటం ఇప్పుడు తన పరమూహోపట గ్రహించిందామె. దీన్ని గురించి లోలోపల కుమిలిపోతూంది.

కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ తన గదికి వెళ్ళిపోయి, దాసీదానిచేత అన్నా కాళిని పిలిపించింది. ఆపిల్ల దానిచేతికి ఆ పరిహాపాయిలూ ఇచ్చి ఇవాళ్టికి మీరంతా వెళ్ళండి, కాళీ! నా వంటో ఏం బాగులేదు'' అంటూ పక్కమీదికిపోయి పడుకుంది.

తరువాత చారుబాల కూడా వచ్చి ఎంతగానో బతిమాలింది, బలవంతం చేసింది. ససేమిరా రాననేసింది లలిత.

చారుబాల తల్లి మనోరమకు పేకాటంటే ప్రాణం. ఆమెకు అపేక్ష వుందిగా? ఆడే నేర్పులేదు. అందుకోసమని లలితను పట్టుకునేది. లలిత చాలాబాగా ఆడుతుంది.

మనోరమ పినతల్లి కొడుకే గిరీన్. అతడు వచ్చినప్పట్నించీ పేకాట జోరుగా సాగుతోంది. గిరీన్ మంచి ఆటకాడు. అందుకనే అతనికి ఎదిరి పక్షంలో కూర్చోబెట్టటానికని మనోరమ లలితను పట్టుకునేది.

మామూలు వేళకు లలిత రాకపోయే సరికి మనోరమ దాసీవాణ్ని పంపింది. ఇప్పుడేమాత్రం వీల్లేదు, రేపొస్తానన్నది లలిత. చివరికి మనోరమ స్వయంగా వచ్చి, ఎలానో ఆమెను తీసుకు పోయింది. ఆటమీద మనస్సు లేకపోయినా, తప్పని సరిగా

చూసింది లలిత.

"రాత్రి మీరు డబ్బు యిస్తే పంపారుగావి. మేం నాటకానికి వెళ్ళలే. రేపరండి అందరంకలిపి వెళ్దాం!" అన్నాడు గిరీష్. వంటో జబ్బుగా వున్నదని చెప్పేసి గబగబా వెళ్ళి పోయింది లలిత.

ఇవాళ గిరీష్ ఎదట కూర్చుని ఆడుతున్నంతసేపూ ఆమె మనస్సుకి ఎలాగో వుంది. ఈ కొద్దిరోజుల పరిచయానికే అతడు తనని ప్రేమదృష్టితో చూస్తున్నాడని తోచింది.

ఇంటోకి వెళ్ళి ఓమాటు కనిపించింది లలిత. శేఖర్ గదిలో మామూలుగా ఆపనీ ఈపనీ చేస్తోంది. అతని గది చక్కగా అమర్చే పని లలితదే. మరొకాళ్ళ వల్లకాదు. ఎనిమిదవఏట తలిదండ్రులు పోయాక లలిత మేనమామ గారింటికి వచ్చింది. అప్పట్నించీ చెల్లెలిలాగా శేఖరుడి వెంట మసులుతూ, చదువునేర్చి, ఈపాటిదయింది.

లలితంటే శేఖర్‌కు ఎంతో అభిమానమని అందరికీ తెలుసు. అదెవ్వరికి ఎబ్బెట్టుగా ఏం లేదు. ప్రత్యేకించి ఎవరి దృష్టినీ ఆకర్షించనూ లేదు. ఎప్పటికయినా ఆమె ఈ ఇంటి కోడలుగా వస్తుందేమోనన్న భావనకూడా ఎవ్వరికీ కలుగలేదు. లలితకీ కలుగలేదు, భువనేశ్వరీ అనుకోలేదు.

* * *

పని పూర్తి చేసుకు వెళదామని ఆ ధ్యానలో వుంది లలిత. హఠాత్తుగా బూట్లు చప్పుడు విని, ముఖం పైకెత్తి, పక్కకి తప్పుకు నిలబడింది. గదిలోకి వస్తూనే శేఖర్ అడిగాడు.

"నిన్నరాత్రి ఎప్పుడొచ్చావ్ ఇంటికి? రెండింటికా, మూడింటికా?—మాట రాదేం, నోట్లోంచి?" మౌనంగా నిలబడి వుంది లలిత.

"వెళ్ళు కిందికి, అమ్మ పిలుస్తోంది!"

భువనేశ్వరి పళ్లాలు పరిచి టిఫిన్లు సర్దుతూంది. "ఈ ఫలహారం మీ శేఖర్‌దాకిచ్చి, చప్పునరా!" అన్నది లలితతో.

పళ్లెం పట్టుకెళ్ళి, లలిత ఒక్కక్షణం ఆగి, మేడమీది కెళ్ళింది. శేఖర్ ఆఫీసు దుస్తులయినా విడవకుండా కళ్లు మూసుకుని ఇంకా అలానే చేరగిలపడి వున్నాడు. లలిత మెల్లిగా దగ్గరకొచ్చి, 'ఫలహారం తెచ్చా!" నన్నది.

"అక్కడే పెట్టి వెళ్లు!"

లలిత పెట్టలేదు. అలానే చాలాసేపు నించుని వుంది. "ఎంత సేపని నించుంటావ్ లలితా! నా కింకా ఆలస్య ముంది. అక్కడే పెట్టి వెళ్ళమన్నాను గా!"

ఇంకా అలా వింయనే చెప్పింది లలిత. "ఆలస్యమైనా ఇబ్బందిలేదు. నాకు ముంచుకుపోయే పనేం లే దక్కడ."

కళ్ళు తెరిచాడు శేఖర్. నవ్వుతూ, "ఏదీ, నోట్లోంచి మాట వచ్చిందే! కిందని పని లేకపోతే ఆ యింటో లేదూ? అక్కడా లేకపోతే పక్కింటో నయినా లేక పోతుందా? నీకు ఒక్కఇల్లే కాదుగా?" అన్నాడు.

కోపమొచ్చి, లలిత చేతిలో పళ్లెం టపీమని టేబిల్ మీద పెట్టేసి పోబోతూంది.

"సాయంత్రం ఒక్కమాటు రావేం!" అని కేకేశాడు శేఖర్.

"వందసార్లు పైకీ కిందికీ నే రాలేను!" అంటూ గబగబా వెళ్లిపోయింది.

కిందికి దిగిరాగానే భువనేశ్వరి "అమ్మాయీ! ఫలహారమయితే ఇచ్చి వచ్చావ్ కాని, అన్నయ్యకి తాంబూలం ఇవ్వలేదేమే?" అనడిగింది.

"నే పోలేను. నాకొంటేస్తోందమ్మా! మరెవరికయినా ఇచ్చిపంపించు" అని, చతికిల బడింది, లలిత. ఆమె కోపంగా ఉండటం చూసి నవ్వుకుందామె.

"సరే, నువు కూర్చో—దాసీదాని చేతికిచ్చి పంపుతాలే!"

లలిత ఫలహారం ముందర కూర్చుంది.

తను నాటకానికి వెళ్ళకపోగా, శేఖర్ తన నెందుకని కేకవెయ్యాలి? ఈ కోపంతో నాలుగైదు రోజులు ఆమె శేఖర్ కంట బడటమే మానివేసింది. అయినా అతడు ఆఫీసుకి వెళ్ళాక మధ్యాన్నమప్పుడు గదిలోకి వెళ్ళి, అతని పనులన్నీ చేసి పెడుతూనే వుండేది.

శేఖర్ తన తొందరపాటు గ్రహించాడు. కబురుచేశాడు మరునాడు. అయినా లలిత రాలే.

## 4

ఒక ముసిలివాడు అప్పుడప్పుడా వీధికి బిచ్చానికి వస్తుంటాడు. వాడిమీద లలితకెంతో దయ. వచ్చినప్పుడల్లా ఓ రూపాయిస్తూందేవ. అది చేతులో వేసుకుని వాడు అపూర్వంగా కురిపించే దీవెనలు వినటం లలితకు వల్లమాలిన సరదా. "ఏదీ మా తల్లి, ఎక్కడుందీ?" అంటూ ఇవాళ పొద్దున్నే వచ్చి పిలిచాడు. లలిత కంగారు పడింది: రూపాయి ఎలా వస్తుందీ?—శేఖర్ గదిలో వున్నాడు. అత్తయేమో దాసీదానితో పోట్లాడి చీకాకుగా వుంది.

అన్నాకాశి పరుగెత్తుకుంటూ వచ్చి, "మీ అబ్బాయి వచ్చాడు వదినా!" అన్నది.

"కాశీ, ఓ చిన్నపని చేసిపెట్టు తల్లీ! శేఖర్‌దా దగ్గరికెళ్ళి, ఒక్కరూపాయి తెచ్చి

పెటమ్మా!" అని చెప్పి లలిత పంపించింది.

మరు నిమిషంలో తెచ్చేసి "ఇదిగో!" అంటూ లలిత చేతిలో పడేసింది. అది బిచ్చగాడికిచ్చి పంపివేసింది లలిత. ఇవాళ వాడి దీవెనలు వినటానికేం ఆసక్తిగాలేదు.

కొన్నాళ్లుగా పేకాట బాగా సాగుతోంది. ఇవాళ మధ్యాన్నం లలిత వెళ్లలే. ఒంట్లో బాగులేదని చెప్పి పడుకుంది. ఆమె మనస్సు వికలమై వుంది. కాశీనుంచి శేఖర్ భోగట్టాలెన్నో తరిచి తరిచి అడిగి తెలుసుకున్నది. మాట సందర్భం వచ్చి, "కాశీ! పేకాట సంగతి నువు చెప్పావా?" అని కోపంగా అడిగింది. అందుకు కాశీ—

"నువ్వేళుకున్నావుగా చాయదాదా ఇంటికీ! ఆ సంగతే చెప్పాను. ఎవరెవరు ఆడుతున్నారని అడిగితే అందరి పేర్లూ చెప్పాను. అంతే."

"ఎందుకు చెప్పావ్! అన్ని గొడవలూ నీకే కావాలి...." అంటూ, లలిత అక్కణ్ణించి వెళిపోయింది.

రెండు రోజుల్నించి పేకాట బంద్ అయింది. లలిత రాలే. తొలిసారిగా చూచి నప్పటినించే గిరీన్ తనపైన కన్నువేసినట్టు లలిత అనుమానిస్తూనే వుంది. ఆ అనుమానం ఇప్పుడు మరింత బలపడింది. ఏమీ?—ఈ రెండురోజులాయి గిరీన్ పరధ్యానంగా ఉండటం. ఇల్లు కదిలి ఎక్కడికీ షికారు పోకపోవటం. ఏం తోచక ఆ గదుల్లోనే పచార్లు చేయడం—ఇవీ లక్షణాలు!

ఇవాళ ఆటకు నాలుగో చెయ్యి లోటు. వెళ్ళి పిలుచుకురమ్మని అతడు మనోరమని ఒత్తిడిచేస్తే. ఆమె వెళ్ళి ఎలానో లలితను లాక్కొచ్చింది. ఇవాళ ఆట రక్తికట్టింది. లలిత పక్షమే గెలుపూ!

కాస్సేపయ్యేసరికి కాశీ వచ్చి "వదినా, శేఖర్‌దా పిలుస్తున్నాడు! ఊఁ—త్వే జల్దీ!" అని వేగిరపెట్టింది. లలిత ముఖం వెలవెలబోయింది. చేతిలో ఆ పేక ముక్కలు అక్కడే వొదిలేసి, కంగారుపడుతూ లేచి నించుంది. "వెళ్ళొస్తా పిన్నీ! లేదంటే, ఆయన కోపమొస్తుంది!" అంటూ గబగబా వెళిపోయింది.

* * *

"శేఖర్‌దా ఎవరక్కయ్యా!" అడిగాడు గిరీన్.

"అదుగో. ఎదురుగ్గా ఆ పెద్దమేడ లేదూ! వాళ్ళబ్బాయి!" అని చెప్పింది మనోరమ.

"ఓ—ఆ యిల్లా! నవీన్‌బాబువాళ్ల బంధువా?"

నవ్వుతూ చెప్పింది మనోరమ: "బంధువేమిటీ! ఆ మానిలాడు లలితవాళ్ల ఇల్లు కూడా కలుపుకోవాలని ఎత్తువేస్తే!"




"నిరుడు డబ్బులేక గురుచరణబాబు కూతురి పెళ్లి చెయ్యలేకపోయ్యాడుగా? అప్పుడు నవీన్‌రాయ్ తలముంచే వడ్డీపైన డబ్బిచ్చి, అతగాడిల్లు తనఖా పెట్టించుకున్నాడు. ఈ అప్పు తీరేదేం కాదు. ఓవరికా యిల్లు కాస్తా ఎటూ కాజేస్తాడు నవీన్‌రాయ్" అంటూ కథ అల్లి చెప్పింది మనోరమ.

గురుచరణుడి పాత ఇల్లు పడగొట్టించి, అక్కడే చిన్నకొడుకు శేఖర్‌కి ఓ పెద్ద భవనం కట్టించాలని ముసలివాడి మనస్సులో ఉద్దేశం అనికూడా చెప్పింది.

ఇదంతా వినేసరికి గిరీన్‌కి కష్టం తోచింది. "గురుచరణబాబుకి ఇంకా ఆడపిల్లలున్నారు గదా, వాళ్ళందరికీ పెళ్లిళ్లు ఎలా చేస్తాడూ?" అనడిగాడు గిరీన్.

"లేకేం. వున్నారు. పైగా ఈ లలితకూడాను. ఈ అమ్మాయికి పాపం, తల్లీ తండ్రీ లేరు. ఆమె బరువుబాధ్యతలంతా ఈ పేదవాళ్ళపైనే వుంది. ఈడు వచ్చిన పిల్ల లలిత. ఈ యేడయినా తప్పక పెళ్లిచేసే తీరాలి. వాళ్ళ సంఘంలో వచ్చిన ముప్పేమిటనుకున్నావ్? వెలివేయటానికంతా సిద్ధమేకాని, సాయం చెయ్యటానికి మాత్రం ఎవరూ ముందుకు రారు, ఆమాటకొస్తే మన పనే హాయిగా వుంది, గిరీన్!" అన్నది మనోరమ. గిరీన్ ఏమీ చెప్పక మౌనంగా ఉన్నాడు. కాని, ఆమె ఇంకా చెప్పుకుపోతూనే వుంది—

"లలిత ప్రస్తావన వచ్చి, ఆవేళ వాళ్ళత్తగారు నా ముందర రాగాలెట్టింది. ఏం చెయ్యటమో, ఎలా చెయ్యటమో వాళ్ళకేం దిక్కు తోచటంలే. దిగులుతో గురుచర

ఉడు కుంగిపోయాడు. నిద్రాహారాల్లేవు వాళ్ళకు. ఆ, అన్నట్టూ—ముంగేరుతో కేవలం పిల్ల లక్షణాలు చూసి పెళ్ళిచేసుకునేవాళ్ళ నీ స్నేహితుల్లో ఎవరైనా లేరూ? ఇలాంటి పిల్ల దొరకడం చాలా కష్టం సుమీ. గిరీన్!''

విషాదంగా ఒక్క నవ్వు నవ్వాడు గిరీన్. ''అలాటి స్నేహితు లెవరున్నా రక్కయ్యా! డబ్బు సర్దుబాటు కావాలంటే నే సాయం చేయగలు'' నన్నాడు.

గిరీన్ తండ్రి డాక్టర్‌గా ఉండి, కొల్లలుగా ఆస్తి గడించిపోయాడు. దానంతటికీ ఇప్పుడు గిరీనే యజమాని.

''అయితే, డబ్బు అప్పుగా ఇస్తానంటావా?'' అనడిగింది మనోరమ.

''అప్పేమిటక్కయ్యా! తీర్చగలిగితే తీరుస్తారు. లేకపోతే లేదు ...!''

''అయితే నీకేమిటి లాభం? వాళ్ళు మనకేం చుట్టాలా? కనీసం మన సమాజపు వాళ్ళయినా కాకపోయిరీ!'' అన్నది ఆశ్చర్యంగా.

''మన సమాజపువాళ్ళ కాకుంటే మాత్రమేం, మన దేశస్థులే కదా? వాళ్ళేమీ తేవి వాళ్ళు. నేను పుష్కలంగా కలవాణ్ణి. వాళ్ళ కంగీకారమయితే ఇవ్వటానికి నాకేం అభ్యంతరం లేదు. లలిత వాళ్ళకీ ఏం కాదు, నాకూ ఏం కాదు. ఆమె పెళ్ళికయే ఖర్చంతా పోనీ, నేనే భరిస్తా.''

ఇప్పటిదాకా మెదలకుండా వున్న చారుబాల సంతోషంతో ఎగిరి గంతేసింది. ''అయితే. ఇవ్వు మావయ్యా! నే వెళ్ళి వాళ్ళత్తతో చెప్పొస్తానూ'' అన్నది.

''ఊరికే వుండు చారూ! నీ కెందుకీ గొడవలన్నీ? చెప్పాల్సివస్తే నేనే వెళ్లి చెబుతాలే!'' అంటూ మనోరమ కూతుర్ని గద్దించింది.

''అయితే చెప్పేసి రా అక్కా! మొన్న రోడ్డుమీద ఎదురయ్యాడు గురుచరణ బాబు. క్షణంపేపు మాటాడితేనే తెలిసిపోయింది ఆయనెంత మంచివాడో! ఎంత మంచి మనసు!—ఏమంటావ్?''

''ఏమంటావేమిటీ? వాళ్ళు—ఆ భార్యాభర్త లిద్దరూ అమాయకులే, గిరీన్. అందుకే వాళ్ళకీ కష్టాలు! అలాంటివాళ్ళకి కొంపా గోడూ లేకుండా పోయేట్టుం దిప్పుడు. దానికంతా విదర్శనం చూస్తూనే ఉన్నావుగా. శేఖర్‌బాబు పిలిచా డనగానే, ఎంత బంగారుగా లేచి పరిగెత్తిందో లలిత? వాళ్లింటో అంతా ఆ కుటుంబానికి అమ్ముడుపోయినట్టుగానే వుంటారు. అయితే—వీళ్లెంతగా వాళ్ళని సంతోషపెడదా మనుకున్నా, నవీన్‌రాయ్ చేతిలో ఒకసారి పడ్డాక మరి బయటపడటం కలలో మాట!''

''అయితే—నువ్వెళ్ళి చెబుతావా అక్కయ్యా?''

"సరే, అడుగుతా, ఇస్తే పోనీ, వాళ్లకి నువ్వే ఉపకారం చేసినవాడి వవుతావ్. మంచిదేగా?" అని, చిరునవ్వుతూ ఇలా అడిగింది మనోరమ: "అవునుగాని గిరీష్, ఈ విషయంలో నీ కింత ఆసక్తి దేనికి?"

"మహా, ఆసక్తి కేముంది అక్కా! కష్టసమయంలో ఒహరికొకరం ఆ మాత్రం ఆదుకోకపోతే ఎలా చెప్పు!" ఇలా అని కొంచెం సిగ్గుపడుతూ అక్కణ్ణించి వెళ్ళి పోయాడు. గుమ్మందాకా వెళ్ళి మళ్లీ వచ్చి కూర్చున్నాడు.

"ఏంరా గిరీష్, మళ్లీ వచ్చి... ?"

గిరీష్ నవ్వుతూ, "నువ్వింతగా చెప్పావే, వాళ్ల కష్టగాధ? అదంతా నిజమో కాదో అక్కా?" అన్నాడు.

"ఎందుకని?" ఆశ్చర్యంతో అడిగింది మనోరమ.

"వాళ్ల లలిత ఆ డబ్బు ఖర్చుపెట్టడమూ అదీ చూస్తే, పేదవాళ్ల పిల్ల అనిపించదు అక్కా! ఆ రోజున మేం నాటకానికి వెళ్ళేనాడు తను రాలేదుగాని, మమ్మల్ని వెళ్లమని పదిరూపాయలిచ్చి పంపించింది. డబ్బు ఎంతెలా ఖర్చుచేస్తుందో ఇంకా చారు నడిగి చూడు!"

నమ్మలేదు మనోరమ.

"నిజమేనే అమ్మా! అదంతా శేఖర్‌బాబు డబ్బు. ఇప్పుడే కాదు. చిన్నప్పట్నించీ ఆమె చనువుగా శేఖర్ బీరువా తెరిచి డబ్బు తీసుకుంటుంది. ఆయనెదటే తాళం తీసి డబ్బు తెస్తుంది. ఎవళ్ళూ ఏమీ అనరు. మరి, మొన్నను అన్నాకాళీ బొమ్మల పెళ్ళికి అంత ఉబ్బెవరిచ్చా రనుకున్నావ్? అంతా లలితే తెచ్చిచ్చింది" అని చెప్పింది చారుబాల.

ఆలోచనలో పడింది మనోరమ. "ఎవరెరుగుదురు? అయినా ఒక్కమాట నిజం. కొడుకుమాత్రం తండ్రిలాగా పీనాసి కాడు. అతడంతా తల్లి పోలిక. అందుకనే ఆ దానధర్మాలూ అవిన్నీ. అదీగాక—లలిత ఎంతో మంచిపిల్ల చిన్నప్పట్నించీ "అన్నా అన్నా" అని పిలుస్తూ ఎంతో కలివిడిగా కూడాకూడా తిరిగేది. అందుకనే లలితంటే అందరికీ అంత అపేక్ష....చారూ! నువ్వు వాళ్ళింటి కెళుతూ వస్తుంటావు గదా, వాళ్ళ శేఖర్‌కి ఈ మాఘంలో పెళ్లిటగా! కట్నంకింద ముసిలాడు బోలెడంత గుంజు కుంటాడటగా, అందరూ అనుకుంటున్నారు?"

"అవునే అమ్మా, నిజమే! వచ్చే మాఘంలోనే పెళ్లి. అంతా నిశ్చయమై పోయింది" అని చెప్పింది చారుబాల.

కొద్ది రోజుల పరిచయానికే గిరీన్‌కి గురుచరణుడితో స్నేహబంధం ఏర్పడింది.

సాయంకాల మప్పుడు "గిరీన్‌మామని టీకి పిలుచుకురా లలితా!" అని కబురంపేవాడు గురుచరణుడు. టీ సమయంలో ఇద్దరూ గోష్టి ప్రారంభించే వారు. వాళ్ళమామయ్య చాటున కూర్చుని, లలిత అప్పుడప్పుడు ఆ సంభాషణలు వింటూండేది. గురుచరణుడి హృదయంతో గిరీన్ మాటలు ఏకీభవించేవి.

"నిజమే గిరీన్!—ఎవరి పిల్లలకి వాళ్ళు ఈడు మించకుండా, మంచి సంబంధం చూసి పెళ్ళిళ్ళు చేసెయ్యాల్సిందే. కాని ఎలా? "పెళ్లి చేసెయ్ పిల్లకి. ఈడు మీరిపోతూంది...." అంటుంది సంఘం. కాని దానికి అవసరమైన సహాయం, ఏర్పాటు—వీటిమాట యేం చెప్పదు.

"ఎ.రి సంగతో ఎందుకు గిరీన్! ప్రత్యక్షంగా నాసంగతే చూడరాదూ! ఇల్లు కూడా తనఖా పెట్టేశాను కదా! రెండు రోజులుపోతే, పిల్లా జెల్లాని వెంటపెట్టుకుని నడివీధిన నిలబడాల్సి వస్తుంది.

అప్పుడైనా ఈ సమాజం "రండి! మాఇంట్లో ఆశ్రయం ఇస్తాం" అన్నమాట అనదు. ఏమంటావ్?"

మౌనంగా ఉన్నాడు, గిరీన్.

"ఇలాంటి సమాజంలో ఉండటంకన్న జాతిని వొదులుకోవటం మేలు. తిన్నా తినకపోయినా ప్రశాంతంగా పడివుండొచ్చు. దుఃఖంలో ఉన్నవారిని అర్థంచేసుకోలేని సమాజం, ఆపదలో ఉన్నవారికి ధైర్యం చెప్పలేని సమాజం, గుడ్లురిమి గొంతు పిసికే సమాజం నాలాంటి పేదవాళ్ళకి కాదు గిరీన్! అది భాగ్యవంతులకోసం పుట్టిన సమాజం. సరే. వాళ్ళనే బతికి బాగుండనీ. మాకవసరం లేదు...." అని ఆగాడు గురుచరణుడు.

ఇవన్నీ శ్రద్ధగా విని, లలిత రాత్రిళ్లు నిద్దరొచ్చేవరకూ వీటిని గురించే ఆలోచించేది. గిరీన్‌బాబు మాటలన్నీ న్యాయసమ్మతాలే అని మనస్సులో అనుకునేది.

ఇప్పుడు—తనకెంతో అపేక్షగల మామ తనకోసమే నిద్రాహారాలు మానుకుని వ్యాకులపడుతున్నాడు. తనకి ఆశ్రయం ఇవ్వటం చేతనే ఇంత బాధపడాల్సి వచ్చింది. అటువంటి మామయ్యకి జాతి ఎందుకు పోవాలి? తనమామతో ఏకీభవిస్తున్న గిరీన్‌పట్ల అంతరంగికంగా గౌరవత్తి చూపసాగింది.

ఇంతవరకూ లలితను గిరీన్ "మీరు" అని అంటూండేవాడు. అలాకాదదు.




"మమ్మీ" అని పిలుస్తుందని గురుచరణుకు చెప్పాడు. ఒకనాడు గిరీన్ 'నువ్వు టీ తాగవా, లలితా?' అనడిగాడు. "ఊహూ" అన్నట్టు తల తిప్పింది. గురుచరణు అన్నాడు—"వాళ్ళ శేఖర్‌దా వొద్దన్నాడు. ఆడవాళ్లు టీ తాగటం అతడి కిష్టంలేదు."

* * *

టీ తాగటం పూర్తి అయింది. కాని గురుచరణు ఇవాళ రోజూ అంత ఉత్సాహంగా సంభాషణలో పాల్గొనటం లేదు. మధ్య మధ్యని పరాకుగా ఉంటున్నాడు. ఇది గమనించాడు గిరీన్.

"ఇవాళ మీ వంట్లో అట్టే బాగాలేదనుకుంటాను? ఆఫీసులో ఏమైనా....?"

ఇదివరకు మాటాడని లలిత కూడా అడిగింది: "అవును మామయ్యా! ఇవాళ మీ మనస్సు బాగా లేదల్లే వుందే?"

గురుచరణుడు నవ్వుతూ, "ఓ, అదా సంగతి! అవునమ్మా, నువు సరిగ్గా కనిపెట్టావ్. నిజంగానే ఇవాళ నాకు మనస్సు బాగాలేదు" అన్నాడు.

లలితా, గిరీన్ ఇద్దరూ ఆయన ముఖంకేసి చూస్తూ వూరుకున్నారు. గురుచరణ బాబు చెప్పాడు: "నా స్థితిగతులు యావత్తూ తెలిసికూడా, నవీన్‌దా నన్ను రోడ్డుమీద నిలబెట్టి కఠినంగా అడిగాడు. ఆయన తప్పుమాత్రం ఏముందిలే! ఆరునెలలు దాటింది. అసలుమాట అలావుంచి వడ్డీ అయినా ఒక్క పైసా కట్టకపోతే ఎవడైనా ఊరుకుంటాడా?"

"నువ్వు దాన్నిగురించి ఆలోచించకు మామయ్యా! తరువాత చూసుకుందాం!" అనేసింది చటుక్కున లలిత—ఈ ప్రపంగం వరాయి వాళ్లె మట ఎత్తడం ఇష్టంలేక.

వినిపించుకోలే, గురుచరణుడు. "ఇహ తరవాత ఏముందమ్మా!—అదికాదు గిరీన్! ఈ ముసిలిఅబ్బాయి దిగులు పెట్టుకోకూడదని మా అమ్మ అనుకుంటూ వుంటుంది. కాని, నీ మామ కష్టాలకేసి చూడనయినా చూడరుగా బయటివాళ్లు! అయినా వాళ్ళకేం పట్టిందిలే! ఏమంటావ్ లలితా?"

గిరీన్ అడిగాడు; "ఇవ్వాళ నవీన్‌బాబు ఏమన్నాడూ?" ఈ సంగతులన్నీ గిరీన్‌కి తెలుసునన్న విషయం లలిత ఎరగదు. అందుచేత తనకు సంబంధంలేని ఈప్రశ్నకు ఆమె లోలోపల కోపంతెచ్చుకున్నది.

స్పష్టంగా చెప్పేశాడు గురుచరణుడు—

"నవీన్‌రాయ్ భార్య చాలారోజులై ఏదో వ్యాధితో బాధపడుతున్నది. ఇప్పుడు ముదిరిపోయింది. గాలి మార్పుకోసం ఎక్కడికో వెళ్లాలిట! అంటే బోలెడంత ఖర్చుఖర్చు సమయం. కనుక ఇప్పుడు పూర్తి వడ్డీ. అసల్లో కొంత జమకట్టే గాని మాట దక్కదు."

ఒక్కక్షణం ఊరుకుని గిరీన్ "మీతో ఒక్క విషయం చెబుదామనుకుంటూనే తెలీకుండా కాలం గడిచిపోతూంది. ఇప్పుడు చెబుదామని వుంది. మీరేమీ అనుకోరు గదా!"

- నవ్వుతూ గురుచరణుడు "నాతో ఏం చెప్పాలన్నా ఎవ్వరూ ఎప్పుడూ సంకోచించరు. ఏమిటా సంగతి?"

"ఏంలేదు. నవీన్‌బాబు ఎక్కువ వడ్డీ తీసుకుంటాడని అక్కయ్య చెప్పగా విన్నా. అందుకని నే ననేదేమిటంటే—నా దగ్గర చాలా డబ్బుంది ప్రస్తుతం ఏమంత పనిలేకుండా ఊరికినే వుంది కూడా. వారికీ అగత్యమాయె! పోనీ ఈ అప్పు తీర్చి వేస్తే బాగుంటుందేమోనని...."

లలితా, గురుచరణుడూ ఇద్దరూ ఆశ్చర్యంతో అతడి ముఖంకేసి చూస్తూ ఊరుకున్నారు.

మళ్ళీ చెప్పాడు గిరీన్—ఇప్పుడు నాకాడబ్బుతో అవసరమేంలేదు. కనుక మీ కెప్పుడు వీలయితే అప్పుడు ఆ రుణం తీర్చవచ్చు. వారికి అనవసరంగా.... అందుకనే చెబుతున్నా" అన్నాడు గిరీన్.

"ఆ పైకమంతా ఇస్తావా నువ్వు" అడిగాడు గురుచరణుడు.

"వారి కవసరమయితే అలాగే...."

గురుచరణుడేదో సమాధానం చెబుదామనుకుంటుంటే, అంతలో అన్నాకాళీ పరుగెత్తుకు వచ్చింది: "పదనా. శేఖర్‌దా నిన్ను దుస్తులు మార్చుకు రమ్మంటున్నాడు. త్వరగా! నాటకానికి వెళ్ళాలిట!" అని చెప్పి, ఎంత విసురుగా వచ్చిందో అంత విసురుగా వెళిపోయింది.

ఆపిల్ల హడావుడికి గురుచరణుడు నవ్వుకున్నాడు. లలిత అలానే కూర్చునివుంది.

"వెళ్ళమ్మా లలితా! ఆలస్యం చెయ్యకు. అందరూ నీకోసం కనిపెట్టుకు నుంటారు!" అన్నాడు గురుచరణుడు.

తప్పనిసరి అయింది లలితకు. వెళ్ళేముందు గిరీన్‌కేసి కృతజ్ఞతా పూర్వకమైన గంభీర దృష్టి బరపి, మెల్లగా వెళుతున్నదని అతడు గ్రహించాడు.

బట్టలూ అవీ మార్చుకుంది లలిత. తాంబూలం మిద్దామనే మిషతో మళ్ళీ ఒకమాటు మామయ్య గదిలోకి వచ్చింది.

గిరీన్ వెళ్ళిపోయాడు. గురుచరణుడు ఒక్కడే ఉన్నాడు. చేరగిలి పడుకున్నాడు. మూసుకున్న అతని కొలకుల్లోంచి కన్నీటి ధారలు ప్రవహిస్తున్నాయి. అవి ఆనంద బాష్పాలని లలిత గ్రహించింది. అందుచేత, అతడికి ధ్యానభంగం కలిగించక, వచ్చింది వచ్చినట్టుగానే నిశ్శబ్దంగా వెళ్ళిపోయింది.

కాస్సేపటికల్లా ఆమె శేఖరుడి గదిలోకి వచ్చింది. ఇంకా కన్నీళ్లు జలజల్లాడుతూనే వున్నాయి. కాళీ ముందుగానే పోయి బండీలో కూర్చుంది. లలితకోసమే కాబోలు శేఖరుడొక్కడే ఎదురుచూస్తూ నిలబడివున్నాడు. అశ్రువులతో నిండిన ఆమెకళ్లు చూశాడు. లోగడ ఆమెపైన గల కోపమంతా మరిచిపోయి, "అదేమిటి, ఏడుపెందుకూ?" అనడిగాడు, ఉద్వేగంతో.

లేదన్నట్టు తలవూగించి, వొంచుకుంది.

ఈమధ్యనల్లా లలిత బొత్తిగా కనిపించకపోయేసరికి అతడి మనస్సు మారిపోయి, సానుభూతి కలిగింది. దగ్గరగా వచ్చి, రెండుచేతులతో లలిత ముఖం పైకెత్తి, "నిజంగానే ఏడుస్తున్నావా. ఏం జరిగిందేం?" అనడిగాడు.

ఇహ ఉండబట్టలేకపోయింది లలిత. అక్కడే చతికిలబడింది. చీర చెంగుతో ముఖం కప్పేసుకుని బావురుమని ఏడ్చింది.

## 6

లెక్కకట్టు తాలూకు వడ్డీ తీసుకున్నా అసలీ పాయదాలు దమ్మిడీలతో సహా లెక్కకట్టాడు నవీన్‌రాయి. దస్తావేజు తిరిగి ఇచ్చేస్తూ "ఎవరిచ్చారోయ్ ఈ డబ్బూ?"

అనడిగాడు.

"ఆమాట అడగవద్దండీ అన్నగారూ! వెల్లడించననే షరతుమీద తెచ్చా నీ డబ్బు."

నవీన్‌రాయ్ డబ్బు తీసుకున్నాడే గాని సంతుష్టిలేడు. అన లిది వసూలవుతుందని ఆయన ఆశించనేలేదు, వసూలు కావాలనే వాంఛా లేదు.

"ఇప్పుడిలాంటి షరతు లెన్నయినా పెడతావులే. అసలు తప్పు నీది కాదు భాయీ! నాదే పొరపాటు—మళ్లీ డబ్బు అడగటం...."

"అదేం మాటన్నయ్యా! మీ డబ్బు రుణమే తీరింది గాని, దయారుణం ఇంకా తీరనేలేదు."

"మీ వదినకోసమని అడిగాను గాని డబ్బు, నాకోసమేం కాదు. అదీ ఒక్కసారి అడిగాను. అంతే. పోనీగానీ, తెలియకడుగుతాను, ఎంత వడ్డీకి తనఖా పెట్టావేం ఇల్లు?"

"తాకట్టూ పెట్టలేదు, ఇంతా అని అనుకోనూ లేదు."

"ఊరికేనే ఇచ్చారా?"

"అవునన్నయ్యా, ఇంచుమించు అంతే, ఆ కుర్రవాడు ఎంతో మంచివాడు, దయగలవాడున్నూ...."

"కుర్రవాడా? ఏ కుర్రవాడూ?"

ఇప్పటికే నోరుజారటం పొరపాటనుకుని, మాటాడక ఊరుకున్నాడు గురుచరణుడు.

"విశేషం ఉంటే చెప్పొద్దులే. కాని అనుభవంవల్ల నీ మేలుకోరి చెబుతున్నా! జాగ్రత్తగా మాత్రం ఉండు భాయీ! మంచికి పోయి గొంతుక్కి ఉరితెచ్చుకునేవు సుమా!" జవాబు చెప్పకుండా పత్రాలు చేతపట్టుకుని ఇంటికొచ్చేశాడు గురుచరణుడు.

* * *

గాలిమార్పుకోసం ఏటా ఈ రోజుల్లో భువనేశ్వరి పశ్చిమదేశానికి పోయి వస్తుంటుంది. ప్రయాణసన్నాహాలు జరుగుతున్నాయి. శేఖర్ తన సామగ్రి సర్దుకుంటున్నాడు. "కాళీ! మీ వదినని ఒక్కమాటు పిలు. ఏమేం తీసుకెళ్లాలో వచ్చి ఇస్తుందీ." లలిత ఏటా తల్లితో కూడా వెళ్ళేది. ఈసారికూడా వస్తుందని తెలుసు శేఖర్‌కి.

"ఈమాటు మా వదిన రాదు!" అన్నది కాళి.

"ఎందుకని?"

"వాహ్! ఎలా వస్తుందేం? వచ్చే మాఘ ఫాల్గుణాల్లో పెళ్లి. వాళ్ళు తెగ తిరుగుతున్నారు వరుడికోసం."




రెప్పవాల్చక చూస్తూ నిలబడ్డాడు, శేఖర్.

"నాన్న ఇవాళ ఆఫీసుకెళ్లడు. ఎంత డబ్బయినా సరే, మంచి వరుణ్ణి వెతకమని చెప్పాడు గిరీన్‌బాబు. భోజనమయ్యాక, వరుణ్ణి చూట్టానికని ఇద్దరూ వెళతారు."

శేఖర్ తొణక్కుండా అంతా వింటున్నాడు. లలిత రానికారణం కొంతవరకూ తెలిసింది. కాశీ చెప్పుకుపోతూంది—

"గిరీన్‌బాబు ఎంత మంచివాడు శేఖర్‌దా! మా అక్క పెళ్ళికి మా యిల్లు పెదబాబుగారికి తనఖా పెట్టాంగా? మరి రెండుమూడు నెలలుపోతే మేమంతా అడుక్కుతింటూ వడిపీధిలోనే ఉండాల్సి వస్తుందని చెప్పాడు నాన్న. అందుకనే గిరీన్‌బాబు తప్పిస్తే. అదంతా పెదబాబుగారికిచ్చేశాడు నాన్న. ఇంక మనకేం భయంలేదన్నది వదిన. నిజమేనా శేఖర్‌దా? ఏమి టాలోచిస్తున్నావ్ శేఖర్‌దా?"

"ఏమీలేదు. మీ వదిన్నొకసారి పిల్చుకురా. ఊఁ—చప్పున వెళ్ళు!!"

కంగారుగా వుంది శేఖర్‌కు. నేలకి చూస్తూ, కింద చాపమీద కూర్చునివున్నాడు. లలిత పైకి వచ్చింది మొదలు కిటికీలోంచి చూస్తూనే వుంది. ఇదివరకెన్నడూ అతడి ముఖం ఇలా వుండటం ఆమె ఎరగదు. ఆశ్చర్యపడ్డది. భయమూ వేసింది. మెల్లిగా దగ్గిరకెళ్ళింది. "దా!" అని తడబడుతూ లేచి నించున్నాడు శేఖర్.

"నన్ను పిలిచారా?"

"ఊఁ—రేపొద్దుటి రైల్లో అమ్మను తీసుకుని పశ్చిమదేశం వెళ్తున్నా. ఈ

మాటు తిరిగిరావటం ఆలస్యమవుతుందేమో. ఇదుగో, తాళంచెవి. నీ ఖర్చుకి కావల్సిన డబ్బు బీరువాలోంచి తీసుకుంటూ వుండు!" అన్నాడు.

మరుదు ప్రయాణానికి తను సరదాగా సామానులన్నీ సర్ది పెట్టడం జ్ఞాపకమొచ్చిందతడికి. ఆమెకేసి తిరిగి, గొంతు సవరించుకుని చెప్పాడు శేఖర్!

"జాగ్రత్తగా ఉండు—ఏదైనా అగత్యం వస్తే, అన్నయ్య దగ్గిర వుంది అడ్రెస్సు—అడిగి తీసుకుని ఉత్తరం రాయి!"

ఇద్దరూ మౌనంగానే ఉన్నారు. ఈసారి తను వారితో వెళ్ళనటూ, దానికిగల కారణం కూడా శేఖర్ తెలుసుకున్నట్టూ అనుకుని లలిత సిగ్గుతో ముడుచుకుపోయింది.

"సరే వెళ్లు ఇహ. నేనివన్నీ సర్దుకోవాలి. టయిమయింది. ఒకసారి ఆఫీసు కూడా పోయిరావాలి " అన్నాడు. శేఖర్.

తెరిచిన పెట్టెదగ్గిరకి వచ్చి కూచుంది లలిత. "నువ్వు స్నానానికెళ్లు. నే సర్దుతాలే ఇవన్నీ!" అన్నది. "అయితే మంచిదే" అంటూ తాళాలుగుత్తి ఆమె ముందర పడేశాడు.

* * *

కిందికెళ్లి తల్లినడిగాడు శేఖర్ కాశీ చెప్పినదంతా నిజమేనని తేలింది. గురుచరణుడు అప్పు తీర్చిన మాటా వాస్తవమే. లలితకు వరుణ్ణి వెతకటమూ యదార్థమే. మరేమీ అడక్కుండా శేఖర్ స్నానానికి వెళ్లాడు. స్నానం, భోజనమూ అయింది. దుస్తులు వేసుకోటానికని గదిలోకి వచ్చాడు స్తబ్ధుడైనాడు.

ఈ రెండుగంటల పేపట్లో లలిత యేమి సర్దనూలేదు. ఏంలేదు. పెట్టెమీద ఓ పక్కన తల ఆనించి, మౌనంగా కూరునివుంది. శేఖర్ వస్తున్న చప్పుడు విని ఉలిక్కిపడింది. ఒక్కమాటు తలఎత్తి మళ్లీ వొంచుకుంది కళ్లు రెండూ జ్యోతుల్లా వున్నాయ్.

"ఇప్పు డిహ నీవల్ల కాదు. లలితా! మధ్యాన్నం వచ్చి సర్దుకువు గానిలే!" అని అనేసి ఆఫీసుకి వెళిపోయాడు.

లలిత కళ్ళు అలా ఉండటానికి కారణం గ్రహించాడు. కాని పూర్తిగా విషయం తెలియందీ ఏమనటానికీ చొరవ చెయలేకపోయాడు.

* * *

ఇవాళ సాయంకాలం వాళ్ళ మామయ్యావాళ్ళకి టీ పట్టుకొచ్చింది గావి. కంగారుపడింది లలిత. గురుచరణబాబు దగ్గర సెలవు తీసుకుందామని వచ్చి. శేఖరుడు కూడా అక్కడ కూర్చున్నాడు.



తల వంచుకుని రెండు కప్పుల టీ తెచ్చి ఒకటి మామయ్య ముందర, రెండోది గిరీన్‌ముందరా పెట్టింది. "శేఖర్‌బాబుకి టీ ఇవ్వలేదేం?" అనడిగాడు గిరీన్.

తల పైకెత్తకుండానే "శేఖర్‌దా టీ తాగడు!" అన్నది లలిత

టీకప్పు తీసుకుని గురుచరణుడు ఇలా ప్రస్తావించాడు—"కుర్రవాడు బి.ఏ. చదువుతున్నాడు....కాని మా గిరీన్‌కు నచ్చలేదు. చూపులకంత బాగుండదనుకో. కాని మగాడికి అందమెందుకూ, గుణం మంచిది కావాలి గానీ...." ఎలానో మూడు ముళ్ళూ పడితే, గురుచరణుడి ప్రాణం కాస్త తెరిపిన పడుతుందని ఆత్రం.

గిరీన్‌కు శేఖర్‌తో ఇదే తొలి పరిచయం. శేఖర్ అతడికేసి చూసి చిరునవ్వుతూ. "ఎందుకని నచ్చలేదూ గిరీన్‌బాబుకి? కుర్రవాడు పెద్ద చదువు చదువుతున్నాడు. మంచి స్థితిపరుడూ, ఇంకేం కావాలీ?"

ప్రశ్న వేసినప్పటికీ, గిరీన్‌కి నచ్చని కారణం శేఖర్ స్పష్టంగా గ్రహించాడు. గిరీన్ బదులుచెప్పలేదు కాని, ముఖం ఎర్రబడింది. అదీ గమనించాడు శేఖర్. వెంటనే లేచి నిలబడి. "బాబాయ్! అమ్మని రేపు పశ్చిమదేశం తీసుకువెళుతున్నాను.

సమయానికి కబురుచెయ్యటం మరిచిపోకు సుమా!'' అన్నాడు.

''అదేమిటి నాయనా! మా బలగమంతా మీదేగా? అదీగాక, మా తల్లి లేంది ఇక్కడ ఏ పనీ పూర్తికాదు. ఏమంటావమ్మా లలితా?'' అని నవ్వుతూ వెనక్కి తిరిగి చూశాడు. లలిత ఎప్పుడో లేచి వెళిపోయిం దక్కడ్నించి!—

''ఈ ప్రస్తావన రాగానే పారిపోయింది!'' అన్నాడు శేఖర్.

# 7

ఇవాళ లలిత టీపార్టీనుంచి మెల్లిగా వచ్చేసి. శేఖర్ గదిలో ప్రవేశించింది. లైటు వెలుతురులో అతడి బట్టలూ అవ్వీ సర్దుకోంది. శేఖర్ లోపలికి రావటం చూసి, ఆమె భయంతో ఆశ్చర్యంతో స్తబ్ధురాలైంది.

శేఖర్ ముఖం గుర్తుపట్టలేనంతగా మారిపోయి, ఎంతో యిదిగా వుంది. ఎండిన గొంతుతో ''ఏమిటి లలితా?'' అనడిగాడు.

వెంటనే లలిత అతడి చెయ్యిపట్టుకుని, గద్గదస్వరంతో ''ఏం జరిగింది శేఖర్‌దా?'' అన్నది.

కుర్చీలో కూర్చుని ''ఏం చేస్తున్నావ్?'' అని ప్రశ్నించాడు.

''ఓవర్‌కోటు పెట్టడం మరిచిపోయాను. అదికూడా సర్ది పోదామని.... ఇది సరిగ్గా పైనే పెట్టాను.... తొడుక్కోవటం మరిచేరు సుమా!''

''సరేకాని లలితా! అమ్మ సామాన్లు సర్దుకోవటం అయిందేమో?''

''ఆఁ—మధ్యాన్నం నేనే అవన్నీ సర్దా.''

''లలితా!—వచ్చే యేడు నా పనులన్నీ ఎవరు చేసిపెడతారో చెప్పగలవూ?''

ముఖం పైకెత్తి. ''ఏం?''

''నాకేం తెలుసూ!—కాని పరాయింటికి వెళ్ళేముందు ఎక్కడెక్కడ ఏమేం వస్తువున్నదీ నాకు చూపించి మరీ వెళ్లేం!''

''పోండి!''

నవ్వాడు శేఖర్. ''ఈ పనులన్నీ నౌకర్లవల్ల అయేవి కావు. ఇహనుంచి మీ మామయ్యలాగా ఓ చొక్కా. పంచెతో ఉండాల్సి వస్తుందేమో. ఎలా జరగాలో జరక్కమానదు కదా!''

తాళంచెవులు బల్లమీద పడేసి పారిపోయింది.

''రేపొద్దున మాత్రం ఒక్కమాటు రావేం!'' అని కేకేశాడు. వినిపించనట్టుగా దబదబ మెట్లుదిగి వెళిపోయింది లలిత.



లలిత డాబామీదికెళ్లి చూస్తే అన్నాకాళీ ఇన్నిపువ్వులు ముందరోసుకుని దండ గుచ్చుతోంది. ఏం చేస్తున్నావే అంటే "దండ గుచ్చుతున్నా. ఇవాళ రాత్రి మా అమ్మాయి పెళ్ళి!" అన్నది. "చెప్పావు కావేం!" అనడిగితే ఇలా అంది—

"ఇవాళ తప్పితే ఇహ ముహూర్తాలు లేవుట. పిల్ల పెద్దదయిందాయె. ఆగటానికి వీల్లేదు. రెండు రూపాయలుంటే ఇవ్వు వదినా, తినుబండారాలు తీసుకురావాలి."

"నా తలగడకింద వున్నాయి తెచ్చుకో!" అన్నది లలిత. పట్టుకుని వెళ్లిపోయింది కాళీ. లలిత అక్కడే కూచుని దండ గుచ్చుతూంది.

ఒక్క క్షణంలో కాళీ మళ్లీ తిరిగివచ్చింది. "అందర్నీ పిలవటం అయిపోయింది. ఇహ ఒక్క శేఖర్‌దానే పిలవాలి," అంటూ వెళ్ళింది.

కాళీ అంటే ఇంటిపనులన్నింటిలో ఆరితేరిన గృహిణి అన్నమాట! శేఖర్‌తో చెప్పి వచ్చింది. "వదినా! ఆయనకో దండ కావాలిట. నువు చప్పున ఇచ్చి వచ్చెయ్. ఈలోగా. నేనిక్కడ ఏర్పాట్లు చూస్తూంటాను. ఇంకట్టే వ్యవధానం లేదు. లగ్నం దగ్గిరకొచ్చేసింది. వెళ్లు వదినా, నాకు చద్దామన్నా తీరుబడి లేకుండా వుంది!" అన్నది నావసానిలాగా.

లలిత వెళ్ళేసరికి శేఖర్ ఏదో ఉత్తరం రాస్తున్నారు. తలుపు తెరిచి అతడి వెనకాలకు వచ్చి నిలుచుంది. అయినా అతడు గమనించలేదు. జాగ్రత్తగా ఆ దండ వెనకనించి అతడి మెళ్ళో వేసింది.

ఉలిక్కిపడి "ఏమిటే కాశీ!" అని, అట్టే వెనక్కి తిరిగి చూశాడు. "ఏం పని చేశావు లలితా!"

"ఏం?"

"తెలీదూ? పోయి కాశీని అడిగిరా! ఇవాళ రాత్రి మెళ్ళో దండవేస్తే ఏమవుతుందో దాన్ని అడిగిరా!"

గ్రహించింది లలిత. సిగ్గుతో ముఖం కందగడ్డ అయింది. "కాదు—ఎన్నటికీ కాదు!" అంటూ పారిపోయింది. శేఖరుడి పిలుపు చెవినిపడినా ఆగకుండా, సరాసరి గదిలోకి వెళ్ళి కళ్ళుమూసుకు పడుకుంది.

"వెళ్ళకు లలితా! విని వెళ్ళు—ఒక ముఖ్యమైన పనివుంది!" అని కేకేశాడు శేఖర్.

ఓ పావుగంటయాక లేచి కూర్చుంది. శేఖర్ అంటే లోపల జంకుగానే వుందామెకు. అయినా ముఖ్యమైన పనివుందని పిలిచాడు. కనక వెళ్ళటమా మానటమా అని ఆలోచనలో పడింది.

ఇంతలో ఇంటిదాసీని "లలితమ్మగారూ! చినబాబుగారు పిలుస్తున్నారు మిమ్మల్ని!" అన్నది

"వస్తున్నా పద!" అన్నది లలిత.

తలుపు సందుల్లోంచి చూస్తే, ఇంకా ఉత్తరం రాస్తూనే వున్నాడు, శేఖర్.

"ఎందుకని పిలిచింది?"

"దగ్గరకిరా చెప్తా!"

"ఉహూఁ—ఇక్కడే వుంటా, చెప్పండి!"

"నువ్వు హఠాత్తుగా ఇలాటి పనెందుకు చేశావో చెప్పు!"

"పొండి—మళ్ళీ అదే మాటా!"

"నా తప్పేముంది? నువ్వు చేసిన పనేగా?"

"నేనేం చెయ్యలేదు! నా దండ నా కిచ్చెయ్యండి!"

"అందుకోసమే పిలిచింది నిన్ను. దగ్గరసా రా, ఇచ్చేస్తా. నువు సగంపని చేసేశావు. నేను దాన్ని పూర్తి చెయ్యాలిగా?"

"ఇలా వేళాకోళమాడితే, ఇంకెప్పుడూ రాను మీ ఎదటికి. ఇదే చెప్పటం, నా



దండ నాకిచ్చెయ్యండి!"

శేఖర్ టేబిల్ వేపు ముఖం తిప్పి. "ఇదిగో, తీసుకెళ్లూ!" అన్నాడు.

"అక్కణ్నించే ఇలా విసిరెయ్యండి!"

"ఉహుఁ—దగ్గిరకొస్తే గాని ఇవ్వను!"

"అయితే నాక్కర్లేదు!" అంటూ కోపంగా పోబోయింది.

"కాని సగంలో ఆగిపోయింది....!" కేకేశాడు శేఖర్.

"ఆగితే ఆగిందిలే!" అంటూ నిజంగానే వెళిపోయింది.

వెళ్ళినమాట నిజమే కాని, కిందికి దిగి వెళ్ళలే. తూర్పువేపు డాబా పిట్టగోడకి ఆనుకు నించుంది. ఎదట నీలాకాశంమీద చందమామ అప్పుడే బయల్దేరింది. లలిత ఒక్కసారి శేఖర్ గదికేసీ, మళ్ళీ ఆకాశంకేసీ చూసింది. సిగ్గుతోనూ, అభిమానంతోనూ ఆమె కళ్లు అశ్రువులతో నిండిపోయినై.

ఆమెకు బాధకలిగించే పరిహాసం ఎందుకు చెయ్యాలతడు?—ఆమె ఆశ్రయం లేనిదీ, దిక్కులేనిదీ. అందుకనే తనని అందరూ ఆదరిస్తూ వుంటారు. శేఖరుడూ ఆదరిస్తాడు, అతడి తల్లీ ఆదరిస్తుంది! నిజాని కామెకి ఆత్మీయులంటూ ఎవరూ లేరు.

తన బాధ్యతను పైన వేసుకునే వారెవరూ లేకపోవటంవల్లనే—కేవలం పరాయి వాడైనప్పటికీ—గిరీన్ ఆమెని ఉద్ధరిస్తా ననగలిగాడు.

కన్నీళ్లు తుడుచుకుని. లలిత తనలో తను అనుకున్నది:—ఈ కలకత్తా సమాజంలో, శేఖర్‌వాళ్ళ దృష్ట్యా తన మామస్థితి ఎంతో హీనం! అటువంటి మామయ్యనే తను ఆశ్రయించుకుని వున్నది!

అక్కడ—సమాన హోదాగల సంబంధం గురించి శేఖర్‌కి పెళ్ళి ప్రసంగం జరుగుతూంది. ఇహ రెండు రోజుల్లో అది ఖాయమవుతుందతడికి. ఈ పెళ్ళికి నవీన్‌రాయ్ కట్నమెంత గుంజాకో దలిచివున్నాడో, ఆ వివరాలన్నీ శేఖర్ తల్లి దగ్గర విని తెలుసుకు ది, లలిత.

పరిస్థితు లిలావుండగా, హఠాత్తుగా ఇవాళ శేఖరుడు తనకెందు కింతగా అవమానం చేసినట్టు! ఈ ఆలోచనలతో ఉండగా, చటుక్కున ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూసింది. నవ్వుతూ శేఖర్ నిలబడి వున్నాడు.

ఎంత ఉపాయంగా ఇంతకు ముందు తను ఏ పువ్వులదండ అయితే వేసిందో, అదే దండ—అంత ఉపాయంగా ఇప్పుడు తన మెళ్లోకి వచ్చిపడింది!

దుఃఖంవల్ల జీరపోయిన కంఠంతో "ఎందుకిలా చేశారూ?"

"నువ్వెందుకు చేశావూ?"

"నేనేం చేశానేం!" అంటూ ఆ దండను తెంచివేయబోయి, శేఖర్‌ను చూసి ఇహ సాహసించ లేకపోయింది.

ఏడుస్తూ "నాకు "నా" అన్నవాళ్ళు లేకపోబట్టే కదా, నన్నిలా అవమానం చేశారు మీరు!" అన్నది.

"నే నవమానం చెయలే, నువ్వు చేశావేమో!"

"నేనేం చేశా!" నన్నది భయంభయంగా.

"కాస్త ఆలోచించి చూస్తే నీకే తెలుస్తుంది. ఈమధ్యని నువు మరీ హద్దు మీరిపోతున్నావ్ లలితా! అందుకనే నిన్నొక పరిధిలో బంధించి మరీ పోతున్నా పరదేశానికి!"

పిండు వెన్నెల్లో ఇద్దరూ మౌనంగా నించుని వున్నారు. కిందని కాశీకూతురి పెళ్ళికదా! ఆ శంఖధ్వని మాత్రం వినిపించింది.

కాస్సేపయాక—

"అర్థరాత్రి వేపు మంచులో నిలబడకు, కిందికి వెళ్లు!" అన్నాడు శేఖర్.

"వెళుతున్నా...." అంటూ అతడి పాదాలకు నమస్కరించి లేచి, "నన్నేంచెయ్య

మంటారో చెప్పి వెళ్ళండి!'' అన్నది మెల్లిగా.

ఒకమాటు నవ్వి, తటపటాయించాడు. తరవాత రెండు చేతులతో ఆమెను చేర తీసుకుని, హృదయానికి హత్తుకున్నాడు. ''ఇంకేమీ చెప్పక్కర్లేదు లలితా! ఇటుపైన నీ అంతట నువ్వే తెలుసుకుంటావ్!'' అన్నాడు.

లలితకు ఒళ్ళంతా గగుర్పొడిచి, కంపించింది. కాస్త జరిగి నిలబడి, ''ఇవాళ హఠాత్తుగా నేను మీ మెళ్ళో దండ వేశాననే కదూ, మీరిలా చేసింది?''

శేఖర్ నవ్వుతూ, కాదన్నట్టుగా తల తిప్పి, ''కాదులే. అయితే చాలా రోజుల్నించి నే నొహటి అనుకుంటున్నా కాని స్థిరం చేసుకోలేక పోయాను. ఇవాళ నిశ్చయించుకున్నా. నిన్ను విడిచిపెట్టి ఉండలేనని ఇవాళే గ్రహించాను.''

మీ నాన్న వింటే కోప్పడతారు. అమ్మ చెవిని పడితే విచార పడుతుంది. ఇది నెరవేరే పనికాదు.''

''నాన్న వింటే కోప్పడే మాట నిజమే. కాని అమ్మ వింటే ఎంతో సంతోషిస్తుంది. ఏది ఏమైతే నేం, జరగవలసిందేదో జరిగేపోయింది. ఇహ నువ్వూ తప్పించుకో లేవు. నేనూ తప్పించుకో లేను. వెళ్ళు, కిందికి వెళ్లి అమ్మకి నమస్కారం చేసి రా!'' అన్నాడు శేఖర్.

## 8

మూడు నెలల తరవాత, ఒకనాడు—

నవీన్‌రాయ్ ఇంటికి వాడిపోయిన ముఖంతో వచ్చి గురుచరణుడు కార్పెట్ మీద కూర్చోబోయాడు. కంగారుగా నవీన్‌రాయ్—

''ఉహుంహూ—ఇక్కడ కాదు, అదిగో ఆ కుర్చీమీదికి పోయి కూచో. ఈ చలిలో పోయి నేను మళ్ళీ స్నానం చేయలేను. జాతి వొదులుకున్నావుటగా నువ్వు!'' అనడిగాడు. దూరంగా వున్న కుర్చీలో తలవంచుక్కూచున్నాడు, గురుచరణుడు.

అతడు యథావిధిగా దీక్ష పుచ్చుకుని బ్రహ్మసమాజంలో కలవటం, అంతా నాలుగయిదు రోజులయింది. ఈ సంగతి చిలవలు పలవలతో, చిత్ర విచిత్రమైన అల్లికలతో సనాతన హిందువయిన నవీన్‌రాయ్ చెవిన పడటం ఇవాళే. ఆయన కళ్ళలోనించి నిప్పులు కురుస్తున్నాయ్. గురుచరణుడు అలానే దూరాన మౌనంగా కూర్చున్నాడు. అతడు ఎవరినీ సలహా అడక్కుండానే ఈపని చేశాడు. అప్పట్నించీ ఇంట్లో ఏడ్పులూ పెడబొబ్బలూ, మొత్తుకోళ్ళూ ఎక్కువై, మనశ్శాంతి అనేది

లేకుండా పోయింది.

"చెప్పవోయ్; నిజమా కాదా?" గద్దించాడు నవీన్‌రాయ్.

గుడ్లనీరు గుక్కుకున్నాడు. గురుచరణుడు.

"చిత్తం, నిజమే...."

"ఎందు కిలాటి పనిచేశావ్? నీ జీతం అరవై రూపాయలేగా—నువ్వు—" కోపం వల్ల ఆయనకింక ఆ పైమాట రాలేదు.

కళ్ళు తుడుచుకుని. గొంతు సవరించుకుని అన్నాడు గురుచరణుడు; "అప్పుడా జ్ఞానం లేకపోయిందన్నయ్యా! దుఃఖావస్థలో అప్పుడు ఉరిపోసుకోవడమా. బ్రహ్మ సమాజంలో చేరటమా నిశ్చయించుకోలేకపోయా. ఆత్మఘాత కన్నా బ్రహ్మజ్ఞానివి కావటమే మంచిదని అందులో చేరేశాను."

"మంచి పని చేశావ్! నీ మెడకు కాకుండా జాతి మెడకే ఉరి తగిలించావ్. సరే వెళ్ళు. మరెన్నడూ నీ ముఖం చూపించకు నాకు. నీకీ సలహా ఇచ్చిన వాళ్ళనే ఆశ్రయించు పోయి. ఇహ నీ కూతుళ్ళని అడ్డమైన వాళ్ళకీ తీసుకెళ్ళియ్య." అని కసిరికొట్టి ముఖం ఇటు తిప్పుకు కూర్చున్నాడు.

నవీనుడికి మొదట ఈ ఆలోచన లేకపోయింది. ఇప్పుడు గురుచరణుడు తన చేతుల్లోంచి పూర్తిగా తప్పించుక పోయ్యాడు. ఇహ మళ్ళీ తన గుప్పెట్లోకి వస్తాడనే మాట కల్ల. అంచేత ఆక్రోశంతో ఉడుకెత్తి పోయింది. అతణ్ని వంచించగల ఉపాయ మేం తోచలే. వెంటనే ఓ తాపీ మేస్త్రిని పిలిపించి. ఇద్దరిళ్ళ మధ్యనీ ఉన్న వచ్చేపోయేదారి మూసుకు పోయేందుకు పెద్ద గోడ కట్టించేశాడు.

ఈ సంగతి దూరదేశంలో వున్న భువనేశ్వరికి శేఖర్ చెప్పగా తెలిసింది. విని చాలా దుఃఖించింది.

ఈ దుర్బుద్ధి ఎవరు పుట్టించారని అడిగింది కొడుకుని. శేఖర్ గ్రహించే వున్నాడు. కాని బైటపెట్టడం ఇష్టంలేదు.

"అమ్మా. రెన్నాళ్ల పోయాకయినా అతణ్ణి మీరే వెలివేశేవారుగా? ఇంతమంది ఆడపిల్లలకి ఎలా పెళ్ళిళ్ళు చెయ్యగల డతడు? నాకేం బోధపడటంలే!"

"ఏదీ ఆగదు, శేఖర్! కేవలం అందుకోసమనే జాతి వొదులుకుంటే చాలా కావచ్చు. వాళ్ళని పుట్టించిన దేవుడే ఆ భారమూ వహిస్తా" అన్నది. శేఖర్ మాటాడలే.

కళ్లు తుడుచుకుని భువనేశ్వరి చెప్పింది—"మన లలితని నా వెంట తీసుకొస్తే, దానికేదో ఉపాయం నేనే ఆలోచించాల్సి వచ్చేది. ఆలోచించేదాన్ని కూడా. కాని, ఈ

- 14 రోజులకే పాకిస్తాన్ సగం పోయింది!
యుద్ధం మరో 14 రోజులు సాగి
వుంటే బావుండేది!!



ఉద్దేశం మనస్సులో పెట్టుకుని గురుచరణుడు దాన్ని పంపలేదన్నమాట నాకు తెలియక పోయె. నిజంగా దానికి సంబంధం కుదిరిందనే నేననుకున్నా."

"అలా అయితే బాగానే ఉండేదమ్మా! ఇప్పుడైతే మాత్రమేం, ఇంటికెళ్లాక ఆ పని ఎందుకు చెయ్యకూడదమ్మా? లలిత ఇంకా ఆ సమాజంలో చేరలేదటగా! వాళ్ళ మామయ్యే మట్టుకే చేరాట్ట! ఇంతకూ, నిజానికాయన లలితకేం సొంత మేనమామ కాదుగా, లలితకెవరూ లేకపోబట్టి వాళ్ళింట్లో పెరిగిందిగానీ!" అన్నాడు శేఖర్.

"నిజమేరా. కాని, మీ నాన్న అదో మొత్తరు మనిషి. ఆయన ఒప్పుకోరు సరి కదా, వాళ్ళ ముఖంకూడా చూడనివ్వరు." శేఖర్‌కీ ఇదే అనుమానం.

రెండురోజుల తరవాత "ఇక్కడ నాకేం తోచటం లేదమ్మా! ఇంటికి వెళి పోదాం!" అన్నాడు. "అలాగైతే పద. నాకూ ఏమీ బాగుండటం లేదు" అన్నది వెంటనే భువనేశ్వరి ఒప్పుకొంటూ.

తల్లీకొడుకు లిద్దరూ ఇంటికి వచ్చిమాస్తే. రెండిళ్ళకీ మధ్యని పెద్ద గోడ!

శేఖర్ రాత్రి భోంచేస్తుంటే. మాటమీద మాటొచ్చి భువనేశ్వరి ఇలా అంది! "వాళ్ళ గిరీష్‌బాబుకి లలిత నిచ్చేటట్టుందిరా అబ్బాయ్! ఈ సంగతి నేను ఇదివరకే ఊహించా."

"ఎవరు చెప్పారూ?"

"మధ్యాన్నం చూసివద్దామని వెళితే. వాళ్ళత్త ఒకే ఏడుపు!" అని ఒక్క క్షణం

యావ

ఆగింది.

తరవాత కళ్ళొత్తుకుంటూ—"ప్రారబ్ధం, శేఖర్! ప్రారబ్ధం! నొసట వ్రాత ఎవరు తప్పించగలరూ? అయినా ఇందులో ఎవరినీ తప్పు పట్టలేం. పోనీలే. అయిందేదో అయింది. గిరీన్ కూడా చిన్నవాడు, మంచివాడు, బోలెడంత ఆస్తి. లలిత ఏం కష్ట పడక్కర్లేదు!" అన్నది.

శేఖర్ సమాధానం చెప్పలేదు.

* * *

మర్నాడు సాయంత్రం అలా అలా తిరిగొద్దామని బయల్దేరాడు శేఖర్. అప్పుడు గురుచరణుడింటో టీ సమావేశం జరుగుతూంది. కబుర్లూ, నవ్వులూ ఉత్సాహంగా సాగటం విని, ఏమనుకున్నాడో ఏమో—శేఖర్ గురుచరణుడి గదిలోకి వెళ్ళాడు. అట్టే ఆ కోలాహలమంతా ఆగిపోయింది. శేఖర్ని చూడగానే అందరి ముఖాలూ మారిపోయాయి.

అతడు తిరిగిరావటం, ఒక్క లలితకు తప్ప మరెవళ్ళకూ తెలీదు! ఇవాళ గిరీన్తో మరో పెద్దమనిషికూడా వచ్చి కూచున్నారు. అతడాశ్చర్యంగా చూశాడు శేఖర్ కేసి.

శేఖర్ గురుచరణుడికి నమస్కరించి, ఓ పక్కన కూచుని నవ్వుతూ, "ఇదేమిటి! అంతా ఒక్కమాటుగా చల్లబడిపోయిందేం?" అన్నాడు. గురుచరణుడు ఏదో మెల్లిగా దీవించినట్టుంది, సరిగ్గా తెలియలేదు. ఆయన మనస్సులో ఉద్దేశం శేఖర్ గ్రహించాడు. ప్రయాణపు సంగతులూ, పశ్చిమదేశపు విశేషాలూ అన్నీ వివరించి, ఓవరికి ఆ కొత్తయువకుడి ముఖంకేసి చూశాడు.

అతణ్ణి పరిచయం చేస్తూ, గురుచరణుడు చెప్పారు: "ఇతడు మా గిరీన్కు స్నేహితుడు. ఒకే ఊరు, ఒకదగ్గరే కలిసి చదువుతున్నారు. చాలా మంచి కుర్రవాడు. శ్యాం బజార్లో వున్నా, రోజూ ఓసారి వచ్చి చూసిపోతుంటాడు." అందుకేం బదులు చెప్పలేదు శేఖర్. కాస్సేపయాక "బాబాయ్, అందరూ అలాపాయేవా?" అనడిగాడు. జవాబివ్వలేదు గురుచరణుడు. శేఖర్ లేచి వెళ్ళబోతూవుంటే, "అప్పుడప్పుడు వొస్తూండు నాయనా! బొత్తిగా వొదిలిపెట్టెయ్యకు. విన్నావుగా సంగతులన్నీ!" అన్నారు ఏడుపు గొంతుకతో.

"వినకేం?" అంటూ లోపలికెళ్ళాడు శేఖర్.

లోపల్నుంచి గృహిణి ఏడుపు వినిపించింది. గురుచరణుడు పంచెకొంగుతో కళ్ళు తుడుచుకుంటున్నాడు. గిరీన్ అపరాధిలా చిన్నదయిన ముఖంతో కిటికీలోంచి చూస్తూ

కూర్చున్నాడు. లలిత అంతకు ముందే వెళ్ళిపోయింది. అక్కణ్ణించి.

శేఖర్ వంటింట్లోంచి ఇవతలికి వచ్చి మెల్లాలోకి వెళుతూండగా, తలుపు చాటున లలిత ఉండటం చూశాడు. సాష్టాంగ నమస్కారం చేసిందామె. లేచి నిలబడి అతడి దగ్గిరగా జరిగింది: "నా ఉత్తరానికి జవాబు రాశారు కాదేం?" అనడిగింది. విస్మితంగా.

"ఏదీ, నా కందలేదే! ఏం రాశావ్, అందులో?"

"చాలా సంగతులు రాశా! పోన్లెండి, అంతా విన్నారుగా. ఇప్పుడేమిటి మీ ఆజ్ఞ, చెప్పండి!"

ఆశ్చర్యంగా "నా ఆజ్ఞ, నా ఆజ్ఞతో ఏం పని?"

"ఎందుకని?"

"ఎందుక నేమిటి లలితా? నే నెవరిని ఆజ్ఞాపించేది?"

"మన్నే. ఇంకెవరి నాజ్ఞాపిస్తారు?"

"నిన్ను మాత్రం ఎందు కాజ్ఞాపిస్తాను? ఆజ్ఞాపిస్తే మటుకు నువ్వెందుకు వింటావ్?" జాలి కొలిపే స్వరంతో అన్నాడు

మనస్సులో చాలా భయపడింది లలిత. ఇంకోమాటు దగ్గరసా వచ్చి, ఏడుపు గొంతుతో అన్నది—"పోండి—ఇదా సమయం వేళాకోళానికి? మీ కాళ్ళమీద పడతా. ఏం చెయమంటారో చెప్పండి. నా కమిత భయంగా వుంది. రాత్రిళ్ల నిద్దరట్టటంలేదు."

"భయం దేనికి?"

"దేని కంటా రేమిటీ? మీరూలేరు దగ్గర, అమ్మా లేదు! ఈలోగా మామయ్య ఇలాంటి పనిచేసి కూచున్నాడామె! ఇప్పుడు అమ్మ నన్నింటోకి రానివ్వకపోతే....?"

"అదీ నిజమే. అమ్మ రానివ్వదు. మీ మావయ్య వాళ్ళదగ్గిర బోలెడంత డబ్బు తీసుకున్నాడని తెలిసిందామెకు. అదీగాక, ఇప్పుడు మీరు బ్రహ్మసమాజికులు, మేం హిందువులం" అన్నాడు శేఖర్.

వంటింటోంచి అన్నాకాళీ కేక: "వదినా, అమ్మ పిలుస్తోంది!"

"వస్తున్నా!" అని గట్టిగా చెప్పింది లలిత.

తరవాత కాస్త గొంతు తగ్గించి అన్నది—"మామ ఎవరైనా కానీండి. మీరు ఎవరో నేనూ అదే. అమ్మ మిమ్మల్ని వదులుకోగలదా? నన్నూ వదులుకోలేదూ. పోతే—గిరీన్‌బాబు దగ్గర తీసుకున్న డబ్బుసంగతి అంటారా?—అది నే తీరేస్తా. అప్పు అని తీసుకున్నాక, అటూ యిటూ కాస్త వెనక ముందుల్లో తీర్చే తీరాలి

"అంత డబ్బెక్కణ్ణించి వస్తుంది నీకూ?"

ఒక్కసారి అతడి ముఖంకేసి కళ్ళెత్తి చూసింది. క్షణంసేపు మౌనంగా ఉంది. "నాకు తెలీదు, ఆడవాళ్ళందరికీ డబ్బు ఎక్కణ్ణించి వస్తుందో, నాకూ అక్కణ్ణించే" అన్నది.

ఇప్పటిదాకా నిగ్రహించుకు మాటాడుతున్నా లోపల మండిపోతూనే వున్నాడు శేఖర్. ఇప్పుడు ఎకసక్కెంగా అన్నాడు: "మామయ్య నిన్ను అమ్మేశాడుగా!"

లలితకు చీకట్లో అతడి ముఖభంగిమ కనిపించలేదు కాని గొంతు మార్పు కనిపెట్టింది.

"అంతా ఒట్టిది. మా మామయ్యలాంటి మనిషి లోకంలో ఎవ్వరూ లేరు. ఆయన్ని మీరు హేళన చెయ్యకండి. ఆయన కష్టాలు మీరు తెలుసుకోలేక పొయ్యారుగాని, లోకమంతటికీ తెలుసు" అంటూ ఒక్కమాటు గుటకమింగి, కొంచెం తటపటాయించింది.

"అదీగాక ఆయన డబ్బు ఎప్పుడు తీసుకున్నారో తెలుసా? నా పెళ్ళి అయినాకే. అంచేత ఆయనకి నన్ను అమ్మే అధికారమూ లేదు, నన్ను అమ్మనూ లేదు. ఆ అధికారం మీ ఒక్కరికే వుంది. తలుచుకుంటే మీరు డబ్బివ్వాల్సి వస్తుందేమోనన్న భయంతో అమ్మేయగలరు కూడా....!" అని చెప్పి గబగబా అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

# 9

రాత్రి పొద్దుపోయేవరకూ తిరిగితిరిగి వచ్చిన శేఖర్ ఆలోచనల్లో పడ్డాడు.

తన కళ్ళముందర పెరిగిన మొన్నమొన్నటి లలిత ఎంత ఆరిందా కబుర్లు నేర్చేసింది! తనముందర సిగ్గువిడిచి ఇన్నిమాటలు ఎలా మాటాడగలిగిందీ?

తన భవిష్యత్ జీవితంలో లలిత ఇప్పుడు ఎలా ముడిపడివుంది? ఆమె లేకుండా ఉండటం ఎంత కష్టం. ఎంత దుఃఖకరం? చిన్నప్పట్నుంచీ లలిత తమ కుటుంబంలో కలిసిపోయింది. కనకనే తలిదండ్రుల మధ్య, అన్నదమ్ముల మధ్య ఆమెకు ఎలాంటి స్థానమున్నదీ అతడెన్నడూ ఆలోచించనూ లేదు. ఆలోచించాల్సిన అవసరమూ కలగలేదు.

తన తలిదండ్రులు ఈ వివాహానికి సమ్మతించరు. కాబట్టి లలితను పొందటం కల్ల. ఆమె మరెవరికో దక్కుతుంది. అంచేతనే ప్రవాసానికి వెళ్ళే ముందురోజు



శాస్త్రి లలిత మెళ్లో బలవంతాన దండవేసి. ఈ దిగుళ్ళన్నీ వదిలించుకున్నాడు.

ప్రవాసంలో ఉండగా—గురుచరణుడు స్వధర్మాన్ని వదిలేసి పరధర్మాన్ని స్వీకరించాడని విని శేఖర్ ఎంతో వ్యాకులపడ్డాడు. అంతకంటె పెద్ద బెంగ—లలితను వదులుకోవాల్సి వస్తుందేమోనని. సుఖంలోగాని, దుఃఖంలోగాని అతడి ఆలోచన లెప్పుడూ లలితమీదికే ప్రసరించేవి.

ఇవాళ లలిత స్పష్టంగా చెప్పిన మాటలు అతడి ఆలోచనల్ని అరికట్టాయి. అప్పుడు లలిత తనకు దక్కదేమోనని బెంగ; ఇప్పుడు లలిత తనను వదలదేమోనని దిగులు!

* * *

శ్యాంబజార్ సంబంధం ఉత్తదయింది. అంత కట్నం ఇవ్వటానికి వాళ్లు వెనకాడారు. అదీగాక, శేఖర్ తల్లికి ఆ పిల్ల అంతగా నచ్చలేదుకూడా! కనుక శేఖర్ ఈ సంబంధంనుంచి తప్పించుకున్నాడు. కాని, నవీన్‌రాయ్ మాత్రం పదిహేను ఇరవై వేల కట్నంల సంగతి మరిచిపోలేదు. ఆ ప్రయత్నంనుంచి పూర్తిగా విరమించుకోను

లేదు.

ఏమిటీ చెయ్యడం?—ఇదే శేఖర్ ఆలోచన. ఆ రాత్రి తను చేసినపని ఇంతిదిగా పరిణమిస్తుందనీ, తనకి వివాహం అయిపోయినట్టే లలిత ఇంత విస్పంకోచంగా విశ్వసిస్తుందనీ, ధర్మపథాన్నిబట్టి చూస్తే ఏ కారణంవల్లా ఇది మారటానికి వీల్లేదనీ—ఈ విషయాలేవీ ఆనాడు శేఖర్ ఆలోచించి చూసుకోలేదు.

ఆ రోజున తనే తన నోటిమీదుగా అన్నాడగా—"అయిందేమో అయిపోయింది. ఇహ నువ్వూ తప్పించుకోలేవు. నేనూ తప్పించుకోలేను" అని?—అవన్నీ ఇవాళ ఆలోచనకు వచ్చాయి.

అప్పుడు పైన చందమామ విహరిస్తున్నాడు. పలుచైనపులా వెండువెన్నెల పుచ్చపువ్వులా వ్యాపించింది. మెళ్ళో దండ వేలాడుతోంది. ప్రియురాలి వక్షస్థలానికి తన హృదయాన్ని ఆనించి, ఆమె హృదయస్పందనలో తన తొలి అనుభవాన్ని పొంది ఆనందించాడు ఆ సమయంలో శేఖర్ స్వార్థపరుడే అనాలి. ఏమంటే?—సాంసారికమైన మంచిచెడుగు లతనికి గుర్తు రాలే. ధనలోభి అయిన తన తండ్రి రుద్రస్వరూపం అతడి కళ్ళకి పొడగట్టలే దప్పుడు.

లలితంటే తన తల్లికీ అపేక్ష. కనుక ఆమెని ఒప్పించటం ఏమంత కష్టం కాదనుకున్నాడు. అన్నద్వారా అయినా చెప్పించి తండ్రినీ మెత్తబరచ వచ్చునని కూడా ఆశించాడు. అదీగాక, గురుచరణుడు అప్పటికింకా ఇలా నాశనం కాలేదు. తన ఆశాపథానికి అడ్డుపడలేదు ఇప్పుడు చూడబోతే, ఆ విధాతే అడ్డుపడి కూర్చున్నాడు!

ఇహ ఇప్పుడు—

తండ్రిమాట అటుంచి, తల్లిని ఒప్పించటమూ అసాధ్యమే. అసలీ విషయం ఎత్తటానికే అవకాశం కనిపించటం లేదు. దీర్ఘంగా ఒక్కసారి నిట్టూర్చాడు శేఖర్. "ఏమిటీ చెయ్యటం?" అని అనుకుంటూ.

లలిత స్వభావం అతడికి బాగా తెలుసు. తనే ఆమె నింతదాన్ని చేశాడు. ఒకసారి ధర్మమని నమ్మినదానికి ఆమె ఎన్నడూ విరుద్ధంగా నడుచుకోదు. శేఖర్‌కి తను ధర్మపత్ని అని నమ్మింది. అంచేతనే ఇవాళ సాయంకాలం నిస్సంకోచంగా చీకట్లో వచ్చేసింది. దగ్గరగా జరిగి, గుండెమీద ముఖం పెట్టి అలా నిశ్చయించి మాటాడగలిగింది.

ఆమెని గిరీన్‌కిచ్చి చెయ్యాలని ప్రయత్నం జరుగుతున్నమాట వాస్తవమే. కాని లలిత ఒప్పుకునేట్టు ఎవ్వరూ చెయలేకుండా వున్నారు. ఇహ లలిత ఎంతమాత్రం ఊరుకోకపోవచ్చు. అంతా బైట పెట్టేస్తుంది.

శేఖర్‌కు కళ్ళూ ముఖమూ జేవురించినై. అనాడు తను ఆమె మెళ్లో దండవేసి

యాతే




అంతటితో ఊరుకోలేదు. ఆమెని తన హృదయంమీదకు చేర్చుకుని ముద్దుపెట్టుకున్నాడు కూడా. ఇందుకూ లలిత అభ్యంతరం పెట్టలేదు. ఏమీ? — ఇది తప్పు కాదనే ఉద్దేశంతోనా ఈ పని చెయ్యటానికి శేఖర్‌కు తగినంత అధికారముందనే భావంతో అడ్డుచెప్పలే. ఇప్పుడీ విషయంలో ఎవరైనా ప్రశ్నిస్తే, ఏమిటి జవాబివ్వటం?

తలిదండ్రుల కిష్టంలేకుండా వివాహం చేసుకోవడం అసంభవం. ఈమాట నిశ్చయం. కానైతే, గిరీష్‌ని లలిత చేసుకోక పోవటానికి కారణమేమిటో తీరా బైట పెడ్తే, ఇంటోగాని బయటగాని తనెల్లా తలఎత్తుకు తిరగటం — ఇటువంటి సందిగ్ధంలో పడ్డాడు శేఖర్.

# 10

మరి లాభం లేదుగనా అని లలిత ఆశ వొదులుకున్నాడు శేఖర్. మొదట్లో కొన్నాళ్లు మహా భయపడుతూ వచ్చాడు — మామూలు చనువుతో లలిత హఠాత్తుగా వచ్చి తన పక్కన కూచుంటుందేమోనని కొంపదీసి ఇద్దరి మధ్యన జరిగిన సంగతులేమన్నా బైట పెడుతుందేమోనని.

డాబా ఎక్కి చూస్తే లలిత కనబడుతుందేమోనని భయం కనుక అక్కడ ఇదే వాడేకాదు. ఈ మధ్య వారింటికీ వీరింటికీ రాకపోకలు సాగటంలే. ఏ పెదదా

లేకుండా ఒక నెల గడిచి పోయింది. ఇప్పుడనుకున్నాడు శేఖర్ తనలో: "ఏమయినా గానీ—ఆడ పిల్లకి సిగ్గూ బిడియం తప్పదు. కనుక ఇలాటి సంగతులేవీ బైట పెట్టలేరు:" అని.

ఈ భయం లేదని అనుకున్నాడు గాని, ఆక్షణంనించీ ఏదో తెలియని బాధ హృదయంలో ప్రవేశించింది—నిరాశ, శంక, వేదన, వీటితో ఎంచేతనో అతడు ఉడుకెత్తి పోతున్నాడు; ఇహ నెప్పుడూ లలిత ఈ విషయం వెల్లడించదా? తనని ఒక అయ్య చేతిలో పెట్టేంత వరకూ నోరు మెదపక ఊరుకుంటుందా? లలితకు పెళ్ళవటం, అ తారింటికెళ్ళడం తలుచుకుంటే సరి, శేఖర్‌కు మనస్సూ శరీరమూ దహించుకు పోతున్నది!

మామూల్లాగే ఇవాళ కూడా అతడు గదిముందు వరాండాలో పచార్లు చేస్తున్నాడు. కాని డాబామీద ఇంటోవాళ్ళెవ్వరూ కనిపించలే. ఒకనాడు మాత్రం అన్నా కాశీ ఎందుకో వచ్చింది కాని, శేఖర్ కనబడగానే దృష్టి అటు కేసి తిప్పుకుంది. పలకరింతా మనుకునేంతలో వెళ్ళి పోయింది.

మరో నెల్లాళ్ళ తరవాత ఒక రోజున మాటల సందర్భంలో భువనేశ్వరి అడిగింది, ఈ మధ్య నెప్పుడయినా లలితని చూశావుట్రా· రెణెల్లయింది దాన్ని చూసి, మొన్న డాబామీదకొస్తే పిలిచా. అదేమిటో, పిల్ల అదోరకంగా మారిపోయింది. ముఖంవాడి; వయస్సయి పోయిన దానిలా కనిపించింది...." అంటూంటే కళ్ళ నీళ్ళు తిరిగాయి ఆమెకు,

"మాసిపోయిన చీరెలు కడుతోందిప్పుడు. నేనేగా దాని కెప్పుడూ కావలసిన చీరెలివ్వటం? అయిదారు నెలలాయె, ఒక్క చీరయినా ఇచ్చి ఎరగను."

శేఖర్ అటువేపే చూస్తూ కూర్చున్నాడు.

"నన్ను తప్ప ఎవర్నీ ఏమీ అడగదురా. అలేస్తే నాతోనే చెబుతుంది నా వెంట వెంటే తిరుగుతుంది. దాని ముఖం చూడగానే నాకు తెలుస్తుంది గాని మరెవ్వరూ గ్రహించలేరు. అమ్మా అని నన్నూరికే పిలవటమే కాదు, తల్లిలాగే నన్ను ప్రేమించేది."

"సరేకాని అమ్మా! మరి, పిలిచి ఏం కావాలో అడిగి ఇవ్వలేక పోయావా?"

"ఎలా తీసుకుంటుందిరా అబ్బాయ్? వచ్చీ పోయే దారి కాస్త మూయించేస్తిమాయె. కష్టాల్లో ఉండి మరిది తెలిసో తెలియకో పొరపాటు చేశాడే అనుకో, అందుకని ఏకంగా వెలి వేసెయ్యటమే? ప్రాయశ్చిత్తం అదీ చేయించి మనవాళ్ళని మళ్ళీ కలుపుకోవటంలే? ఇంతకీ, వాళ్ళు అలా పీడించటం వల్లనే మతంలో కలిసి పోయాడు.

మనస్సుకి రోత కలిగితే, మనిషి ఏ పనయినా చేస్తాడు. వికానికి ఆయన మంచిపనే చేశాడంటా. నేను, మనందరికన్నా ఆ గిరీన్ ఆత్మీయుడై కష్టపెడుతున్నాడు. లలితని అతనికిచ్చి చేస్తే అదీ సుఖపడుతుంది. చెబుతున్నాగా; వచ్చే నెలలోనే అవుతుందట!"

"వచ్చే నెల్లోనే!" ఆశ్చర్యంగా అడిగాడు, శేఖర్.

"అలాగే విన్నా, వాళ్ళ మామ వంటోకూడా ఏం బాగుండటం లేదని చెప్పింది లలిత. ఎలావుంటుందిలే, మనశ్శాంతి ఎక్కడ? ఎప్పుడూ ఏడుపులూ పెడబొబ్బలూ వేసాయె!"

తల్లి వెళ్ళగానే, శేఖర్ మెల్లిగా వెళ్ళి పడుకున్నాడు. లలితని గురించే ఆలోచనలు పరిగెడుతున్నాయ్.

* * *

ఆఫీసునించి అప్పుడే వచ్చాడు శేఖర్, వాళ్ళ వీళ్ళ ఇళ్ళ మధ్య ఇరుకు సందులోంచి ఒక బండీ వచ్చింది. కనుక్కుంటే, గురుచరణుడింటికి డాక్టరొచ్చాడని తెలిసింది.

అన్నట్టు—గురుచరణుడికి వంటో సుస్తీగా ఉంటోందని అమ్మ చెప్పిందిగా! ఆ మాట జ్ఞాపక మొచ్చి ఎకాయెకి వాళ్ళ పడక గదిలోకి వెళ్లాడు, శేఖర్. గురుచరణుడు లేవలేని స్థితిలో వున్నాడు. లలితా, గిరీన్ విచార ముఖాలతో ఓ పక్కన కూచుని వున్నారు. ఎదర డాక్టర్ రోగిని పరీక్షిస్తున్నాడు.

అస్పష్ట స్వరంతో గురుచరణుడు శేఖర్‌ను కూర్చోమన్నాడు. లలిత తలమీది చెరగు ముందుకి లాక్కుని, ముఖం అటు తిప్పుకు కూర్చున్నది.

డాక్టర్ని శేఖర్ ఎరుగు, ప్రిస్క్రిప్షన్ రాసిచ్చి అతన్ని వెంటబెట్టుకు వచ్చి బయట కూర్చున్నాడు. వెనకాలే గిరీన్ వచ్చి, డాక్టర్‌కి ఫీజు చెల్లించాడు. "రోగం ఇంకా ముదరలేదు. గాలి మార్పుకోసం ఎక్కడికైనా తీసుకెళ్ళటం ముఖ్యం" అని చెప్పాడు. డాక్టర్

డాక్టర్ వెళిపోగానే గిరీన్, శేఖర్ ఇద్దరూ ఒక్కసారిగా గురుచరణుడి గదిలోకి వచ్చారు.

లలిత చేత్తో సైగచేసి, గిరీన్‌ను చాటుగా పిలిచింది, అతడితో ఏదో గుసగుసలాడింది, ఎదరకుర్చీలో శేఖర్ స్తబ్ధుగా కూచుని గురుచరణుడికేసి చూస్తున్నాడు. కాస్సేపయాక లేచి వెళ్లాడు, అప్పటికింకా లలితా, గిరీన్ గుసగుసలాడుతూనే వున్నారు. శేఖర్‌ను పిలిచి ఒక్కళ్లూ ఒక్క మాటయినా చెప్పలే.

ఇవాళ లలిత ఒక గొప్ప బాధ్యతనించి తనని శాశ్వతంగా విముక్తుణ్ని చేసిం దనుకున్నాడు శేఖర్. ఇహ నిశ్చయంగా నమ్మవచ్చు. సందేహంలేదు లలిత ఇంక తనని అంటి పెట్టుకుని ఉండదు.

గిరీన్ వాళ్ళకి పరమ ఆప్తుడన్న సంగతి ఇవాళ తను స్వయంగా చూసివచ్చాడు. వాళ్ళందరికీ ఆధారం. భవిష్యత్తులో లలితకు ఆశ్రయమూ ఇచ్చేవాడతడే. తనేం కాదు ఇలాంటి ఆపత్సమయంలోకూడా ఆమె ఒక్క సలహాకాని మరేంకాని తనని అడగదే లేదే!

శేఖర్ ఈజీచైర్లో కూలబడ్డాడు. ఎన్నో ఆలోచనలు దొర్లినై: లలితకు తను పరాయివాడై పోయినట్టేగా? తనని చూస్తూనే ముసుగు ముఖం మీదికి లాక్కొని అటుకేసి ఎందుకు తిరిగినట్టూ? దానిమాటకేం?—తన కళ్ళ ముందరే గిరీన్‌ని చాటుకి పిలిచి, ఎంతసేపెంతసేపు ఆ గుసగుసలు! లోగడ ఒకప్పుడు ఇతగాడి వెంటనేకదా నాటకానికి వెళతానంటే ఆమెను వెళ్లనివ్వలేదు. తను? బహుశా, తనతో వున్న రహస్య సంబంధం గుర్తు కొచ్చి ఆవేళ సిగ్గుపడిందేమో!

అంతలో గది బైటనించి తల్లి పిలుపు; "ఏరా! ఇంకా కాళ్ళూ చేతులూ కడు క్కోలేం?" శేఖర్ హడావిడిగా లేచి, గబగబా కిందికి వెళ్ళిపోయాడు.

నిజానికి తప్పెవరిది?—ఈ సంగతి ఇన్నాళ్ళనించీ శేఖర్ ఆలోచించనే లేక పోయాడు, ఇప్పటిదాకా లలితతో తను ఆశకొలిపే మాట ఒక్కటీ చెప్పనే లేదు. పోనీ అంటే, ఆమె తనని అడిగేందుకయినా అవకాశ మివ్వలేదు. ఈ సంగతి బైట పడితే తను ఎలాంటి బాధ్యత వహించాల్సి వస్తుందోనని ఒకవంక భయం. కనుక అన్నివిధాలా తప్పంతా లలిత నెత్తినే రుద్దటానికి ఉపాయాలు వెదుకు తున్నాడు. ఈ విధంగా కోపంతో, అభిమానంతో మనస్సు లోలోపల దహించుకు పోతూవుంది.

ఒక వారం రోజుల తరవాత—

ఇవాళ సాయంత్రం కూడా ఆతడలాగే తపించి పోతున్నాడు. చటుక్కున గది ముందు చప్పుడైంది. ముఖమెత్తి చూశాడు, హృదయం గతుక్కుమంది! కాళీ చెయ్యి పుచ్చుకుని లలిత గదిలోకి వచ్చింది. కింద పరిచివున్న కార్పెట్ మీద కూర్చుంది.

"శేఖర్ దా! మేమిద్దరం మీకు నమస్కరించటానికి వచ్చాం, రేపు ఊరికి వెళు తున్నాం!" అన్నది కాళీ.

మాటాడలే. చూస్తూ ఊరుకున్నాడు, శేఖర్.




"శేఖర్‌దా! మీ పాద సన్నిధిని మేమెన్నో తప్పులు చేసి వుంటాం. అవన్నీ మరిచిపో!" అన్నది కాళీ.

ఈ మాటల్లో ఒకటీ ఆమె స్వంతం కాదనీ, పాఠం నేర్చుకుని ఒప్ప జెప్తోందనీ గ్రహించాడు శేఖర్.

"రే పెక్కడికి వెళుతున్నారు మీరూ?"

"పశ్చిమ దేశం, నాన్నని తీసుకు ముంగేరు వెళుతున్నాం. అక్కడ గిరీన్ బాబుగారి ఇల్లుంది. నాన్నకి నయమయినా ఇహ మేం తిరిగి రాం. ఇక్కడి నీళ్లు నాన్నకి సరిపడలేదని డాక్టర్‌గారు చెప్పేశారు" అన్నది.

"ఇప్పుడెలా వుందేం?" అడిగాడు శేఖర్.

"కాస్త నయమే." అంటూ, ఓర చాదువించి కొత్త చీరెలు రెండు తీసి చూపించింది కాళీ. "ఇవిగో, పెద్దమ్మ మా క్కొవిచ్చింది!"

ఇప్పుడు మెల్లిగా లేచి లలిత టేబిల్ దగ్గరి కెళ్ళింది. తాళంచెవి టేబిల్‌మీద పెట్టి, "బీరువా తాళంచెవి ఇన్నాళ్లాయె నాదగ్గరే ఉండిపోయింది" అన్నది, చిరు నవ్వుతూ. "కాని, అందులో డబ్బుమాత్రం ఏం లేదు, అంతా ఖర్చయ్యిపోయింది!" అని చెప్పింది.

మాటాడలే శేఖర్.

"పద వొదినా, పొద్దు పోతూంది!" అన్నది కాళీ.

"కాళీ! కిందికెళ్లి రెండు కమలపాకులు తెచ్చిపెట్టమ్మా!" అన్నాడు శేఖర్, తడబడుతూ.

కాళీ చెయ్యి నొక్కిపట్టింది లలిత. "నువ్వుండే కాళీ. నే తెస్తానే!" అంటూ గబగబా దిగివెళ్లి, ఒక్క నిమిషంలో ఆకులు తెచ్చి కాళీ చేతికిచ్చింది. కాళీ శేఖర్ చేతి కిచ్చింది.

శేఖర్ తెల్లబోయి, అలా నే కూర్చున్నాడు.

"వెళుతున్నాం శేఖర్‌దా!" అంటూ, కాళీ దగ్గరసావచ్చి అతడి పాదాలకు నమస్కరించింది, లలిత కూర్చున్న చోటినుంచే నేలకు వంగి నమస్కరించింది. ఇద్దరూ లేచి బైటకు వెళ్లిపోయారు.

మతిపోయిన వాడిలా శేఖర్ అలానే కూర్చున్నాడు. లలిత వచ్చింది, చెప్పవలసిందేమో చెప్పి, సెలవు తీసుకు వెళిపోయింది. కాని శేఖర్ తనుమాత్రం మాటాడలేక పోయాడు. మాటాడ్డానికేమీ సంగతులు లేనట్టుగా ఆ కాస్సేపూ ఎలానో వెళ్ళబుచ్చాడు.

కావాలనే ఇవాళ లలిత కాళీని వెంటబెట్టుకొచ్చింది. అక్కడ జరిగిన విషయాలేవీ పైకి రాకూడదని లలిత ఉద్దేశం కాబోలునని శేఖర్ అనుకున్నాడు. తరవాత అతడికి ఒళ్ళంతా ఏమిటో లాగుతున్నట్టూ, తల తిరిగి పోతున్నట్టూ ఉంది. లేచి వెళ్లిపోయి పక్కమీద పడుకున్నాడు.

# 11

గాలి మార్పుకోసం ముంగేరు వెళ్ళినా, గురుచరణుడి ఆరోగ్యం బాగుపడలే. ఓ ఏడాదిపాటు తీసుకు తీసుకు దేహం చాలించాడు. గిరీన్ ఎంతో అభిమానంతో చివరి ఘడియదాకా ఉండి, చెయ్యగలిగిందంతా చేశాడు.

ఇహ పోతాడనగా ఆయన గిరీన్ చెయిపట్టుకుని, "మన స్నేహాన్ని బంధుత్వంగా చెయ్యాలి నువ్వు. నే నీ కళ్ళతో చూసి ఆనందించటానికి నోచుకోలేదు. పరలోకం నించైనా చూసి ఆనందిస్తా!" నంటూ బతిమాలి చెప్పాడు, గద్గద స్వరంతో.

గురుచరణుడింటో అద్దెకున్నవాళ్ళద్వారా భువనేశ్వరికి వీళ్ళ కబుర్లు తెలుస్తుండేవి. ఇప్పుడాయన పోయిన సంగతికూడా వాళ్ళవల్లనే తెలిసింది.

ఇది జరిగిన మరి కొద్దిరోజులకే నవీన్‌రాయ్ మరణించాడు. భువనేశ్వరికి ఈ కష్టంవల్ల పిచ్చెత్తినట్టయింది అంచేత సంసారమంతా పెద్దకోడలి కొప్పగించి. తను కాశీ వెళిపోయింది. వచ్చే ఏడు ఏర్పాట్లన్నీ చేసి కబురెడితే వచ్చి శేఖర్ పెళ్ళి జరి-




పించి వెళతానని చెప్పింది, వెళ్ళేముందు.

నవీన్‌రాయ్ స్థిరపరిచేవున్నాడు సంబంధం. ఆయన పోవడంతో ఏడాదివరకూ ఆగవలసి వచ్చింది, లేకపోతే ఈపాటి కయిపోవాల్సిందే.

పిల్ల తరపువారు ఇహ ఆగరు. నిన్ననే వచ్చి ముహూర్తం పెట్టుకు వెళ్లారు. ఈ నెల్లోనే పెళ్లి. ఇవాళ బయల్దేరి వెళ్లి, తల్లిని తీసుకువద్దామనుకుంటున్నాడు శేఖర్.

ప్రయాణంకోసం బీరువాలోంచి గుడ్డలూ అవీ తీసుకుని పెట్టెలో సర్దుకుంటూ వుంటే, చాలారోజుల కివాళ లలిత మళ్ళీ జ్ఞాపకమొచ్చింది. ఇదివరకీ పన్లన్నీ లలితే చేసిపెట్టేది. వాళ్ల పెళ్లి ఇప్పటికప్పుడే మూడేళ్ళు పైగా అయింది. వాళ్ళ సంగతులేవీ శేఖర్ తెలుసుకోనూ లేదు. తెలుసుకోవాలని అతడికి కుతూహలమూ లేదు.

ఈలోగా లలితమీద క్రమంగా అతడికో విధమయిన అసహ్యభావం ఏర్పడింది. కాని, ఇవాళెందుకో చటుక్కున ఆమె సంగతి తెలుసుకోవాలని బుద్ధిపుట్టింది.

లలిత ఖులాసాగానే ఉండివుంటుంది. గిరీశ్ స్థితిమంతుడేగా, కనుక ఏమీ లోటు చెయ్యడు. అయినా—పెళ్ళి ఎప్పుడయిందో ఆమెకు. అతడితో లలిత ఎలా వుంటూందో, తెలుసుకోవాలని ఒకవంక. వాళ్ళింటో అద్దెకున్నవాళ్ళు రెణ్ణెల్ల కిందటే ఖాళీచేసి వెళిపోయారు కనుక కబుర్లు తెలియటంలే.

పోనీ—చారుబాల తండ్రికి తెలుస్తుంటాయి వాళ్ళ భోగట్టాలు. పోయి కనుక్కుందామా అనిపించింది. సర్దుతున్న సామాన్లు అమట్టునే వొదిలేసి. ఈ ఆలోచనతో కిటికీలోంచి బైటికి చూస్తున్నాడు.

అంతలో దాసీది పిలిచింది—"చినబాబుగారూ! కాశీగారి అమ్మగారు మిమ్మల్ని రమ్మంటున్నారండి!"

ఆశ్చర్యంతో "ఏ కాశీగారి అమ్మో?"

గురుచరణుడి ఇంటికేసి చేత్తో చూపిస్తూ చెప్పింది: "మన కాశీగారి అమ్మే. చినబాబుగారూ! ఆరంతా వొచ్చేపిస్తను గదండీ. పూరివించి?"

"పద వొస్తున్నా!" అంటూ మేడదిగి వెళ్లాడు శేఖర్.

ఇంటో అడుగెట్టంగానే ఏడుపులూ, శోకాలూ. వితంతు రూపంలో వున్న గురుచరణుడి భార్యదగ్గరికెళ్ళి కింద కూర్చున్నాడు శేఖర్. కళ్లు తుడుచుకున్నాడు. ఈ పరామర్శలో ఆమె భర్త మరణం, తన తండ్రి మరణం రెండూ కలిసివున్నాయి.

పొద్దు గుంకింది. లలిత వచ్చి దీపం పెట్టింది. దూరంవించే అతడికి నమస్కరించి, ఒక్క నిమిషం నిలబడి మెల్లిగా వెళిపోయింది.

ఇప్పుడు లలిత పదిహేనేళ్ళ పరస్త్రీ, శేఖర్ దృష్టిలో. అత డామెకేసి కన్నెత్తి చూడనూలేదు, పలకరించనూ లేకపోయాడు. అయినా, ఓరకంట చూసి ఆమె చాలా చిక్కిపోయినట్టు మాత్రం కనిపెట్టాడు.

ఏడుపులూ పరామర్శలూ అయినాక గురుచరణుడి భార్య చెప్పింది—"నాయనా శేఖర్! ఈ ఇల్లమ్మేసి, ముంగేరు వెళ్లి, అక్కడే అల్లుడిదగ్గ రుండిపోదామనుంది. చాలాకాలంగా ఈ యిల్లు కొనాలని నాన్నగారికి ఉద్దేశముండేది కదా. కనక, ఏదో ధర కట్టి మీరే తీసుకుంటే, సొమ్ము సొమ్ములో కలిసింది కదా అని నాకు తృప్తి వుంటుంది. పైకి పోతుందేమోనని మీకూ మనస్సు కష్టంగా ఉండదు. మీరే తీసుకుంటే, మళ్ళీ ఎప్పుడయినా ఒహవేళ మేమొస్తే, రెండురోజులపాటు తల దాచుకునేందు కాస్కారముంటుంది...." అంటూ మనసు విడిచి తన ఉద్దేశం వెల్లడించింది.

"అమ్మతో చెప్పి చూస్తా, నేమంటుందో!" అన్నాడు శేఖర్.

"అయితే—అక్క ఈ మధ్య నెప్పుడూ రాదా యేం, శేఖర్?"

"ఇవాళ రాత్రికే వెళుతున్నా అమ్మని తీసుకురావటానికి" అని చెప్పాడు.

తరవాత మరెన్నో సంగతులూ విశేషాలూ తరిచి తరిచి అడిగిం దావిడ. శేఖర్ పెళ్లెప్పుడు, ఏవూరు సంబంధం, కట్నమెంత, నగలెన్ని?—ఇలాటి వివరాలన్నీ అడిగి తెలుసుకుంది.

వెళ్ళొస్తానన్నాడు శేఖర్, అప్పటికి వెన్నెల బాగా పైకి వచ్చింది. ఆ సమయంలో



మేడమీదినించి దిగి గిరీన్ వాళ్లక్కగారింటికి కాబోలు వెళ్ళాడు. గురుచరణుడి భార్య చూసి, "మా అల్లుణ్ణి ఎరుగుదువా శేఖర్? అతడితో ఎప్పుడయినా మాటాడావా, లేదా? చాలా మంచివాడు సుమా!" అన్నది.

అతడితో తనకి పరిచయముందని చెప్పి, గబగబా వెళిపోయాడు శేఖర్. కాని, బైట గది ముందరికి వచ్చేప్పటికి చటుక్కున ఆగిపోవాల్సి వచ్చింది. చీకట్లో తలుపు చాటున లలిత నిలబడివుంది:—

"ఇదుగో, మిమ్మల్నే! అమ్మని తీసుకురావటానికి ఇవాళే వెళుతున్నారా?"

'ఊఁ.'

"బాగా అధైర్యపడిపోయింది కామోసు!"

"పిచ్చెత్తిపోయినట్టే అయింది!"

"మీ వంటో కులాసాగా వుందా?"

"కులాసాగానే వుంది!" అంటూ తొందరగా వెళిపోయాడు, రోడ్డుమీదికి వచ్చాడు. శరీరం ఆపాదమస్తకం వొణికిపోయింది. లలితపక్కన నిలుచుంటే తన శరీరంకూడా

అపవిత్రమయిందా అనిపించింది.

తిరిగి ఇంటికి వచ్చాడు. ఎలానో పెట్టె సర్దేశాడు. రైలుకింకా టయిముంది. అందుకని మళ్లీ పడుకుని ఆలోచనల్లో పడ్డాడు—లలితంటే అసహ్యం ఎక్కువై పోయింది. మనస్సులో ఆమెపైన మండిపోతున్నాడు. ఆ మంటలో ఆమెను అనరాని మాటలన్నీ అని దూషించాడు. చివరికి లలితను "కులట" అని అనటానికూడా సంశయించలే.

మాటల సందర్భంలో అప్పుడు గురుచరణుడి భార్య ఇలా అన్నది—"నాయనా, శేఖర్!—ఇది సంతోషంతో చేసిన పెళ్లికాదు. చివరి క్షణందాకా జరుగుతుందని ఎవళ్లమూ అనుకోనేలేదు. లేకపోతే, అప్పుడు మిమ్మల్నందర్నీ పిలవమనే చెప్పింది లలిత." అని ఈ విషయం బైటపెట్టేప్పటికల్లా అసలే లలితపైన మండిపోతున్న స్పర్థ శేఖర్ కోపాగ్నిని మరింత ప్రజ్వలింపజేసింది.

# 12

క్రోశించి తల్లిని తీసుకువచ్చేశాడు శేఖర్. అప్పటికింకా అతడి పెళ్ళి పన్నెండు రోజులుంది. రెండురోజులు పోయాక—

శేఖర్ తల్లిదగ్గిర కూర్చుని లలిత ఏదో పనిచేస్తూంది. లలిత వచ్చిందని శేఖర్‌కు తెలీదు. అంచేత, ఏదో పనిమీద వచ్చి "అమ్మా!" అని పిలిచాడు. గదిలో అడు గెట్టడంతోనే తొట్రుపడి నిలబడిపోయాడు. తల వంచుకుని లలిత తన పని చూసుకుంటోంది.

"ఎందుకురా నాయనా?" అడిగింది తల్లి. వచ్చిన పని కాస్తా మరిచిపోయి. "ఏం లేదులే!" అంటూ వెళిపోయాడు. లలిత ముఖం అతడికి కనిపించలేదు గాని, దృష్టి మాత్రం ఆమె చేతుల పయిన పడింది. చేతులకి రెండు గాజులు తప్ప మరేం లేవు! మనస్సులో క్రూరంగా నవ్వుకున్నాడు. "ఇదో వేషం కాబోలు!" అనుకున్నాడు. గిరీన్ అంత గొప్ప స్థితిమంతుడు కదా, అటువంటి ఆయనకు గృహిణి అయిన లలిత చేతు లింత అలంకారశూన్యంగా ఉండడమేమిటీ అని! ఈ మాత్రం ఊహించుకోలేకపోయాడు, శేఖర్.

* * *

ఆ రోజు శేఖర్ గబగబ మేడమెట్లు దిగివస్తున్నాడు. ఆ మెట్లమీఁదనించే పైకి ఎక్కబోతున్నదల్లా లలిత కొంచెం పక్కకి తప్పుకు నిలబడింది. శేఖర్ దగ్గిరికి



తాగావే సంకోచిస్తూ మెల్లిగా అన్నది: "మీతో ఒకమాట చెప్పాల్సివుంది!"

ఆశ్చర్యంగా శేఖర్ "ఎవరితో! నాతోనా?"

"అవును—మీతోనే!"

"నాతో చెప్పేదేమిటుంటుంది?" అంటూ విసురుగా కింౕకి దిగివెళ్ళాడు.

కాస్సేపు అక్కడ అలానే నిలబడిపోయింది లలిత. చిన్నగా నిట్టూర్చి. మెల్లిగా వెళ్ళిపోయింది.

* * *

మర్నాడుదయం—

గదిలో కూర్చుని పత్రిక చూసుకుంటున్నాడు. శేఖర్. గిరీన్ వచ్చి నమస్కరించి. కుర్చీ లాక్కుని కూర్చున్నాడు. ఇద్దరికీ పరిచయమున్నది కాని, ఎన్నడూ ఇంతవరకు మాటాడుకుని ఎరగరు.

లాంఛనాలేం లేకండా గిరీన్ ఏకంగా తను వచ్చిన వ్యవహారంలోకి దిగాడు: "ఒక ముఖ్యమైన పనిమీద మీకు శ్రమ కలిగించటానికని వచ్చాను. మా అత్తగారి

ఉద్దేశం మీకు తెలిపిందే. వారిల్లు మీకే విక్రయించాలనుకున్నారు. ఆ సంగతే ఇప్పుడు నాతో చెప్పి పంపించారు. ఆ సంగతి ఎంత వేగిరం తేలిపోతే అంత త్వరలో ఆవిడని ముంగేరు తీసుకు వెళదామనుకుంటున్నా'' నన్నాడు.

గిరీన్‌ను చూడగానే శేఖర్ హృదయంలో తుఫాను రేగింది. ఈ మాటలేం అతనికి నచ్చలే "మంచి మాటే. కాని నాన్నగారు పోయినప్పట్నుంచీ యజమాన్లు మా అన్నగారే. కనక . ."

చిరునవ్వుతూ గిరీన్ అన్నాడు: "అదీ తెలుసు నాకు. కాని, వారితో మీరే చెబితే బాగుంటుందేమో?"

"అహ—మీరు చెప్పినా బాగానే వుంటుంది. వారి తరఫున ఇప్పుడు సంరక్షకులు మీరేగా?" అన్నాడు శేఖర్.

"నేనే చెప్పడం అవసరమయితే అలాగే చెబుతా. మీరు కాస్త శ్రద్ధ పెట్టారంటే పని చాలా సులుభంగా జరిగిపోతుందని చెల్లి చెప్పింది. విన్నను"

ఇప్పటివాకా శేఖర్ బాలీసుకి చేరగిలబడి మాటాడుతున్నవాడల్లా లేచికూచుని "ఎవరు చెప్పారూ?" అనడిగాడు..

"చెల్లాయ్ లలిత చెప్పింది" అన్నాడు గిరీన్.

మతి పోయినట్టయింది శేఖర్‌కు. గిరీన్ ఏం చెప్పాడో కూడా సరిగా చెవినిపడలే. ఒక్కక్షణం అతడి ముఖంకేసి చూస్తూ ఊరుకుని, అడిగాడు: "క్షమించండి గిరీన్ బాబుగారూ! మీరు లలితను పెళ్లి చేసుకోలే?"

నాలిక్కరుచుకున్నాడు గిరీన్. "చిత్తం, లేదు. వారినందర్నీ బాగా ఎరుగుదురుగా మీరు? కాని.... నేను...."

"కాని, అలా అనుకోలేదే మొదట్లో?"

"లేదు. అలా అనుకోలేదు. ఆ మాట నిజమే. గురుచరణ్‌బాబు మరణ సమయంలో నన్ను పిలిచి చెప్పారు: "నాయనా, గిరీన్! మన స్నేహం బంధుత్వంగా మారాలి సుమీ. ఇదే నా తుది కోరిక!" అని. పరేవని నేనూ మాట ఇచ్చాను. ఆయన పోయాక సంగతి సందర్భాలన్నీ నాకు విడమర్చి చెప్పింది చెల్లెలు లలిత. ఈ సంగతులన్నీ ఎవరూ ఎరగరుట. అయినా అంతకుముందే తనకి వివాహం అయిందట! ఇప్పుడు భర్త ఖులాసాగానే ఉన్నాట్టకూ ! ఈ మాటలెవరూ నమ్మకపోవచ్చు. కాని, చెల్లి ఏం చెప్పినా నాకు పూర్తి విశ్వాసముంది. అయినా—స్త్రీకి కదా పెళ్లి మాటే? ఓ—అదేమిటీ?" అన్నాడు, గిరీన్.

యా. శే.




శేఖర్‌కు నేత్రాలు రెండూ బాష్పాలతో నిండిపోయినై. ఆ బాష్పాలే గిరీన్ ఎదట ధారలుగా ప్రవహింపసాగినై. కాని, ఈ స్పృహ లేనేలేదు శేఖర్‌కు. ఒక పురుషుడి ఎదుట మరో వ్యక్తి దౌర్బల్యాన్ని వ్యక్తంచెయ్యటం సిగ్గుచేటు కదా, ఆ సంగతి కూడా స్ఫురించలేదు శేఖర్‌కు.

మాటాడక చూస్తున్నాడు గిరీన్. అతడి మనస్సులో ఇన్నాళ్ళనుంచీ సందేహం కద్దు. ఇవాళ స్పష్టంగా తెలిసిపోయింది. లలిత భర్త ఎవరో!—శేఖర్ కళ్ళు తుడుచుకుని అడిగాడు, "మీరు లలితని ప్రేమించలేదు?"

గిరీన్ మెల్లిగా సమాధానం చెప్పాడు—ఈ ప్రశ్నకు జవాబు అనవసరం. ఎంతటి ప్రేమ అయినా, తెలిసి తెలిసి ఒకరు పెళ్లాడిన స్త్రీని మరొకరు ఎన్నడయినా చేసుకుంటారా? పెద్దలు మీరు....మిమ్మల్ని నే విమర్శించ దలుచుకోలేదు" అని, నవ్వాడు. లేచి నిలబడి, "ఇప్పటికి సెలవ్, మళ్లీ కలుసుకుందాం!" అంటూ, నమస్కరించి వెళిపోయాడు.

* * *

గిరీన్‌ను శేఖర్ చాలారోజుల్నించీ ద్వేషిస్తున్నాడు. అది క్రమశః పరమానహ్యంగా పరిణమించింది. ఇవాళ అతడు వెళిపోగానే శేఖర్ లేచి, శిరస్సు నేలకాని చి, అపరిచితుడైన ఆ బ్రాహ్మణ యువకుణ్ణి ఉద్దేశించి నోసార్లు నమస్కరించాడు. నిశ్శబ్దంగా మానవుడు ఎంతటి స్వార్థత్యాగాన్ని చెయ్యగలడో, నవ్వుతూ ఎంతటి కఠోర

... ఇవాళ శేఖర్ మొదటిసారిగా చూడగలిగాడు.

* * *

అపరాహ్ణం. భువనేశ్వరి తన గదిలో కూచుని కొత్త బట్టలన్నీ ఎంచి, వరసగా బొత్తులుపెట్టి సర్దుతోంది. లలిత ఆవిడకి సాయం చేస్తోంది.

గదిలోకి వచ్చాడు శేఖర్. తల్లి మంచంమీదికి వెళ్ళి కూర్చున్నాడు. ఇవాళ అతడు లలితని చూడగానే గాభరా పడలే. తల్లి అడిగింది; "ఏమిట్రా అబ్బాయ్!"

"ఏం చేస్తున్నా వమ్మా?"

"ఎవరెవరికి ఏయే రకం బట్టలు పెట్టాలో ఎంచి లెక్కచూస్తున్నా. బహుశా మరి కొన్ని కావాల్సి వుంటుం దనుకుంటా, ఇవేం సరిపోయేట్టు లేదు—కాదు తల్లీ?"

"అవు" నన్నట్టు తల తిప్పింది లలిత.

శేఖర్ నవ్వుతూ, "ఒకావేళ నే పెళ్ళి చేసుకోకపోతే....?"

భువనేశ్వరి "ఆఁ—నువ్వెంతకయినా తగిన వాడివే! గుణాలకేం తక్కువ లేదు!" అన్నది నవ్వుతూ.

"ఇప్పుడు పరిస్థితులన్నీ అలాగే వచ్చాయి అమ్మా!"

"అవేం మాటల్రా, అలా అనకు!"

"ఇప్పటిదాకా మాటాడలే. నే నయినా. కాని ఇహ మాటాడకుండా ఉండటానికి వీల్లేదు. ఇహ ఊరుకుంటే మహాపాపం చుట్టుకుంటుంది."

ఈ మాటల్లో అంతర్యం గ్రహించలేక, చూస్తూ ఊరుకుంది భువనేశ్వరి.

"అమ్మా! ఈ బిడ్డడి తప్పులు ఇంతవరకూ ఎన్నో క్షమిస్తూ వచ్చావ్ నువ్వు. నేను నిజంగానే చేసుకోను," అన్నాడు శేఖర్.

కొడుకు మాటల తీరూ, అముఖ కవళికా చూసి భువనేశ్వరికి ఉద్రేకం కలిగింది. కాని, మభ్యపరచుకుంది. "సరే, అలాగేలే, నన్నిట్టె వేధించక, నువ్విక్కణ్నుంచి వెళ్ళు. నాకూ బోలెడన్ని పనులున్నాయి...." అన్నది.

"నిజం చెబుతున్నానమ్మా! ఆ పెళ్ళి నే చేసుకోను," అన్నాడు శేఖర్.

"ఎందుకని? ఇదేం ఆటలనుకున్నావా యేం?"

"ఆట కాదు, అందుకనే చెబుతున్నా!"

ఈ మాటు నిజంగానే భయపడింది భువనేశ్వరి రోషంతో "ఏం జరిగిందేం. తెలిసేట్టు చెప్పు. ఈ డొంకతిరుగుడు మాటలేం నా దగ్గిర పనికి రావు." అన్నది.

"చెబుతాలే అమ్మా. మరోనాడు. అప్పుడు నిందవు గానీలే...." అన్నాడు



మెల్లిగా.

"మరో రోజు నేమిట్రా?" అంటూ, ఆ కొత్త బట్టలన్నీ ఓ పక్కకి నెట్టింది. "అయితే. ఇవాళే నన్ను కాశీకి పంపించెయ్. ఇలాంటి సంసారంలో క్షణంకూడా ఉండలేన్నాయనా!"

తల వంచుక్కూచున్నాడు శేఖర్.

భువనేశ్వరికి మనస్సు స్థిరంగా లేదు. "లలితకూడా నాతో వస్తానంటూంది రేపు. దాని ప్రయాణానిక్కూడా ఏర్పాటు చెయ్!"

శేఖర్ నవ్వుతూ, "నీ వెంట వస్తుంటే వేరే ఏర్పాట్లెందుకు అమ్మా! నీ ఆజ్ఞ కంటె మించిందేముంది దానికి?"

నవ్వుతున్న కొడుకు ముఖం చూసింది భువనేశ్వరి. ఒకసారి లలితకేసి చూసి, "విన్నావా తల్లీ! వాడి మాటలూ ఉద్దేశాలున్నూ? నా ఇష్టముంటే నిన్ను యెక్కడి కయినా సులువుగా తీసుకెళ్ళగలనుట. మీ అత్తని అడగక్కర్లే?"

జవాబు చెప్పలే లలిత. శేఖర్ ధోరణికి లలిత భయపడింది.

ఇష్టం మీద ఆధారపడివుంది. ఏమయినా కానీ. నువ్వెలా అంటే అలా జరిగే తీరుతుంది తల్లీ! ఈ సంగతి నాకూ తెలుసు. నువ్వు వెంట తీసుకువెళతానంటున్న అమ్మాయికీ తెలుసు. మరి, ఆమె నీ కోడలే కదుటమ్మా!"

చకితురాలయింది భువనేశ్వరి. తల్లితో హాస్యాలా. ఏమిటీ మాటలూ? "ఏమిట్రా అన్నావ్? అది నాకేమవుతుందనీ అంటున్నావ్?" అనడిగింది. ఆత్రంతో.

ముఖం పైకెత్తలేదు గాని, సమాధానం మటుకు చెప్పాడు శేఖర్: "అదే— చెప్పాను కదు అమ్మా! ఇవాల్టి సంగతి కాదిది. నాలుగేళ్ళనాడే జరిగింది. అది నీ కోడలే నిజంగా. ఇహ నే నింకేం చెప్పలేను. దాన్నే అడుగు, అదే చెబుతుంది." అని చూసేసరికల్లా లలిత భువనేశ్వరికి నమస్కరించబోతూంది లలితపక్కనే వచ్చి నించునాడు శేఖర్. ఇద్దరూ కలిసి ఆమెకు పాదాభివందనం చేశారు.

భువనేశ్వరి కళ్లనుండి ఆనందాశ్రువులు జలజల రాలాయ్ ఆమెకు లలితంటే ఎంత ప్రేమో!—నగలపెట్టె తెచ్చి. అందులోంచి ఒక్కొక్కటే తీసి లలితకి అలంకరిస్తూ—ఒక్కొక్కటే సంగతులన్నీ మెల్లిగా అడిగి తెలుసుకుంది. అంతా విన్నాక. "అందుకనేనా తల్లీ. గిరీన్ కాశీవి చేసుకున్నదీ?" అనడిగింది.

"ఊఁ—అందుకనే అమ్మా!—గిరీన్‌బాబులాంటి మనుషులు లోకంలో ఉంటారో ఉండరో నే చెప్పలేను. కాని ఆయన నన్ను పూర్తిగా నమ్మేశాడు. నే నాయనతో ఇలా చెప్పాను: "నిజంగానే నాకు పెళ్ళయిందనీ. నా భర్త నన్నేలుకోనీ. ఏలుకోకపోనీ. అదంతా వారిష్టం. కాని. ఆయన ఇప్పుడు ఖులాసాగానే వున్నారు" అని చెప్పేసరికి నా మాటలు పూర్తిగా విశ్వసించారాయన." అన్నది లలిత.

నవ్వింది భువనేశ్వరి. లలిత తల నిమురుతూ చెప్పింది—"అలాంటివాళ్ళుండక పోవడమేమిటి తల్లీ! జన్మజన్మాలకూ సుఖంగా ఉండాలనీ ఆశీర్వదిస్తున్నా. కాస్సేపు ఇక్కడ కూర్చోమ్మా! నే వెళ్ళి. పెళ్లికూతురు మారిందని మా పెద్దవాడితో చెప్పి వస్తా!" నంటూ అవినాశుడి గదివేపు వెళ్ళింది భువనేశ్వరి.






"తారక్ !— మా అమ్మని నేనెరగను. ఆమెను నే నెన్నడూ చూసి వుండలేదు. అయితే— మా అమ్మ స్థానంలో నేను కొత్తమ్మనే ఎరుగుదును. కొత్తమ్మే నాకు తల్లి. ఆమె భర్త వ్రజబిహారిబాబే నాకు పితృసమానుడు.

వ్రజబిహారిబాబు జమీందారు. ఆయన రెండవ భార్య కొత్తమ్మ. అసలు పేరు సవిత. ఆవిడ ఆ యింటికి కొత్తకోడలే అయినా అధికారం అంతా ఆమెదే. ఆమెను వ్రజబాబు 'కొత్తకోడలూ' అని పిలుస్తాడు. నేనేమో 'కొత్తమ్మ' అని పిలుస్తాను. ఆమె నన్ను 'రాజూ' అని ముద్దుగా పిలుస్తుంది.

తల్లీ తండ్రీ పోయి అనాధగా వున్న నన్ను జమీందారుగారి ముసలి గుమాస్తా కొత్తమ్మ దగ్గరికి తీసుకువెళ్లాడు. 'చిన్నమ్మా!–ఈ అబ్బాయి బ్రాహ్మల పిల్లవాడు. పేరు రాఘాల్ రాజు! మొన్ననే తండ్రిపోయాడు. వీడికి తల్లీ, తండ్రీ— తోడూ

సీదా అన్నీ కూడా మీరే. మీ భిక్షకోసం వచ్చాడు, అని నన్ను పరిచయం చేశాడు.

"సరే, అయితే మరి రాజూ!- నాతో వచ్చేస్తావా? మా అత్తారింటికి తీసి కెళతాను నిన్ను. అక్కడ మంచి స్కూలుంది, కాలేజీ వుంది. నీకేం కావాలన్నా దొరుకుతాయి. వస్తావా మరి?-" అని అడిగింది కొత్తమ్మ.

అదే కొత్తమ్మతో నా పరిచయం.

ఆయింట్లో అత్తమామల పోరు, ఆడబిడ్డల హోరు లేవు. అయితే - వచ్చే బంధుమిత్రులూ నాలాంటి ఆశ్రితులూ ఇంటినిండా బిలబిలమంటూ వుంటారు. ఇంత కలిగిన ఇల్లు, దానికితోడు కొత్తమ్మ చెయ్యి చిన్నచెయ్యేం కాదు.

ఆమె భర్త వ్రజబాబు కూడా తలనెరిసి వృద్ధాప్యంలో పడ్డా అంతా చిన్న పిల్లాడివాటం. అన్నీ కొత్తమ్మే చేయాలి, ఆమె చేతులమీదుగానే జరగాలంటాడు. నన్ను తన కడుపున పుట్టిన బిడ్డలాగ చూసుకుంటాడు.

ఆయనకు భూములూ పుట్రలూ, తోటలూ దొడ్లూ, రెండు మూడు తాలూ కాల్లో వ్యవసాయం, కలకత్తాలో పెద్ద వ్యాపారం వున్నాయి. ఇన్ని కామాటా లున్నా రోజులో సగం జపతపాలూ, పూజాపునస్కారాలతో గడిచి పోతుంది.

నన్ను స్కూల్లో చేర్పించారు. రెండు మూడు జతల కొత్తబట్టలూ, చెప్పులూ కుట్టించారు, పుస్తకాలు, పెన్సిళ్ళూ కొన్నారు, ఇంటో ప్రయివేటు మేష్టర్ని ఏర్పాటు చేశారు. నే నాయింటికి ఎలా వచ్చానన్న సంగతే మరిచిపోయి అంతా నన్ను ముద్దుగా పెంచారు. నేనూ ఇంటో పుట్టిన బిడ్డకంటే ఎక్కువగా ప్రవర్తించాను.

రోజులు గడుస్తున్నాయి. స్కూలు వదిలి కాలేజీలో అడుగు పెట్టాను. అప్పట్లో జరిగిందా సంఘటన. నే నెన్నటికే మరిచిపోలేను. తలచుకున్న పుడల్లా కళ్ళకి కట్టినట్టే అనిపిస్తుంది," అని రాఘాల్ తారక్‌నాథ్‌తో చెప్పాడు.

"ఏమిటది రాఘాల్‌బాబూ ... ఏమిటదీ?——" ఆత్రంగా అడిగాడు తారక్ నాథ్.

* * * *

కొత్తమ్మ వెళ్ళిపోయిన తరవాత కూడా ఆ మహల్‌లో— రాఘాల్ పదేళ్ళ పాటున్నాడు. రానురాను ఇంట్లో అజమాయిషీ చేసేవాళ్ళు ఎక్కువయ్యారు. అను కున్నందుకు చదువు సంధ్యలు పూర్తి అయినాయి. ఇహ ఆ ఆవరణలో ఉండ లేకపోయాడు రాఘాల్.



ఇప్పుడు లోకంలో ఒంటరిగానే జీవిస్తున్నాడు. 'పటల్‌డాంగా'లో ఒక ఇల్లు అద్దెకితీసుకుని వుంటున్నాడు. ఉదయంపూట పిల్లలకు పాఠాలు చెప్పడం, తక్కిన సమయంలో సాహిత్య సభలు, సమావేశాల్లో పాల్గొనటం.

అతని స్నేహితుడు తారక్‌భట్టాచార్య. చదువు పూర్తికాగానే నౌకరీకోసం తెగ తిరిగాడు. చివరికి వర్ధమాన జిల్లాలో హైస్కూలు హెడ్మాస్టరుగా దొరికింది. రేపు తెల్లవారుఝామునే ప్రయాణం.

'మనిద్దరమూ బతికుంటే మళ్ళీ దసరా సెలవల్లో కలుసుకుందాం. నా కిప్పుడో ఇరవై రూపాయలు కావాలి' అంటూ తనవేపు చూసి వేలి ఉంగరంతీసి డ్రాయరుమీద పెట్టాడు తారక్‌నాథ్.

'ఈ ఉంగరం నాకు తాకట్టాః-' అన్నాడు రాఘాల్.

'తాకట్టు ప్రసక్తి ఎందుకు. దీన్ని అమ్మినా పది రూకలు రావే. ఊరికే నా జ్ఞాపకంకోసం నీదగ్గరుంచుకో' అంటూ ఉంగరాన్ని రాఘాల్ వేలికి తనే స్వయంగా పెట్టాడు.

'అయితే నువ్వెళ్ళటం ఖాయమే నన్నమాటః-'

స్నేహితు లిద్దరూ విడిపోవటానికి కొన్ని గంటలముందు అన్యోన్యంగా మాట్లాడుకుంటున్న ఆ సమయంలో - అద్దంలో ఒక ప్రతిబింబం కనబడింది అ ప్రతిబింబం ఒక స్త్రీది. దబ్బపండులాంటి రంగు, సన్నని శరీరం, చక్కని

చీరె, మితంగా నగలూ, నుదుట తిలకం—. ఇద్దరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. రాఘూల్ ఆమెను చూస్తూనే ఆశ్చర్యపోయాడు.

ఆమె ఎవరోకాదు. కొత్తమ్మ...!

వెంటనే పాదాలు స్పృశించి నమస్కరించాడు రాఘూల్! అతన్ని ఆప్యాయంగా చేరదీసుకుంది. తారక్‌నాథున్ని పరిచయం చేశాడు కొత్తమ్మకి రాఘూల్.

"రాజూ! నాయనా!!— నువ్విప్పుడా యింటివేపే వెళ్లటంలేదా?'' అన్నది కొత్తమ్మ.

"వెళ్తూంటానమ్మా, పదీ పదిహేను రోజులకోసారి" అన్నాడు రాఘూల్.

"మన రేణుకు పెళ్లిట కదూ!" మళ్ళీ అంది కొత్తమ్మ.

"రేణుకా?— పెళ్లా?— నా కాసంగతే తెలియదే!" ఆశ్చర్యపోయాడు రాఘూల్ ఈ కొత్తవిషయం వింటూనే.

రేణు కొత్తమ్మ కూతురు. రాఘూల్ రేణుని తోడబుట్టిన చెల్లెలికంటె ఎక్కువ ప్రేమగా చూసుకుంటాడు. ఆ గడప దాటివచ్చిన క్షణంనుంచీ ఆ తల్లీకూతుళ్ల బంధం తెగిపోయింది. వెర్రిపిల్ల ఎలావుందో ఏమిటో:—

"నిజమేట నాయనా! ఇవాళ పొద్దున్న పదింటికి పెళ్ళికూతుర్ని చేశారట కూడా. రాజూ!— ఇందుకోసమే నేను పనిగట్టుకు మరీ వచ్చాను. నీవల్ల ఈ ఉపకారం తప్పక జరిగితీరాలి!..."

"ఏమిటి కొత్తమ్మా? నువ్వనేది, రేణు పెళ్లా?" అంటూ సగంలో ఆపాడు రాఘూల్.

"రేణు పెళ్ళి జరక్కూడదు, ముమ్మాటికీ జరగకూడదు. వెంటనే వెళ్ళి పెళ్ళి ఆపితీరాలి" అన్నది కొత్తమ్మ.

'ఎందుకమ్మా?' ఆశ్చర్యంగా అడిగాడు రాఘూల్.

"నే చెప్పేది పూర్తిగా విను రాజూ!— రేణుకు కాబోయే అత్తారింట్లో అందరికీ పిచ్చే. పిల్లవాడు అందంగా వుంటాడు. చదువు, డబ్బూ వున్నాయి. అయితే — మీ నాన్నగారి సంగతి తెలియందేముంది?— ఎవరేం చెప్పినా ఇట్టే నమ్మేస్తారు. పిల్లవాడి తలిదండ్రుల్లాగా పిల్ల తలిదండ్రులేం పిచ్చివాళ్లు కారు, చూస్తూ చూస్తూ కన్నకూతుర్ని గంగలో తొయ్యటానికి."

"మరి రేణుని పెళ్లికూతుర్ని చేశారని కూడా అంటున్నావు కదమ్మా?" అన్నాడు రాఘూల్ ఆత్రంగా.

"ఆవున్నాయనా, అయినా సరే - నా బిడ్డకు అన్యాయం జరక్కూడదు. రాజూ!- నువ్వు ప్రయత్నంచేస్తే పెళ్ళి తప్పకుండా ఆగిపోతుంది. ఎలాగైనా నువ్వు "బాగ్ బజార్" వెళ్ళి రావాలి. ఆ వీధిలోనే పెళ్లికొడుకు మేనమామా, వాళ్లూ ఉన్నారట. పెళ్ళికూతురి తల్లి లేచిపోయిందని చెప్పు. ఈ ఒక్క అస్త్రం చాలు. ఒకవేళ అలా జరక్కపోతే-ఇంకో మార్గం ఆలోచిద్దాం. నేను మళ్లీ రాత్రి పదకొండుగంటల కొస్తాను." అంది కొత్తమ్మ.

"అమ్మా!- ఇవాళ మనం ఈ పనిచేసి పెళ్లి చెడగొట్టామే అనుకో, మరి రేపు మళ్ళీ రేణుకి పెళ్లికావటమెలాగ?- ఇంటి గుట్టూ, కులంలో కుళ్ళూ వీధిన పెట్టుకుంటామా?-" సలహా ఇస్తున్నట్లుగా అన్నాడు రాఘూల్.

"మరేం ఫరవాలేదు రాజూ!- తారక్, నీమీద నాకేం అధికారం లేక పోయినా, మీ స్నేహం విని చనువుతీసుకొని అడుగుతున్నాను. నువ్వు కూడా నా మాటవిని రెండ్రోజులపాటు ఇక్కడ వుండాలి" అంటూ జవాబుక్కూడా ఎదురు చూడకుండా వెళ్లిపోయింది కొత్తమ్మ.

ఆనాటి సంఘటనను గురించి రాఘూల్ తారక్‌నాథ్‌తో ఇలా చెప్పుకు పోతున్నాడు:-

"ఆ రోజుల్లో వ్రజబాబు కుంటుంబానికి కావలసిన ఒకాయన తరచుగా వాళ్ళింటికి వస్తూండేవాడు. ఆయన పేరు రమణిబాబు. రమణిబాబు అక్కడికి వచ్చినప్పుడల్లా మర్యాదలు ఘనంగా జరిగేవి.

కొత్తమ్మకీ రమణిబాబుకీ ఏదో చుట్టరికం. కాని, వాళ్ల స్నేహాన్నీ చనువునూ గురించి తక్కిన ఆడవాళ్ళు చెవులు కొరుక్కోవటం ప్రారంభించారు. అయితే ఈ గుసగుసలు వ్రజబిహారిబాబు చెవుల్లో పడకపోలే.

ఉన్నట్టుండి ఒకనాడు అర్ధరాత్రి బ్రహ్మాండమయిన వింత జరిగింది. వరండాలో ఐదారు లాంతర్లున్నాయి. ఒకవేపు అంతా ఆత్రంగా చూస్తున్నారు. మరొకపక్క వ్రజబాబు తలొంచుకుని నిశ్శబ్దంగా కూచున్నాడు. వ్రజబాబు పినతండ్రి కొడుకు నవీనబాబు తలుపు గుద్దుతూ "రమణిబాబూ!- తలుపు తియ్ - గది మేం సోదా చెయ్యాలి" అని అరుస్తున్నాడు.

తలుపులు తెరచుకున్నాయి. కొత్తమ్మ! రమణిబాబు చెయ్యి పుచ్చుకుని కొత్తమ్మ - బయటికొచ్చింది. చుట్టూ అంతా వేటకుక్కల్లా కాచుకునివున్నారు.

కొత్తమ్మే అంది, "మీ కెవ్వరికీ ఏమాత్రం శ్రమ అక్కర్లేదు. మీరు తొందరపడి నన్నేమీ అనవలసిన పనిలేదు. రమణిబాబూ, నేనూ ఇదిగో ఇప్పుడే ఈ యింటినుంచి వెళ్ళిపోతున్నాం."

ఈ మాటలు పిడుగుపాటుగా వినబడ్డాయి. కొత్తమ్మకి తలవంపులు తెద్దామని కుట్రపన్నిన ఇంటిల్లిపాదీ సిగ్గుతో తలలు వాల్చేశారు.

కొత్తమ్మ, రమణిబాబు వాళ్ళ వెనకాల మరొకళ్ళు గుమ్మం దాటారు. వ్రజబాబు దుఃఖం, అవమానం, ప్రేమా, వాత్సల్యం, కోపం, అహంకారం, భయం – అన్నీ పెల్లుబికి నిశ్చేష్టుడైపోయాడు. కాస్సేపటికి తేరుకుని 'రేపు నీ రేణుకి ఏం సమాధానం చెప్పను కొత్తకోడలూ' అని వాపోయాడు.

*　　　*　　　*　　　*

సవిత ఇల్లు విడిచిపెట్టేసింది. ఆ యింట్లోవాళ్ళని వదిలేసింది కానీ, ఆ యింట్లో ప్రతి అణువు చుట్టూ ఆ లోగిలిలో వుండే ప్రతి వ్యక్తి చుట్టూ ఆమె అల్లుకున్న ఆశాపాశాలు మాత్రం ఆమెను వదల్లేదు. ఆ యింట్లో అందర్నీ, ముఖ్యంగా రేణుని ఒక కంట కనిపెట్టేవుంది.

వ్రజబిహారిబాబు కలకత్తా వచ్చేశాడు. మళ్ళీ పెళ్ళిచేసుకుని అక్కడే వుండి పోయాడు. వ్రజబాబుకి మేనత్త ఒకామె వుంది. ఆవిడకి కూడా నన్ను చూస్తే కిట్టదు. 'ఎప్పుడు విరగడయిపోతాడో, ఎప్పుడు తెరిపిన పడతామో' అని నాకు వినబడేట్టుగా ఆడిపోసేది."

రానురాను మేనత్త హయాం మితిమీరిపోయింది. ఇల్లు ఇల్లులా లేదు. అలాగే పదేళ్ళు నెట్టాడు రాఘూల్. మరి వుండలేకపోయి బయటపడ్డాడు.

వ్రజబాబు మూడోభార్యకి పెద్దన్న ఒకడున్నాడు. వ్రజబాబు ఇంటి మంచి చెడ్డలన్నీ ఆయన చూడాల్సింది. వ్రజబాబు మేనత్త అయినా ఫరవాలేదు కాని, ఈ బావమరిది చూపులకు అసలు తట్టుకోలేకపోయాడు, రాఘూల్.

ఇప్పుడు రేణుకి ఈ సంబంధం తీసుకువచ్చింది కూడా వ్రజబాబు బావ మరిదే.

## 3

కొత్తమ్మ చెప్పిన ప్రకారం రాఘూల్ జమీందారుగారింటికి వెళ్ళాడు.

"మేమింకా గుర్తున్నామటయ్యా రాఘూల్?" అడిగింది జమీందారుగారి భార్య.

'అన్నయ్య నన్నసలే మరిచిపోయాడు' అని నిష్ఠురంవేసింది రేణు.



సమయానికి జమీందారు ఇంట్లో లేడు. వచ్చిన పని కాలేదు.

"నాన్నగారితో నేను వచ్చి వెళ్ళానని చెప్పు. చాలా అర్జంటు పనిమీద వచ్చాను. మళ్ళీ రేపు సాయంకాలం వస్తాను" అని చెప్పి రాఘాల్ వెళ్ళి పోయాడు.

రాఘాల్ ఇంటికి వచ్చేసరికి తలుపు గొళ్ళెంలో ఒక చీటీవుంది. "మళ్ళీ రేపు సాయంకాలం వస్తాను" అని. ఆ చీటీ కొత్తమ్మ రాసి పెట్టింది,

సరిగ్గా సమయమయింది.

టీనీళ్ళు కాచుకుంటూ రాఘూలూ, తారక్ కొత్తమ్మకోసం ఎదురుచూస్తున్నారు. రానే వచ్చింది కొత్తమ్మ. ఎన్నెన్నో విశేషాలు అడిగింది, విన్నది. రేణుని గురించి మరిమరి చెప్పించుకు విన్నది.

"మాటల్లో పడ్డాం. నువ్వక్కడికి వెళ్ళే వేళయిందేమో నాయనా" అని తొందర పెట్టింది కొత్తమ్మ.

ఈలోగా 'రాజుబాబు ఇల్లిదేనా? – అని అడుగుతూ ఎవరో వెతుక్కుంటూ వచ్చారు. రాఘుల్‌రాజు ఆయనకి ఎదురెళ్ళాడు. ఆయన ఎవరు? ఎవరో కాదు–వ్రజబాబు –

అందర్నీ గబగబ పలకరించాడు వ్రజబాబు. కొత్తమ్మతో ఎంతో ఆప్యాయంగా మాట్లాడాడు.

ఇంకా ఆయన రేణుకి కుదిరిన సంబంధం గురించి సదభిప్రాయంతోనే వున్నాడు "పిల్లవాడికి అందచందాలున్నాయి, ఆరోగ్యముంది, బాగా తెలిసిన సంబంధం. దేనికీ లోటులేదు. కొత్తకోడలూ!– నువూ ఒకసారి అల్లుణ్ణి చూస్తే చూడు. నిన్న రాఘూల్ వచ్చాట్ట, నాకోసం, రేణు చెప్పింది. సమయానికి నేనింటో లేకుండాపోయాను. అవతల పెళ్ళిపనులూ అవీ సందడించుకోవాలా!– మరి. మన రాఘూలయితే అన్నీ చూసుకుంటాడు. వాణ్ని తీసికెళదామనే ఇప్పుడు స్వయంగా వచ్చా నేను." అన్నాడాయన రెండు చేతులతో గోవిందుడికి నమస్కారం చేసుకుంటూ.

"నాయనా రాజూ, అసలు సంగతి మీ నాన్నగారికి చెప్పు బాబూ" అంది కొత్తమ్మ.

రాఘూల్ గొంతు సవరించుకొని "నాన్నగారూ!– రేణుకి ఈ సంబంధం చెయ్యకండి" అన్నాడు.

ఆశ్చర్యపోయాడు వ్రజబాబు.

"ఏం నాయనా. ఏవిటీ అసలు సంగతి?"

"అవన్నీ కొత్తమ్మనే అడగండి."

"ఏవిటది కొత్త కోడలూ?– పిల్లన్ని ఖాయం చేసుకోవటం, తాంబూలాలు పుచ్చుకోవటం అన్నీ అయిపోయాయే. ఇప్పుడిలా అంటే ఎలాగా? మనకున్నది ఒక్కరోజు వ్యవధి. ఈ ఒక్కరోజులో మరో పెళ్ళికొడుకు ఎక్కడ దొరుకుతాడు?"– అడిగాడాయన ఖంగారుగా.

కొత్తమ్మ నెమ్మదిగానే సలహా చెప్పింది. "ఈ సంబంధం మీరుగా ఏమీ ఖాయం చెయ్యలేదుగా!— ఎవళ్ళయితే నిర్ణయించారో వాళ్ళనే మరో సంబంధం చూడమంటే సరి."

'ఆజ్ఞాపించటం నాకు చేతకాదని నీకు తెలీదా కొత్తకోడలా? నువ్వెప్పుడయినా నా మాట విన్నావా, ఈనాడు వాళ్ళు వింటారా?''—

సవిత తలవంచుకునే అంది, "రేణుకి తల్లిని, నేను దానికి లేకపోయినా తండ్రి మీరున్నారుగా?—మీ కొత్త బావమరిది రేణుని ఓ పిచ్చివాడి చేతుల్లో పెడుతూవుంటే చూస్తూ ఊరుకుంటారా"—అని కాస్త కటువుగానే అడిగింది.

"నువ్వే కనక ఆ యింట్లో వుండివుంటే, నాకీ పరిస్థితి ఏర్పడేది కాదు కొత్తకోడలూ, సరి. నీకిష్టం లేనప్పుడు ఆ పెళ్లింక జరగదులే. కాని – రేణుకి ఎక్కడో ఒకచోట వరుడ్ని చూసి పెళ్ళి చెయ్యాలికదా? – నాయనా రాజా!– నీకు చాలామంది తెలుసుకదా. పోనీ తగిన సంబంధం ఏదేనా వుంటే చూడలేవూ?"—

కొత్తకోడలికి ధైర్యం చిక్కింది. "రేణుక మీ పిల్ల. మీ కిష్టమయినచోట మీకు నచ్చిన సంబంధం చేస్తారు. ఇందులో కాదు కూడదనడానికి హేమంత బాబు పెత్తనం ఏమిటి?—ఒకవేళ అతను అడ్డుతగిలినా మీకేమిటి భయం?"

మధ్యలో రాఘూల్, "నీకేం తెలీదమ్మా, ఇప్పుడాయింటికి మామయ్యే యజమాని. వాళ్లమ్మే సర్వాధికారిణి," అని ఉన్న సంగతి చెప్పాడు.

కొత్తమ్మ మాటాడలేక బల్లమీద తలపెట్టుకు ఆలోచనలో పడింది. కాసేపటికి సవిత వ్రజబాబు పాదాలకు నమస్కరించి, పాదధూళి తీసుకుని నుదుట వుంచుకుంది. అంతా బయటికి వచ్చారు. రాఘూల్ ఇంటికి తాళంపెట్టి, కొత్తమ్మతో బండెక్కాడు.

పిలవకపోయినా రాఘూల్ కొత్తమ్మ వెంబడి బయల్దేరాడు. రాఘూల్‌ను రమణిబాబు బాగా ఎరుగు, కాని గుర్తుపట్టగలడో లేడో. అందుకని రాఘూల్ 'అమ్మా! కారు ఆపమని చెప్పు. ఇక్కడే దిగిపోతా' నన్నాడు అకస్మాత్తుగా.

అనుకున్నట్టుగానే రమణిబాబు వచ్చి కొత్తమ్మను చూడగానే "చూశావా, జీవనుడి భార్య ఎలాటి దౌర్భాగ్యపు పని చేసిందో, ఎన్నిసార్లు చెప్పాను, ఇలాంటి వాళ్లకి ఇల్లు అద్దెకివ్వొద్దని?" అన్నాడు నిందిస్తూ.

జీవనచక్రవర్తి కొత్తగా అద్దెకు వచ్చినవాడు. అతడిభార్య ఇవాళ నల్ల మందుమింగి ఈ అనర్థం తెచ్చిపెట్టింది. ఆమెకు పిల్లల్లేరు. ఏ పనికీ విసుక్కోదు. శాంతమూర్తి, సహనశీలి. అందుకని ఎవళ్ళకేఅవసరమొచ్చినా చీటికీ మాటికీ పిలుస్తుంటారు. అమె భర్తకు అయిదారు నెల్లాయి ఉద్యోగంలేదు. అసలు ఇంటికి రావటమే మానుకున్నాడు, ఇటీవల.

ఆమెను హాస్పిటల్‌కు తీసుకెళ్ళే భారం రాఘాల్ నెత్తిపైన వేసుకున్నాడు. కొత్తమ్మ కార్లోనే ఆమెను తీసుకు బయల్దేరాడు. ఆ అమ్మాయికి ఇరవై ఏళ్లుంటాయి. మంచి అందకత్తె ఒక్క నగలేదు, మంచి చీరైనా లేదు. అయినా అపురూపమైన సౌందర్యం.

"నాపేరు శారద" అని చెప్పింది. "నన్ను 'మీరు' అనకండి, సిగ్గుగా వుంటుంది" అని చెప్పింది. కుశలప్రశ్నలయ్యాక తన సంగతి వెల్లడించాడు రాఘాల్. అప్పుడు శారద "మా ప్రాంతంలో బ్రాహ్మల్ని 'దేవత' అని పిలుస్తారు. నేనూ మిమ్మల్ని అలానే పిలుస్తా" నన్నది.

తను నాలుగైదునెలలు ఇంటిఅద్దె బాకీవున్నట్టూ, తనభర్త ఇహ రాడుగాక రాడనీ తనకు పుట్టిల్లూ అత్తిల్లూ ఆశలేదనీ అంటూ తన దిక్కుమాలిన స్థితి వెల్లడించింది. ఏం తోచడం లేదామెకు, చద్దామన్నా లోకం తనని చావనివ్వటం లేదు. చివరికి అద్దె విషయంలో అమ్మకు సిఫారసు చెయ్యమని బతిమాలింది. అందుకతడు తనే అమ్మకు రుణపడివున్నానని తన పూర్వకథ చెప్పుకొచ్చాడు.

రాఘాల్ ఆమెతో అన్నాడు. "నీకు చదువూ రాయడం వచ్చునన్నావు. దస్తూరికూడా బాగానే వుంటుందన్నావు. రాతపని ఇస్తాను. తప్పుల్లేకుండా శ్రద్ధగా, శుభ్రంగా రాశావంటే, నెలకి పదిహేను ఇరవై రూపాయలు దొరుకుతాయి. ఏమంటావ్ ?"

ఆమె ముఖంపైన సంతోషం తాండవించింది. చీకటిలో మెరుపులా కనబడిన ఆమె ముఖకాంతికి అతను ఆశ్చర్యపోయాడు. వెళ్ళి బండి తీసుకువస్తానన్నాడు.

"తీసుకు రండి. ఇహ నాకేం దిగులులేదు. బహుశా యిందుకేనేమో నేనీ లోకాన్ని విడిచిపెట్టలేకపోయాను" అన్నది శారద.

బండిమీద యిద్దరూ వెళ్ళేప్పటికి యింటో కొత్తమ్మ లేదు. కారు గారేజిలో వుంది. రమణిబాబు రోజూ రాడు. ఒకవేళ వస్తే ఏ తొమ్మిదీ పదిగంటలకో, అని చెప్పాడు నవుకరు.



శారద వొట్టిపల్లెటూరిపిల్ల. అయినా, చదువంతగా లేకున్నా, మృత్యుముఖం నించి తప్పించి జీవనోపాధి కల్పించిన వ్యక్తిపట్ల కృతజ్ఞత చూపగలిగింది. అప్పుడామె కంఠస్వరంలో తొణికిసలాడే ధైన్యం రాఘూల్‌ను చకితుణ్ని చేసింది. "నిలబడేవున్నారు, కూర్చోండి. ఇవాళ మీ పాదధూళివల్ల నా యిల్లు పవిత్రమయింది" అన్నది, శారద.

కొన్ని కుశలప్రశ్నల తరవాత రాఘూల్ తన ఒంటరి జీవితం, స్వయం పాకం గురించిన వివరాలు వెల్లడించాడు. టీ పెట్టి ఇస్తానని చెప్పిందామె. "పని

మీద వెళుతున్నాను, మరెప్పుడయినా వచ్చి నేనే టీ చేయించుకు తాగుతాను" అని చెప్పి బయల్దేరాడు.

ఇంత పెద్దనగరంలో రాఘాల్ ఎన్నో కులీన కుటుంబాలకు ఆత్మీయుడై నాడు—తన సుగుణాలవల్లనే. పిల్లలకు చదువుచెప్పడం, ఇంత వండుకుతినడం, మెస్‌లోపడివుండటం: రాఘాల్ చాలా మంచివాడు, పెద్దమనిషి, పరోపకారి అని అతనికి బిరుదులిస్తారు. ఇవే అతనాశించేవి.

ఇవాళ రోడ్డుమీద నడుస్తూవుంటే ఆ ప్రశంసలూ, పూర్వపరిచితస్త్రీలు, చదువుసంధ్యలు, సుఖదుఃఖాలు అన్నీ జ్ఞాపకం వచ్చాయ్.

రాఘాల్ ఇంటికొచ్చేసరికి రెండు త్తరాలు ఉన్నాయి. మొదటిది వ్రజజాబు రాసింది—'రేణు పెళ్లి ఆగిపోయింది. ఈ సంగతి మీ కొత్తమ్మకు చెప్పు. వచ్చే శనివారం నేనే వచ్చి అన్నీ మాటాడతా' ననీ.

ఇంకోటి. రాఘాల్ చదువుచెప్పుతున్న పిల్లలతండ్రి—అంటే యజమానివద్ద నించి: 'మా అన్నకుమారుడిపెళ్లి అకస్మాత్తుగా ఢిల్లీలో నిశ్చయమైంది. కారణాంతరాలచే నే వెళ్లడం పడలేదు. నీకంటే ఆత్మీయుడు నాకు మరెవ్వరూ లేరు. కనక నువ్వే వియ్యంకుడిగా ఈ వివాహానికి హాజరుకావాలి. సరిగ్గా ఈ వచ్చే ఆదివారమే ప్రయాణం. వెంటనే వచ్చి నన్ను కలుసుకోగోరుతున్నాను.'

రెండూ సంతోషాన్ని కలిగించినై రాఘాల్‌కు. రేణు పెళ్లి ఆగటం, ఢిల్లీ ప్రయాణం.అది మరీ సంతోషంగావుంది. ఢిల్లీనగరపు వింతలను గూర్చి వినటమే గాని ఎప్పుడూ చూడలేదు. ఈ అవకాశం బలే బాగా వచ్చింది!

ఉత్తరం జేబులో పెట్టుకొని మర్నాడు కొత్తమ్మని చూడబోయాడు. ఆమెకీ సంగతి ముందే తెలుసు. చాలా సంతోషించింది. వెళ్లొస్తానని చేప్పేసి శారద గదికి వచ్చాడు. మంచంమీద కూర్చుని ఆమె రాస్తున్నది చూశాడు, దస్తూరీ ఎంతో బాగుంది. ఆ తరవాత—

"నే ఢిల్లీ వెళుతున్నాను, ఒక స్నేహితుడిపెళ్లికి. తిరిగి రావటానికి వారం పదిరోజులు కావచ్చు. నే వచ్చాక నీకు రాతపని ఇస్తాలే. అందాకా ఇది దగ్గ రుంచుకో" అంటూ కొంత డబ్బిచ్చాడు.

*  *  *  *

అక్కడ యజమానురాలు రాఘాల్‌తో అన్నది: "అబ్బాయీ! నీదగ్గర బంధువులూ, కావల్సిన మిత్రులూ ఉంటే వాళ్లనీ వెంటబెట్టుకు వెళ్లు, ఖర్చంతా



కన్యాపక్షంవాళ్లే పెట్టుకుంటారు. ఒక్కటి జ్ఞాపకముంచుకో—మనవేపు కర్తా ధర్తా–నగానట్రా–డబ్బూదస్కం అన్నింటికీ నువ్వే బాధ్యుడివి, సర్వాధికారివి సుమా. మన హోదాకు గౌరవానికీ ఎలాంటిలోటూ రాకూడదు!" అని చెప్పింది.

ఈ మాట అనగానే రాఘుల్‌కు తారక్ గుర్తుకొచ్చాడు. కాని, అతని పట్టు విడిపించడం కష్టం అని మళ్లీ ఆలోచించి ఇంతకూ అతను వర్ధమాన్ జిల్లాలో నవుకరీకి పోయాడో ఏమో. అయినా ఇంకా వ్యవధి వుందికదా అనుకుని ఇంటికొచ్చి పని చూసుకుంటున్నాడు.

వెళ్లేటి పరాయిచోటు, చేత డబ్బుంటే మంచిది. సేవింగ్స్ ఎకౌంటునించి కొంత తీసుకుందామనుకున్నాడు. పోస్టాఫీసునించి తిరిగివస్తూ టాక్సీ మాటాడు తుంటుండగా పోస్టుమన్ ఒక ఉత్తరమిచ్చాడు. అది తారకుడి వద్దనించే.

"వర్ధమాన్ జిల్లాలో ఒక గ్రామస్కూల్‌కి హెడ్మాస్టర్‌గా ఉన్నాను. వెళ్లే టప్పుడు కలుసుకోలేనందుకు ఏమీ అనుకోవద్దు. కొత్తమ్మకూ, వ్రజబాబుకూ, నమస్కారాలుచెప్పు" అని.

*   *   *   *   *

మర్నాడు మధ్యాహ్నం రాఘాల్ ట్రంకులో బట్టలు సర్దుకుంటున్నాడు, అంతలోనే కొత్తమ్మ వచ్చింది.

"నా ఆందోళన రేణుపెళ్లి గురించి కాదు నాయనా! మీ పెదనాన్నని గురించే," అని కన్నీళ్లు పెట్టుకుంది. మాటలోనే వ్రజబాబు అటువచ్చాడు. రేణు పెళ్లి ఆగిపోపటం గురించే కొంత ప్రసంగం జరిగింది. సవితతో అన్నాడు వ్రజ బాబు——

"నిరుడు నీ డబ్బు వ్యాపారంనుంచి తీసేసి బ్యాంకులో జమకట్టాను. అదే మంచిదయింది. నీడబ్బు నీకిచ్చివేదామనుకుంటున్నా. మళ్లీ రేపొకసారి రాగలవా?" వస్తానన్నది సవిత. "మరి నీ నగలో? నీ వస్తువు నీదగ్గరే ఉండటం మంచిది. ఈ భారాన్ని సహించగలశక్తి నాలో లే" దని చెప్పాడు.

*   *   *   *   *

వ్రజబాబు సరిగ్గా అదే సమయానికి వచ్చాడు. చేతిలో సీలువేసిన చిన్నపెట్టె వున్నది. దాన్ని సవితకు ఎదురుగా టేబిల్‌మీదపెట్టి, "ఇప్పటిదాకా ఈ పెట్టె బ్యాంకులోవుంది. ఇందులో నీ నగలన్నీ ఉన్నాయి. ఇదుగో, నీతాలూకు యాభై రెండువేల రూపాయలచెక్కు," అంటూ ఆమె చేతికి అందిస్తూ, "ఇవాళ నా మనస్సులో పెద్ద బరువు దిగిపోయినట్టుగా వున్నది కొత్తకోడలూ!" అన్నాడు.

"ఈ నగలు రేణు పెట్టుకుంటుందన్నారుగా?"

"ఇవి నీవిగాని నావికాదుగా? ఒకవేళ ఆ రోజువస్తే...ఆనాడు నువ్వే రేణుకు అలంకరిద్దువుగాని."

*   *   *   *   *

సవిత, రాఘాల్ ప్రయాణపు హడావిడిలో వున్నారు. వ్రజబాబుకి పాదాభి వందనం చేసింది. "నాగురించి నువ్వేమీ ఆలోచించకు కొత్తకోడలూ! నా ముఖాన

ఏం రాసిపెట్టిందో అలాగే జరిగిపోయింది. అన్నీ ఆ గోవిందుడే పరిష్కారం చేశాడు. మీరు సుఖంగా వుండండి. ఇదే నా ఆశీర్వాదం!"

సవిత తలెత్తి వ్రజబాబుని చూసింది. ఆమె రెండు కళ్లనుండీ అశ్రుధారలు ప్రవహిస్తున్నాయి. "నీ రేణుని చూడాలనుందా, కొత్తకోడలూ?" అనడిగాడు

"ఇంకెంతోకాలం జీవించను నేను. కొద్దికాలమైనా ఏం చూసుకు జీవించేది?" అన్నది. అంతలో రాఘూల్‌ను నగలపెట్టె పట్టుకెళ్లి కారులో పెట్టమని చెప్పి వ్రజబాబు అందించాడు. సవిత అడిగిన ప్రశ్న అలాగే ఉండిపోయింది. రాఘూల్ వెనకాతలే కొత్తమ్మకూడా మెల్లిగా వెళ్లిపోయింది

## 6

ఢిల్లీలో పెళ్లికార్యం జయప్రదంగా జరిపించుకుని పదిరోజులకల్లా రాఘూల్ ఇంటికి తిరిగివచ్చాడు. యజమానీ యజమానురాలూ అతన్నెంతగానో మెచ్చుకున్నారు. రాఘూల్ కార్యకుశలతా, ఘనతా చాలా వ్యాప్తి పొందింది. కన్యలుగల తలిదండ్రులు వాళ్లపిల్లల్ని అతనికి చూపించి, సంబంధం చేసుకోవాలని ఆత్రపడ్డారు. అందుకతడు "ఇంటికెళ్లి అమ్మని నాన్నగారినీ సంప్రదించి రాస్తా" నంటూ చెప్పి తప్పించుకున్నాడు.

సంసార బాధ్యత మొయ్యటానికీ, బాదరబందీలు పడటానికీ ఇష్టంలేక పెళ్లి ప్రసక్తి విరమించుకున్నాడు రాఘూల్. కాని, శారద తన సహాయాన్ని ఎప్పుడైతే అపేక్షించిందో, జీవిత మహాసాగరంలో పడిన ఆనాడే ఆమెను రక్షించాల్సిన బరువు బాధ్యతలన్నీ తనవిగా భావించినాడు.

ఢిల్లీ యాత్రవల్ల మునుపటి పిరికి ఆలోచనలన్నీ అంతరించి ధైర్యం, ఆత్మ విశ్వాసం కలిగింది అతనిలో. ఈ ఆనందంతో రాఘూల్ శారదను కలుసుకోవాలని వెళ్లాడు.

"అమ్మా, ఏమిటే సందడి అంతా?" అనడిగాడు, రాఘూల్. ఆమె బదులు చెప్పలేదు కాని, రమణిబాబే అన్నాడు.

"మీ అమ్మ గొప్ప ఆస్తిని సగం ఖరీదుకే కొనేసిందోయ్. అందుకే ఈ విందు! మా సింగపూర్ భాగస్థుడు శైలేంద్రకూడా వచ్చాడు. గొప్ప కోటీశ్వరుడు! ఇంకా చాలా చాలామంది గొప్పవాళ్లొస్తారు. కలకత్తాలో పేరుపొందిన మాలతి పాటకచ్చేరీ జరుగుతూంది" అంటూ చెప్పుకుపోతున్నాడు.

సవిత అడ్డుపడి "నన్ను చెప్పనివ్వరెందుకనీ! ఇందులో దాపరిక మేముందీ?" అనేసరికి రమణిబాబు మళ్లీ అందుకున్నాడు—

"రాజూ! మీ అమ్మ నిజంగా అదృష్టవంతురాలోయ్! ఏనాడో ఒక అనామ పడికి బోలెడంత అప్పిచ్చి, ఆ ఆశనే వదిలేసుకుంది అప్పుతీసుకున్నవాడు భయస్థుడు, మొన్ననీమధ్య వడ్డీతోసహా తెచ్చి జమకట్టాడు..." అని ఇంకా ఏమేమో చెబుతూ సవితవేపు అదోలా చూశాడు రమణిబాబు. ఆ చూపుంకి రాఘాల్ కే సిగ్గేసి మొహం పక్కకి తిప్పుకున్నాడు. పనుంది, ఇంటికి వెళతా నన్నాడు రాఘాల్ సవితతో. ఫలహారం తీసుకోమంది. వద్దు, ఆకలి లేదన్నాడు. మెట్లు దిగుతూ, రాఘాల్ ఆలోచించాడు— ఆ డబ్బిచ్చిన వ్యక్తి ఎవరో తనకు తెలుసుననుకొని రమణిబాబు చేసిన వ్యంగ్య విమర్శకు రాఘాల్ నొచ్చుకున్నాడు. చిత్రమేమిటంటే-అన్ని మాటలు వినికూడా సవిత ఒక్క మాటయినా అడ్డు చెప్పలేదేః— అదే విశేషం.

*　　*　　*　　*　　*

ట్రాముదిగి. సందుమలుపు తిరిగి, రాఘాల్ వ్రజబాబు ఇంటిముందు కొచ్చాడు. తాళం వేసివుంది. 'ఈ ఇల్లు అద్దెకివ్వబడును' అని చీటీ ఒకటి వేలాడుతున్నది. రాఘాల్‌కు కళ్లు బైర్లు కమ్మాయి. అక్కడ తెలిసిన కొట్టు వాణ్ని అడిగితే 'ఇల్లు అమ్మేశారు బాబూ! యజమానురాలేమో కూతుర్ని తీసు కుని అన్నగారింటికి వెళ్లిపోయింది. వ్రజబాబుగారు రేణుతోసహా అద్దెఇంటో ఉంటున్నారు." అని చెబుతూ, చేత్తో సంజ్ఞచేసి పదహారో నెంబరిల్లు ఆనవాలు చూపించాడు.

*　　*　　*　　*　　*

ఇల్లు వెతుక్కువెళ్లి రాఘాల్ తలుపు తట్టాడు. లోపలికి అడుగుపెట్టేసరికల్లా గుండె బేజారైపోయింది. వ్రజబాబు పైన వంటచేస్తున్నారు. నాలుగురోజులై రేణుకి జ్వరం. ఆమె రాఘాల్‌ని చూస్తూనే కన్నీళ్లు పెట్టుకుంది.

ఇహ ఇది పనికాదని, తనే వంటపనిచూసి, జావకాచి రేణుకిచ్చాడు రాఘాల్ స్నానానికి వెళ్లాడు. మళ్లీ వచ్చి రేణుతో చెప్పాడు; "నేను వెళ్లాలి, పనుంది.. రేపు మళ్లావస్తాను. నే వచ్చేంతవరకూ నాన్నగారిని వంటదగ్గరికి వెళ్లనివ్వకు. ఎవర్నీ పొయిదగ్గరకి వెళ్లనివ్వొద్దు. కాస్త కనిపెట్టివుండు" అనిచెప్పి వెళ్లి పోయాడు.

*　　*　　*　　*　　*

ఆ వీధిలోనే డాక్టరిగారిల్లు. రేణుని చూడటానికి తప్పకుండా వెళ్లిరమ్మని మరిమరి చెప్పాడు, రాఘాల్. తప్పకుండా వెళ్లాస్తానన్నాడు డాక్టరు. వీధిలో

అక్కడకూడా టైఫాయిడ్ ఉంటున్నది. డాక్టర్‌కీ అదే అనుమానం. తనతో పాటు పెరిగిపెద్దదైన రేణుకిప్పుడు అర్జంటుగా మందుఖర్చుకి డబ్బు కావాలి.

కొత్తమ్మ జ్ఞాపకమొచ్చింది. ఆ యింటికి చేరేసరికి అక్కడ చాలా కార్లు న్నాయ్. తోరణాలతో, లైట్లకాంతితో, సంగీతవాద్యాలతో, ఇల్లు శోభాయ మానంగా వుంది

వెళ్లి గదిలో కూచోమంది. అడగలేక అడగలేక ''ఒక ముఖ్యమైన పనిమీద వచ్చానమ్మా! కొంచెం డబ్బు కావాలి,'' అనడిగాడు.

ఇప్పుడేంలేదన్నట్టుగా నసిగిందావిడ. అంతలో శారద తన దగ్గరఉన్న పది రూపాయలు ఇవ్వబోయింది. భోంచేసి మరీ వెళ్లమంది సవిత. ఆకలి లేదు క్షమించమన్నాడు, రాఘవ్.

"డబ్బడిగితే లేదన్నాను." రాజుకివాళ కోపంవచ్చి భోంచేయకుండా వెళ్ళి పోయా"డన్నది కొత్తమ్మ శారదతో. "కోపంతో వెళ్ళలేదు, నాకు తెలుసు''న్నది శారద.

"అకస్మాత్తుగా అతగాడికి డబ్బు అవసరమేమిటి వచ్చిందో?" అన్నది సవిత.

"ఏమోనమ్మా! ఎవరో అమ్మాయికి జబ్బుగా వుందిట. మందుల కోసరమట!" అని చెప్పింది శారద.

"ఎవరా అమ్మాయి? రాత్రికి చేగడియారం తాకట్టు పెట్టేంత అవసర మేమొచ్చిందో?"

"నాకేం తెలీదమ్మా! పిల్లకి జబ్బుసంగతి మాత్రం నిజం. వైద్యంలోపంవల్ల ఆ పిల్ల చచ్చిపోతుందేమోనన్న భయం ఆయన ముఖంలో కనిపించిందమ్మా నాకు. ఆ పిల్లతండ్రే చిన్నప్పట్నుంచీ ఆయన్ని పెంచి పోషించాడట!'

ఆశ్చర్యపడింది సవిత. లోపలికివెళ్ళి కొద్ది నిమిషాల్లో సవిత మళ్ళీ తిరిగి వచ్చింది. ఈ మాటు వంటిని ఒక్కనగలేదు మంచి చీరకూడా కాదు, కట్టు కున్నది. ముఖంలో ఆందోళన కనిపిస్తూంది

ఆ రాత్రివేళ ఎవరికీ తెలీకుండా, శారదను తనవెంట రమ్మన్నది. ఎందుకో శారదకు తెలీదు. అయినా తర్కించలేదు. టాక్సీ పిలిపించింది సవిత. ఇల్లు ఆనంద సంగీత హాస్యాలతో నిండిపోయింది. రుమాలుతోకట్టిన ఒక మూట శారద చేతికిచ్చి, "ఇది నీ కొంగున కట్టుకో శారదా! నేనిస్తే బహుశా తీసుకోడు, నువ్వే అతనికివ్వు" అని చెప్పింది సవిత.

పది నిమిషాల్లో కారుదిగి, ఇద్దరూ రాఘుల్ ఇంటికి చేరారు. ఇంటికి తాళం వేసివుంది. మళ్ళావచ్చి కారులో కూర్చున్నారు బాగ్ బజార్లో ఒక ముందు ఆగిందా కారు. ఇంటికున్న పెద్దతాళం కనబడింది "ఇల్లు అద్దెకివ్వ బడును'' అని నోటీసుబోర్డు కూడా కనిపించింది.

బయల్దేరినచోటుకే తీసుకెళ్ళమని డ్రయివర్‌కుచెప్పి, సవిత తలుపు మూలని అనుకుని పాషాణ మూర్తిలా పడిపోయింది. అసలు విషయం శారదకు అర్థంకాలే.

'నన్ను తీసికెళ్ళటానికి రాఘుల్‌బాబు రేపు తప్పక వస్తారమ్మా!' అన్నది.

"ఒకవేళ రాకపోతే? నా గుమ్మంలో మళ్ళీ అతడు అడుగుపెట్టలేకపోతే?" శారద ఆలోచనలో పడ్డది.

సవిత చాలాదుఃఖిస్తున్నట్టు శారదకు బోధగట్టింది. "అమ్మా, నేను నీబిడ్డలాంటి దాన్ని. నాకీ లోకంలో మరెవరున్నారు? నువ్వేది శాసిస్తే అలానే నడుచుకుంటా నమ్మా!'' అన్నది. శారదను ఆమె ఒళ్ళోకి తీసుకుంది. ఆమె కన్నీళ్లు శారద తల పైన పడ్డాయి.

ఇద్దరూ ఇంటికి చేరేటప్పటికి ఇంకా కచ్చేరీ జరుగుతూనేవుంది. వీరు ఇంటో లేరన్న సంగతి ఎవరూ గమనించినట్టులేదు. ఆ రాత్రికి తిండీతిప్పలు. గడిచి పోయినై. ఒక్కొక్కరూ వీడ్కోలు చెప్పి వెళిపోతున్నారు. శారద మంచానికి తలాపు దిక్కున కూర్చుని సవితకు తల నొక్కుతున్నది. మండిపడుతూ రమణిబాబు గదిలోపలికి వచ్చాడు.

"ఇంటికి నలుగురూ వచ్చినప్పుడే నీకేదో ఒకటి వస్తూంటుంది. అందరూ వెళి పోయారుగా, లే. లేచి స్నానంచేసి మంచిచీరె కట్టుకో! విమలబాబు నిన్ను చూట్టానికి వస్తున్నాడు!"

''నన్ను చూడటం దేనికీ?"

"ఎందుకా? అలా అడుగుతావేం? ఇంత ఘనంగా ఆయన్ని అహ్వానించి నందుకు అంతలోనే యజమానురాలు అంతర్ధానమైపోయ్యె!

"ఆహ్వానించినంత మాత్రాన యజమానురాలిని కలుసుకోవాలని ఎక్కడుంది? ఇవాళ వీలుపడదని చెప్పండి, వారితో" అన్నది సవిత.

"ఎందుకు సాధ్యంకాదూ?, అతనెవరో తెలుసా? కోటీశ్వరుడు! ఆయనవల్ల ఏటా నాకెంతో వ్యాపారం జరుగుతూంది... నీకేం తెలుసు? ఖచ్చితంగా నువ్వాయన్ను..."



అంతలోనే చెప్పుల చప్పుడయింది. సవిత మేలిముసుగు ముందుకి లాక్కుని లేచి కూర్చుంది! విమలబాబు లోపలికొచ్చి నమస్కరించి స్వయంగా కుర్చీ ముందుకి లాక్కుని కూర్చుని అన్నాడు.

"అకస్మాత్తుగా మీకు వంట్లో బాగాలేదని తెలిసింది. బహుశా రేపు వుదయమే నేను కాన్పూరు వెళ్ళాల్సివుంది. తిరిగి రావడం పడదనుకుంటా, అట్నుంచి

బొంబాయి వెళ్ళి, తిన్నగా కేంద్రస్థానానికి వెళ్ళిపోవాలి. అంచేత మిమ్మల్ని ఒక్కసారి కలుసుకుందా మనిపించి వచ్చా, మీ ఆతిథ్యం నాకు చాలా ఆనందాన్ని కలిగించింది."

నెమ్మదిగా "అది నా అదృష్టం!" అన్నది సవిత.

నలభై ఏళ్ళవాడు. విమలబాబు. సంపూర్ణమైన ఆరోగ్యం, నిండు విగ్రహం. మళ్ళా అన్నాడు—"రమణిబాబుకూడా ఇక్కడ తరుచు సుస్తీగా వుంటున్న దని తెలిసింది. మీరూ అలాగే కనిపిస్తున్నారు. మీ పాత ఫోటో చూశా, చాలా మారిపోయారు."

సిగ్గుపడిపోయి, "అయితే నా పాతఫోటో మీరు చూశారా?" అనడిగింది.

"నిజంగానే, మీరు కలిసి తీయించుకున్న ఫోటో రమణిబాబు నాకు పంపించారు. అది చూసిననాడే—'ఈ వ్యక్తిని జీవితంలో ఒక్కసారైనా చూడగలిగితే... అంతేచాలు!' అనుకున్నాను. ఆ కోరిక ఈనాడు సఫలమయింది... పోనీ మీ రొక్కసారి మా సింగపూరు రాకూడదూ? సముద్ర ప్రయాణం చేసినట్టూ వుంటుంది. క్రాన్‌స్ట్రీట్‌లో నాకో ఇల్లుంది. ఆ యింటి పై అంతస్థునించి చూస్తే సూర్యోదయం, సూర్యాస్తమయం, ఉభయ సంధ్యలూ ఎంతో అందంగా కన్పిస్తాయి. ఈ మాట రమణిబాబుకి ఇదివరకే చెప్పా. సరే నన్నాడు. మీ అనుమతి కూడా లభిస్తే - ఈసారి నా ప్రయాణం సార్థకమైనట్టే..."

రమణిబాబు చెప్పాడు—"నేనివరకే మీకు మాట ఇచ్చాను. నా తప్పులేదు. వచ్చేవారమే నా ప్రయాణానికి సిద్ధం. ఇప్పట్లో నాకు సముద్రపుగాలి చాలా అవసరం కూడాను. ఏమంటే నా ఆరోగ్యం అంత బాగుండటం లేదు."

"అటయితే మనందరం ఒకే ఓడలో వెళ్ళవచ్చు" అంటూ సవితతో "మీరు అనుమతిస్తే ఏర్పాట్లన్నీ నే చూస్తా. నా ఆఫీసుకూడా టెలిగ్రామిస్తా. ఇంటో ఎట్టి ఇబ్బందీ కలక్కుండా ఏర్పాట్లు చేస్తా" నన్నాడు విమలబాబు ఆనందంతో.

మృదుస్వరంగా సవిత అన్నది "ఈసారికి నే రాలేను." ఈ మాటకు రమణిబాబు మళ్ళీ సవితను కేకలేసి, విమలబాబుతో "మీరు నిరభ్యంతరంగా టెలిగ్రాం పంపండి, ఏర్పాట్లు చేయించండి!" అని చెప్పాడు.

"ఏమంటారు? టెలిగ్రాం పంపమంటారా?" అని విమలబాబు మళ్ళా సవిత నడిగాడు.

జవాబు చెప్పటానికి సవిత తలెత్తేసరికి ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి. సిగ్గుపడి చప్పున "ఊహుఁ – ఈసారికి రాలేను" అన్నది.



చీత్కారించుకు అన్నాడు రమణిబాబు—

''ఏం ఎందుకురాలేవు? చెబుతున్నా, విధిగా బయల్దేరాలి నువ్వు. నిన్ను వెంటబెట్టుకు మరీ బయల్దేరతాను నేను. కాళ్ళూ చేతులూ కట్టిఅయినా తీసుకెళ్తా నిన్ను."

## 7

సవిత వంటో సుస్తీగానే వుంది. శారద ఏంకావాలి అని అడిగినా ఏదీ వొద్దంటుంది. అంతలో రమణిబాబు వచ్చి నిలబడ్డాడు. పెద్దగా నిట్టూర్చి అన్నాడు—"రక్షించావ్! ఇవాళ్టి కేలాగో మర్యాద దక్కింది ఆయనెంత మంచివాడు! గొప్పఅంతస్థు. నిగర్వి, నీ గురించే ఎంతో విచారించాడు. ఉద యానికల్లా నీ ఆరోగ్యస్థితి తెలియపర్చమని వందసార్లయినా చెప్పాడు. ఎంత ఆత్రుత ఆయనకి! ఒహవేళ డాక్టర్ని వెంటబెట్టుకు వచ్చినా రావచ్చు! డబ్బు లెఖ్ఖలేని మనిషి. ఆయన కంపెనీలో జనరల్ మేనేజరు జీతమే నెలకి మూడువేలు!"

విచిత్రమైన అంకెలేవో చెప్పబోతూవుంటే, సవిత "నువ్వు మళ్ళీ తిరిగి వచ్చావేం? ఇంటికి పోలే?" అనడిగింది. సవితకు ఈ ప్రసంగం ఆసక్తి లేదని గ్రహించాడు. "ఇవాళ్టికి వెళ్ళ" నన్నాడు. అతడిప్పుడు డోస్‌లో వున్నాడని పసికట్టింది సవిత.

కోపంగా అన్నాడు రమణిబాబు—"నువ్వు భార్యవి కావని అందరికీ తెలిసిం

చనేగా నీకీ పౌరుషం? కాని... ఈ సంగతి ఎవరికి తెలియదు? శారదకు తెలీదా? ఇంటో ఒద్దివాళ్ళకి తెలీదా? అబద్ధం ఎంతకాలం దాగుతుందీ?"

ఉభయుల మధ్య వివాదం పెరిగిన తరవాత ఆమె అన్నది—"నిజంగా నేనెవరి భార్యనో ...ఆయన పాదధూళికి కూడ నువ్వర్హుడవు కావు. ఈ సంగతి నీకు తెలీదు."

"అటయితే ఆ పూజనీయుణ్ని ఆరాధించక, ఇక్కడపడి ఉన్నావెందుకూ?" అనడిగాడు.

*　　　*　　　*　　　*

కాస్సేపటికి విమలబాబు సవితను చూడాలనివచ్చాడు. "బహుశా రమణిబాబు కోపంతో వెళ్ళలేదనుకుంటాను. నిన్నంతా ఆయన చికాకుగానే కనబడ్డాడు," అన్నాడు. "నిన్న నావల్లకూడా పొరపాటే జరిగింది. మీకిష్టం లేనప్పుడు నే బలవంతం చెయ్యకపోతే, అలా జరిగి వుండేదికాదు. మిమ్మల్ని క్షమాపణ కోరుకోడానికే ఇప్పుడు వచ్చా"నని కూడా అన్నాడు. సవిత జవాబు చెబుదామని తలెత్తేసరికి ఇద్దరి చూపులూ కలిసినై.

"మీరు నిన్నటికంటె ఇవాళ మరీ నీరసంగా కనిపిస్తున్నారు. గుమ్మంలో అడుగుపెట్టగానే గుర్తించా నీ సంగతి. అందుకే ఇంత వ్యాకులపడుతున్నాను" అన్నాడు.

సవిత నవ్వింది. సాధారణ దృష్టికి ఆ నవ్వుకి ఒక్కసారిగా నరాల్లోని రక్తం జివ్వుమంటుంది! విమలబాబు కళ్ళప్పగించి చూస్తూ అలానే ఉండిపోయాడు! అతని చూపు ఎంత తృష్ణాసక్తితో ఉన్నదో సవిత గమనించక పోలేదు. ఆమె మనస్సులో అనుమానాలన్నీ ఈ క్షణాన తేలిపోయి, సిగ్గుతో కుంచించుకుపోయింది. బహుశా అతను తనను గృహిణిగా కాకుండా వేశ్యగా పరిగణిస్తున్నాడా అనిపించి, మనస్సు ఒక్కసారి భగ్గుమన్నది.

*　　　*　　　*　　　*

మర్నాడు సవిత పదిగంటలకు బండిదిగి, దర్వాన్‌ను వెంటబెట్టుకుని 17 వ ఇంటి గుమ్మంముందుకి వచ్చింది. చిరకాలంనించి ఈయింటో పనికత్తెగా వుంటున్న ఫటిక్ తల్లి చెప్పింది—'రేణుకు ఇంకా జ్వరం తగ్గలేదు, బాబుగారే వంట. నూనెగిన్నె తిరగబడింది. మళ్ళీ తేవడానికి వెళుతున్నా' నన్నది.

ఫటిక్‌తల్లి అడిగిందానికి సవిత చెప్పింది—"వీళ్ళది మావూరే. దూరపు బంధువును. రేణును చూసిపోదామని వచ్చాను. నువ్వెళ్ళి నూనె పట్టుకురా" అని బండి మలుపులో వుంచమనీ, ఇప్పుడే వస్తాననీ దర్వాన్‌తో చెప్పింది.



వ్రజబాబు వంటచేస్తున్న వరండాలో వెనకగా నిలబడింది. అతను "నూనె తెచ్చావా, ఫటిక్‌తల్లీ? బంగాళాదుంపలూ దొండకాయలూ ఒకేసారి పడెయ మంటావా?" అని అడిగేసరికి, 'రెండూ ఒకేసారి పడెయ్యండి చినబాబూ, ఏదో ఒకటి తయారుకాకపోదు!' అని చెప్పింది సవిత. తిరిగిచూచి డిల్లబో యాడు. సవితకు రెండుకళ్ళూ నిండినయ్. వ్రజబాబుకి కనిపించకుండా పక్కకి తిప్పుకుంది.

మరుక్షణంలో రాఘుల్ వచ్చాడు. చేతుల్లో కూరలు, సగ్గుబియ్యం, పంచదార, బ్రాండీ, పళ్ళు – మరెన్నో పొట్లాలు కట్టివున్నాయి కొత్తమ్మను చూడగానే ఆశ్చర్యపోయి, పొట్లాలు కిందపెట్టి, ఆమె పాదధూళి తీసుకు నమస్కరించాడు.

స్నానాలగదికి వెళ్ళి తలుపు తట్టింది సవిత. లోపలవున్న వ్రజబాబు గాభరా పడాడు. చప్పున లోపల చొరబడి సవిత తలుపు మూసేసింది. ''మీతో కొంచెం మాటాడాలి!'' అన్నదామె. ''నేనే తే మీరేం చేసారూ? జవాబు చెప్పేదాకా తలుపు తియ్యను...'' అంటూ పట్టుబట్టి ది

''ఇక్కడే వుంటావా? మళ్ళీ నీ ఇంటికి వెళ్లవా?'' అనడిగాడు.

''నాయిల్లు ఇదే! నా భర్తా సంతానం ఎక్కడుంటే అదే నా ఇల్లు. మరి అక్కడికి వెళ్ళను'' అన్నది సవిత.

''ఇక్క డెక్కడుంటావు?''

''కిందిభాగంలో అన్ని గదులున్నాయి. ఇక్కడే ఏ మూలయినా పడివుంటా, ఎవరైనా అడిగితే పనిమనిషి అని చెప్పండి. నిజంగా చెబుతున్నా, నన్ను మీరు కదిలించలేరు.''

వ్రజబాబు నవ్వాడు. వెంటనే మోకాళ్ళమీద వంగి తన తల అతని పాదాలకు ఆనించింది. ''ని కూతురికోసమేగా ని బాధ! అంతేనా కోడలూ? చూద్దాం...'' అన్నాడు. కళ్ళనీళ్ళతో అన్నది సవిత –

''కాదు చినబాబూ! రేణుకోసం నేనేం దిగులుపడటంలే. దాన్ని చూడటానికి మనుషులున్నారు. కాని మీకోసరం?... ఈ భారాన్ని నాకు అప్పగించటానికే ఒకప్పుడు మీరు నన్నిఇంటికి తీసుకొచ్చారు—''

## 8

డాక్టర్ని పంపించేసి పరమసంతోషంతో రాఘుల్ కొత్తమ్మదగ్గరికి వచ్చాడు. రేణుకు నయమయింది, ఇవాళ నిశ్చింతగా ప్రశాంతంగా నిద్దరోయిందని ఆమెతోనూ, పెదనాన్న అయిన వ్రజబాబుతోనూ చెప్పాడు

తరవాత – సవిత వ్రజబాబు గదితలుపు తీసుకు లోపలికెళ్ళి, మంచం మీద కూర్చుంది. నా ప్రశ్నకు జవాబు చెప్పారేకాదు'' అన్నది. అందుకతడు ''ప్రశ్న ఎవరువేసినా జవాబు చెప్పడం ఎప్పుడూ నువ్వే!—అకస్మాత్తుగా నా లక్ష్మీసరస్వతులిద్దర్నీ నువ్వే మాయంచేశావు. నా బుద్ధీ వివేకం లుప్తమై పోయినై. నా కొద్దిజ్ఞానంతోనే ఎన్నో చిక్కుప్రశ్నలకు జవాబులు చెప్పుకుంటూ వచ్చా, ఏంలాభం?– నాకు సంభవించిన 'దుర్గతి' నీకు తెలియంది కాదు.''

తీవ్రంగా ఆలోచించినమీదట సవిత అడిగింది—"సరేగాని చినబాబూ వ్యాపారమంతా నిజంగానే ధ్వంసమైపోయిందా ? ఇప్పుడు మీదగ్గర ఎంత మిగిలింది ?"

"ఏమీలేదు. చేతికున్న వజ్రాల ఉంగరం అమ్మితే ఐదువంద లొచ్చినై. దానితోనే కాలక్షేపం..."

"ఏం ఉంగరం ? నే దీక్ష పుచ్చుకున్నప్పుడు గురుదక్షిణగా మీ కర్పించినదా. అదీ అమ్మేశారూ ? సరే—అయితే మరి, కొత్తగా పెళ్ళి చేసుకున్నామెకు ఏం మిగిల్చారూ ?" అనడిగింది.

"ఆవిడ పేర 'పటల్‌డాంగా'లో రెండిళ్లు, నగానట్రా, కొంచెం చరాస్తి ఉన్నది. అంతాకలిపి పాతిక ముప్ఫయివేలదాకా ఉండొచ్చు, దానితో ఆమెకూ సంతతికీ గడిచిపోవచ్చు."

"మరి రేణుకకు ?"

"ఏమీ లేవు. కొద్దిగా నగలుండాలి. అవీ పొరపాటున ఆవిడే తీసుకెళ్ళినట్టుంది." ఈమాట విని సవిత తల వంచుకూర్చుంది.

మళ్ళీ వ్రజబాబే ప్రారంభించాడు— "రేణుకి కాస్త నయంకాగానే మా వూరు వెళ్ళిపోదామనుకుంటున్నాం. అక్కడే ఎవరైనా దయతలిస్తే పిల్లదానికి ముడెట్టిం చేదామనుకుంటున్నాం. అయితే—'నాన్నా ! పెళ్లిప్రసక్తి వద్దు. మనవూరు పోదాం' అని ఒకేపట్టు రేణుక. 'దురదృష్టవంతురాలి జీవితానికి 'సుఖం' ఎందుకుంటుంది నాన్నా ! వట్టి భ్రమ. నా నొసట విధాత అదే రాసిపెట్టాడు. నా గురించి మరి ఆలోచించకండి, శ్రమ పడకండి," అన్నది రేణు, అంటూవుంటే అతని గొంతు వేదనతో నిండిపోయింది. సవిత కళ్ళనిండా అశ్రువులునిండినయ్.

"నువ్వేం చెయ్యాలనుకుంటున్నావ్ కొత్తకోడలూ ? ఎన్నటికీ కూడా రేణు నీ సహాయాన్ని కోరదనే సంగతి నాకు తెలుసు. ఇహ నా సంగతా ?..."

ఆగలేక అకస్మాత్తుగా సవిత అడిగింది : "నేను బతికున్నాననే సంగతి రేణుకు తెలుసా చినబాబూ ?"

"ఎందుకు తెలియదూ ? నువ్వీ కలకత్తాలోనే ఉంటున్నావనీ, అనంతమైన ఐశ్వర్యాలలో మునిగి తేలుతున్నావని కూడా తెలుసు."

ఈ మాటకు చచ్చిపోదామనిపించింది సవితకు. తలెత్తి భర్తముఖం చూశాక అతడి కళ్లనుండిపోయింది.అశ్రుబిందువులు జారటం గమనించి ఎన్నో విషయాలు జ్ఞాపకమొచ్చాయి !

ఒక ఒడ్డున కులత్యాగిని అయిన తను నిలబడి వుంది. అవతలి ఒడ్డున భర్తా బిడ్డా నిలబడివున్నారు. ఉభయుల మధ్యనీ ఉన్నవి లోకం, ఇల్లూ వాకిలీ, నీతీ నియమం, సమాజధర్మం, మరెన్నో. దేవుడా అని విలపిస్తేనూ, భర్త పాదాలపై పడితేనూ ధర్మాలను తిరస్కరించడం కుదురుతుందా? మరి మాటాడ లేక, భర్తకదా అనే గౌరవంతో మరొక్కసారి శిరస్సు వంచి నమస్కరించి లేచి నిలబడింది.

*　　*　　*　　*

ఇవాళ్టి సంఘటనలన్నీ మాటిమాటికీ సవిత మనసులో దొర్లుతున్నాయి. గత పదమూడేళ్ళకు మునుపు సవిత ఏయే అనుబంధాలతో గడిపిందో, సరిగ్గా అలానే ఇవాళ కాలం గడిపింది—భర్త, కన్నబిడ్డ, పెంచిన రాఘాల్, ఇష్ట దైవం గోవిందుడు! ఈ కుటుంబంతో బాంధవ్యాలు తెగిపోయిన తరవాత ఇంచుమించు ఆమె అజ్ఞాన జీవితమే గడిపింది.

తన తండ్రి దరిద్రుడనీ, సుఖభోగాలకేమీ ఆస్కారంలేదనీ రేణుకు తెలుసు. ఆమె విచారించక ధైర్యంతో ఉండబట్టే వళ్ళు నయమయాక సొంతఊరెళ్ళిపోయి, వృద్ధుడైన తండ్రికి సేవచేస్తూ జీవితం గడపాలని నిశ్చయించుకుంది.

తల్లి బతికే ఉన్నదనీ, ఐశ్వర్యాలలో మునిగి తేలుతున్నదనీ రేణుకు తెలుసు నని వ్రజబాబే అన్నాడుగా! ఈమాట జ్ఞాపకం వచ్చినప్పుడల్లా సవిత సిగ్గుతో కుమిలి కుమిలి ఏడ్చేది.

రేణును స్వయంగా తను చూళ్ళేదు. రాఘాల్ చెప్పగా వినటమే! పిల్ల అచ్చగా తన పోలికేననీ తరుచు అంటూవచ్చాడతను.

నిరంతరమూ గోవిందుని సేవలో మునిగే ముసలితండ్రి లోకం సంగతి ఏం పట్టించుకోడు. నిరాధారురాలయిన రేణుకు సానుభూతి చూపే ఆత్మీయు లెవరూ లేరు. ఎలా జీవితం గడపడం? మళ్లా ఇలానే జబ్బుపడితే? ముసలితండ్రి అకస్మాత్తుగా చచ్చిపోతే? ఏమిటి రేణుక గతి? ఆలోచిస్తున్నకొద్దీ తన సంతా నాన్నే తనకు దూరంచేసిన పాపిష్ఠి లోకాన్నీ, ఈ యమయాతననూ, నరకాన్ని సృష్టించిన దుష్ట లోకాన్ని నిందించాలనిపించింది.

*　　*　　*　　*

ఇంటిముందు బండీ ఆగేసరికి సవిత మళ్లా మామూలుస్థితిలో పడింది. "బాబుగారివాళ మహాకోపంగా వున్నారమ్మా. చాలాసేపయింది వచ్చి" అని దాసీది చెప్పింది. 'సరే! నువ్వెళ్లి నీపని చూచుకో' మని దాసీని పంపేసింది, సవిత.

ఆమె స్నానంచేసి బట్టలు మార్చుకుని వీధిగదిలోకి వచ్చేప్పటికి దీపాలు వెలుగుతున్నాయి. సవితను చూస్తూనే విమలబాబు లేచి నిలబడి ఆరోగ్యం ఎలా వున్నదని అడిగాడు. 'బాగానేవుంది. కూర్చోండి' అన్నదామె. అప్పటిదాకా ఉదాసీనంగా వున్న రమణిబాబు ఉగ్రుడయ్యాడు.

"ఎక్కడికి కెళ్ళావ్ ఇవాళ?"

"పనుండి వెళ్ళా."

"ఈమధ్య నీకు స్వతంత్రం ఎక్కువయిందే! ఇంటిపట్టున ఉండటమే అరుదుగావుంది. ఏమిటా సొంత పన్లు?"

"మీరు తెలుసుకో నవసరంలేదు..." అంటూ విమలబాబుతో "ఇవాళా వెళ్లలేదా మీరు?"

"లేదు, మా పెదనాన్నగారికి బాగా నయమయేవరకూ ఉండాల్సి వచ్చేట్టుంది" అని చెప్పాడు.

మధ్యలో అడ్డువచ్చి "హుఁ - నన్నడక్కుండా వెళ్ళావుగదూ?" అని గద్దించాడు, రమణిబాబు.

"మీ రప్పుడు లేరిక్కడ" అన్నది సవిత

మరింత రెచ్చిపోయి మండిపడ్డాడు రమణిబాబు; "ఉన్నానో లేదో నాకు తెలుసు. ఇవాల్టినించి నన్నడక్కుండా కాలు కదిపిచూడు, ఏం జరుగుతుందో!" అన్నాడు. ఈ గొడవచూసి విమలబాబు వెళ్లొస్తానన్నాడు.

"కాదు, కూర్చోండి! కూర్చోండి!! ఈ సిగ్గుమాలినతనం ఇహ నేను సహించలేను" అన్నాడు రమణిబాబు.

తీక్షణంగా చూస్తూ, అడిగింది సవిత- "ఏమిటా సిగ్గుమాలినతనం?"

"అదే - అదే - అడ్డమైన తిరుగుళ్ళూ... ఆ సంగతి!"

"పనున్నా వెళ్ళకూడదా?"

"కూడదు! నాకు తెలీకుండా నువ్వెక్కడికీ వెళ్ళకూడదు."

"ఇంతకాలమూ ఆమాటే పాటిస్తూ వచ్చా. అయినా నామీద ఆమాత్రం విశ్వాసం లేకపోయిందీ! ఎందుకో ఈ అపనమ్మకం?"

"ఎందుక్కూలగదూ? నువ్వేం సీతవా, సావిత్రివా? ఇదివరకే ఒకళ్లని మోసగించి వచ్చావు. అలాంటిదానివి నన్ను మాత్రం మోసగించవని నమ్మకమేమిటీ?"

ఈ సంభాషణకు విమలబాబు సిగ్గుతో కుమిలిపోయాడు.

సవిత రమణిబాబును చాలాసేపు మౌనంగా పరకాయించి చూసి, నెమ్మదిగా చెప్పింది - "చినబాబూ! నేనెన్నడూ అబద్ధమాడనని నీకు తెలుసుగా? ఇవాల్టి నించీ మన బాంధవ్యం సరి! ఇహ రేపటినుంచి నువ్వు నా ఇంటికి రావలసిన పని లేదు!" అంటూ కచ్చితంగా చెప్పింది సవిత.

ఇంతకు ముందెన్నోసార్లు ఇలా ఘర్షణలు జరిగినై. కాని ఇంత తీవ్రస్థాయికి రాలే. ముఖ్యంగా - తమమధ్యనున్న ఈ రహస్యం బట్టబయలవుతుందేమో నన్న భయంతో చాలావరకు ఆమె సహించి ఊరుకునేది. అలాటి సవిత నోటి వెంబడే ఈ మాటలు రావడంతో రమణిబాబు నిశ్చేష్టుడయ్యాడు. అందులోనూ మూడోవ్యక్తి సమక్షంలో! కనుక మరీ పౌరుషం ముంచుకొచ్చింది

"అలాగేలే! ఇంతకీ ఈ యిల్లెవరి దనుకుంటున్నావు? నీదా? ఆ మాట చెప్పటానికైనా సిగ్గులేదూ?"

"అవునవును. ఈయిల్లు నాదీ కాదు, నీదీ కాదు. నువ్విచ్చిన ఇల్లు. సరే, రేపుదయానే నేను ఇంకోచోటికి వెళ్లిపోతాను. పదమూడు సంవత్సరాల తర్వాత చివరిసారిగా నేను వెళ్ళిపోయేటప్పుడు సితాలూకు చిల్లిగవ్వ అయినా నావెంట తీసుకెళ్లను! అంతా నీకే విడిచిపెట్టి పోతా!"

కలవరపడ్డాడు రమణిబాబు, గప్పుమని తగ్గి. "రేపా? రేపెట్లా వెళతావ్?" అనడిగాడు.

"అవును. రేపే వెళిపోతా."

"నే వెళ్ళనియ్యొద్దూ?"

"అడ్డగించబోకు, వ్యర్థప్రయత్నం చెయ్యకు, చినబాబూ! మన బంధాలన్నీ తెగిపోయినయ్! ఇహ మరి ముడిపడవు, సాధ్యంకాదు!" అని చెప్పింది.

భయపడుతూ రమణిబాబు-"కోపంకొద్దీ ఈయిల్లు నీదికాదంటే నిజమే అనుకున్నావా?" అని మందలించబోయాడు. ఇంకా ఇలా అన్నాడు - "ఇదంతా అర్థంలేని కోపం తీరా కోపం చల్లారాక, ఇంత భవనాన్ని నిష్కారణంగా పోగొట్టుకున్నానే అని బాధపడతావు. బాధ నిన్ను అహర్నిశలు వేధిస్తుంది. నేనింక అట్టే మాట్లాడలేను. ఇప్పటికే అలిసిపోయా!" అన్నాడు.

"విమలబాబూ! ఇహ మనం బహుశా కలుసుకోలేమనుకుంటా. రేపే నేనువెళ్లి పోతున్నా" నని చెప్పింది సవిత.

"ఎక్కడికి వెళతారూ?"

"నిర్ణయిచుకోలేదింకా"







"వెళ్ళేముందు మరోసారి కలుసుకుందాం. మళ్ళీ కనిపిస్తా" నన్నాడు విమల బాబు

"వీలుంటే కనిపించండి, నే వెళ్తున్నా" అంటూ ఇద్దరికీ నమస్కరించి వెళ్ళి పోయింది.

"రమణిబాబూ! నేనూ వెళ్తున్నా. నా నమస్కారం కూడా స్వీకరించండి". అన్నాడు విమలబాబు.

## 9

ధనరూపంగా కాకపోయినా ఏదోవిధంగా అద్దెకున్నవాళ్ళందరూ సవితకు ఋణపడేవున్నారు. వాళ్ళంతా శారదను చుట్టేశారు. ఆమె సవితను కాళ్ళట్టుకు బతిమాలింది, ఎంతమాత్రం వెళ్లొద్దని.

అందుకు సవిత "నరకతుల్యమైనా కళ్ళుమూసుకు గడిపేశా, ఈ పదమూ డేళ్ళూ. ఇహ విముక్తి పొందుతా" నన్నది. వెళ్ళడం అనివార్యం అని చెప్పింది సవిత.

'ఈ ఇల్లెవరిది?' అని శారద అడిగితే "ఈయిల్లు రమణిబాబుది. అవన్నీ కోర్టు వ్యవహారాలు. నోటిమాటలతో దానం చేసినవాటికి అధికారాలేమిటో నాకు తెలీదు" అన్నది సవిత. అందుకు శారద గాభరాపడుతూ "లిఖితం జరగలేదా? ఇంత తెలివితక్కువపని ఎలా చేశావమ్మా?" అంటూ విచారం వెల్లడించింది.

"ఏంచేసినా ఇహ ఆయన తప్పేంలేదు శారదా! ఇకమీదట నాతో మాట్లాడ్డానికిగానీ పోట్లాడ్డా కిగానీ నా ఎదటికి రావద్దు అని చెప్పేస్తా" అన్నది సవిత.

ఆ తరవాత ఇద్దరూ తమతమ జీవితాలను పోల్చి చెప్పుకున్నారు. ఎన్నో సంఘటనలు జ్ఞాపకానికి తెచ్చుకున్నారు. "ఆనాడు 'ఆయన' నన్ను ఒంటరిగా విడిచి పెట్టిపోతే... పిచ్చిదాన్నయిపోయానుగా? అజ్ఞానంవల్ల పరిస్థితులు అర్థం చేసుకోలేక భయంతో విషంతాగి చావ సిద్ధమయ్యాను గాని లేకపోతే అంత సాహసం చెయ్యగల్గుదునా? మీరు నిర్భయంగా నిశ్చింతగా ఉంటే ఎలా కుదురుతుందమ్మా,''

"నీ పరిస్థితి కేవలం నిరాధారం! నాపరిస్థితులు వేరు. నేనా మధ్య కొంత ఆస్తి చవకగా కొన్నాను తెలుసుగా. అదంతా నా సొంతమే!'' అని చెప్పింది సవిత.

''దాన్ని గురించి గొడవలు రావుకదా!''

"అది నా భర్త ఆస్తి శారదా! నా ఆస్తి. నా ఆస్తిని గురించి అడిగే హక్కెవరికుంది?" ఈవిధంగా తన వ్యవహారాలన్నీ దాపరికం లేకండా ఆ పిల్లముందు మాటాడసాగింది, సవిత.

* * * *

ఇంతలో దర్వాన్ మహదేవ్ వచ్చి 'అమ్మగారూ, బండి తెచ్చా' నన్నాడు. సవిత మెట్లు దిగేసరికి శారదకూడా సిద్ధంగా నిలబడివుంది. "అమ్మా, నేనూ వస్తా మీ వెంట. అక్కడ రాఘుల్‌బాబు ఉంటారుకదా. నన్ను గురించి ఆయనేమీ అనుకోరు" అన్నది.

"సరేకాని, నువొచ్చి మాత్రం అక్కడ చేసేదేముంది శారదా?" అన్నది. సవిత.

"నాకు తెలుసమ్మా రేణుకు సుస్తీగా వుందిగా? ఒక్కసారి చూసొస్తా. ఆమె తండ్రిగారినికూడా దర్శనం చేసుకుని పాదాభివందనం చేసుకోవాలనుంది అమ్మా!" అంటూ, బండీలో వెళ్లి కూర్చుంది.

వెళుతుండగా "రేణు తండ్రిగారెలా ఉంటారమ్మా?" అనడిగింది శారదా.

సవిత నవ్వి ఇలా అన్నది – "విను శారదా! ఆయనెలా ఉంటారో చెబుతా! ఒక వైష్ణవుడు, వృద్ధు, నాకంటే చాలా పెద్ద, పిలక, నెరిసిపోయిన జుట్టు, ఆజానుబాహు, పూజలూ పురస్కారాలు ఉపవాసాలతో శరీరం శుష్కించి వుంటుంది, ఇలాంటి మనిషి నీకు నచ్చుతాడా?"

యు.వ.



"ఊహుఁ- నాకు నచ్చరు, మీకో?" అనడిగింది శారద.

"భర్త అంటే నచ్చడం, నచ్చకపోవటం కాదమ్మా శారదా!- అంగీకరించాల్సిందే. ఇది తర్కం కాదు, వేదాంతం కాదు తీసి పారేయటానికి. సంసార జీవితంలో భర్త యౌవన రూపాలు స్త్రీకి ముఖ్యం కాదు..."

అంటూవుంటే శారద "అమ్మా! ఒక్క సంగతి తెలుసుకోవాలనుందమ్మా! కాని..." అని ఆగిపోయింది.

"కాని...ఏమిటే? ఇహ నాకు సిగ్గేముంది? ఎందుకుంటుంది? అడగదలిచిన దేమిటో నిర్భయంగా అడుగమ్మా!" అన్నది సవిత. శారద ఊరుకుని ఉండటం చూసి మళ్లా చెప్పింది—

"నాకీ దుర్గతి ఎందుకు పట్టిందో తెలుసుకుందామని...అంతేనా? ఎంత గానో ఆలోచించా, నా అంతరాత్మకు తోచిందల్లా పూర్వజన్మకు ఫలితమైన కర్మానుసారం. అంతే. ఇహనేం జవాబు దొరకలే." ఇంకా ఇలా చెప్పింది, సవిత.

"ఏ వ్యక్తికయితే నేను నిన్న పీడోౘలు చెప్పానో, ఆయన్ని నా భర్త కంటే ఎక్కువగా ఎన్నడూ గౌరవించలేదు. ఎన్నడూ ఆయన్ని ప్రేమించనూ లేదు. అయినా నా జీవితంలో ఒక యుగమంతా ఆయన ఇంట్లోనే గడిచిపోయింది."

సిగ్గువిడిచి ఇలా అడిగింది శారద: "ఇవాళ కాకుంటే ఆనాడయినా రమణిబాబుని నిజంగా మీరు ప్రేమించలేదా?"

"లేదమ్మా. ఈనాడూ లేదు, ఆనాడూ లేదు," అని చెప్పింది సవిత.

"అటయితే ఇంతకాలం ఎలా జరిగింది?"

మళ్లా సవిత నవ్వి ఇలా అన్నది – "కాలుజారటానికి కారణమేముంటుందీ? అది అకస్మాత్తుగా అర్థరహితంగానే జరిగిపోతుంది. ఈ పదమూడేళ్ల జీవితంలో ఎంతో మంది స్త్రీలను నే చూశా. వాళ్లంతా సర్వభ్రష్టులై ఏ గంగలో కలిశారో!"

* * *

బండీ వచ్చి ఆగింది. మహదేవ్ తలుపు తెరిచాడు. సవిత, శారద ఇద్దరూ దిగారు. ఇల్లు తలుపు తీసేవుంది. కింద ఎవరూ లేరు. మెట్లెక్కుతున్నప్పుడే పైభాగంలో పదహారేళ్ళ అమ్మాయి కనిపించింది. ఆ పిల్ల కూరలు తరుగుతూన్నది. వీళ్ళని చూడ్డంతోనే 'రండి, రండి' అని పిలిచింది. ఇద్దరికీ కూర్చునేందుకు చాప పర్చి. సవిత పాదధూళి తీసుకున్నది.

'ఇంత పెద్దదయిందే రేణుక! ఆనవాలు పట్టలేక పోయానే!!' అనుకుంటూ హృదయాంతరాల్లోనించి పొంగి పొరలి వస్తున్న దుఃఖం ఎంత యత్నించినా దిగమింగుకోలేక పోయింది సవిత. అకస్మాత్తుగా కళ్లవెంబడి అశ్రుధారలు ప్రవహించినై. దుఃఖం తగ్గలే. భోరున ఏడ్చేసింది.

## 10

ఎంత ప్రయత్నించినా సవిత దుఃఖం ఎక్కువవుతున్నదే గాని తగ్గలేదు. జ్వరపడి లేచిన ఆ పిల్ల అవస్థపడుతూ కూరలు తరుగుతూనేవుంది. అక్కడ



కూర్చున్న ముగ్గురి పరిస్థితీ సందిగ్ధంగా వుంది. ఎవరికి వారే లోలోపల మథన పడుతున్నారు.

కాస్త చొరవచేసి శారదే 'నీ ఆరోగ్యం ఎలా వుందమ్మా చెల్లీ?' అనడిగింది. కొద్దిగా కుశలప్రశ్నలు నడిచినై. కొద్ది నిమిషాల్లో రేణుక లేచివెళ్ళి చిన్న చెంబుతో నీళ్లతెచ్చి "రేమ్మా! కాళ్లు కడుక్కో!" అన్నది సవితతో. ఒక్కసారి సవిత బిడ్డని గుండెలకు హత్తుకుని స్మృతిలేకుండా పడిపోయింది. తెలివి వచ్చేసరికి తను శారద ఒళ్లో తలపెట్టుకు పడుకునుంది, ఎదురుగా పిల్ల విసురుతూవుంది.

ఆ తరువాత సవిత పిల్లదాని తలంతా నిమిరింది. జడలు కట్టిన జుత్తు చిక్కులుతీస్తూ కూచుంది రేణుకలేచి ఠాకూర్ పూజకి అన్నీ సిద్ధంచేశానని చెప్పింది. పాత సంగతులెన్నో దొర్లినై. శారద ఏదో ప్రశ్నవేస్తే దానికి జవాబుగా రేణుక తల్లితో అన్నది—"నా కప్పుడు తొమ్మిదేళ్లుంటాయేమో! నాన్నగారు నన్ను పిలిచారు. దుఃఖంతో నన్ను దగ్గరగా కూర్చోబెట్టుకుని అడిగారు—'నా గోవిందుడి సేవాభారం ఒకప్పుడు మీ అమ్మ నిర్వహించేది. ఇకనించి ఆ భారాన్ని నువు స్వీకరించి నెరవేర్చగలవా?' అని.

'నెరవేర్చగల నాన్నగారూ!' అని చెప్పా. అప్పట్నించీ ఠాకూర్ పూజాది కాలు నేనే చూస్తున్నా. పూజ అయేదాకా నిరాహారమే. జ్వరం భయమేలేకపోతే

ఇవాళ నేనూ మీతోపాటే కలిసి భోజనం చేసేదాన్ని" అన్నది. ఈ మాటల్లో మర్మం సవితకు సూటిగా హృదయానికి తగిలి, వేదన కలిగించింది.

తరువాత శారదను వెంటబెట్టుకుని రేణుక ఠాకూర్ పూజామందిరం చూపించింది.

*　　　*　　　*　　　*

"అమ్మా! నాన్నారు వచ్చారు!"

తుళ్లి పడింది సవిత. చప్పున లేచి నిలబడి "ఇంత ఆలస్యం చేశారేం? యిల్లు కదిలితే మళ్లా ఈ సంగతే గుర్తుండదు. చూశారా, ఎంత పొద్దుపోయిందో?" అన్నది. ఆలస్యానికి కారణం ఏదో వివరంగా చెప్పబోయాడు.

"ముందు స్నానం చేసుకుని ఠాకూరుపూజ టూకీగా ముగించండి!" అన్నది, సరే అన్నాడు వ్రజబాబు. ఆవేళకు ఎలానో భోజనాలయినై.

"భోజనం అయిందా? రేణుక నీకేం లోపం చెయ్యలేదుగదా?-ఏదో పేద వాళ్లం. అన్నీ సక్రమంగా ఉండకపోవచ్చు" అనడిగాడు.

"నాకేం లోపం జరగలేదు. కాని, మీ వెటకారం మాత్రం మీరు మానరు. అదొక్కటే నాకు బాధ. మీలాంటి భర్త లోకంలో మరెవ్వరికీ దొరకరనే సంగతిమాత్రం నేను చచ్చేదాకా మరిచిపోను" అన్నది సవిత.

నిట్టూర్చి అన్నాడు వ్రజబాబు—"అదికాదు కోడలూ! యింత హీనస్థితిని నువ్వు కళ్లారా చూడాల్సి వచ్చిందికదా అని నా బాధ! సరేగాని, అసలు నువ్వెందుకొచ్చినట్టు?"

"చూడలేకపోతే పరిపూర్ణమైన శాంతి నా కెలా లభిస్తుంది చినబాబూ! ఒకప్పుడు ఈ గోవిందుణ్ని నా చేతుల్తోనే పూజించా. అంచేతనే దయదలిచి ఆ గోవిందుడే మళ్లా నన్నిక్కడికి తీసుకు వచ్చాడేమో!" అన్నది. ఆమెకు కళ్లనీళ్ళు తిరిగినై.

వ్రజబాబుకి కొన్ని పాత సంగతులు గుర్తుకొచ్చాయి.

లోగడ ఒకసారి వ్రజబాబుకి వ్యాపారంలో పెద్ద నష్టం వచ్చింది. అటువంటి సమయంలో ఈమే అడ్డుపడి వ్యాపారం మళ్ళీ ఒకదారికి తెచ్చింది. ఈ సంగతి జ్ఞాపకమొచ్చింది. "అవునవును. యిప్పటిదాకా కొత్తకోడలు చచ్చిపోయిందనుకుని కొంతమంది నిశ్చింతంగా నిద్రపోతున్నారు యివాళ మళ్ళీ నీ ఉగ్రరూపం ప్రదర్శించావంటే వాళ్లు హడిలి చస్తారు."



మస్కా అన్నాడు — ''నాకూ జీవితం అస్తమయం కావస్తోంది. ఆలోచించేశక్తి నాలో లేదు. నేననుభవించే బాధనూ దుఃఖాన్నీ నువు అర్థంచేసుకున్నట్టు మరెవళ్లూ అర్థంచేసుకోలేరు. ఆయన ఆహ్వానంకోసం ఎదురు చూస్తున్నా......''

"ఇప్పుడు నిజంగానే మీరేం చెయలేరా ? నిజంగానే జీవితంలో మీరు అలసిపోయారా ? అయితే ఇప్పుడేం చెయ్యదలుచుకున్నారు ?''

"రేణుకని వెంటబెట్టుకుని స్వగ్రామం వెళిపోతా.''

"మరి రేణుక భారాన్ని ఎవరికి అప్పగిస్తారు ?''

''భగవంతుడికే, మరో ఆశ్రయం కనబడదు.''

కన్నబిడ్డ భవిష్యత్తును భగవంతుడికి అప్పగించి నిశ్చింతంగా కూర్చున్నందుకు సవిత హృదయం కల్లోలమయింది.

''చినబాబూ ! ఒక్క మాటడుగుతా, నిజం చెబుతారా ? నా నేరానికి శిక్ష విధించటానికేనా నా డబ్బు నాకు అప్పగించింది ? శిక్షించేందుకు మరో మార్గం కనబడలేదా ?''

"ఎప్పుడైతే నువు నీ భర్తని సయితం కాలదన్ని వెళిపోయావో, ఆనాడే నిశ్చయించుకున్నా...మళ్లా మనం కలుసుకోవటం జరిగితే నీ సొమ్ము నీకు అప్పగించాలని, అలానే చేశా. ఋణవిముక్తుడ నయ్యాను.''

"జన్మ జన్మాంతరాల్లో కూడా నా సంబంధ బాంధవ్యాలేవీ ఉండ కూడదనేగా మీరీ పనిచేసింది? అంతేనా చినబాబూ?"

మాటాడలే వ్రజబాబు.

''అయితే మీరందరూ ఇంటికి ఎప్పుడు వెళతారు?''

"త్వరలోనే......"

''సరే, అయితే నేను వెళ్లనా?"

"మంచిది."

లేచి నించుంది సవిత. అంతా అర్థమయిం దామెకు. తన అభిప్రాయాలకు ఆశలకూ ఇక్కడ విలువలేదు వాటికర్థంలేదు. జీవితంలో దౌర్భాగ్యభరిత మైన ఆనాటిరాత్రి ఉభయుల మధ్యనీ ఏర్పడిన పాషాణంవంటి అడ్డుగోడ ఈనాటికీ అభేద్యంగానే వున్నది. వృద్ధుడు, సదాచార పరాయణుడు, ప్రశాంత మూర్తి అయిన ఆయన ఇంత కఠినుడని ఆమె ఎన్నడూ ఊహించనైనా లేదు.

వెళ్లబోతున్న సవిత ఆగి చెప్పింది — "చినబాబూ! కడపటి మాట! మీరు ఎంతోమంది అపరాధులను సహృదయంతో క్షమించారు. కాని నా ప్రార్థనమట్టుకు పెడచెవిని పెట్టారు. నేను పశ్చాత్తాపపడినా క్షమాభిక్ష ప్రసాదించలేకపోయారు. కనుక మీరెంత భక్తులైనా మీకు పుణ్యం దక్కదు, ముక్తిలేదు. ఈసంగతి ఈనాడు కాకపోయినా ఎప్పటికయినా మీరు గుర్తిస్తారు!"

అన్నీ విని ఊరుకున్నాడు వ్రజబాబు. వెళ్ళేటప్పుడు రేణుక తల్లి పాదాలకు నమస్కరించింది గాని, సవిత మాటాడక మౌనంగానే వున్నది.

శారదను వెంటబెట్టుకుని సవిత వెళ్లిపోయింది. తీరా బండిలో కూర్చున్న సమయానికి అటునుంచి తారకుడితో కలిసి రాహూల్ ఇటుగానే వస్తున్నాడు. "అమ్మా! ఒక్క క్షణం ఆగు!'' అంటూ తారక్ సవితకు నమస్కరించాడు. లోపల్నుంచి పొర్లివస్తున్న దుఃఖంవల్ల ఆమెకు మాట పెగల్లేదు. చేత్తోనే సైగ చేసింది. ''రండి నాయనా; నాతోపాటు మీరూ రండి!" అన్నమాట మాత్రం చెప్పగలిగింది.

## 11

రాహూల్ ద్వారానే సవితకు రెండు సంగతులు తెలిసినై: కూతుర్ని వెంట బెట్టుకుని వ్రజబాబు గ్రామానికి వెళ్లిపోయాడు. రెండవది - వ్రజబాబు కొత్త భార్యా, ఆమె కుమార్తె మాత్రం కలకత్తాలోనే అన్నగారి సంరక్షణలో వుంటు

న్నారు. పుష్కలంగా డబ్బుంది. కేవలం ఇంటి అద్దెలమీదనే జీవితం గడిచి పోతుంది. అదీగాక నగా నట్రా, బోలెడంత వడ్డీవ్యాపారం ఉండనే వున్నాయి.

సవిత సందెవేళ ఒకత్తే కూర్చుని తీవ్రాలోచనలో పడింది— ఈ చిత్ర విచిత్ర వాంఛవ్యాలూ, రాగద్వేషాలు! ఎన్నడూ ఎవరూ ఊహించని పరిణామాలు ఇవన్నీ.

ఇటీవల రమణిబాబూ తరచు రావడంలే రావాలని సవిత మనస్సులోనూ లేదు. అంతా మిథ్యగా కనిపిస్తూందామెకు. తన ఇంట్లో అద్దెకున్నవాళ్లలో ఒకతె అయిన శారద తన హృదయంలో ఎలా స్థానం సంపాదించుకోగలిగింది ? ఇదీ శాశ్వతం కాదు.

విమలబాబు సంగతీ అలానే. మృదుభాషి, శ్రేయోభిలాషి, సనక ర కాదు. జీవితపు లోతులూ మచ్చలూ వెతికే దుర్గుణంలేదు. నియమ నిగ్రహాలు కలవాడు. కాలం విలువ తెలిసి, దాన్ని సద్వినియోగం చేసుకుంటాడు. అంత మర్యాద, సభ్యత, తెలిసి మసిలేవాడు కనకనే సవితకు భయం! అయినా ఇద్దరిమధ్యా చనవుగా సంభాషణలు నడిచేవి. దూరంలో శారద కనిపించేది. ఆమెను పిలిచి మంచినీళ్లడిగి పుచ్చుకునేవాడు. ''ఇహ నే వెళ్లిరానా ?" అని అడుగుతాడు చివరకు. "సరే వెళ్ళిరండి!" అంటుందామె. నాలుగైదు రోజులుగా ఇలానే జరిగింది.

* * * * *

మామూలు ప్రకారం ఇవాళకూడా విమలబాబు లేచినిలబడి "మరి వెళ్లి రానా ?" అన్నాడు.

''అహఁ — ఇవాళమాత్రం దయుంచి మరి కాస్సేపు కూర్చోవాలి" అని చెప్పింది సవిత.

''రమణిబాబుని ఎప్పుడైనా కలుసుకుంటూ వుంటారా ?'' అనడిగింది.

''తరుచు..."

''ఆయనిప్పుడు ఇక్కడికి రావటంలేదు, తెలుసా ?''

"ఎందుకు తెలియదు ?"

''అయితే — ఇహ రారా ?''

"మీరు కబురంపితే రావచ్చు."

''ఇవాళ పొద్దుట పోస్టులో ఒక దస్తావేజు వచ్చింది ఈ యిల్లు నాకు అమ్మి, రిజిస్టరుచేసిన దస్తావేజు అది. తెలుసా ?"

''తెలుసు!"

''ఈ ఇల్లు నాకివ్వాలనే అభిప్రాయమే వుంటే దానపత్రం రాస్తే సరిపోయే దిగా? ఈ తతంగమంతా ఎందుకూ? నిజానికి నేనాయనకేం డబ్బివ్వ లేదుగదా?"

ఇలాంటి విషయాలు వీరిద్దరూ ఇంతకుముందెప్పుడూ మాటాడుకోలేదు. అవసరమూ కలగలేదు. ఇవాళ సవిత నోటివెంబడి ఈ ప్రసక్తి విని విమలబాబు విచలితుడయ్యాడు. ''నిజానికి దస్తావేజు అలా రాయటంలో పొరపాటేమీ లేదు. కొత్తకోడలూ?'' అన్నాడు.

"కొత్తకోడలూ!" అని ఆయన పిలవడం నిజంగా కొత్తవిషయమే. "నేనేదైతే అనుమానించానో, సరిగ్గా అదే జరిగింది విమలబాబూ! డబ్బు మీరు చెల్లించివుంటారు. ఎందుకల్లా చేశారు? సరాసరి ఆయన నాకు దానంచేస్తే పుచ్చుకోటంలో కొంత అర్థముంది. కాని మీ దగ్గర్నుంచి తీసుకోవడం 'యాచన' కాదూ? ఇలాటి భిక్షను నేనెందుకు స్వీకరించడం? మీరే చెప్పండి!"

మౌనంగా కూర్చున్నా డాయన. "మీరు సమాధానం చెప్పకపోతే దస్తావేజు తిప్పి పంపేస్తా విమలబాబూ!" అన్నది.

''ఆశ్రయంకోసరం మీరెక్కడికైనా వెళిపోతారేమోనని భయపడి అలా చేశా. ఇవ్వకుండా ఉండలేకపోయా. అందుకనే ఈ యిల్లు కొన్నా."

'అయితే ఆయన మీ దగ్గర డబ్బు తీసుకున్నారా?'

"ఆయనకి డబ్బు అవసరాలు లోలోపల చాలా వున్నాయి. ఎంత ఆరాట పడినా సమర్థించుకోలేకపోతున్నాడు."

''స్థితి అంతవరకూ వచ్చిందనుకోలేదు. సరేగాని, మీరు బాగా ధనవంతులనీ డబ్బు లెక్కచెయ్యరనీ విన్నా. ఇవ్వగలిగి మీరిస్తేమాత్రం నేనెల్లా తీసుకుంటాను? మీరు జవాబు చెప్పితీరాలి!"

"ఒక ఆప్తమిత్రుడు ఇచ్చినట్టుగా మీరు అంగీకరించవచ్చు!" నన్నాడు విమలబాబు.

"మీరు మిత్రులే, కాదనను ఇప్పుడిక్కడ మీరూ నేనూ తప్ప మరెవరూ లేరు. నా ఎదుట చెప్పటానికి ఎందుకు సందేహం? మీరన్నమాట నిజంగా మీ మనసులో మాటేనా?"

"నా మనసులోమాట మీకెందుకు చెప్పడం? అందువల్ల లాభమేమిటీ?"

సవితకు కళ్ళల్లో నీళ్ళు నిండిపోతున్నయ్. ''నా గత జీవితచరిత్ర మీకు తెలుసా విమలబాబూ?"




''ఏం జరిగిందో తెలియదు. తెలుసుకోవాలనీ లేదు. అందరికీ ఎంతవరకూ తెలుసో, నాకూ అంతవరకే తెలుసు కొత్తకోడలూ! అంతకుమించి మరేమీ తెలీదు,'' అన్నాడు.

ఆశ్చర్యపడింది సవిత. లోలోపలే కల్లోలమైపోయింది. "నేను భర్తను వదిలేసి ఈ రమణిబాబుతో వచ్చేశానన్న సంగతి మీకు తెలుసుననుకుంటాను. కానైతే, ఈ సంబంధం కూడా మొన్నమొన్ననే తెగిపోయింది. కాబట్టి నేనేమంత మంచి ఆడదాన్ని కాను. కొంత కాలానికి మరొకరి ఆశ్రయాన్ని కూడా సంపాదిస్తానని మీ రనుకోవటంలేదూ ?''

''నేనలా అనుకోవటంలేదు. ఎందుకంటే మీజీవితంలోకి రావాలకున్న వ్యక్తిని ఆ ఛాయ కనిపించగానే అవతలికి గెంటివేశారు !'' అన్నాడు.

"మీరు పూర్తిగా ధార్మికులనుకుంటా !"

"అంటే మీ దృష్టిలో ఎలాంటివారు ? మీ భర్తలాంటి వారేనా సరిగ్గా ?"

ఆశ్చర్యంతో ''మీరు వారిని ఎరిగున్నారా ? వారితో పరిచయం వుందా ?" అనడిగింది సవిత.

"అవును, నాకు మీరు తెలుసు. పరిచయంకూడా బాగానే జరిగింది. ఒక్క విషయంలోమటుకు ఉభయులం భేదించాం."

"పోనీ, ఈ సంగతయినా చెప్పండీ — అలాటి సత్పురుషుణ్ని, సదయ హృదయుణ్ని, వదిలేసి ఈ స్త్రీ ఎలా బయటికి వచ్చిందా అనైనా అనిపించలేదా ?"

"స్వయంగా మీరు పరిత్యజించ లేదుగా ? మీ కుటుంబం, చుట్టుముట్టిన సమాజం మిమ్మల్ని ఆ స్థితికి ఈడ్చుకొచ్చాయి. అంతా తెలుసు నాకు."

''అలా చేసినందుకు వాళ్లమీద నాకేం పగలేదు! అది మంచికే వచ్చింది ఒక విధంగా. భర్త సంసారాన్ని అపవిత్రం చేస్తూ అక్కడ పడివుంటం కన్నా, చేసిన పాపాలను శిరసావహించి బయటికి రావటమే మేలు — ఎన్ని భోగట్టాలు, ఎన్నిగుట్లూ తెలిసికూడా మీరు నన్నెందుకు ప్రేమిస్తున్నారూ? గత జీవితపు నా భ్రష్టచరిత్ర తెలిశాకకూడా ఏం చూసి నన్ను ప్రేమిస్తున్నారో నాకర్థం కావటంలే. వయస్సా, పెరిగిపోతున్నది రూపమా, తరిగిపోతున్నది. ఏ కొంచ మైనావుంటే అదీ త్వరలో మాసిపోయేదే ..."

"కొత్తకోడలూ! ఒకవేళ నేను ప్రేమించడం జరిగితే ప్రస్తుతరూపాన్నీ యౌవనాన్నీ చూసికాదు. ఈమాట నువ్వు సహృదయంతో అర్థంచేసుకుంటే కృతజ్ఞుణ్ని." ఈ విషయంలో నాకు స్వార్థం లేదు. నేను నీ భర్తనీ కుమా ర్తెనూ చూశా. ఆయన అన్ని రుణాలూ తీర్చుకుని కూతుర్ని వెంటబెట్టుకు వెళ్లడమూ నాకు తెలుసు. అన్నీ తెలిసికూడా మిమ్మల్ని పొందగలననుకోడం భ్రమతప్ప మరేవిటి? — అందువల్లనే నన్ను మీ ఆప్తమిత్రుడుగా మాత్రమే అంగీకరించమని కోరుతున్నా కొత్త కోడలూ!"

"ఈ మిత్రత్వం మాత్రం ఎంతకాలం నిలుస్తుంది విమలబాబూ! స్త్రీ పురు షుల మధ్య సంబంధం ఎప్పుడో ఒకప్పుడు మనల్ని అధఃపాతాళానికీడ్చుకు పోతుంది. దాన్ని ఎవరాపగలరు?"

"ఎప్పుడైనా నన్ను బాగా అర్థంచేసుకుని మీ అభిప్రాయం మార్చుకుంటే, ఆనాడు నన్నాహ్వానించండి. ఎక్కడయినా జీవించివుంటే, ఆనాటికి తప్పక మీ వద్దకువస్తాను. అప్పుడయినా మిమ్మల్ని శిరసావహించటానికి వస్తా, వంచించి మిమ్మల్ని పొందటంకోసం మాత్రం కాదు."

"వర్థమానజిల్లాలో ఎక్కడో మాస్టరీ ఉద్యోగం చేస్తున్నాట్ట తారకుడు. నన్నోసారి అక్కడికి రమ్మని లోగడే పిలిచాడు. కొంతకాలంపాటు అక్కడ ఉందామని .."

"వెళ్ళిరా."

''అయితే మీరు కలకత్తాలోనే ఉంటారా?''

''అక్కడ మరో కార్యస్థానం ప్రారంభించాం. చాలా వ్యవహారాలు చూడాలి. కనక ఉండాల్సిందే.''

"అవునుగాని విమలబాబు; ఇప్పటికే మీకు బోలెడంత ఉన్నదికదా, ఇంకా సంపాయించి ఏం చేదామని?"

"ఇదంతా నేను కావాలని సంపాదించింది కాదు. దానంతటది పెరుగుతున్నది. నేను చూస్తూకూర్చున్నా. ఇహముందేం చెయ్యాలో నిర్ధారణకాలేదు."

"అసలు ఈఇల్లు నాకవసరంలేదు. జరిగిందేదో మంచికే. ఒకచిక్కు విడింది అనుకున్నా. కాని కొత్తచిక్కు మళ్ళా మీరు కల్పించారు. నాతోపాటు ఈ చిక్కుల్లో కొంతభాగం మీరూ పంచుకోండి. ముఖ్యవిషయం-ఈఇంట్లో అద్దె కుంటున్నవాళ్ళని కాస్త దయగా చూస్తూండండి," అని చెప్పింది.

"అలాగే."

"మరొక సంగతి-నాభర్తా కుమార్తె ఇప్పుడు వనవాస జీవితం గడుపుతున్నారు. ఏపాటి అవకాశమున్నా వాళ్ళమంచి చెడ్డలుకూడా కాస్త కనిపెట్టండి."

శారద వచ్చిపోతుండటం ఇంతకుముందు గమనిస్తూనే వున్నాడు విమలబాబు. ఇప్పుడు మరింత దగ్గరగా పిలిచి "ఏమ్మా శారదా! మీ అమ్మకు భోజనంవేళ అయింది కదూ, ఇహ లేద్దామా?" అనడిగాడు.

"లేదు, ఆలస్యం కాలేదు. అమ్మకిది మామూలువేళే. మీకే చాలా ఆలస్యమైపోయింది. లేచి కాళ్ళు కడుక్కోండి, మీరిక్కడే భోంచెయ్యాలి!"

విమలబాబు నవ్వుతూ లేచి "కాదమ్మా, శారదా! జరుగురు పనుంది..."

సవిత నిలబడి నమస్కరించింది.

విమలబాబు ప్రతినమస్కారంచేసి మెల్లగా మెట్లు దిగాడు.

## 12

ఇప్పుడు రమణిబాబు రావటం మానేశాడు. వీళ్ళిద్దరి మధ్యనా జరిగిన అసలు విషయం ఏమిటో అద్దెకున్నవాళ్ళెవరికీ అర్థంకాలేదు. వాళ్ళంతా సవిత మంచితనాన్ని గురించి శారదతో అంటూండేవాళ్ళు.

ఆరోజు శారద గదిలోకి వచ్చేసరికి రాఘాల్ పడుకుని దీపపు వెలుగున కాగితాలు చూస్తున్నాడు. శారద విస్మయంతో 'ఎంతసేపైంది వచ్చి!' అని తనలో అనుకున్నది. ఆమెకు రాతపని సాగలేదని చెప్పేసరికి, రాఘాల్ విసుక్కున్నట్టు కనిపించింది.

"ఈ కాగితాలన్నీ ఎందుకు పనికొస్తాయంట! ఒకవేళ పనికొచ్చినా నాకేం సంబంధం? నేను చావాలనుకున్నప్పుడు అడ్డుపడ్డారు మీరు, రక్షించారు. నన్ను బతికించాల్సిన బాధ్యత మీపైనే వుంది. నేనొక్క వాక్యంకూడా రాయను" అని చెప్పింది శారద.

"రాయకపోతే నాబాకీ ఎలా తీరుస్తావు?"

"తీర్చను మీకు రుణపడే వుంటా."

"కొంత రాశావుకదా, నీకర్థం కాలేదూ అవి పనికి వస్తాయని?"

"నన్ను అవస్థపెట్టడం తప్ప వాటిల్లో ప్రయోజనం లేదు. పురాణకథలూ, మత సంబంధంగా ఉపన్యాసాలూ తప్ప మరేముంటుంది అందులో?" అన్నది.

నిజానికి అవి భగవంతుని లీలలను గురించిన వ్యాసాలు. వాటి నకలు రాయించి మత ప్రచార సంస్థల అధికారులకు ఇస్తూవుంటాడు రాఘాల్. అదే అతనికి జీవనాధారం. ఇవి వెల్లడించడం ఇష్టంలేక గోప్యంగా వుంచుతాడు. పైగా పిల్లలకి ప్రయివేట్లు చెబుతున్నా నంటాడు స్నేహితులతో. ధనవంతుల పిల్లలకు ట్యూషన్ చెప్పడం నిజమే. కాని ఆ ఆదాయం ట్రాం ఖర్చులక్కూడా చాలదు.

ఇంతకాలంగా శారద అమాయకురాలనీ ఆమెకు విద్య లేదనీ అనుకునేవాడు. ఆ మాట తప్పు అని ఇప్పుడు రుజువయింది. "శారదా! మొదట్లో నువు మంచి దానవే. ఇప్పుడిల్లా మారిపోయావేం?" అన్నాడు.

"అందుకనేనా జ్వరంవస్తే సగ్గుజావ మీరే కాచుకోవడం, ఎవ్వరికీ తెలియ నివ్వకపోవడం, చివరికి కొత్తమ్మకయినా కబురుచెయ్యకపోవడం?" అనడిగింది. మళ్లా అన్నది—

"అమ్మ ఈసంగతి విని ఏమన్నదో తెలుసా? — 'రేణు జబ్బుగా వుంటే రాత్రీ పగలు మేలుకుని ఎంతో సేవచేశాడు. తను జబ్బు పడితే ఎలా వున్నా వురా అని అడిగే దిక్కే లేకపోయింది నన్నెందుకు నమ్ముతాడమ్మా? నా కూతు రికి జబ్బుగా వుంటే, ఇతరుల పేరుమీద నన్ను గోప్యంగా అప్పు అడిగితే ...త్రం అర్థం చేసుకోకపోయినా —ఇవ్వలేకపోయిన పాపిష్ఠిదాన్ని!' అని ...ప్పింది,"

శారద కళ్లనీళ్ళు పెట్టుకుంది, ఈ మాటలు చెబుతూ.

"పోనీ నేనేం పాపంచేశాను దేవతా? నాకయినా కబురెట్టకూడదా?" అనడి గింది, దీనంగా. "నిజానికి మీరూ ఏమంత మంచివారు కాదు! చద్దామనుకుంటే చావనివ్వకుండా హాస్పిటల్లో పడేసి, రాత్రింబగళ్ళు శ్రమపడి బతికించారు. తర వాత ఏమీ తినకుండా చద్దామనుకుంటే, అదీ పడనిచ్చారుకాదు...ఇప్పటిదాకా మీ రెందుకు పెళ్ళిచేసుకోలేదో నాకర్థమయింది దేవతా! స్త్రీలంటే మీకు ద్వేషం... నాకివాళ చాలా కోపంగా వుంది మీమీద. సుస్తీచేస్తే తెలపకపోవడమేం?" అని అన్నది.

"నీ భర్తేవుంటే ఇన్ని మాటలు మాటాడేదానవా?"



"ఆయనే వుంటే ఈ ప్రస్తావనే రాదు. ఏ శారద ఆయన్ను ప్రాణప్రదంగా ప్రేమించిందో— ఆయనకోసం ఎన్ని కష్టాలు సహించిందో, భగవంతుడే సాక్షి. పెళ్లాడతానని వాగ్దానాలు చేసి తీసుకొచ్చి, ఎంగిలి విస్తరిలా వదిలేసి వెళిపోతే, శారద గతి? అన్నివిధాలా సర్వ భ్రష్టురాలైన ఆ శారద చచ్చిపోయింది. ఈనాడు మీ ఎదటవున్న ఈశారదకు ఇది పునర్జన్మ. ఈ శారద సర్వస్వతంత్రురాలు. ఈమెపైన ఎవరికీ హక్కులూ అధికారాలూ లేవు" అన్నది.

మౌనంగా విన్నాడు రాఘుల్.

తరవాత అడిగాడు: "చెప్పగా వినటమే కాని జీవన్‌బాబుని ఎప్పుడూ చూళ్ళేదు నేను. ఆయన నిజంగా నీ భర్తకాదా?"

"కాదు."

"అయితే నువు విధవవా?"

"అవును! నా జీవితకథ మీ కసహ్యం కలిగిస్తున్నదా?"

"లేదు శారదా! అమ్మ నీకంటే పెద్ద అపరాధం చేసింది. ఐనా ఆమెను నేనేం అసహ్యించుకోలేదు..." అనేసి, నాలిక కొరుక్కున్నాడు—ఏదో పొరపాటున మాట జారిపోయినట్లుగా.

"ఇహముందేం చేదామనుకుంటున్నావో చెప్పవా" అనడిగాడు.

"ఇప్పుడేం చేస్తున్నానో అదే—కొత్తమ్మ పనులు చేసిపెట్టడం. జీవితానికి డబ్బు

అవసరమే. కాని మీరు చెప్పే రాతపని మాత్రం చెయ్యను. నాకెప్పుడైనా డబ్బు కావాలంటే ఉత్తరంముక్క రాసి తలగడ కింద పెడతా. ఒకాయన వస్తారు. ఆ ఉత్తరం చదువుకుని, అక్కడే కొంత డబ్బు పెట్టేసి వెళిపోతారు. అది నాకు చాలు.'

అంతలో దాసీది వచ్చి శారదతో "పెద్దమ్మగారి పూజ పూర్తయింది. మిమ్మల్ని పిలుస్తున్నారు'' అన్నది. ఇద్దరం కలిసి వెళదాం అంటే ఎందుకో రాఘూల్ 'తరవాత వస్తా. నువ్వెళ్ళు' అన్నాడు. ఇవాళ అతడు బలే హుషారుగా వున్నాడు.

ఎన్నో సందర్భాలలో అతనికెంతోమంది స్త్రీలతో పరిచయమున్నది. కాని ఈనాటి శారదలాంటి వ్యక్తిని జీవితంలో ఇంతదాకా చూసినట్టు జ్ఞాపకంలేదు. ప్రేమకు నిజమైన ప్రతిరూపమూ ఈ శారద?

అంతలో రాఘూల్‌ను కూడా రమ్మని కబురొచ్చింది. గబగబా పైకెళ్ళి కొత్తమ్మ పాదాలకు నమస్కరించి, పాదధూళి తీసుకుని పక్కనే కూర్చున్నాడు.

"క్షమించాలి అమ్మా! పెద్దపొరపాటు చేశా. ఎంతో సుస్తీచేస్తే కబురు కూడా పంపలేకపోయా!" అన్నాడు.

అందుకామె "ఒకనాడు మీకు కష్టం కలిగించానన్న సంగతి నాకు అస్తమానం జ్ఞాపకం మొస్తూంది '' అంటూ రాఘూల్ వీపుమీద చేయివేసి ఆప్యాయంగా నిమిరింది.

ఇవన్నీ వింటున్న శారద ముందుకొచ్చి "అమ్మా! దేవతని ఈపూట ఇక్కడే భోంచేసి వెళ్ళమను. లేకపోతే ఇంటికెళ్ళి మళ్ళా వెయి కాల్చుకోవాల్సి వస్తుంది." అన్నది

సవిత చెప్పింది:-"ఇలాంటిదాన్ని భర్త ఎలా వొదిలేసి పోయాడా అని పిస్తూ వుంటుంది. ఏమైనా, రాజూ! దౌర్భాగ్యపు ఆడజన్మ!''

"అమ్మా! ఇషానైనా పెళ్లిచేసుకోమని మీరు చెప్పండి! మీమాట కాదన లేదు!" అన్నది శారద.

''నీకు తెలీదుగాని నాసంగతి అమ్మకి బాగా తెలుసు. ఏదో ట్యూషన్లు చెప్పుకు బతికే సామాన్యుణ్ని. ఇలాంటివాడికి పిల్లనిస్తే ఎవరైనా, వాళ్ల ముప్పుకే! అందుకని ఇలాంటి సలహా ఇవ్వనే ఇవ్వదు అమ్మ,'' అన్నాడు రాఘూల్.



"నాయనా, రాజూ!— ఇక్కడ దగ్గర్లోనే దామోదర్ నదీ తీరాన తారకుడు ఉద్యోగం చేస్తున్నాట్ట! పోనీ కొంతకాలంపాటు అక్కడి కెళదామనిపిస్తూందిరా నాయనా, వెళ్లిరానా?" అనడిగింది సవిత.

"రమ్మన్నాడా?"

"అవును, పిలిచాడు. అతడూ మంచివాడేరా: వినయం, విద్య అన్నీ వున్నాయి. కాగల బిడ్డ!" అన్నది.

"ఏమిటీ, కలకత్తా వచ్చాడు? నాకా సంగతే తెలియదే?"

ముందురోజునే తారకుడికి ఉత్తరం రాశాడు – 'వంటో బాగుండటం లేదు, కొన్నాళ్లపాటు నీతో ఉండి విశ్రాంతి తీసుకుందామనుకుంటున్నా' నని. కాని, ఆ ఉత్తరానికి తారకుడి జవాబు రాసేరాలేదు.

## 13

రాఘాల్‌తోపాటే మేడమెట్లు దిగివచ్చిన శారద అన్నది— "నా చేత్తో నేను మీకు వంటచేసి పెడదామని సరదాగా వుంది."

"సరే. ఎప్పుడు రమ్మంటావు భోజనానికి?"

"ఎల్లుండి, సరిగ్గా ఇదే టయిము. గుట్టు చప్పుడు కాకుండా భోజనంచేసి వెళ్ళిపొండి."

"ఏం, అంత గోప్యం?"

"ఎవళ్లకూ తెలియటం నాకిష్టం లేదు."

"సరే!"

చెప్పినట్టే వచ్చాడు రాఘుల్. ఆప్యాయంగా స్వాగతం చెప్పింది శారద. అనురాగంతో వడ్డన జరిగింది. ఆడంబరం లేకండా క్లుప్తంగా తయారు చేసిన శారద వంటను ఎంతో మెచ్చుకున్నాడు రాఘుల్. భోజనాలైనాక—

"ఇహ డబ్బుప్రసక్తి వదిలేస్తున్నా శారదా! నువ్వు అప్పు తీర్చనక్కర్లేదు, మరేం ఆలోచించకు. నీకిచ్చిన ఆ కాపీమాత్రం తిరిగిచ్చెయ్!" అన్నాడు.

"అయితే మన స్నేహం ఇవాల్టితో సరా? ఇహ మీరు డబ్బా అడగరు. మిమల్ని నేను ఏమీ అడగను – డబ్బులేక చచ్చిపోతున్నా సరే, అంతేనా?" అన్నది

"నువ్వు దుష్టురాలవు శారదా! తెలియక అడుగుతానూ, జీవన్‌బాబు నిన్నసలు సరిగ్గా అర్థంచేసుకోనే లేదా?"

"నా భర్త నన్ను అర్థంచేసుకోలేదు. చివరికి – నన్ను యమపాశంనుంచి తప్పించిన 'దేవత' కూడా అర్థంచేసుకున్నట్టు లేదు ! నేనేం చేసేది ?"

"ఇన్ని సంగతులు తెలిసినదానివి, ఆత్మహత్యకెట్లా సిద్ధపడ్డావ్?"

"మీ పరిచయ భాగ్యంకోసమే! అవునుగాని దేవతా! అసలు మీరెందుకు పెళ్లి చేసుకోలేదు, నిజం చెప్పండి!"

"చెబితే నీకేమిటి లాభం?"

"అదంతా మీ కనవసరం. అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పండి సూటిగా–"

"శారదా!– లోకంలో కొందరు ఇతరులకి వివాహం జరిపిస్తారు, కొంతమంది వాళ్ల పెళ్లిగొడవే చూసుకుంటారు. నా పెళ్ళి జరక్కపోవడానిక్కారణం పిల్లనిచ్చే వాళ్లెవరూ లేకపోవడం. పిల్ల నివ్వకపోవటానిక్కారణం నాకు డబ్బు లేకపోవడం! ఈ లోకంలో నాకు అయినవాళ్లెవరూ లేరని నీకు తెలీదు. [కాబోలు!"

"పేదవాళ్లెవరికీ పెళ్ళిళ్లు కావటంలేదు కదూ! పిచ్చిమాటలు చెప్పకండి. మీకు సాహసం లేదు, వట్టి పిరికివాళ్లు. ఇదే నిజం. ఏమైనా మీరు వివాహం చేసుకు తీరాలి! ఎవళ్లో జరిపించ లేదని అన్నారుగా? నేను జరిపిస్తా మీ వివాహం!"

*          *          *          *

సిగ్గుతో చిరునవ్వునవ్వుతూ అన్నది శారద: "బహుశా ఎల్లుండే మేమంతా హరన్‌పూర్ ప్రయాణం."

"ఎల్లుండా? తారకుడి వద్దకా?"

''అవును. శనివారం సాయంత్రం వచ్చి ఆదివారం ఉదయం బండికే మమ్మల్ని వెంటబెట్టుకు వెళ్తారు."

''నా కక్కనిపించనే లేదే!''

"ఒక్కరోజే సెలవు పెట్టారుట. ఆయన మంచివారే కదండీ? గొప్ప చదువు చదివారు! రూపం గుణం అన్నీ మంచివే. ఎన్నో సామాన్లు కొనుక్కొచ్చారు బజార్నించి. ఎంత బరువున్నాయనుకున్నారు? ఆయనే మోసి బండిలో పెట్టుకున్నారు మీరైతే ఎత్తనే లేరు. మీకు సాహసం లేదు. 'ప్రయత్నించాలి గాని, మనిషికి సాధ్యం కాని పని లేదన్నారు.' తారక్‌బాబు"

* * * *

'రమణిబాబు వెళిపోయి మరి రావటం మానేశాడు–ఎక్కడి కెళ్ళాడో తెలీదు గాని, వెళ్తూ నిష్కారణంగా నిందమోపి మరీ పోయాడు. దానికంతా మూల కారణం మీరే!– ఒకనాడు రేణుకు జబ్బుగా వున్నప్పుడు ఎవరి పేరో చెప్పి మీరు గోప్యంగా డబ్బడిగారు. అమ్మ డబ్బివ్వకపోతే మీరు కోపగించి భోజనం కూడా చెయకుండా వెళ్ళిపోయారు. అమ్మ ఎంత బాధపడిందో మీకేం తెలుసు? "'నేను రాజుని కలుసుకు తీరాలి. నా ప్రాణాలు నిలిచేట్టు లేదు నువ్వూ నా వెంటరా" అన్నది అమ్మ. రాత్రి బయల్దేరి వస్తే మీరు ఇంటోలేరు. వ్రజబాబు గారింటికెళితే అక్కడా ఎవరూ లేరు 'అద్దె కివ్వబడును' అని బోర్డు కట్టివుంది. తిరిగి ఇంటికొచ్చేసరికి – విందులూ, నృత్యాలు, అంతా కోలాహలంగా వున్నది. అమ్మ దుఃఖప్రవాహంలో మునిగిపోయింది.

''ఆనాటి ఆనందోత్సవపు అతిథుల్లో రమణిబాబు ఒకరు. ఆయన అకస్మాత్తుగా తలుపు తీసుకొచ్చి, నాట్యసభలోకి రమ్మని అమ్మని బలవంతపెట్టాడు. ఒంటో బాగాలేదన్నా వినిపించుకోలే. '' విమలబాబు నా యజమాని, కోటీశ్వరుడు. నువు రాకపోతే నిన్ను కలుసుకోవటానికి ఆయనే ఈ గదిలోకి వస్తాడు" అన్నాడు. ఎంత వొద్దన్నా మానలేదు రమణిబాబు.

''విమలబాబు స్వయంగా గదిలోకి వచ్చాడు. కుశలప్రశ్నలు వేసి, క్షేమాదికాలు అడిగి, "పోనీ, మా సింగపూర్ రండి. అక్కడ మా బంగళా వున్నది. చల్లటి గాలి, ప్రశాంత వాతావరణం, మంచి ఆరోగ్యం" అంటూ ఎంతో ప్రోత్సహించాడు.

జబ్బుగావున్న కూతుర్నీ, ఇల్లూ వాకిలీ లేని భర్తనూ వదిలి ఎట్లా వెళ్తుంది? "ఉహుం రాలే" నన్నది. ఒక్కమాటలో, రమణిబాబు మండిపడి ఎన్నెన్ని ఆడిపోశాడో లెక్కలేదు. సూదుల్లా గుండెకు గుచ్చుకునే సంభాషణలు చేశాడు.. "నువ్వు నా భార్యవే కాదు ఉంపుడుకత్తెవి. పతివ్రతలా నటిస్తున్న వేశ్యవు, ఈ సంగతులు లోకమంతటికీ తెలుసు..." అంటూ ఇష్టమొచ్చినట్టు పేలాపన సాగింది.

"కడపట అమ్మ చెప్పింది—"ఇంతకాలం నిద్రపోతూనే వున్నా, ఇప్పుడే కళ్ళు తెరిచా. మనమధ్య మిగిలిందేమీ లేదు. ఇహమీదట మరెన్నడూ ఈ యింటికి నువ్వు రావలసిన పనిలేదు,'' అంటూ కంపించిపోయింది, అమ్మ. దాని మీదట మతిభ్రష్టుడైన రమణిబాబు "ఈ యిల్లు నీది కా" దంటూ డబాయించాడు "మన బాంధవ్యం ఈ క్షణంతో సమాప్తి'' అని చెప్పేసింది, అతగాడు వెళ్లిపోయాడు.

"తరవాత?'' అనడిగాడు రాహుల్.

"అప్పట్నించీ విమలబాబు సన్నిహితుడైనాడు. ఈనాడు ఈ కుటుంబానికి ఆయనకంటే ఆత్మీయులెవరూ లేరు. రమణిబాబుకి విమలబాబే స్వయంగా డబ్బిచ్చి అమ్మ పేర ఈ యిల్లు కొన్నారు. లేకపోతే మేమంతా ఈపాటికి ఏమైపోయేవాళ్ళమో!

రాహుల్‌కు ఇదేం నచ్చలేదు. "విమలబాబు కోటీశ్వరుడే కావచ్చు. కాని ఆయన దానమిస్తే అమ్మ ఎలా స్వీకరించింది? అమ్మ స్వభావం అలాంటిది కాదే?"—

"ఆయన ఇప్పుడు పరాయివారు కాకపోవచ్చు. ఇలాంటి సందర్భంలో దానం పుచ్చుకోవడమే ఉచితమనుకుంటా'' నన్నది, శారద.

"నాకేం బోధపడటం లేదు'' అంటూ రాహుల్ లేచి నిలబడి, ''చాలా రాత్రయింది, వెళ్లొస్తా, మీరంతా వచ్చాక మళ్లా కలుసుకుందాం'' అన్నాడు.

శారద గుమ్మానికి అడ్డంగా నిలబడింది. "ఇంత అకస్మాత్తుగా మిమ్మల్ని వెళ్ళనిస్తా ననుకున్నారా? ఉహుం—! అమ్మని చూడకుండా వెళతారా?'' అన్నది.

"నా అవసరాలూ, ప్రయోజనాలూ నా అంతరాత్మలోనే వున్నాయి. ఈ అభిమానం వాత్సల్యం కూడా అలానే వుంటాయి. ఆడంబరాలు ముఖస్తుతులూ నే చెయ్యలేను శారదా!''



'అది నీ డబ్బు ! ఇదేమో నాది !! నీ డబ్బును మాత్రం యిష్టమొచ్చినట్టు ఖర్చు పెట్టుకోవచ్చు-తెలిసిందా ??'

---

"పదండి, నామాట వినండి. అమ్మని ఒక్కసారి చూసి వద్దురుగాని రండి. మీతో మాటమాత్రమైనా చెప్పకుండా అమ్మ ఎప్పుడూ ఎక్కడికీ వెళ్ళదు" అన్నది శారద.

"అంటే అర్థం ?"

"అర్థమేమిటని నేనూ అడిగాను. అమ్మ ఏమని చెప్పిందో తెలుసా — 'రాజు అభ్యంతరం చెప్పడని నాకు తెలుసు. ఒకవేళ రాజుకి ఇష్టం లేకపోతే మాత్రం నే నెక్కడికీ బయల్దేరనమ్మా శారదా !' అన్నది." అని చెప్పింది.

స్తబ్ధుడైపోయాడు రాఘుల్, ఈమాట విని. కళ్ళురెండూ అశ్రుపూరితాలయినె.

"ఇవాళ ఆమ్మని చూడగలిగే శక్తి నాలో లేదు శారదా ! ఆవిడ పాదధూళి స్వీకరించటానికి రేపు తప్పకుండా వస్తానని నా మాటగా చెప్పు !" అన్నాడు. శారద జవాబేమీ చెప్పకుండానే అతను వెళిపోయాడు.

## 14

శనివారం రాత్రి బండికి తారకుడు వచ్చాడు. రేపు సాయంకాలమే అందరూ ప్రయాణం. సవితవెంట శారదా ఇద్దరు దాసీలూ ఉంటారు.

అక్కడ హారాన్‌పూర్‌లో తారక్ ఒక కొత్తఇల్లు కట్టించినంత పనిచేశాడు. సవితకు ఎటువంటి కష్టమూ తోచకుండా, ఆమె నాజూకుగా మసులుకోవటానికి అనుకూలమైన ఏర్పాట్లన్నీ చాలాబాగా చేశాడు. కొన్ని వస్తువులేవో ఇంకా కొని తేవటానికని బజారు కెళ్లాడు. ఇంకా రాలే...

"ఇంతలో విమలబాబు వచ్చి, "ఇక్కడెంతకాలం వుంటావు నువ్వు కొత్త కోడలూ ?" అనడిగాడు. అందుకామె "మీ రెంతకాలం ఉండమంటే అంతకాలమే! మించి ఒక్క క్షణం కూడా ఉండను !" అని చెప్పింది

తరవాత రమణిబాబూ - మోసం ప్రసక్తి వచ్చింది. సవిత చెప్పింది: "సంకెళ్లు విడిపోయిన ఖైదీ ఎంత స్వేచ్ఛను అనుభవిస్తాడో, అలాటి అనుభూతినే ఆనాడు నేను పొందాను. అటువంటి స్థితిలో మీరు అపరిచిత బంధువులాగా ముందుకొచ్చి నా చెయిపట్టుకుని 'సరే' నన్నారు - పోనీగాని మిమ్మల్ని ఏమని పిలిచేది ?" అనడిగింది.

"ఇరుగు పొరుగులంతా నన్ను 'దయామయా' అని పిలుస్తారు." అని అనేసరికి సవిత "ఈ పేరు నాకు బాగా వచ్చింది ఇవాళ్టినుంచి నేనూ మిమ్మల్ని అలాగే పిలుస్తా" నని చెప్పింది.

విమలబాబు 'అలాగే' అన్నాడు.

"ఎవరు నిజమైన స్నేహం చేస్తారో వాళ్ళవల్ల ఎన్నడూ అపకారం జరగదు. అవునా ?" అన్నది సవిత.

"నువు చెప్పిన మాట నిజం ! శ్రేయోభిలాషు లెప్పుడూ స్వార్థత్యాగులే ! ఎంత కష్టాన్నయినా సహిస్తారు."

"అంతేకాదు. మీ కష్టాల్లోనూ, దుఃఖాల్లోనూ నాకూ భాగం వుంటుంది."

"ఈనాడు నా భారం కేవలం ఐశ్వర్యంవల్ల సంక్రమించింది. ఏనాడయినా ఈ భారంతో అలిసి కృంగిపోతే, నీదగ్గర నేను ఆనాడు సంతోషంతో సెలవు తీసుకుంటా. ఒక ఉత్తమ మిత్రుడికి వీడ్కోలిచ్చే ధోరణిలో అప్పుడు నువు నా ప్రార్థన అంగీకరించాలి ! ఆ చివరిరోజున నీకు నేను చీమ తలకాయంతైనా కళంకాన్ని మాత్రం ఆపాదించనని ప్రమాణపూర్తిగా వాగ్దానం చేస్తున్నా కొత్తకోడలూ !"

"ఒకవేపున అచంచలమైన ప్రేమ, మరోవేపున దాన్ని పొందటానికి అవకాశం లేని పరిస్థితి—ఇలాంటి జటిల సమస్యలు ఎందుకొస్తాయా అని..." అన్నది సవిత.

"ప్రయత్నలోపం వుంటే ఏ సమస్యా పరిష్కారం కాదు, ఆ అంధకారంలో కొట్టుమిట్టాడుతూ వుంటే చివరికి మరణమే ప్రాప్తి. ఇలాంటి అగ్నిపరీక్షలు నాకెన్నో వచ్చినయ్. నిజమైన ఆత్మవిశ్వాసం ఎక్కడా ఎన్నడూ లోకంలో వ్యర్థంకాలేదు కొత్తకోడలూ!" అన్నాడు విమలబాబు.

''మరైతే నిష్కపటమైన మీ మనోవాంఛ నాదగ్గర వ్యర్థమే అయిపోయిందిగా దయామయా?"

"లేదు. నీకు నేను విశిష్టమైన స్థానమిచ్చి, గౌరవించి ఆ విధంగా నిన్ను పొందాను. ఎప్పుడో ఒకనాడు నా మనోవాంఛ పూర్తిగా సఫలమవుతుంది. నిన్ను నేను సంపూర్ణంగానే పొందుతాను. అటువంటి అదృష్టాన్ని ఎవరూ— నువ్వయినా సరే, తప్పించలేరు."

*           *           *           *

అంతలోనే శారద వచ్చి రాఘాల్‌బాబు వచ్చాడని చెప్పింది. రాఘాల్ ముందుకొచ్చి కొత్తమ్మ పాదధూళి తీసుకున్నాడు. విమలబాబుకి కూడా నమస్కరించి పక్కనున్న చాపమీద తనూ కూర్చున్నాడు.

శారదా తనూ తారకుడి వద్దకు ప్రయాణమవుతున్న వైనంచెప్పి, అతని అభిప్రాయం ఏమిటని అడిగింది. "తారకుడు మీ అందరికంటే నాకు ప్రాణమిత్రుడు. నా అభిప్రాయం మీదే మీ ప్రయాణం ఆధారపడి వుంటేమాత్రం— మీరక్కడి కెళ్ళడం నాకిష్టంలేదు. ఈ ప్రయాణం జరక్కూడదు" అన్నాడు రాఘాల్.

సవిత దిగ్భ్రాంతిపడింది. అంతాసిద్ధమైపోయింది, తనమాట నమ్మి తారకుడు బజారుకి వెళ్ళాడు. పల్లెటూళ్లో ఎన్నెన్నో సౌకర్యాలుఏర్పరిచాడు, తీరా యింత చేశాక తప్పేదెట్లా?

''నాకు తెలుసు తప్పదని, కనుకనే నిన్నడగటం ఉచితంకాదు. అవసరమూ లేదు. నిన్న ఏమన్నారో శారదతో తెలుసా:? బిడ్డ పెద్దవాడైనాక అతని అభిప్రాయమూ తెలుసుకుంటూ వుండాలని. అమ్మా!– ఈ మాటకు కృతజ్ఞుణ్ని, నా జీవితమంతా జ్ఞాపకముంచుకుంటాను. కాని – పరోపకారం పేరుతో లోకులకు పనికిమాలిన పనులు చేసిపెడుతూ కాలం వెళ్లబుచ్చే బిడ్డకు మాత్రం ఆయుర్వృద్ధి లేదమ్మా! ఎవరో కాదు. తల్లిదృష్టిలోనూ అంతే. నేను నీకు అలాటి బిడ్డనే!" అన్నాడు రాఘాల్.

తల వంచుక్కూచున్నది సవిత.

మళ్ళా అన్నాడు రాఘాల్: "మనస్సు కష్టపెట్టుకోకమ్మా! లోకుల హేళన, లేనిపోని బరువు మోస్తూ తిరగటం – అవే నా ముఖాన విధాత రాసిపెట్టాడు. మీరు వెళ్ళాక ఇక్కడ చేయాల్సిన పనులేమన్నా వుంటే చెప్పమ్మా. ఏకారణం వల్లగానీ తల్లి ఆజ్ఞ నేనెన్నడూ నిర్లక్ష్యం బెయ్యను!"

అన్నీ విని మరి సహించలేక ఇలా చెప్పింది శారద— "మీరు లోకులకు ఎంత ఉపకారమైనా చేస్తుంటారు కానీ, అమ్మ కింత కష్టం కల్గించటంమాత్రం బాగాలేదు."

చప్పున తలెత్తి కళ్ళతో వారించింది సవిత. "శారదా! మాటాడకు, చెప్పనీ రాజుని!"

శాంతంగానే అడిగింది సవిత. "నాయనా, నువ్వేమన్నా తారకుడితో వివాద పడ్డావా?" అందుకు రాఘాల్ "నన్ను కలుసుకోటానికి అతనికి వ్యవధి లేక పోయిందని శారద చెప్పిం" దన్నాడు.

అంతలో విమలబాబు "నన్ను మీ అబ్బాయికి పరిచయం చెయ్యవా?" అన్నాడు, సవితతో. "నాలోని సమస్త గుణ దోషాలతోసహా అతనికి నేను తల్లిని" అని చెప్పింది.

ఆ తరువాత రాఘాల్ సవిత తన కాశ్రయమిచ్చిన సంగతి అంతా వివరిం చాడు. మరోసారి కొత్తమ్మ పాదధూళి తీసుకున్నాడు.

"నీకేమాత్రం ఇష్టంలేకపోయినా ఈ ప్రయాణం సాగదు. నిజం చెప్పు రాజూ!" అన్నాడు విమలబాబు. ఆమె విమలబాబు మాట మీరదని తెలియగానే "అయితేసరే, మీదృష్టిలో మంచిదని తోచిన పనే చెయ్యండి!" అంటూ, మేడ మెట్లు దిగి వెళ్ళిపోయాడు.

* * * *

మెట్లమీద ఒకపక్కగా నిలబడివుంది శారద. "ఒక్కమాటు మీరు మా యింటికి రావాలి, దేవతా!" అన్నది.

"ఎందుకు?"

"చాలామంది శారదలను చూశానన్నారు. మీద్వారా వాళ్ళందర్నీ ఓసారి పరి చయం చేసుకుంటా."

"ఏమిటి ప్రయోజనం?"

"మీకు స్త్రీలంటే అసహ్యంకదా? వాళ్ళు మీపట్ల కృతజ్ఞతను ఎలా తీర్చు కుంటారో విందామని..."






''ఇప్పు డవకాశం లేదు, పనుంది.''

''నాకూ పనుంది. ఇవాళ మీరు రాకపోతే, శారదలు చాలామంది లేరు, ఉన్నదొక్క_ర్తే అని మీరు తెలుసుకోవలసి వస్తుంది.''

శారద కంఠస్వరంలో పరివర్తన చూస్తే ఆనాడామె ఆత్మహత్యకు తల పడినప్పటి కంఠస్వరం గుర్తొచ్చింది.

''సరే, మిగతా పనులకేం, పద - ముందు మీ ఇంటికేవస్తా'' నన్నాడు రాఘాల్.

## 15

శారద గదిలో మంచంమీద కూర్చుని ''నన్నెందుకు పిలుచుకువచ్చావ్?'' అనడిగాడు రాఘాల్,

''వెళ్ళేముందు ఒక్క_సారి మీ పాదధూళి తీసుకుందామని.''

''నన్ను వొద్దని చెప్పండి దేవతా? నేను హారాన్‌పూర్ రావడానికి దేవత అంగీకరించలేదని అమ్మతో చెప్పొస్తా,'' నన్నది శారద. ''మధ్యని నేనెందుకు అభ్యంతరం చెప్పడం? వొద్దు అని వారించేందుకు నాకేం అధికారముందీ?'' అని రాఘాల్. ఈ విషయమై యిద్దరి మధ్యన చాలాసేపు చర్చ నడిచింది.

''అక్షరజ్ఞానం లేనిదాన్ని, పల్లెటూరిదాన్ని, పేద కుటుంబానికి చెందినదాన్ని అని ఒకనాడు చెప్పావు, ఆనాడు నేను బతికించకపోతే ఈ భూమ్మీద మరి

దిక్కే లేవన్నావు. నీ మాటలు శంకించక, చెయ్యగలిగిందంతా శక్తివంచన లేకుండా చేశా. కాని ఇప్పుడదంతా హాస్యాస్పదంగా తయారైంది నీ దృష్టిలో. విమలబాబు ఇవాళ వచ్చినవాడు అమిత ధనవంతుడు – తారకుడూ ఈ మధ్య వచ్చినవాడే – అలానే కొత్తమ్మకూడా. కనుక గతమంతా మర్చేపోయావు నువ్వు"

"ఇదే నా చరిత్ర అని మీరు అపోహపడుతున్నపుడు ఇహ మిమ్మల్ని నేను యాచించను! ఏవో కొనమని అమ్మ కొంత ఇచ్చింది. నాకా డబ్బు వద్దు. మీరూ నాకొంత డబ్బు ఇచ్చారు. తిరిగి ఇచ్చెయ్యమంటారా?"

''సరే, నీ ఇష్టం. డబ్బు చేతికొస్తే అవసరానికి ఉపయోగపడుతుంది. నేనూ పేదవాణ్నేనని తెలుసుగా?"

తలగడకింద మూటకట్టి పెట్టిన డబ్బు లెక్కపెట్టి అతనికిస్తూ, "ఇవిగో తీసుకోండి. కాని ధన ఋణం తీరిస్తే అన్ని ఋణాలూ తీరిపోయినట్టుకాదు దేవతా! మీరు నిష్కారణంగా నాకు శిక్ష విధిస్తున్నారు. దీనికి ప్రతిఫలం ఎప్పుడో ఒకప్పుడు అనుభవించే తీరుతారు, తప్పదు'' అన్నది శారద.

"అయితే వెళ్లనా, చాలా రాత్రయింది!"

రాఘూల్ పాదాలకు నమస్కరిస్తూ కాళ్ళమీదపడి భోరున ఏడ్చింది శారద. ఆతను వెళ్ళిపోయాడు

* * * *

రాఘూల్ వెళుతూ దారంట తీవ్రాలోచనలో పడ్డాడు. శారదపైన తన కెందుకంత కోపం? ఆమె ఏం చేసిందని? అతను లోగడ ఎంతోమంది స్త్రీలతో స్నేహం చేశాడు. వాళ్ళు తనని ప్రేమించారో లేదో చెప్పటం కష్టం. అదే ప్రేమని శారద తనకీనాడు ఇవ్వాలని ఆశిస్తున్నదా? కాని; ఏ ముఖంపెట్టుకుని అంగీకరించడం? శారద విధవ, నిందితురాలు, కులత్యాగిని. ఈ ప్రేమలో గౌరవం లేదు. ఛ, నే పేదవాణ్నే కావచ్చు, ఆకలవుతున్నంత మాత్రాన ఎంగిలి ముద్దలు మింగుతామా?

కాని, కొన్ని మధురస్మృతులు జ్ఞాపకానికి వచ్చాయి. ఇప్పటిదాకా తను స్నేహం చేసినవాళ్ళలో శారదవంటి స్త్రీ ఎక్కడయినా కనిపిస్తుందేమోనని చూస్తే, ఉహుం! శారద నిష్కపటమైన నారీత్వానికి ప్రతిబింబం. అటువంటామెను ఇవాళ ఎంత అవమానించి వచ్చాడు?– ఇది పునరాలోచన.

* * * *

కాలక్షేపం కోసమని ఒక పుస్తకంతీసి పేజీలు తిరగేస్తున్నాడు రాఘాల్. క్షణక్షణానికీ శారదే గుర్తొస్తున్నది. గత విషయాలన్నీ ఒక్కసారి తుడిచివేయ కలిగితే ఎంత బాగుండును అనిపించింది. రెండోకంటికి తెలియని తన జీవిత కథను శారద తనకుమాత్రం చెప్పింది. ఈ క్షణమందే - రాత్రికే శారదను కలుసుకుని క్షమాభిక్ష వేడుకుందామా అని అనుకున్నాడు.

దీపం వెలుగుతూంది. బుజంమీద ఉత్తరీయం వేసుకుని, గదికి తాళంవేసి బయల్దేరాడు. క్షణంలో అక్కడికి చేరుకున్నాడు. మెట్లెక్కి పైకి వెళ్ళాడు. పైన వరండాలో — ఎదరెదర రెండు కుర్చీల్లో కూర్చుని సవితా, విమలబాబూ ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు: ఆకస్మికంగా రాఘాల్‌ను చూసి ఆశ్చర్య పోయారు

సవిత అతన్ని పలకరించింది. రాఘాల్ అన్నాడు: "తారకుణ్ని చూసి చాల రోజులయింది, రేపు కలుసుకోవడం పడదుగా. ఒక్కసారి చూసిపోదామని వచ్చా" నన్నాడు.

"అయితే నిన్ను భోజనానికి పిలవలేదా రాజూ?" అనడిగింది సవిత.

"లేదమ్మా!"

"మరచిపోయింది కామాలు" అంటూ, శారదను పిలిచి అడిగింది. శారద ఏంచెప్పలేకపోయింది.

"నే భోజనానికి రాలేదమ్మా!'' అనేశాడు రాఘాల్. శారద మౌనంగా కూర్చున్నది.

కలవరపడుతూ సవిత చెప్పింది - "తారకుడు అతిథే కావచ్చు. కాని నువ్వు సొంతబిడ్డవి నాయనా! ఎవ్వరేమనుకోనీ, నువుమాత్రం ఇవాళ నాదగ్గర కూర్చుని విధిగా భోంచెయ్యవలిసిందే!"

''ఊహు - సాధ్యంకాదు. మా ముసలిది బతికున్నంతకాలం - నా కుకర్ ఉన్నంతకాలం — ఆ వంటా, ఆ భోజనమే నాకు అమృతం. గొప్పింటి విందుల కోసం ఆరాటపడే తత్వం కాదమ్మా నాది!" అన్నాడు.

"లాంఛనానికి కాదు రాజూ, నేను పిలిచింది. నువ్వు భోంచెయకుండా వెళితే నా మనస్సు చాలా దుఃఖపడుతుంది, చెబుతున్నా.''

"నువు మాటవరసకి అంటూన్నావని నేననుకోవడం లేదు అమ్మా! నేను భోంచెయ్యనంత మాత్రాన నీకు దుఃఖం ఎందుకూ? నేనెవర్ని గనక? ఎవర్ని గురించీ మీరు దుఃఖపడరు!'' అన్నాడు.

నిర్ఘాంతపోయింది సవిత. విమలబాబు కళ్లప్పగించి చూస్తూ కూర్చుండి పోయాడు. సవిత రాఘుల్‌వేపు చూస్తున్నదేగాని, కోపగించుకోలేదు. 'వెళ్లొస్తా నమ్మా!' అన్నాడు రాఘుల్. గప్పున అతనిచెయ్యి పట్టుకుని సవిత అడిగింది– "నాయనా రాజూ! ఏమిటీ, అసలేం జరిగిందీ?"

"ఏం లేదమ్మా, ఏమీ జరగలేదు."

అతను సవితకు సమస్కరించి పాదధూళి తీసుకున్నాడేగానీ, మాటాడలే. అతను వెళుతుండగా విమలబాబు కలిపించుకుని అన్నాడు – "నాయనా రాజూ! నన్ను నీ శ్రేయోభిలాషుల్లో ఒకడుగా ఎంచుకో."

నెమ్మదిగా మెట్లు దిగి వచ్చేశాడు రాఘుల్. ఇదివరకులాగానే శారద మెట్ల మీద పక్కగా నించునివుంది, రాఘుల్ చేరువకు రాగానే "దేవతా!" అని పిలిచింది.

"ఏం!"

"అనేకమంది శారదలలో నేనూ ఒకత్తెనన్నారు, అదే నిజం కాబోలు!" అన్నది.

"అవును."

"మీరెన్నో విధాల దయదలిచి నన్ను బతికించారు. నే బతికింది మీ దయ వల్లనే. మీరెంతోమందికి ఉపకారం చేశారు. మీరేం నష్టపోలేదు. ఒహవేళ నేను బతికివుంటే – ఈ సంగతి ఆఖరిక్షణం వరకూ మరిచిపోను."

జవాబు చెప్పకుండానే రాఘుల్ నెమ్మదిగా దిగి వెళ్లిపోయాడు.

## 16

మర్నాడుదయమే హారాన్‌పూర్ ప్రయాణం. శారదని పిలిచి జాగర్తకోసం అక్కడికి పట్టుకెళ్ళే బట్టలన్నీ లిస్టు రాయమన్నది సవిత. "నా బట్టలు ఆ లిస్టులోకి రావమ్మా!" అని చెప్పింది, శారద. ఈమాట తారకుడికీ ఆశ్చర్యం కలిగించింది. ఎందుకు, ఏమిటీ అంటూ శారదను ప్రశ్నలు వేశారు. బయల్దేరితీరాలి అని శాసించినట్టు చెప్పారు.

"వెంబడి ఆడవాళ్ల సాయంలేకుండా అమ్మ ఒక్కతే ఆ పల్లెటూళ్లో ఎలా వుండగలదు? అయినా, నిన్నభ్యంతరపెట్టిన ఆ మహానుభావుడెవరు: రాఘుల్ బాబు అయివుంటాడు, అవునా?" అని అన్నాడు తారకుడు.

అందుకు శారద "ఎవరైతే నాకీఇంటో స్థానం కల్పించారో, వారి అనుమతి లేకుండా ఎక్కడికీ రాను నేను," అన్నది; తారకుడి ముఖం చూడకుండానే.




శారద సవిత పాదాలకు నమస్కరించి, నువుమాత్రం నన్ను అపార్థం చేసుకోకమ్మా!" అన్నది.

"ఇవాళ కాకపోతే రేపయినా అందరూ నిన్ను సక్రమంగా అర్థం చేసుకుంటారు" అని చెప్పింది సవిత.

"దయామయా!"

"ఏం కొత్తకోడలూ?"

"ఒక్కమాట చెబుతా. మరోలా అనుకోరుకదా? నన్ను కొత్తకోడలూ అని పిలవకండి! రేణుకతల్లీ! అని పిలవండి"

"నిజమే, ఇదిబాగుంది," అన్నాడు విమలబాబు.

బెల్ కొట్టారు విమలబాబు చెప్పాడు - "సరే నే వెళ్తా. ఒహవేళ హారాన్ పూర్‌లో నచ్చకపోతే వెంటనే తిరిగివచ్చేయ్. తారకుడికి సెలవు దొరక్కపోతే నేనే వచ్చి నిన్ను తీసుకువస్తా" నన్నాడు.

బండీ కదిలింది. విమలబాబుతో 'నమస్కారం!' అని చెబుతూనే తారకుడు కదుల్తున్న బండిలో ఎక్కేశాడు.

## 17

గ్రామంలో బోలెడంత ఆస్తివుంది, వ్రజబాబుకి—ఇల్లూ, వాకిలీ, పంటపొలం, చెరువు, ఇంకా ఏమేమిటో. గత పన్నెండేళ్ళుగా అతని సోదరుని సంతతీ, పెత్తండ్రికొడుకు నవీన్‌బాబూ, వాళ్లూ యథేచ్ఛగా నిశ్చింతగా హాయిగా అనుభ

విస్తున్నారు. ఇంతకాలానికి ఆకస్మాత్తుగా, కూతురుతో సహా వ్రజబాబు వచ్చేప్పటికి ఆందోళన ప్రారంభమయింది. కాని, నిజమైన అధికారికి అడ్డు చెప్పలేకపోయారు. అయినా, కొంతసేపు వాళ్లమధ్యని గుసగుసలైన తరవాత ఎలా అయితేనేం, తండ్రికీ కూతురికీ కలిపి వరండాలో కొంతభాగం, వసతిగా కేటాయించారు. ఇదీ వ్రజబాబుకి ఆత్మబంధువులు కల్పించిన ఆశ్రయం.

మొదటిపూట భోజనం కూడా పాపం వాళ్ళే శ్రమపడి ఏర్పాటుచేశారు——ఇంతే కాదు, వరండాలోకే పదార్థాలన్నీ పంపించారు. తరవాత ఆ వరండాలోనే చిన్న గదులుగా చేసుకున్నాడు వ్రజబాబు, కాలక్షేపానికి. ఎంత యత్నించినా వ్రజబాబు తన గోవిందుణ్ని పూజామందిరంలో స్థాపించుకోటానికి వాళ్లు ససేమిరా ఒప్పుకోలేదు. అభ్యంతరపెట్టారు.

వాళ్లసలు ఇంత అకస్మాత్తుగా రావటానికి కారణమేమిటో కూపీ లాగాలని గింజుకుపోయారు వాళ్ళంతా. అతడేమో కులభ్రష్టుడు, అనారోగ్యం. కూతురేమో అవివాహిత.

లోగడ ఏవో కొంత స్థిరాస్తి రాసిచ్చినందుకుగాను తనభారం, ఈ పిల్లభారం తమను మొయ్యమంటాడేమో ! ఎవడు భరించగలడు ?——ఇదీ వాళ్ల వేదన.

పెత్తండ్రికొడుకు నవీన్‌బాబు నిలబడి చెప్పాడు : "చిన్నన్నాయ్ ! ఒకమాట చెప్పాలి నీతో. నోరు రావడంలేదు; అయినా చెప్పక తప్పదు. రేణుకి మూడేళ్ల వయస్సులో వాళ్ళమ్మ భర్తనీ కుటుంబాన్నీ వొదిలేసి దూరపు బంధువయిన రమణిబాబుతో లేచిపోయిందిట. ఆ సంగతి ఊళ్లో అందరికీ తెలుసట ! కనక ఇలాంటివాళ్లకి ఇంటో స్థానమిస్తే వాళ్లుకూడా పతితలూ, కులభ్రష్టులూ అయిపోవాల్సి వస్తుందిట !"

ఈ సంగతి విని వ్రజబాబు తలవంచుకూర్చున్నాడు.— లోగడయితే, ధనవంతుడు కనక డబ్బుతో అందర్నీ నోరు మూయించగలిగేవాడు. ఇప్పుడేముంది? నిర్ధనుడు. పైగా, ఈడొచ్చిన పిల్లకు పెళ్ళిచెయ్యని నేరాన్ని కులస్థులు క్షమించలేరు !

ఇన్ని విషయాలు లోకులకు తెలుసుననీ, ఇంతగా చెప్పుకుంటారనీ రేణుకకి తెలీదు. తెలిస్తే అక్కడికి రానే రాకపోను. కాని ఈ స్థితిలో మరెక్కడికి వెళ్ళటం? ఇంకెక్కడ ఉండటం ?

ఘనమైన మర్యాదలతో సత్కరించటానికి సాధ్యం కాలేదని, అది తమ దౌర్భాగ్యమేనని బంధువులు వ్రజబాబును ఓదారుస్తూ

అన్నిటికంటే రేణు పెళ్లిసమస్యే పెద్ద దిగులుగా వుందని నవీనుడు పరామర్శ చేశాడు!

అందుకు వ్రజబాబు "చింతించకు నాయనా! రేణునీ నా గోవిందుణ్నీ కూడా తీసుకుని బృందావనం వెళ్ళిపోతాను. గోవిందుడి సన్నిధిలో తల్లిచేసిన నేరానికి కుమార్తె దోషికాదు నాయనా! అంతదాకా వరండాలోనే కాలం గడుపుతా. ఎవ్వరికీ ఏమీ కష్టం కలిగించను." అని చెప్పాడు.

వ్రజబాబు పొందుతున్న దుఃఖం చెప్పతరంకాదు. లోలోపలే కుమిలిపోతూ, "గోవిందా!—చివరకు నీకూడా తగినస్థానం కల్పించలేకపోయాను ప్రభూ! మాతోపాటు నువుకూడా పతితుడవై పోయావా దేవా!" అనుకుని వాపోయేవాడు.

*　　　　*　　　　*　　　　*

ఇవాళ గోవిందుడికి హారతి ఇస్తూ, ఇస్తూ వ్రజబాబు కళ్ళు తిరిగి పడిపోయాడు. స్పృహ తప్పింది. "నాన్నా! అన్నయ్యనైనా, నవీన్‌బాబాయినైనా తీసుకురానా?" అనడిగింది కంగారుగా రేణు. కొంతసేపటికి తెప్పరిల్లుకుని "రాజు...రాజు!" అనిమాత్రం ఉచ్చరించాడు వ్రజబాబు.

ఆరోజునే రాహుల్‌కి టెలిగ్రామ్ పంపించింది రేణు. వ్రజబాబు గురించి ఊళ్లో డాక్టరు 'రక్తపోటు హెచ్చుగావుంది. ఇప్పటికి గండం గడిచినట్టే, మళ్ళీసారి వస్తే ప్రాణాపాయం, జాగ్రత్తగా ఉండాలి' అని చెప్పాడు.

*　　　　*　　　　*　　　　*

ఆనాడేమన్నది శారద?— 'మీరనేకమందికి ఎంతో ఉపకారం చేశారు. అందువల్ల మీకు కలిగే కష్టమేం లేదు. నా జీవితాంతం వరకూ ఈ సంగతే గుర్తుంచుకుంటా,' నన్నది.

ఇదంతా నిజమే. ఎంతోమందికి ఉపకారం చేశాడు. శారదకూ చేశాడు. తనకి నష్టం కలగలేదు—మరి ఆనాటి రాత్రి శారదనే కాదు, మాతృ సమానురాలైన కొత్తమ్మనిసైతం ఎందుకంత తీవ్రంగా విమర్శించాడు?— అదీ పరుల ఎదుట?—

ఒకవేళ శారద తారకుణ్ని అమిత గౌరవంగా చూసి వుండవచ్చు. మధ్యని తనెందుకు క్షోభపడటం? శారద తనకెంతో, తారకుడికీ అంతే! తారకుణ్ని ఆమె ప్రసంగవశాత్తూ మెచ్చుకుంటే అదేమంత పెద్ద అపరాధం? రాజు కెందుకని ఆగ్రహం రావాలి? ఈ ఆలోచనలతో రాహుల్‌కు తల పగిలిపోతున్నది.

రెండురోజుల కిందట ఎస్ప్లనేడ్‌లో తను ట్రాంకోసం నిలబడ్డాడు. కారులో వెళుతున్న విమలబాబు రాజుని గుర్తించి కారు ఆపాడు. రాజు వెళ్ళగానే, "మీ పెదనాన్న వ్రజబాబూ, రేణూ కులాసాయేనా? వాళ్ల దగ్గర్నుంచి ఉత్తరాలొస్తున్నాయా? అక్కడ పల్లెటూళ్లో ఎలా వుంటున్నారో ఏమిటో?

"బాగానే వున్నారు. నాలుగురోజుల కిందటే ఉత్తరమొచ్చింది. మీరెక్కడికెళుతున్నారూ?'' అనడిగాడు.

"శారదను చూసి వద్దామని."

"శారద ఎవరూ?" అడిగాడు ఆశ్చర్యంగా.

విమలబాబు ఆశ్చర్యపడి "నువ్వెరగవూ?" అన్నాడు.

"నే నెరిగిన శారద ఇక్కడ లేదు. కొత్తమ్మతో కూడా తారకుడి దగ్గరికెళ్ళింది, హారాన్‌పూర్."

"ఏమిటీ? ఆమె హారాన్‌పూరు వెళ్ళనే లేదన్న సంగతి నీకు తెలియనే తెలీదా?"

"ఉహుఁ – వాళ్ల ప్రయాణానికి ముందురాత్రి వరకూ శారద వెళ్తుందనే నాకు తెలుసు."

"తన 'స్వామి' అనుజ్ఞ లేకుండా ఎక్కడికీ కదల్నని అన్నది."

"ఎవరా 'స్వామి'?"

"నాకు తెలీదు, బహుశా వొదిలేసిపోయిన భర్తయేమో!''

సంగతులన్నీ స్మృతిపథంలోకి తెచ్చుకున్నాడు. రాఘూల్. అంతా స్పష్టంగా అర్థమయింది.

రాఘూల్ శారదను చూసిరావటానికి నిశ్చయించుకున్నాడు.

ఈ నిర్ణయంతో మనస్సు కెంతో ప్రశాంతత లభించింది. అనేకమైన ఆలోచనలలో అతనికి తెలీకుండానే నిద్రపట్టేసింది.

## 18

ఇవాళ పొద్దెక్కినా రాఘూల్‌కు మెలకువ రాలే. ఇంకా బద్ధకం కూడా వదల్లేదు. సిగ్గుతో గభీమని లేచి, చకచక కృత్యాలన్నీ తీర్చుకుని, డ్రెస్సు వేసుకు తయరయ్యాడు.

అంతలో వైరొచ్చింది. చూడగానే ముఖం విచారంతో నిండిపోయింది— వ్రజబాబుకి సుస్తీగా వుంది, వెంటనే రమ్మని రేణు ఇచ్చిన టెలిగ్రాం అది. అది చేత్తో పట్టుకుని కాస్సేపు సందిగ్ధంలో పడ్డాడు – ఇప్పుడు శారదని చూడటానికి







వెళ్లటమా, మానటమా అని. వెంటనే బండికి అందుకోలేదు. తరవాతి బండికి బోలెడంత వ్యవధి ఉన్నది, కనక అక్కడ జబ్బువాళ్ళకి కావలసిన పళ్ళూ అవీ కొనుక్కోవచ్చు.

శారద ఇంటికి చేరేటప్పటికి—అరుగుపైన చాప వేసుకూర్చుని వుందామె. పిల్లలకు పాఠాలు చెబుతూంది. రాఘవ్‌ను చూసి ఆమె ఆశ్చర్యపడలే, కంగారు పడలే! చదువుతున్న పిల్లలతో "ఇహ మీరుపొండి, మళ్ళా మధ్యాన్నం రెండు గంటలకల్లా బడి!" అని చెప్పింది.

శారద అతన్ని చూడగానే ఆశ్చర్యపడుతుందనుకున్నాడు, కాని అలా జరగ లేదు. ఒహవేళ ముందే తెలిసిందా ఆమెకు?

"కొత్తమ్మ వెంట నువు హారాన్‌పూర్ వెళ్లలేదని తెలిసింది?"

జవాబు రాకపోయేసరికి రాఘవ్‌కు కోపం ముంచుకువస్తూంది. "అన్నట్టు-నా రుణమయితే చిల్లిగవ్వతో సహా ఆనాడే తీర్చేశావు. కనుక నాతో మాటాడక పోయినా యిబ్బంది లేదు. కొత్తమ్మ రుణంకూడా తీర్చేసినట్టేనా ఈమధ్యగానీ?"

శారద మనస్సులో ఎంత బాధపడుతూందో ముఖంలో కనిపిస్తూనేవుంది. మృదు స్వరంతో జవాబు చెప్పింది—"వేరేదైనా చెప్పదలిస్తే, లోపలికొచ్చి మాటాడండి. అలా బజార్లో నిలబడి కబుర్లు చెబితే కాదు. రండి, లోపలికివచ్చి

కూర్చోండి ఇప్పుడే వస్తా!" నంటూ క్షణంలో మాయమైంది. "నాకు వ్యవధి లేదు. ఈ ఒక్కమాట విని వెళ్లిపో!" అంటూ తొందరపెట్టాడు రాఘాల్. ఆమె వినిపించుకోలే.

ఉండనా పోనా అనుకుంటూనే అతను గదిలోకి వెళ్ళి మంచంమీద కూర్చు న్నాడు.

కమ్మటి టీ కలిపి కప్పుతో అతనిముందు పెట్టింది. సందేహిస్తూ, "ఇంతసేపు కూర్చోబెట్టావ్, ఎందుకని ఇదంతా'" అన్నాడు. అందుకు శారద "నాకు తెలీదులెండి, వొద్దకపోతే అలా ఉండనిచ్చేయండి!" అని చెప్పింది

మళ్ళా వెళ్ళిపోయిందామె. కొద్ది నిమిషాలలో — ఒక మెరిసే తెల్లని పళ్లెం నిండా జిలేబీలు, రసగుల్లాలు, మరెన్నో భక్షణాలు రాజభోజ్యాలైనవి తెచ్చి ముందుపెట్టింది. అతడు ఆప్యాయంగా ఆరగిస్తూ వుండగా మరో కప్పు టీ పట్టుకు సిద్ధంగా వున్నది శారద

''శారదా! నువ్వు టీ తాగవుకదా, మరి ఈ ఫలహారాలూ అవీ ఎవరి కోసమనీ?"

''నిజమే!...కాని తారకబాబు..." అంటూ ఆపేసింది.

"సరిసరి! అర్థమయింది,'' అని రాఘాల్ సగం తిన్న జిలేబీ పళ్ళెం కింద వుంచేశాడు.

అవన్నీ పూర్తిగా తినకపోతే తల పగలగొట్టుకు చస్తానని కూర్చుంది శారద. తినాలని లేదనేశాడు అతను. "రోజూ ఉదయం టీతోపాటు వేడివేడి జిలేబీలు తింటారుకదూ మీరూ! రెండు కప్పుల టీ తాగితేగాని సంతృప్తి లేదుగదూ మీకు?"

అనడిగేసరికి, ''నన్ను గురించిన ఈ రహస్యాలన్నీ ఎలా తెలిశాయి నీకు? తారకుడు చెప్పాడన్నమాట?" అన్నాడు.

బదులు చెప్పక, శారద కాస్సేపటికి ఇంత వక్కపొడీ, రెండు యాలకులూ తెచ్చియిచ్చింది. "ఇందాక వీధిలో నిలబడి చెబుతున్నారే ఏదో. ఇప్పుడు చెప్పండీ అదేమిటో!" అనడిగింది శారద.

''కొత్తమ్మని ఒంటరిగా హారాన్‌పూర్ పంపించి, కలకత్తాలో ఎందుకని ఉండిపోయావో, ఆ ముఖ్యమైన పనేమిటో తెలుసుకుందామని..."

ఎంగిలి పళ్ళాలను, గ్లాసులూ చూపిస్తూ నవ్వింది శారద. "ఇందుకే వెళ్ళలేక పోయాను. ఇప్పుడయినా అర్థమయిందా?" అంటూ అవి పట్టుకు బయటికి వెళ్ళి పోయింది.

లోగడ ఒకమాట అన్నాడు రాఘాల్ — లోకంలో ఎంతోమంది శారదలను చూశానని. నిజమేనా ఈ మాట? ఈ శారదలాంటి ఇంకో శారద జీవితంలో మరెక్కడయినా తారసపడిందా? ప్రాణదానానికి ప్రతిఫలంగా, ఇంత నిరాడంబరంగా ఆత్మార్పణ చెయగలిగిన స్త్రీ ఎక్కడయినా ఇంతవరకు ఎదురుపడిందా?

''నేను పన్నెండు గంటల బండీకి అందుకోవాలి'' అన్నాడు, రాఘాల్.

''ఎక్కడి కెళ్తున్నారూ?" ఆశ్చర్యంగా అడిగింది, శారద.

"పెదనాన్నగారికి జబ్బుగా వుందిట, నన్ను రమ్మని రేణు వైరిచ్చింది."

"సరే, దేవతా! ఒక్క నిమిషం ఆగండి!" అంటూ, ట్రంకు పెట్టెలోంచి కొన్ని బట్టలు తీసుకు వెళ్ళింది. నిమిషాల్లో తిరిగి వచ్చేసింది. శుభ్రమైన తెల్లటి చీర కట్టుకుని, చేత్తో చిన్న మూట పట్టుకొచ్చింది. ఆశ్చర్యంగా చూస్తున్న రాఘాల్‌తో "నేను మీతో వస్తున్నా" అని చెప్పింది.

"నావెంట ఎక్కడికని?"

''పెదనాన్నగారికి జబ్బు, రేణు ఒక్కతే వుంది. చెయ్యాల్సిన పనులెన్నో వుంటాయి కదా?"

అడ్డుపుల్ల వేదామని రాఘాల్ ఎంతో యత్నించాడు. కాని శారద బతిమాలింది...''వొద్దనకండీ, కాళ్ళుపట్టుకుంటాను. వాళ్ళు నన్ను బాగా ఎరుగుదురు. నేను వస్తే ఏమీ అనుకోరు." అన్నది.

"సరే, నీస్నానం, భోజనంకానీ. ఈలోగా బజార్లో వస్తువులు కొనుక్కొస్తా. సిద్ధంగా వుండు" అని చెప్పాడు.

*  *  *  *

"ఇంతలోనే భోజనమయిందా. సరిగ్గా తిన్నట్టులేదు...."అన్నాడు రాఘాల్.

"నిజంగా ఇవాళ ఎంతో తృప్తిగా భోంచేసింది నేను దేవతా ప్రసాదంకదా?" అన్నది శారద, నవ్వుతూ.

చేత పట్టుకున్న చిన్నమూట, అందులో మూడు చీరెలు, ఇదే శారద ప్రయాణపు సరంజామా. తుళ్లిపడి ఇలా అంది శారద--"అరెరె-అన్నట్టు చెప్పడం మరిచా. మీరటు బజారుకెళ్ళగానే విమలబాబు వచ్చారు తొందర పని మీద వెళుతున్నారుట, ఇప్పుడే తిరిగి వస్తాను. మిమ్మల్ని కార్లో దిగబెడతాను,'' అని చెప్పి వెళ్ళారు.

రాఘాల్ స్వరం తీక్షణమయింది. "ఇవాళ ఆయన్ని కలుసుకోవటానికి వ్యవధిలేదు. శారదా! మళ్ళా వచ్చాక చూసుకుందాం. నే వెళ్ళి టాక్సీ తీసుకు రానా?'' అనడిగాడు.

మాట పూర్తికాకుండానే గుమ్మం ముందు కారు హారన్ వినిపించింది. గుమ్మంలోనించి "ఏమ్మా, శారదా!" అని విమలబాబు పిలుపు.

"రండి!'' అని పిలిచింది శారద.

గదిలోకి వచ్చాడు విమలబాబు. "అరె రాజా వచ్చేశాడే! ఒక ముఖ్యమైన పనిమీద వెళుతున్నా. శారదను పలుకరించి పోదామనీ... తీరా వచ్చాక, వ్రజ బాబుకు సుస్తీ, రేణు టెలిగ్రాం. ఇవాళే మీ ప్రయాణం...ఇవన్నీ తెలిశాయి పదండి, స్టేషన్‌కి దిగబెట్టి వెళతా.''

ఇష్టంలేకున్నా రాఘూల్ వొద్దనలేకపోయాడు.

సామానంతా కార్లో పెట్టించాక, విమలబాబు రాఘూల్ చెయ్యి పుచ్చుకుని చెప్పాడు – ''నాయనా రాజూ! ఇదే నామాట: వ్రజబాబుకి ఏ సహాయం కావల్సినా వెంటనే నాకు టెలిగ్రాం ఇవ్వు. ఈ స్థితిలో ఆర్థిక సహకారం, ఆప్తుల సహకారంరెండూ అవసరమే. నీ టెలిగ్రాం అందిందంటే, తక్షణమే మంచి డాక్టర్ను వెంటబెట్టుకొస్తాను. వ్రజబాబుకీ, రేణుకీ నేను శ్రేయోభిలాషిని. ఏ విధమైన శంకా పెట్టుకోకుమా నాయనా!"

ఈ మాటలకు రాఘూల్ హృదయం ద్రవించిపోయి, క్షణకాలం ఆయనకేసి పరిశీలనగా చూశాడు.

మళ్ళా చెప్పాడు విమలబాబు – ''నాయనా రాజూ, ఆ కుటుంబాని కీనాడు నీకంటె పరమాప్తులెవరూ లేరు. నాకు తెలుసు. ఏపాటి తృణప్రాయమైనా నేనూ వారికి ఉపకారం చెయ్యగలిగితే అంతకు మించిన సంతోషం నాకు మరొకటి ఉండబోదు. అందుకే అంతగా చెబుతున్నా," నన్నాడు.

ఇంకా ఇలా అన్నాడు – "ఈనాడు వ్రజబాబూ రేణుకా ఎంతటి అసహాయ స్థితిలో ఉన్నారో ఆ సంగతి నాకు బాగా తెలుసు నాయనా!"

రాఘూల్‌కు రెండు నేత్రాలూ అశ్రువులతో నిండినై. ''అంతకు ముందు నేనేమైనా మీపట్ల అనాలోచితంగా నడుచుకుంటే నన్ను మన్నించాలి. ఇదే నా క్షమాపణ. పెదనాన్నగారికి ఏం సహాయం కావల్సి వచ్చినా, వెంటనే మీకు తెలియజేస్తా'' అని చెప్పాడు,

## 19

కలవరపడిన సవిత మనస్సు తారకుడి సేవతోనూ శుశ్రూషణతోనూ కొంత శాంతిపడింది. ప్రతిపనీ ఎంతో శ్రద్ధగా ప్రేమాభిమానాలతో చేస్తున్నాడతను. ఒకనాడు మాటల సందర్భంలో సవిత అడిగింది: "నాయనా, తారక్!–




నన్నిక్కడికి తీసుకొచ్చే ముందు మాట మాత్రమైనా రాజుతో చెప్పలేదా?"

"లే" దన్నాడు.

"నువు నాకు చేసే సపర్యలకంటే కూడా అది చాలా ముఖ్యం నాయనా! ఒక్క ముక్క చెప్పివుండాల్సింది."

"ఆ సంగతి మరోనాడెప్పుడైనా చెబుతాలే!'' అన్నాడు. ఆమె ఆశ్చర్య పడింది. "నాతో చెప్పటానిక్కూడా సందేహపడవలసిన సమస్య మీ ఇద్దరి మధ్యనే ఏమంత వచ్చిపడింది.నాయనా?"

"ఆ గొడవ ఈపాటికే మీకు చెప్పివుంటాడనుకున్నాను. ఒకవేళ లేకపోయినా నేడో రేపో చెప్పేతీరతాడు. అందుకనే నేనూ నిజం చెప్పేస్తా'' అన్నాడు తారకుడు.

"రాజుకి నువ్వు ప్రాణస్నేహితుడివటగా, ఈపాటికి అతన్ని బాగా అర్థం చేసుకునుంటావనుకున్నా. కాని, ఇంకా ఇప్పటికీ సరిగ్గా అర్థంచేసుకోలేనట్టుగా కనిపిస్తూంది."

"ఎంచేతనమ్మా?"

"తనకెంత అన్యాయం జరగనీ, ఒహర్ని గురించి మరొకళ్ళతో ఫిర్యాదు మాత్రం చెయ్యడు. అంత సహన గుణమున్న దతనికి, నాకు తెలుసు," అన్నది సవిత.

''క్షమించమ్మా! నామాట పొరపాటుగా అర్థంచేసుకోకూడదు. నాకూ అతనికీ మధ్యని సంభాషణ జరిగిందనటం నిజమే, కాని అదెంతమాత్రం యదార్థంకాదు '

"అసలేం జరిగిందో రాజు నాకు చెప్పలేదు. నేనింతవరకూ విననూలేదు, తారక్! కనుక నిశ్చింతగా ఉండొచ్చు "

ఉన్నట్టే ఉండి పెద్ద ఉపన్యాసం ప్రారంభించి, చివరికిలా అన్నాడు! ''ఈనాడు సభ్య సమాజంలో గౌరవంగా జీవిస్తున్నాడంటే ఎవరి ప్రోత్సాహం వల్ల? ఎవరతన్ని ప్రతిభావంతుణ్ని చేసింది? ఎవరి కరుణ, వాత్సల్యం అతన్ని అనుక్షణం శ్రీరామరక్షలుగా కాపాడుతున్నయ్? అలాంటి తల్లి ఎదట సత్యాన్ని మరుగుపరచటం నేనెంతమాత్రం హర్షించలేనమ్మా'' ఇలా చెప్పి దీర్ఘంగా నిట్టూర్చాడు.

''అసలు మీ ఇద్దరిమధ్యనేం జరిగిందేమిటో చెప్పు నాయనా?'' అన్నది సవిత.

''అయితే చెబుతా వినమ్మా!– మీగురించి నాకు పరిచయం చేస్తూ, రాఘవ్ ఎంత హేయంగా వర్ణించాడంటే... మిమ్మల్ని తల్లి అని భావించే వాడెవడూ అలా అని ఉండడు.''

ఇలా చెప్పినందుకు ఆమె ముఖంలో ఎటువంటి మార్పూ కలగలే.

''రాఘవ్‌కు ఒకర్ని గురించి మరొకరితో ఫిర్యాదుచేసే గుణం లేదన్నారుగా? ఈమాటకు భిన్నమే అమ్మా, అతని స్వభావం. మీగురించి నాకు ఫిర్యాదు రూపంలోనే వర్ణించి చెప్పాడు.''

చూస్తూ వింటూనే వుంది సవిత. మళ్ళా అందుకున్నాడు తారక్ – ''ఒక్క మాట మాత్రం నిజమేనమ్మా! ఆనా డతను అతిశయోక్తులతో ఒక కథ చెప్పాడు ఇది విన్న తరవాత నీకు రోత పుట్టడంలేదా? అసహ్యం కలిగే మాట నిజమే."

''అతడెన్నడూ అబద్ధాలూ, అతిశయోక్తులూ చెప్పడు నాయనా. అతను చెప్పినదంతా నిజమే! ముందెప్పుడైనా నువ్వు పొరబడేందుకు అవకాశముంటుం దేమోనని ముందుగా తనే అన్ని విషయాలూ అరమరిక లేకుండా నీకు వివరంగా చెప్పాడన్నమాట. అతని మాటలు అపార్థం చేసుకోవడం నీదే పొరపాటు!''

''ఆ విషయాలు నేనడగలేదు, పెట్టలేదు. తనే...''

''రాఘుల్‌కంటె నువ్వు బుద్ధిమంతుడివి, ఎక్కువ చదువు చదివావు. బాగా ఆలోచించగలవ్, మంచి చెడ్డలు నిర్ణయించగలవు. అందుకనే రాజు నీ దగ్గర ఏ రహస్యమైనా దాచటానికి ఇష్టపడలేడు. తన కొత్తమ్మను గురించిన దౌర్భాగ్య కథను ఉన్నదున్నట్టు చెప్పాడు '' అన్నది సవిత.

ఆలోచనలో పడ్డాడు తారకుడు. కాస్సేపయాక వంచిన తల ఎత్తి ఇలా చెప్పాడు: ''అమ్మా! ఒకరోజున మాటల సందర్భంలో రాఘుల్ ఏమన్నాడనుకున్నావ్? 'ఈ లోకంలో వెయ్యిమందిలో 999 మంది సామాన్యులే, ఒక చోట ఒక్కామె మాత్రమే అసాధారణ స్త్రీ అయివుంటుంది. అలా వెయ్యిమందిలో లభించే అసాధారణ స్త్రీలలో మన కొత్తమ్మ ఒకత్తె' అన్నాడు. ఈ మాట మాత్రం నిజం."

సవిత పరధ్యానంగా ఏదో ఆలోచిస్తున్నట్టు కనబడింది.

"అమ్మా! జీవితంలో నాకెన్నో ఆశలున్నాయి, ఆశయాలున్నాయి. సామాన్యపు బ్రతుకు ప్రతిజీవీ బ్రతుకుతుంది. కాని నాకు గొప్పగా జీవించాలనీ, నే చేసే పనిలో ప్రత్యేకత ఉండాలనీ, కీర్తి, గౌరవం, ప్రతిష్ఠా సంపాదించాలనీ, ఉన్నతోన్నతమైన స్థానం పొందాలనీ నా అభిలాష!

"మంచిదే నాయనా! మంచివాళ్లకి ఉండాల్సిన ఆదర్శాలే అవి," అన్నది సవిత.

"అమ్మా! నేను లోగడ ఎన్ని కష్టాలూ అవస్థలూ పడ్డానో చెప్పానుకదా! స్వయంకృషివల్లనే కాలేజి చదువులో జయం పొందా. నిజానికి నాకు పట్టుదల చాలా ఎక్కువ! పని వస్తే పూర్తి అయేవరకూ నిద్రపోను!" అని చెప్పాడు తారక్.

సవిత నవ్వుతూ ఏదో ఆలోచిస్తున్నది.

"మీకుమాత్రమే చెప్పానమ్మా, నా జీవితకథ అంతా. సృష్టికర్త మానవుడికి చేసిన మహాదానమే మాతృప్రేమ అనేది. అలాంటి మహాదానానికి జన్మతోనే దూరమయిపోయినవాడు..." అంటూవుంటే తారకుడి గొంతు రుద్ధమైపోయింది. సవితకళ్లు నీళ్లతో నిండినై. కాని ఏం మాటాడలే, తారకుణ్ని ఊరడించనూ లేదు.

అంతలో ''పోస్ట్!''

సవితపేర వచ్చింది ఉత్తరం. శారద రాసింది. "రాజూ, విమలబాబూ

బజార్లో కలుసుకున్నారు. గ్రామంలో రేణు, వ్రజబాబూ కులాసాగానే వున్నారు– ఈ క్షేమవార్తలన్నీ రాణి ద్వారా తెలిసినై."

ఉత్తరం చదివింది సవిత. "రాజు శారదను కలుసుకోలేదనుకుంటా. ఎలా కలుసుకోలేదనుకుంటాడు? శారద నాతోపాటు హారాన్‌పూర్ రాలేదన్న సంగతి తెలియదుగా?"

మాటాడలే తారక్.

"పోనీ, నేనే రాజుకి ఉత్తరం రాస్తే?...సరేగాని, తారక్! నువ్వోపని చెయ్యి. రాజుని ఇక్కడికి రమ్మనమంటూ నువ్వో అతని కొక ఉత్తరం రాయి. అందులో నేనూ రెండు ముక్కలు రాస్తా. రాజు ఇక్కడికి వస్తే, మీ ఇద్దరి మధ్యనీ ఉంటున్న అపోహలు మాసిపోవచ్చు!" అని చెప్పింది సవిత.

"అలానే అమ్మా! ఇవాళే రాస్తా" నన్నాడు.

తారకుడు ప్రసంగ విషయం మార్చేశాడు. "విమలబాబు దగ్గర్నుంచి ఇప్పటిదాకా జాబు వచ్చినట్టులేదు. ఇవాళ ఏమయినా వచ్చిందా అమ్మా!"

"నువ్వేమైనా రాశావా ఆయనకు?"

"ఎందుకు రాయలే? మీకు ఆయన ఉత్తరంరాసి పదిరోజులయిందను కుంటాను?"

"అవునవును దానికే నేను జవాబు రాయలేదు. అందుకే మళ్ళీ ఉత్తరం రాలేదనుకుంటా. అయినా శారద ఉత్తరంద్వారా ఆయన యోగక్షేమాలు తెలుస్తూనే వున్నాయి."

"చాలా ఉత్తముడమ్మా అయన. చూస్తే చెయ్యెత్తి నమస్కరించ బుద్ధిపుడుతుంది. ఎంత మంచివాడు! లోకంలో అలాంటి సార్థక పురుషులు చాలా అరుదు."

నవ్వుతూ అన్నది సవిత–"అపరిమితమైన ధన సంపాదన తప్పితే ఆయన జీవితంలో సాధించిందేమిటో?"

అంతలో శిధూతల్లి వచ్చింది. "పొద్దెక్కుతూందమ్మగారూ! చప్పున వంట మొదలెట్టండీ!" అన్నది.

"ఇప్పటిదాకా అమ్మ చేతి చల్లటి ప్రసాదం నాకు దొరుకుతూనే వుంది. రాజరాజేశ్వరిలాంటి నా తల్లిచేత రోజూ వంట వండించటం, బట్టలుతికించటం– ఇదా పని?– అమ్మా, మీరిలాంటి పనులేమీ చెయ్యొద్దు. మీకు తగినవి కావు," అన్నాడు తారకుడు.




సవిత కళ్లు జలపూరితమయినాయి "ఎల్లకాలం  కే ఓపిక ఉంటుందా? తెలుసు. కాని ఇప్పుడు మాత్రం దాసీలచేత చా.రీ చేయించుకోవటం నా కిష్టం లేదు. ఒకవేళ – దేవుడు దయదలిస్తే, నీ దగ్గరకే వచ్చి ఉం.టా, మంచంమీద హాయిగా కూర్చుని దాసదాసీలచేత అన్నిపనులూ చేయించుకుంటాగా?" అన్నది సవిత.

సవిత మాటలో ఉండే అంతరార్థం గ్రహించలేకపోయాడు తారకుడు. విచారంగా ఉన్నాడు

"నీ అంతరాత్మ ఎంత పవిత్రమయిందో నీ పరిచయం కాకముందే నే తెలుసుకున్నాను నాయనా! నువ్వంటే నాకెంతో అభిమానముంది విశ్వాసమూ ఉంది, నాయనా!" అని చెపి .ంది.

"నన్ను చూడకముందే నన్నుగురించి తెలుసుకొన్నావా అమ్మా? చెప్పావే కావేం? ఎవరిద్వారా తెలుసుకున్నావో గాని విశ్వాసపాత్రుణ్ని అని మాత్రం, ఎలా నిర్ణయించుకోగలిగారు?"

"ఎలా తెలుసుకున్నానో ఆ సంగతి నువు వినొద్దు, నాయనా! నా అంతరాత్మకి అలా అనిపించింది. నమ్మాను. అంచేతనే స్నేహపూరితంగా నువు పిలిస్తే సరే అన్నాను. నా బిడ్డ రాజుకి కొంచెం బాధ కలిగించినా, ఇక్కడ నీ ఆతిథ్యం స్వీకరించేందుకు నే వచ్చాను" అని చెప్పింది, సవిత.

''నిజంగా నామీద అంత అభిమానమూ, నమ్మికా ఉన్నదా అమ్మా?"

"అంతేకాదు నాయనా! అంతకంటే ఎక్కువగానే నిన్ను విశ్వసిస్తున్నా. నాకు పుత్ర సంతతి లేదని తెలుసుగా నీకు? ఆ కొరత లేకుండా తీర్చాడు రాజు. అయినా అందులో కొంత అసంపూర్ణత ఉన్నది. కనక దాన్ని సంపూర్ణం చెయ్యవలసిన బాధ్యత నీదే నాయనా, తారక్!" అన్నది సవిత.

సంతోషంతోను, ఆశ్చర్యంతోనూ అలాగే చూస్తూ కూర్చున్నాడు తారకుడు.

## 20

శారదా, రాఘుల్ కలిసి వ్రజబాబు మంచం దగ్గరికి వచ్చారు. వ్రజబాబుకి వ్యాధి మఖ్యముఖం పట్టినా, శారీరకంగా మానసికంగాకూడా చాలా దుర్బలంగా వున్నాడు. రాఘుల్‌ను చూడటంతోనే అశ్రుధారలు స్రవించినాయి. పితృతుల్యుడైన వ్రజబాబు స్థితి చూసేసరికి రాఘుల్‌కు కన్నీళ్ళు ఆగలేదు.

"రాజూ! – ఇక్కడి సామాజికులంతా నన్ను వెలివేశారు నాయనా! నా గోవిందుడికూడా స్థానం లేకుండాపోయింది. ఈ స్థితిలో నీ చెల్లెలి మంచి చెడ్డలు చూసేదెవరు? అందుకనే పిలిపించాను నాయనా! రేణు వివాహం జరిగిపోతే నిశ్చింతగా గోవిందుడి సన్నిధిని చేరుకోగల ననుకున్నా. కాని సాధ్యం కావటంలేదు. రాజూ! –"

"మీరు కాస్త కోలుకుంటే రేణుక సంబంధం గురించి నేప్రయత్నిస్తానుగా?" అన్నాడు రాఘుల్.

"రేణుక అసలు పెళ్ళే చేసుకోదుట?"

"ఏదో చిన్నపిల్ల ... ఆవేశంలో అనివుంటుంది. స్తిమితంమీద నచ్చజెప్పవచ్చుగా?"

"నీ కొత్తమ్మ కూతురే నాయనా, రేణుక! కొత్తమ్మ ఎంత పట్టుదలమనిషి! నాకూ భగవంతుడికి తప్ప ఆ సంగతి మరెవ్వరికీ తెలీదు. అందువల్లనేగా యావత్ జీవితమూ ధ్వంసంచేసుకున్నది? పోనీ అంటే పునరాలోచనకూడా లేదు. ఆ తల్లి కూతురే నాయనా రేణుక!" అన్నాడు వ్రజబాబు.

''కాని, తల్లికున్నంత పట్టుదల లేదనుకుంటా రేణుకి."

"నీకు తెలియదు రాజూ! నూటికి నూరుపాళ్లూ తల్లి స్వభావం అబ్బింది కూతురికి. తలుచుకుంటే నాకే చిత్రమనిపిస్తుంది. రేణుతల్లి వంటి సచ్చరిత, సదయహృదయ లోకంలో అట్టేమంది కనిపించరు, నాయనా! అలాంటి కొత్తకోడలు...అదంతా దౌర్భాగ్యం-తప్ప మరోటికాదు. ఆమె నిర్దోషి."

"ఆ సంగతులన్నీ ఇప్పుడెందుకు పెదనాన్నగారూ! ముందు మీ ఆ రోగ్య విషయం చూతనివ్వండి!" అన్నాడు రాఫూల్. వ్రజబాబు ఎన్నడూ సవితను గురించి ఇతరులతో చర్చించి ఎరగడు. అటువంటిదీనాడు పుత్రతుల్యుడైన తన ఎదుట ఈ ప్రసంగం తేవటం రాఫూల్‌కు ఆశ్చర్యమే కలిగించింది

గదిలోకి వచ్చి శారద వ్రజబాబుకి నమస్కరించింది. ఆశ్చర్యంతో వ్రజబాబు రాజు నడిగాడు: "మీ కొత్తమ్మకూడా వచ్చిందా యేం?" "లేదు, అమ్మ కలకత్తాలో లేదు, వర్ధమాన్ జిల్లాలో వున్న తారకుడిదగ్గరకెళ్ళింది. శారద ఇక్కడికి రావాలనీ, మిమ్మల్ని సేవించుకోవాలనీ ఆత్రపడింది. పోనీ మీ అనారోగ్యం సంగతి కొత్తమ్మకి తెలియజెయ్యనా?" అనడిగాడు రాఫూల్.

"వొద్దు వొద్దు. తెలిస్తేచాలు, తక్షణమే బయల్దేరి వచ్చేస్తుంది" అన్నాడు వ్రజబాబు.

వ్రజబాబుకి మెదడులో రక్తపోటు ఎక్కువచే పక్షపాత లక్షణాలు కన్పడినయి. ఇక్కడ సరైన డాక్టరు లేడు. కనుక ఒక్కటే దారి—కలకత్తానుంచి పెద్ద డాక్టరెవరినయినా ఇక్కడికి రప్పించటం! సందిగ్ధంలో పడ్డాడు రాఫూల్.

ఇది బోలెడంత ఖర్చుసమయం. తనదగ్గర ఏమీ ఆర్థికస్తోమతు లేదు. వ్రజబాబు వైద్యానికా చాలా ఖర్చవుతుంది. కాబట్టి కొత్తమ్మకు తెలియబరిస్తే? —ఇలాటి ఆలోచనలకు దరీ దాపూ కనిపించలేదు. సరిగ్గా ఇదేసమయానికి విమలబాబు ఉత్తరం వచ్చింది. అది చేతిలో పెట్టుకుని ఉదాసీనంగా కూర్చునేసరికి శారద వచ్చింది.

"ఎందుకిలా ఆలోచిస్తూ కూర్చుంటారు? మాటమాత్రం విమలబాబుకి తెలిస్తే చాలు. ఆయనన్నీ సిద్ధం చేస్తారు పెదనాన్నగారి స్థితి మరీ అధ్వాన్నంగా ఉంది. ఏక్షణం ఎలా వుంటుందో తెలీదు. త్వరపడాలి. పోనీ, ఈ విషయం కొత్తమ్మకు తెలుపకుండానే డబ్బు అర్జంటుగా కావాలని రాయండి" అన్నది.

మాటాడలే రాఫూల్.

"నేనో మాటడుగుతా చెప్పండీ— పెదనాన్నగారి ప్రాణం ఎలాఅయినా రక్షించుకోవాలి మనం. ఈ స్థితిలో కొత్తమ్మనో, విమలబాబునో సహాయం కోరటానికి మీరెందుకు లజ్జపడాలి?" అనడిగింది శారద.

"నిజమే శారదా, నువ్వు చెప్పినమాట! ఇవాళే కొత్తమ్మకూ విమలబాబుకీ ఉత్తరాలు వేస్తా" నన్నాడు రాఫూల్.

"అంతే దేవతా, అలానే చెయ్యండి. ఎవళ్ళనీ అడగడం పెట్టుకోవద్దు."

* * * *

ఆ సమయంలో గోవిందుడికి నైవేద్యం తయారుచేస్తున్న రేణుక దూరాన కూర్చుని అంతా వింటున్నది. కబుర్లు సాగిపోతున్నాయి. శారద ఎన్నెన్నో కోతలు కోస్తూపోతూవుంది. ఆ ధోరణిలో కొత్తమ్మను గురించి కూడా వాగేస్తూంది. ఇహ కొత్తమ్మగారింటో అద్దెకున్నవాళ్ళ సంగతులు సరేసరి!

కూరలు తరుగుతూనే అన్నది శారద! "కలకత్తానించి మంచి డాక్టర్ని తీసుకురమ్మని విమలబాబుకి, వైరివ్వటానికని వెళ్ళారు రాఘూల్ బాబు. బహుశా రేపు మధ్యాన్నానికి వచ్చేస్తారు........."

ఆశ్చర్యంగా చూసింది కాని రేణుక ఒక్కమాట కూడా మాటాడలేదు

"విమలబాబు వస్తే కొంచెం ధైర్యంగా వుంటుంది. వైద్యం-మందులూ, పథ్యం-పానం అన్నీ చక్కగా సమకూరుతాయి. పెదనాన్నగారికి చప్పున నయమవుతుంది" అన్నది శారద.

తండ్రికి పథ్యం అమరుస్తూవుంది రేణుక. మౌనంగా వున్నా, శారద చెబుతున్న ప్రతిమాట శ్రద్ధగా వింటూనేవుంది. మళ్ళా ప్రారంభించింది శారద—

"ఆనాడే గనక విమలబాబు అడ్డుపడి మమ్మల్ని రక్షించకపోతే, నిలవ నీడ లేకుండా వీధిలో తిరగాల్సిన వాళ్ళం. ఆసంగతి గుర్తుకొస్తే ఇప్పటికీ భయంతో వణికిపోతా. ఇంతకాలమూ ఎవరి ఆశ్రయంలో మేం నిశ్చింతగా బతుకుతున్నామో, అలాటి కొత్తమ్మకే ఈనాడు ఆశ్రయం లేకుండాపోయింది! ఆనాడు నాకు కొత్తమ్మ తప్ప-అన్యథా శరణం నాస్తి!"

"ఎందుకని?" అనడిగింది రేణుక.

ఇందుకు బదులుగా – తనకు కొత్తమ్మా, దేవతా పునర్జన్మ ప్రసాదించటం, జీవితానికి కావల్సిన సంపూర్ణ ఆశ్రయాన్ని మాత్రం తను సంపాదించుకోవటం— అంతా వివరంగా చెప్పింది

అంతలో రాఘూల్ వచ్చి రేణుకను పిలిచాడు. "పెదనాన్నగారికి పథ్యపువంట తయారయింది, స్నానం చేయించాలి, కాని ఆయన నిద్దరోతున్నారు. ఈలోగా ఒకసారి మాటాడాలి" అని పిలిచేటప్పటికి "బియ్యం పడేసి ఇప్పుడే వస్తా"నని చెప్పింది రేణుక.

* * * *

రేణుక వచ్చేసరికి రాఘూల్ పత్రిక చదువుకుంటున్నాడు. ఆమెను కూర్చోమన్నాడు. "పెద్దడాక్టరుకోసం కలకత్తాకు టెలిగ్రాం ఎందుకిచ్చావ్?" అనడిగిందామె. "ఇక్కడివాళ్లకు అసాధ్యం. పెదనాన్నగారికి కాస్త ఆరోగ్యం కుదట




బడగానే మనం ఇక్కణ్నించి పెట్టే బేడా సర్దుకోవటం మంచిది. కలకత్తా వెళ్ళాక మునుపటిలాగానే ఒక చిన్న ఇల్లు అద్దెకుతీసుకుందాం...తిరిగి ఇక్కడికే వచ్చినందువల్ల ప్రయోజనంలేదు'' అన్నాడు.

''ఎందుకని ''

''ఇంతకాలం ఇక్కడున్నావే ఇంకా ఆసంగతి అర్థంకాలే?'' మన జాతివాళ్ల వాలకం చూస్తూనే వున్నావుగా? అంత సుస్తీచేస్తే, పెదనాన్నగారివేపు ఒక్కడయినా తొంగిచూశాడా?''

''మన కుటుంబ పరిస్థితులు ఆలోచిస్తే, కలకత్తాలో చిరకాలం ఉండటం అసాధ్యం. ఇక్కడయితే ఇంటిఅద్దె లేదు. తక్కువ ఖర్చుతో కాలక్షేపం జరిగిపోతుంది'' అన్నది రేణుక.

''పెదనాన్నగారి ఆరోగ్యం ఏమంత నమ్మతగిందిగా లేదు. దురదృష్టవశాత్తు ఏనాడయినా మరోలా జరిగితే-నీకిక్కడ ఆశ్రయమిచ్చేవాళ్లెవరు? ఇక్కడి సమాజం ఎరుగుదువుగా, మనవాళ్లే మనకి దూరమైపోతున్నారు. సవితల్లి ముందుగానే మనల్ని వదిలిపెట్టి పుట్టింటికి చేరుకుంది కదా, ఈలోగా నీ వివాహం కాస్తా అయిందనిపిస్తే పెదనాన్న నిశ్చింతగా ఉండవచ్చు, నాదగ్గర, మరో హరి సాయంకోసరం ఎదురుచూడక్కర్లే. నీ వివాహం జరిపిస్తేగాని ఆయన ప్రాణాలు కుదుటపడవు'' అని చెప్పాడు రాఘాల్.

రకరకాలుగా వివాహ ఆవశ్యకతను గురించి రాఘుల్ రేణుకకు నూరి పోశాడు. అందుకామె "వివాహాన్ని గురించి నాకెంతమాత్రం ఆసక్తిలేదని నేను నాన్నగారితోనే చెప్పాను రాజన్నాయ్! నాకా అభిప్రాయమే లేదు'' అన్నది రేణుక

"గుర్తుంచుకో రేణూ!- నువ్వు యుక్తవయస్కురాల వయ్యావు. బాగా ఆలోచించిచూడు. అనివార్యమైన పరిస్థితులకు లొంగి ఒకప్పుడు నువు చెప్పిన మాటకే కట్టుబడి ఉండాలనుకోకు. మూర్ఖంగా వ్యవహరించి, మన కుటుంబానికి తీరని విషాదాన్ని తెచ్చిపెట్టకు," అని చెప్పాడు, రాఘుల్.

రేణుక తలవంచుకుని ఈ మాటలన్నీ వింటూ కూర్చున్నది.

## 21

అనుకున్నట్టుగానే పేరుపొందిన ఇద్దరు డాక్టర్లు కలకత్తానించి వచ్చారు. వ్రజబాబుని బాగా పరీక్షచేసి, వైద్య విధానమంతా సూచించి, ముఖ్యమైన ఏర్పాట్లుచేసి వెళ్ళిపోయారు. ఆయనకింకా రక్తపోటు తగ్గాలి, తరవాతనే కలకత్తా వెళ్లటం.

ఈలోగా - మెడికల్ కాలేజీదగ్గరలో గాలీ వెలుగూ బాగా వచ్చే చక్కటిల్లు అద్దెకు తీసుకోమని కలకత్తాలో గుమాస్తాలకు రాశాడు విమలబాబు. వైద్యులు వచ్చి వెళ్ళాక వ్రజబాబు ఆరోగ్యం కోల్కుంటూనేవుంది. అంచేత అందరూ సంతోషంగానే ఉన్నారు.

ఒకనాడు సాయంత్రం వరండాలో వ్రజబాబూ విమలబాబూ చెరో పడక కుర్చీలో కూర్చుని 'ట్రేడ్ డిప్రెషన్' గురించి చాలాసేపు మాటాడుకున్నారు.

"ఆర్థిక దృష్ట్యా చూస్తే నిజంగా మీరు లక్ష్మీపుత్రులు. అన్ని విధాలా అనుకూలంగా వుంది. దేనికీ లోటు లేదుగదా! ఇంత వయస్సులోకూడా మీరు వివాహం ఎందుకు చేసుకోలేదూ?" అనడిగాడు వ్రజబాబు.

అందుకు విమలబాబు సమయం సందర్భం కలిసిరాలేదనీ చేసుకోవాలన్న ఆసక్తి లేదనీ చెప్పాడు. దానిపైన ఉభయుల మధ్యనీ ఎన్నో తర్కాలూ చర్చలూ నడిచాయి.

"ఆ సమయం కాస్తా గడిచిపోయింది వ్రజబాబూ! ఋతు ధర్మానికి విరుద్ధంగా ఏ పువ్వూ వికసించదు. బల్లవంతాన వికసింపచెయ్యదలిస్తే అది వికృతమైపోతుంది గాని ప్రయోజనం లేదు" అన్నాడు విమలబాబు, ప్రసంగవశాత్తూ

వ్రజబాబు నవ్వుతూ చెప్పాడు - "తెలివయిన తోటమాలి శ్రద్ధగా ప్రయత్నిస్తే ఋతు ధర్మానికి భిన్నంగానే కొన్ని పువ్వుల్ని వికసింపచెయ్యవచ్చు."

యమ



"అయితే విమలబాబూ! వివాహం మానవుడి ఇష్టాయిష్టాలమీదనే గాని అదృష్టంమీద ఆధారపడలేదా?'' అనడిగాడు వ్రజబాబు.

ఈ విధంగా సంభాషణ సాగిన తర్వాత తన ప్రార్థనను అంగీకరిస్తానని విమలబాబునించి వాగ్దానం తీసుకున్నాడు.

* * * *

అప్పటికే వ్రజబాబు కళ్లలో నీళ్లు నిండినై. రుద్ధకంఠంతో అన్నాడు— "గోవిందుడి దయవల్ల నీకు తప్పక శుభం కలుగుతుంది విమలబాబూ!— ఆజన్మాంతం నాకు దుఃఖంగా రూపొందిన నా కుమార్తె భారాన్ని మీరు స్వీకరించాలి. దాన్ని మీచేతుల్లో పెట్టి, నిశ్చింతగా జీవితశేషం గడుపుదామని వుంది."

ఇటువంటి సంగతి విమలబాబు కలలోకూడా ఊహించలే, కనక ఈ మాట వింటూనే స్తంభించిపోయాడు!

"ముందు మీరు విశ్రాంతితీసుకోండి వ్రజబాబూ! ఈ సంగతులన్నీ తరవాత ఆలోచించుకోవచ్చు!'' అన్నాడు.

ఆవేశంతో చెప్పాడు వ్రజబాబు—"నిజంగా మీరు ఉదారులు. విశాలహృదయులు. అందుకనే ఈ విషయం మీతో ప్రస్తావించగలిగా! నా విషాదగాథ అంతా మీకు తెలుసు. నాబిడ్డ నిష్కళంక, సద్గుణవతి, రూపమూ లోటులేదు. కాని దాని ముఖాన దుఃఖాన్ని రాసిపెట్టాడు. నాకిప్పుడున్న క్లిష్టపరిస్థితుల్లో దాని వివాహం

కావడం కష్టం. చూడబోతే నాకా ధనబలం లేదు, సంఘబలం లేదు, కనీసం సాటి కులస్థుల అభిమానమైనా లేకపోయె. ఇహ నెట్లా పెళ్ళిచేసేది?"

ఈ సంగతులన్నీ వేదనతో ఏకరువుపెడుతున్నాడు, వ్రజబాబు. ఏ మాటకూ విమలబాబు సమాధానంచెప్పటంతే. నిస్పృహతో "హే, గోవిందా! నీదే భారం!!" అన్నాడు వ్రజబాబు

అంతలో శారద లాంతరు పట్టుకు వచ్చింది వరండాలోకి.

"అమ్మా! రాజు ఇంటో వున్నాడా?" అనడిగాడు విమలబాబు, ఆమెను.

"ఉహు—ఇంతకుముందే డాక్టరుగారింటి కెళ్లారు. ఈ పాటికి వస్తూండాలి" అని చెప్పింది శారద. వ్రజబాబుతో "పెదనాన్నా, బత్తాయిరసం తీసుకురానా?' అనంటే, వొద్దనేశాడు, చేత్తో సంజ్ఞచేస్తూ తరవాత విమలబాబు బలవంతంమీద 'సరే'నన్నాడు.

కళ్ళు మూసుకుని నిర్జీవంగా పడుకునివున్న వ్రజబాబుని లాంతరు వెలుగున పరిశీలనగా చూశాడు విమలబాబు. ముఖం పాలిపోయింది, అశ్రుబిందువులు రాలినై.

తనబిడ్డ భవిష్యత్తును గురించి వ్రజబాబు ఎంత బాధపడుతున్నాడో నిమిషంలో అర్థంచేసుకున్నాడు విమలబాబు. తనూ బాధపడ్డాడు మనస్సులో. బ్ధంగా ఆలోచిస్తున్నాడే గాని, ఓదార్చలేకపోయాడు.

వ్రజబాబుకి రేణుక గోవిందుడి చరణామృతం తాగించింది. తర్వాత బత్తాయి రసం పుచ్చుకున్నాడు కాస్సేపయాక రాఘాల్ విమలబాబు సాయంతో వ్రజబాబుని గదిలోకి తీసుకొచ్చారు. ఆయన చాలా దుర్బలంగా ఉన్నాడు. అటువంటి వ్రజబాబు చేతిని తన చేతిలోకి తీసుకుని, "మీరన్న సంగతి కొంచెం ఆలోచించి చెబుతాను. మళ్లా మనం రేపు కూర్చుని మాట్లాడుకుందాం" అన్నాడు. సరే అన్నట్టు వ్రజబాబు తల ఊపాడు.

—"నిన్న సంధ్యవేళ ఆశతో ఆకాంక్షతో ఒక విషయం విన్నవించుకున్నాను మీతో. ఇంతవరకూ దాన్నిగురించి మీరు ప్రస్తావించలేదు, ఆ గోవిందుడికి నాపైన దయ కలుగలేదనుకుంటా."

అందుకు విమలబాబు చెప్పాడు: "గత రాత్రంతా ఆవిషయం గురించే ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చా."

"నాకు తెలుసు విమలబాబూ! ఆ గోవిందుడు మీద్వారా నాకీ భారాన్ని తొలగిస్తాడని ఎప్పుడో నమ్మాను" అంటూ, సంతృప్తికరమైన ఆశతో అన్నాడు వ్రజబాబు.

"నిన్న మీరు చెప్పిన సంగతి బాగా ఆలోచించి, చూశా. అన్ని విధాలా ఆలోచించి రేణుకను స్వీకరించటానికే నిశ్చయించుకున్నా. అయితే— ఒక్క మాట:—నామాట మీరు పాటిస్తానని అభయమిస్తే ఆ సంగతి చెబుతా, ముందుగా మీ వాగ్దానం కావాలి నాకు,'' అనడిగాడు విమలబాబు

"సరే అలాగే!'' అన్నాడు వ్రజబాబు.

"మీ కన్యను నాకు దానం చెయ్యాలనుకున్నారుగా! సంతోషంతో మనస్ఫూర్తిగా అంగీకరిస్తా. మతైకంగా సామాజికంగా చట్టబద్ధంగా మంత్రసహితంగా భార్యగా అంగీకరించినప్పుడు, గోత్రాలతోసహా ఆమె పూర్తిగా మా వంశంలో చేరిపోతుంది! నా ఆస్తి అంతటికీ అధికారిణి అవుతుంది. అదే విధంగా నేనామెను మతైకంగా, సాంఘికంగా, చట్టబద్ధంగా, మంత్రసహితంగా నా దత్త పుత్రికగా స్వీకరించటానికి నిర్ణయించుకున్నా! ఈ విధంగాకూడా ఆమె నా వంశానికీ గోత్రానికీ అధికారిణి అవుతుంది. నా సమస్త సంపదలకూ ఉత్తరాధికారిణి అయి, నా తదనంతరం అశౌచాన్ని పాటిస్తుంది!'' అన్నాడు విమలబాబు

అయోమయంగా ఉన్నట్టు వ్రజబాబు కళ్ళప్పగించి చూస్తూ కూర్చున్నాడు.

మళ్లా చెప్పాడు విమలబాబు—''రేణుకను మీరెంత ప్రాణ సమానంగా ప్రేమిస్తున్నారో నాకు తెలుసు. ఆమెపై నాకూ మీకున్నంత ప్రేమా ఉన్నది. రేణుకను కేవలం నా సంతానరూపంగా మాత్రమే స్వీకరించటానికి నిశ్చయించుకున్నా."

కాస్సేపాగి మళ్ళా అన్నాడు—"మా వంశంలో యోగ్యుడైన వాడెవడయినా వుంటే అతన్ని నా యావదాస్తికీ సర్వాధికారిగా చేదామనీ, రేణుకను నా కోడలుగా చేసుకుందామనీ అనుకున్నా! కాని, అలాంటివాడెవడూ కనిపించడు. కనకనే రేణుకను నా దత్తపుత్రికగా స్వీకరించటానికి నిశ్చయించుకున్నా. ఇహ మీదట ఆమె భవిష్యత్తుకు సంబంధించిన బాధ్యతలన్నీ మీ బదులు నేనే నిర్వహిస్తా."

వ్రజబాబు నిట్టూర్చాడు, కళ్లు మూసుకు మౌనంగానే ఉన్నాడు. ముఖంలో సంతృప్తీ లేదు, అసంతృప్తీ కనిపించదు.

* * * *

మధ్యాహ్నంపూట విమలబాబుని కొంచెం పక్కగా పిలుచుకువెళ్లాడు

రాఘూల్‌బాబు. ఒక ఉత్తరం తీసిచ్చి "ఇది చదివి కాస్త మీ సలహా ఇవ్వండి!" అన్నాడు. చివర్న సంతకం చోటున "శ్రేయోభిలాషి హేమంతకుమార్ మైత్రా" అని వున్నది.

"ఎవరీయన రాజూ?" అనడిగాడు విమలబాబు.

"ఆయనా! పెదనాన్నగారి ఇప్పటి సంబంధం తాలూకు బావమరిది! మాకు శకునిమామ అవుతాడు..."

"ఓహో! ఆయనా!!! గుర్తొచ్చింది. వ్రజబాబు వ్యాపారం సర్వభ్రష్టం చేసింది ఈయనేగా?"

"అవునవును. ఒక్క వ్యాపారమేకాదు. ఇల్లూ వాకిలీ, ఆస్తిపాస్తులూ, అన్నీ దిగమింగేసి, చివరికి పెదనాన్నగారిని గోవిందుడికి శరణాగతుణ్ని చేసిన మొన గాడీ మహానుభావుడే!"

నిశ్శబ్దంగా విమలబాబు ఉత్తరం పూర్తిగా చదివి, మళ్ళా తలెత్తి రాఘూల్ కేసి చూశాడు

"ఇప్పుడు చెప్పండి, ఈవుత్తరం పెదనాన్నగారి కివ్వడం మంచిదా, కాదా?" అనడిగాడు రాఘూల్. ఆలోచనలోపడ్డాడు విమలబాబు.

ఈ విషయం దాచిపెట్టడం భావ్యంకాదన్నాడు రాఘూల్. "ఇందులో కటువైన పదాలు చాలా వున్నాయి. కనుక ఉత్తరం చేతి కివ్వడంకంటే, అలాటి పదాలు విడిచిపెట్టి చదివ్వినిపిస్తే చాలు" అని సలహా చెప్పాడు విమలబాబు.

అంతేకాదు. మానెయ్యాల్సిన భాగాలు ఆనవాలు పెట్టి, అవి చదవడం విడిచి పెట్టమన్నాడు.

"ఇంతవరకూ పెద్దపిల్లకు పెళ్ళి కానేలేదు, చిన్నపిల్లకు ఎంత హడావిడిగా హుందాగా వివాహం జరగబోతున్నదో చూడండి!" అన్నాడు రాఘూల్.

"లోకంతీరే అంత నాయనా! రాజూ, ఎవరికోసమూ ఎవరూ ఎదురుచూస్తూ కూర్చోరు!" అంటూ సావధానంగానే సమాధాన మిచ్చాడు విమలబాబు.

రాఘూల్ అన్నాడు—"పెదనాన్నగారు తన సర్వస్వం ఆయనకు అప్పగించారు. ఇవాళ చిల్లిగవ్వకూడా వెతుక్కోవలసిన పరిస్థితి తెచ్చిపెట్టుకున్నారు, అందుకే ఆయనంతగా మితిమీఁపోయాడు."

"ఇదీ లోక సహజమే నాయనా!"

ఇప్పుడీఉత్తరం అందుకున్నప్పట్నించీ రాఘూల్‌కు మండిపోతున్నది. "లోకం



తీరు అయినంతమాత్రాన సహించాలని ఎక్కడుంది విమలబాబూ !'' అనడిగాడు రాఘాల్.

''సహించక మనం చేయగల్గిందేముంది రాజూ ?'' అన్నాడు విమలబాబు.

## 22

శీతకాలం. సంధ్యవేళ. కలకత్తాలో ఒక మురికిసందు. అక్కడ ఒక చిన్న ఇంటిలో తలుపు దగ్గరగా వేసుకుని, లాంతరువెలుగులోకూచుని రేణు పూలుటోపి అల్లుతున్నది. "అక్కా !" అని పిలుపు. అది శారద గొంతు.

లోపలికి రమ్మన్నది రేణుక. శారద వెనకనే ఒక పనిమనిషి గంప నెత్తిన పెట్టుకు వచ్చింది. "ఏం లేదమ్మా, గోవిందుడి కోసమని పళ్లూ, కాయగూరలూ, మంచి వెన్న అమ్మ పంపించింది" అని చెప్పింది శారద.

కొంచెం తీక్షణంగా చూస్తూ అన్నది రేణుక: "శారదక్కాయ్! వాటిని మేమెంతమాత్రం స్వీకరించలేమమ్మా, దయవుంచి మమ్మల్ని క్షమించమని చెప్పు!" ఎంత చెప్పినా అంగీకరించలేదు రేణుక.

దగ్గరగా జరిగి, "పెదనాన్నగారు కులాసాయేగదా?" అని పరామర్శించింది.

"ఆఁ - కులాసాయే!" అని చెప్పింది రేణు. ఇహ శారద లేద్దామనుకుంటూ వుండగా మళ్ళా ఇల్లా అన్నది—

"అమ్మకు ఎలా అయినా నచ్చచెప్పు శారదక్కాయ్! నన్నుగురించి మనస్సులో దుఃఖించవద్దను ఏది అసంభవమో, అది శాశ్వతంగానే అసంభవమని చెప్పు. ఈ సంగతి నాకంటే ఆమెకే ఎక్కువగా తెలుసు. దుఃఖాన్ని ఆపుకోటానికి యత్నిస్తే, ఉభయులకూ అది ఇంకా ఎక్కువవుతుందే గాని తగ్గదు."

శూలాల్లా గుచ్చుకున్నయ్ ఈ మాటలు శారదకు. "అయితే ఇహ వెళతానమ్మా!" అన్నది. సరేనన్నట్టు తల వూపింది రేణుక.

* * * *

ఆ పల్లెనించి వచ్చేసి వ్రజబాబు కలకత్తా కాపరంపెట్టి ఇప్పటికి ఎనిమిది నెలలు. విమలబాబు ఏర్పాటుచేసిన అద్దెఇంటో ఉండటానికి రేణుక ఎంతమాత్రం ఒప్పుకోలేదు. ఆమె మొండిపట్టుతోనే ఆ యిల్లు కుదిరింది. ఇప్పుడు రేణు స్వభావంలో—ఇతరుల సహాయాన్ని అర్థించకూడదు, అనే మార్పు వచ్చింది. ఈ సంగతి అందరికీ తెలుసు.

చిన్నజీతంమీద పనిమనిషిని కుదుర్చుకుని, చాలా పొదుపుగా కాలక్షేపం చేస్తూ, తీరికసమయంలో కుట్టుపనులు చేసీ, ఊరగాయలు తయారుచేసీ వాటిని పనిమనిషిద్వారా దుకాణాలకు పంపి విక్రయిస్తూ గడుపుతున్నది.

పైభాగంలో ఉన్న చిన్నగదిలో పరిశుభ్రంగా గోవిందుడి మందిరం నెలకొల్పింది. స్నాన భోజనాదులకు తప్ప తక్కిన సమయమంతా వ్రజబాబు అక్కడే గడుపుతాడు. రేణుకతో తప్పితే మరెవ్వరితోనూ మాటాడే పనే లేదాయనకు.

తెచ్చినవన్నీ తిప్పి తీసుకుపోతే సవిత దుఃఖపడుతుందని, శారద ఇంటికి చేరగానే గంపను కిందిభాగంలో వంటగదిలో పెట్టించి పైకి వెళ్ళింది. గదిలో కూర్చుని పంచాంగం పేజీలు తిప్పుతూవున్న సవిత చిరునవ్వుతో శారదను పలకరించింది. రేణుకను గురించి ఎంతో ఆత్రంతో ప్రశ్నలు కురిపించే సవితలో ఎక్కువగా తెలుసుకోవాలనే తాపత్రయమే కనిపించలే. "వాళ్ళకేం లోటులేదు,

బాగానే జరిగిపోతూంది. ఇంతకూ రెండు ప్రాణాలు కదా!'' అంటూ ముక్త సరిగా క్షేమవార్తలు చెప్పింది శారద.

తరవాత గంప ఎక్కడ పెట్టించింది అనే ప్రశ్న వచ్చింది. పంపిన వస్తువులు పంపినట్టే వచ్చేశాయని తెలిస్తే సవిత దుఃఖంతో తల్లడిల్లిపోతుందని అనుకున్నది, కాని సవిత వాత్సల్యంతో శారద తల నిమురుతూ ఇలా అన్నది—"పిచ్చిదానా! నీలాగే అందరూ తల్లిమనస్సు నర్థంచేసుకుని ప్రేమించగలరా? అలా అని రేణుమీద నాకేం కోపంలేదు సుమా! ఇందులో నిజంగా రేణు దోషమేమీ లేదమ్మా!''

*　　　*　　　*　　　*

శారద అడిగింది! "అమ్మా! రేణుకకోసం డాక్టర్ సంబంధ మొకటి మంచిది చూసి ఖాయంచేశారటగా దేవత, ఏమయిందమ్మా, ఆసంగతి!"

"ఏమీలేదు తల్లీ. అసలు పెళ్లేచేసుకోనని పిల్ల ప్రతిజ్ఞ చేసిందట! తన వివాహం గురించి ఎలాటి ప్రయత్నమూ చెయ్యొద్దనీ చేస్తే తనకేమీ క్షేమకరం కాదనీ రాజుతో చెప్పిందట!" అన్నది సవిత.

శారదకు స్వరం కంపించింది. "రేణుక అభిప్రాయం నిజంగా అదే అయి వుంటే, పోనీ ప్రధానం పెట్టుకున్న ఆ సంబంధానికే ఇచ్చిచేస్తే బాగుండేదిగా? ఆమె అదృష్టం బాగుండి మొగుడు పిచ్చివాడు కాకుండా ఉండేవాడేమో!" అన్నది.

సవిత నవ్వి— "ఇప్పటికి ఏడెనిమిది నెలలవుతుంది. ఆ సంబంధానికే రేణు సవితి చెల్లెలు రాణి వివాహం జరిగిపోయిం" దని చెప్పింది.

శారద విస్మయం చెందింది.

బాధతో నిట్టూర్చి సవిత ఇలా అన్నది—"కేవలం నా పొరపాటు వల్లనే అదంతా అలా జరిగింది. ఆనాడు నేను తొందరపడి రేణు పెళ్ళికి అభ్యంతరం కల్పించాను. లేకపోతే వాళ్ళవిధంగా ఈనాడు నిరాశ్రయులై పోవలసిన పరిస్థితి వచ్చేదికాదు..."

అంతలో తారకబాబు వచ్చాడు. అతనికి భోజనం పెట్టడానికని సవిత వెళ్ళబోతూవుంటే ఆమె వెంట శారద వెళ్లింది. హారన్‌పూరునించి వచ్చేశాక సవిత ఇల్లు మారింది, మునుపున్న రమణిబాబు ఇంటో ఉండటానికి ఆమెకు మనస్కరించలే. ఏ ఇంటోనయితే ఆత్మహత్యవంటి పన్నెండేళ్ళ దుర్భర జీవితం గడిపిందో ఆ ఇంటిని కంటితో చూడ్డానిక్కూడా ఆమె భయంతో కంపించి పోతూంది.

వ్రజబాబు, రేణుకలకోసం విమలబాబు ఏర్పాటుచేసిన ఆ ఇంటోనే సవిత ప్రవేశించింది. ఇప్పుడు విమలబాబు కలకత్తాలో లేడు. వ్యాపారవిషయమై బెల్జియంవస్తే సింగపూర్ వెళిపోయాడు. వెళ్తూవెళ్తూ సవితను కనిపెట్టుకునుండి ఆమె మంచి చెడ్డలు చూడడానికని రాఘాల్‌ను ఉండమని కోరాడు. 'మంచి చెడలు చూస్తానుగాని, ఇంటోమాత్రం ఉండ' ననేశాడు రాఘాల్. అంచేత విమలబాబు కోరికమీదనే తారకుడుకూడా ఆ ఇంటో వుంటున్నాడు.

సవిత సలహా ననుసరించే తారక్ మేష్టరీ పని వొదిలేసి హైకోర్టులో ప్రాక్టీసు పెట్టాడు. ఇంటి బయటిగది లా-పుస్తకాలతో నిండివుంటుంది. విమలబాబు పలుకుబడివల్ల ఒక ప్రసిద్ధ వకీలుదగ్గర తారకబాబు జూనియర్‌గా ఉండే ఏర్పాటు జరిగింది. తారకుడు విమలబాబుగారి చిన్నకారులో కోర్టుకి వెళ్ళి వస్తూంటాడు.

*     *     *     *

ఎన్నివిధాల బతిమలాడినా సవిత భోంచేయలేదు. శారద వెళిపోగానే సవిత దీపం తగ్గించి తలుపు గడియవేసుకు పడుకుంది.

మధ్యాహ్నం రాఘాల్ వచ్చాడు. ఇబ్బందుల్లో వున్న తనభర్త, కుమార్తెల గురించి అన్ని విషయాలూ తెలుసుకుంది. ధారావాహికంగా ప్రవహిస్తున్న అశ్రుధారలతో ఆమె తల అంతా తడిసిపోయింది. తన పొరపాటువల్ల తన సంతానం ఈనాడు పొందుతున్న కష్టాలూ, దుఃఖాలూ ఆరని అగ్నిజ్వాలలాగా హృదయాన్ని దహిస్తున్నది.

కళ్ళ తెరిచి వెనక్కు తిరిగిచూస్తే, ఆత్మీయు లనేవాళ్ళ లేరు, 'తనది' అనేది ఏదీ కనిపించదు. ఇల్లూ, వాకిలీ - భర్త, సంతతీ - నవుకర్లూ, పరివారం - లోకం, పరువూ, ప్రతిష్ఠా - సమస్తమూ ఇంద్రజాలంలాగా మాయమైపోయినై. సమాజానికి దూరమైన తను బంధువిహీన, ఆశ్రయవిహీన, శూన్యంలో నిరాధారంగాతేలి ఆడుతున్నట్టు అనిపించింది. ఈ పృథ్విపైన తనకు చోటే లేదన్నట్టు కనిపించించింది ! - ఈ విధంగా రోజులూ నెలలూ ఏళ్లూ గడిచి పోయినై.

రూపవతి, గుణవతి అయిన స్త్రీకి తగిన పురుషుడే లభిస్తే, ఆమె తన హృదయ సౌందర్యంవల్ల లక్ష్మీవంటి పత్నిగా, ఆదర్శవంతమైన మాతగా, మమతతో, మాధుర్యంతో మూర్తీభవించిన ఉత్తమ ఇల్లాలుగా ప్రకాశించేది కదా! ఎందుచేత అకాలంగానే ఆమె జీవిత అరుణోదయం అంతరించిపోయింది ? చెప్ప




పాటు కాలంలో ఈ దౌర్భాగ్యకాండ అంతా ఎలా జరిగిపోయిందో! ఎంత ఆలోచించినా సవితకు పరిష్కారమార్గం కనిపించలే.

తలుపు చప్పుడయింది, తారకుడు పిలుస్తున్నాడు! "కొత్తమ్మా, తలుపు తియ్యి!"

తీసింది. తారకుడు గబగబా లోపలికివచ్చి, "అమ్మా! మీరు రోజూ సరిగ్గా భోంచెయ్యటంలేదుట? ఆవాళా ఏమీ తీసుకోలేదుట? ఆరోగ్యం బాగా లేదా?" అనడిగాడు.

"బాగానే వుంది, హంగామా చెయ్యకు తారక్" అని చెప్పింది, మెల్లగా.

"డాక్టర్ని తీసుకురానా? ఎందుకని మీరు ఉపవాసాలు చేసి శరీరం కృశింపజేసుకుంటున్నారూ? ఈ సంగతులన్నీ నేను సింగపూర్‌కి రాస్తా. అయన ఊరినించి వచ్చి "ఏం తారక్? మీ అమ్మ మంచిచెడ్డలు చూస్తూండమంటే ఇదా నువ్వు చేసిన నిర్వాకం? నాకెందుకు తెలియజెయ్యలేదూ?" అనడిగితే నేనేం చెప్పేది? ఈపాటి దానికి నే నిక్కడ ఉండడ మెందుకూ?'' అన్నాడు.

"నా కివాళ చాలా అలసటగా వున్నది తారక్! నీతో తర్కించలేను. ఇహ నేను నిద్దరోవాలి" అంటూ తలుపులు వేసేసింది.

* * * *

మెట్లముందే శారద ఎదురొచ్చింది. తారకుడు ఆమెపైన మండిపడుతూ

"కొత్తమ్మ రోజూ అన్నం తినటం లేదటగా? మాట మాత్రమైనా నాతో చెప్పావు కాదే!" అనడిగాడు

"చెబితే ఏం లాభం? మీరట్టే శ్రద్ధ తీసుకోలేదు. కొత్తమ్మ ఇష్టాయిష్టాల మీద అధికారం ఒక్క రాఘాల్‌బాబుకి మాత్రమే ఉన్నది" అని చెప్పింది. శారద మాటలు తారకుడికి ములుకుల్లా గుచ్చుకున్నాయి,

"అందుకనే కాబోలు. కొత్తమ్మ అసహాయస్థితిలో వుంటే దగ్గరుండటాని కూడా ఇష్టపడలేదు!"

"లోకంలో చాలామంది స్వార్థంకోసమే ఇతరుల సేవ చేస్తారు. రాఘాల్ బాబు అలాంటివాడు కాడు. కొత్తమ్మ మంచిచెడ్డలకంటే ఇంకా ఎక్కువ భారాన్ని ఆయన వహించారు. ఆసంగతి మీకు తెలియకనే ఆయన్ని అర్థం చేసుకోలేకపోయారు!" అన్నది.

క్షణంసేపుకూడా అక్కడ నిలవలేక గబగబా మెట్లుదిగి కిందికి వచ్చేసింది.

* * * *

మర్నాడుదయం — సవిత స్నానంచేసుకువచ్చి, ఘనమైన తలకట్టును ఎండలో ఆరబెట్టుకుంటూ, తదేక ధ్యానంతో ఒక ఉత్తరం రాస్తున్నది. అక్కడే వరండాలో పక్కగా కూచుని శారద జాకెట్ కుట్టుకుంటూ వుంది. రాఘాల్ ఇటు రావటం కనిపెట్టి, మెట్లుదిగి వీధితలుపు తియ్యటానికి వెళ్లిందామె.

"ఈ సమయంలో ఎవరికోసమని గుమ్మంలో ఎదురుచూస్తూ నిలబడ్డావు, శారదా?" అనడిగాడు, రాఘాల్.

"ఒక మనిషికోసరం,"

"బజారు వ్యాపారికోసమా?"

"కాదు. మీరు ఊహించలేరు." ఇదో క్లిష్ట సమస్య అయింది రాఘాల్‌కు. "పదండి లోపలికి, తలుపు వెయ్యాలి!" అంటూ శారద తలుపు వేసేసి, రాఘాల్‌తోపాటు లోపలకి వచ్చింది.

"అప్పుడప్పుడు ఇలానే గుమ్మంలో నిలబడి ఎవరికోసమో ఎదురుచూస్తూంటావా?" అనడిగాడతను.

"అవును. ఎప్పుడూ చూడవలసే వస్తుంది. మొదటిసారిగా మీరు నన్ను చూసినప్పుడూ సరిగ్గా ఇలానే నిలబడ్డాను," అన్నది.

"ఎవరికోసం

''నాకు పరమ మిత్రుడైన మృత్యుదేవత కోసం! ఆయనకోసం సరిగ్గా ఇలానే తలుపులు తెరిచా. అయితే మృత్యుదేవతకు బదులుగా మర్త్యలోకపు దేవత ఎదురయ్యారు!'' అన్నది.

కొత్తమ్మను గురించి ఛోగట్టాచేస్తే, ఆమె ఉత్తరం రాస్తున్నట్టు చెప్పింది శారద. పెద్దగా నిట్టూర్చి, "వెళ్ళి కూర్చోండి దేవతా!" అన్నదామె.

''మధ్యాహ్నం రెండుగంటలకి వస్తే ఆమె విశ్రాంతికి లోటు కలగదను కుంటాను?"

''కొంచెంసేపు ఆ పక్కబల్లమీద కూర్చోకూడదా, దేవతా! అమ్మ ఉత్తరం పూర్తికావటానికి ఇంకా వ్యవధి ఉంటుంది. ఈ లోగా మిమ్మల్ని రెండుమాటలు అడగాలనుకుంటున్నా."

అమ్మముందు మాటాడటానికి చచ్చేంతసిగ్గు. అందుకని ఆతన్ని వసారాలో ఒక ప్రక్కకి తీసుకెళ్ళింది శారద. బెంచిమీది దుమ్ము చీరెచెంగుతో శుభ్రంచేసి, కూర్చోమన్నది. ''అసలీ విషయం మిమ్మల్ని అడగటమా వద్దా అని సంశయం గానే వుంది. సరేగాని. రేణుక సవితి చెల్లెలు రాణికి పెళ్ళయిందికదా! ఆ తర వాత ఆమె ఎలావుందో మీకేమన్నా తెలుసా?''

ఈ ప్రశ్న వస్తుందని రాహూల్ ఊహించలేదు ఆశ్చర్యంతో ''నాకేం తెలియదే! గొప్పఇంటి కోడలై, హాయిగా స్వేచ్ఛగా వుంటుందనుకున్నా, అంతే.''

"సరేగాని, రాణి ఇప్పుడు గర్భవతి అయిందన్న శుభవార్త పెదనాన్నగారికి తెలియజేశారటగా?"

"అయినా ఆ సంగతులన్నీ మనకెందుకు శారదా? ఇందుకోసమేనా నన్ని క్కడికి పిలిచావ్?''

''ఊహుఁ—అసలు మీకే సంగతీ తెలీదు అది చెప్పడానికే పిలిచా. రేణుకి మొదట ఖాయంచేసిన ఆ వరుడితోనే రాణి వివాహం జరిగింది!'' అని చెప్పింది.

మరింత ఆశ్చర్యంతో రాహూల్ "ఆ సంగతే నాకు తెలియదే!!"

శారద అడిగింది: "పెదనాన్నగారు బృందావనం వెళిపోవటం నిశ్చయమేనా?

"అవును."

''రేణుక కూడా వెళుతుందా?"

"వెళ్ళక మరెక్కడ ఉంటుంది?''

'కాని... అక్కడ... ఈ వయస్సులో...కన్యగా..." అని ఆగిపోయింది

"అంతా నా కర్థమయింది శారదా! కాని, గత్యంతరముంటే చెప్పు!— ఎవరి నొసట ఏం రాసిపెట్టివుందో అలాజరిగేతీరాలి. అదే లోకంతీరు! ఈ మాట నమ్మనివాళ్ళకి తీరనిబాధ, దుఃఖం తప్ప మరేం మిగలదు!" అని చెప్పాడు రాఘాల్.

"విచారించడం నిష్ప్రయోజనమేనా?"

"అంతే! రేణుక దురదృష్ట జీవితం చిన్నప్పుడే ప్రారంభమయింది. లోక మంతా ఏకమైనా మనం ఈనాడు ఆమెను సుఖపెట్టలేము. ఎన్నెన్నో కష్ట సుఖాలు అనుభవించినమీదట నేను నేర్చుకున్నది ఇదే," అన్నాడు.

శారద చెప్పింది—"రేణుకకు ఈనాడు సంప్రాప్తమైన ఈ దుస్థితికి తల్లి కూడా మూలకారణమే, నాకు తెలుసు." రాఘాల్ వింటూ కూర్చున్నాడు. మళా ప్రారంభించింది శారద—"ఒక్క సంగతి ఆలోచించి చూడండి ఆనాటి అమ్మకూ ఈనాటి అమ్మకూ ఎక్కడా పోలికేలేదు.! ఈ విషయం ఇతరులు గుర్తించగలిగినా లేకపోయినా, అమ్మను పూర్తిగా అర్థంచేసుకున్న మీరుమాత్రం గ్రహించగలిగారు."

రాఘాల్ ముఖంలోనూ కళ్ళలోనూ వేదనపడుతున్న ఛాయలు అలుము కున్నాయి.

"ఇహ నేను అమ్మముఖం చూళ్లేను. మునుపు ఎలావుండేదో ఇప్పుడెలా అయిపోతున్నదో నాకు తెలుసు! శారీరకంగా మానసికంగా ఆరని జ్వాలతో ఆమె హృదయం మండిపోతున్నది. అన్నపానాలు విసర్జించింది, పటుబట్టలు త్యజించింది. పనిమనుషుల కంటే ఎక్కువగా ఇంటి చాకిరీ అంతా తనే చేసుకు శ్రమపడుతున్నది. నిరంతర వేదనతో ఒక పేదరాలుగా ఎంతో కష్టంతో ఈ జీవయాత్ర సాగిస్తున్నది. ఆమెకు క్షణంకూడా సుఖంలేదు, మనస్సుకి శాంతి లేదు."

రాఘాల్‌కు నోట మాటరాలేదు. విచారంగా అటు చూస్తున్నాడు. శారద ప్రాధేయపూర్వకంగా మళ్లా చెప్పింది—

"అమ్మని గురించి ఇహనైనా మీరు శ్రద్ధపెట్టండి! ఆమె హృదయంలో వెలిగే ఆరని జ్వాలను ఆర్పగల శక్తి ఈ లోకంలో ఒక్కరికే ఉన్నది— మీ ఒక్కరికే!! మరెవ్వరివల్లా కాదు. నా అంతరాత్మ ఇలా చెబుతున్నది!"




## 23

ఇప్పుడు విమలబాబు మళ్ళా కలకత్తాకు వచ్చాడు సింగపూర్‌నించి. వచ్చే ముందు సవితకు ఉత్తరంద్వారా, తరవాత టెలిగ్రాంద్వారా తెలియపర్చాడు. ఈ సంగతి విని విమలబాబుకి స్వాగతమిచ్చేందుకు ఉదయం చాలా పెందరాళే హార్బర్ చేరుకున్నాడు. అప్పటికే చిన్నకార్లో, పెద్దకార్లో మేనేజరూ, దర్వాన్ గుమాస్తాలూ అందరూ వచ్చేశారు. విమలబాబు ముందుగా తారకుణ్ని పిలిచి, కార్లో కూర్చోబెట్టుకున్నాడు.

"నేను బయల్దేరేముందు రాజుబాబుకి కూడా ఉత్తరం రాశా—రాలేదేం చెప్మా! ఆరోగ్యం బాగాలేదో, ఇంతకంటె ముఖ్యమైన పనే ఉందో!" అన్నాడు, విమలబాబు.

'నిన్న సాయంత్రమే అతన్ని మనింటిదగ్గర చూశా' నని చెప్పాడు తారక్. విమలబాబు డ్రైవరుతో "శివచరణ్! పటల్‌డాంగా పోనీయ్!" అన్నాడు.

అప్పుడు తారకుడు "ఒక మిత్రుణ్ని తప్పనిసరిగా కలుసుకోవాలి, ఇక్కడే దిగిపోతా" నంటూ, తప్పుకున్నాడు.

విమలబాబు అడిగాడు "అయితే నీ ప్రాక్టీసు జోరుగా సాగుతుందా?"

"మీ దయవల్ల లోటులేదు."

"సంతోషం. నువు తప్పక అభివృద్ధిలోకి వస్తావు!"

తారకడు వినయంగా వంగి విమలబాబు పాదధూళి తీసుకుని కారులోనించి దిగిపోయాడు.

* * * *

పటల్‌డాంగా వచ్చిచూస్తే, రాఘూల్ ఇంటికి రెండు తాళాలు వేసివున్నాయి. ఫోటోగ్రాఫ్ లేవీ తెలియలే. అక్కణ్ణించి బయల్దేరి విమలబాబు తిన్నగా సవిత ఇంటికి చేరాడు.

శారద "కూర్చోండి, అమ్మని పిలుచుకొస్తా" నంటూ వుండేపరికే గది లోంచిసవితఇవతలికివచ్చింది—మాసిపోయినమల్లుచీరె, తలకు తైలసంస్కారం లేదు. కళావిహీనంగా వుంది. ఆ విశాల నేత్రాలలో అజ్ఞాత జీవితంవల్ల కలిగిన వేదనా ఛాయలు కనిపిస్తున్నాయి.

"ఏమిటిలా అయిపోయావ్!" అనడిగాడు విమలబాబు ఆశ్చర్యంతో.

"ఏమీలేదు, స్నానం, భోజనం అయాక మధ్యాహ్నం మూడు గంటలక్కడూ వస్తానని రాశారూ? కాళ్లయినా కడుక్కోకుండా తిన్నగా ఇక్కడికే వచ్చేసినట్టుందే!" అనడిగింది.

అందుకు విమలబాబు చెప్పాడు—"కొంతమంది దేవతల్ని దర్శించటానికి ముందు ధూళి పరిశుభ్రం చేసుకు మరీ రావాలి. కొంతమంది పత్యేక దేవతలను పాదధూళి సహితంగానే దర్శించాలి''.

"లోకంలో దయామయులందరూ దుఃఖితులను ఎప్పుడూ ఇలానే పరామర్శిస్తూ వుంటారు." అన్నది నవ్వుతూ.

"స్నానం భోజనం ఎక్కడ చేస్తారు?'' అనడిగింది.

"నువు చెప్పినచోట!"

"అయితే ఇంటికి వెళ్లిరండి. అక్కడ ఉండేది ఎవరైనా, మీకోసం ఎదురు చూస్తుంటారు. వేదాంతం తరవాత మాటాడకుందాం. అన్ని సంగతులూ ఆనక చెబుతా. ఇప్పుడు నన్నేమీ అడక్కండి!" అన్నది సవిత.

"ఊహుఁ చెప్పేదాకా వెళ్లను!"

"మధ్యాహ్నం మూడింటికి రండి, చెబుతా. రాత్రికి బహుశా మీ భోజనం ఇక్కడే! ఈమధ్యనల్లా నేనే స్వయంగా వంటచేసుకోవడం!"

ప్రతి చిన్నమాటకూ వేదనతో సవిత ఇవాళ దుఃఖావేశం పొందడం గమనించాడు విమలబాబు. 'సరే, సాయంత్రం వస్తా'నని చెప్పి వెళ్లిపోయాడు.

* * * *

అనుకున్నకంటె ముందుగానే వచ్చాడు విమలబాబు. ఆయన రావడంతోనే ఒంటినిండా చీరె కప్పుకుని వచ్చిన సవిత వంగి. విమలబాబు పాదాలు రెండూ స్పృశించి నమస్కరించింది.

అప్రయత్నంగా రెండడుగులు వెనక్కువేసి. "ఏమిటిది? నీకేమయినా పిచ్చి. "అంటూ ఆగిపోయాడు.

తన విశాల నేత్రాలతో సవిత ఆయనవేపు ఉజ్వలంగా చూసింది. "పిచ్చిపని కాదు దయామయా: ఉదయాన మిమ్మల్ని ఆహ్వానించా. సంధ్యవేళ నమస్కరించాను, ఇహ మీరు నన్నేమీ అడగరు గదా!" అన్నది మధురస్వరంతో.

ఇవాళ సవితలో ఒక విశిష్టసౌందర్యం, మర్యాద, స్నేహం, ధైర్యం, విశ్వాసం ఇవన్నీ క్షణక్షణం తొణికిసలాడుతున్నాయి. నిజానికి విమలబాబు తన జీవితకాలంలో ఇలాంటి అపురూప సౌందర్యాన్ని చూసి ఎరగడు ఇటువంటిది ఇంతవరకూ ఎవరికీ లభించలేదు. ముందుకూడా ఎవరికీ లభించదు. ఇటువంటి అపూర్వరూపాన్ని చూసి, దూరంగా నిలబడి నమస్కరించడం తప్ప సమీపానికి వెళ్ళే సాహసం ఎవ్వరికీ ఉండదు.

"ఎంతసేపలా నిలబడతారు కూర్చోరా?" అన్నది సవిత. వెంటనేకుర్చీలో కూలబడి, కన్నార్పకుండా సవిత ముఖం చూస్తూనే వున్నాడు. ఇవాళ ఆయన దృష్టిలో కామతృష్ణలేదు. అనురాగం, ఆర్చర్యం మాత్రమే కనిపిస్తూంది.

విస్మయంతో అడిగింది సవిత! "ఏమిటల్లా తదేకంగా చూస్తున్నారు?"

"ఇప్పటి నీ రూపాన్ని ఇంతకు ముందెప్పుడూ చూళ్లేదు. ఇదివరకునేచూసిన సవిత వేరు."

"ఆ సవిత ఎలా వుండేదీ?" అనడిగింది.

"ఒక విషాద ప్రతిమా! దుఃఖంలో మునిగివున్న శోకదేవత!"

"మరి ఈనాటి సవిత?"

"ఒక దివ్యసుందరమూర్తి. సింగపూర్‌లో ఉండగా నువు రాసిన ఉత్తరంలో ఈ పరిణతి తాలూకు ఛాయ గోచరించింది — ఆ పరిపూర్ణ రూపాన్ని ఇప్పుడు ప్రత్యక్షంగా చూడగలిగా."

సవిత నవ్వింది. ఎంతోచిత్రంగా నవ్వి ఇలా అన్నది—

"నిజమే కావచ్చు, మీరన్నది. ఒకే జన్మలో మనిషి ఎన్నిదశలు అనుభవిస్తాడో, ఎవరికి తెలుసు." అని చెప్పింది. విమలబాబు మాటాడలేదు. ఆమెకేసి ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

* * *

ఇప్పుడు సవిత కాచురంగు బార్డరు బనారస్ పట్టుచీర కట్టుకున్నది. ఒక ప్పుడు విమలబాబు తన పనిమీద కాశీ వెళ్లివస్తూ, ఈచీరెప్రత్యేకం సవితకోసం తీసుకొచ్చాడు. కట్టుకోమని ఆయన ఎంత బతిమాలినా ఆమె అప్పుడు కట్టుకోనే లేదు. "సమయం రానివ్వండి, కట్టుకుంటా''నంటూ జరుపులు పెట్టింది. ఇవాళ విమలబాబుకోసం ఎదురుచూస్తూవున్న సవిత సరీగ్గా అ చీరే కట్టుకు కూచుంది.

విమలబాబు అన్నాడు— "నాకు నమ్మకంలేని పునర్జన్మ సిద్ధాంతాన్ని ఇవాళ నాచేత నమ్మించావు, నువ్వన్నట్టు మనిషి జీవితంలో ఎన్నో జన్మలెత్తుతాడు. అందుకనే ఆనాడు నేనిచ్చిన చీరె నువు ధరించే అవకాశం నేకళ్లారా చూసే అదృష్టం నాకీ జన్మలోనే లభించింది."

ఆ తరువాత ఇద్దరి మధ్యనీ ఎన్నో సమస్యలపై వేదాంత చర్చలూ ప్రసంగాలూ, చాలాసేపు సాగినై

సవిత ఆకాశంవేపు చూస్తూ యిలా అన్నది —"నా అభాగ్యజీవితం నాకు నేర్పిన గుణపాఠాలు ఇవే ? ఒకనా డెప్పుడయినా అన్నిసంగతులూ మీకు వివరించి చెబుతా, దయామయా!''

''నువ్వు చెప్పే ఆరోజు ఎప్పుడు వస్తుంది సవితా?— నా భర్తనుగురించి నాకుమాత్రమే తెలియవలసిన సంగతులున్నాయి, కొన్ని, చెబుతా''నని వాయిదా వేస్తూన్నావే కాని, చెప్పడం కనబడదు,'' అన్నాడు విమలబాబు

''చెప్పాలనిపిస్తుంది కాని చెప్పలేకపోతున్నా. అవి వింటే మీకేమిటిలాభం? తన ఇష్టానుసారంగా భర్తను విడిచి, అగాధ దుఃఖంలో మునిగిపోయిన స్త్రీ హృదయం తెలుసుకోవాలనా మీ అభిలాష?"

* * * *

సవితను పిలిచి విమలబాబు అడిగాడు ! ''నిజం చెప్పు సవితా !-నా గురించి నువు భయపడుతున్నావా ?"

"భయమా ? ఎందుకనీ ? మీగురించి భయపడటానికి నాకింకేం మిగిలున్నది గనక ? ఇహ నాకు జరగాల్సిన అపకారమేం లేదే, భయపడటానికీ ?

మీ గురించి నాకేం భీతిలేదు. ఇప్పటిదాకా మీమీద పూర్తిగా ఆధారపడటమా మానటమా అని సందేహిస్తూవచ్చా. ఈ నాడు ఆ సందేహమూ తీరిపోయింది. మిమ్మల్ని నేను మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను. అంటే ఇంతవరకు ప్రపంచంలో ఏస్త్రీకూడా, తనతో సంపర్కంలేని పరాయి పురుషుణ్ని ఇంత

...టు !"



కొంచెం ఆగి, మళ్లా చెప్పింది—"మీరు నన్నెప్పటికీ ఇంతకంటె మరింత పతితను చేయలేరు। నాకు తెలుసు పురుషులదగ్గర ఏ విషయంలో నయితే స్త్రీలు అవమానానికి గురి అవుతారో, ఆ దుర్గతినీ మీరు నాకు కలిగించరు. నన్ను పూర్తిగా అర్థంచేసుకోవడంలో మీరెంతమాత్రం పొరపాటు పడలేదు!"

"ఎంతయినా, మానవుడు మానవుడేగాని దేవుడు కాడుగదా! కాబట్టి, గుణ

దోషాలతో మిశ్రమమైవున్న మానవుణ్ని అంత పూర్తిగా విశ్వసించటం ఉచిత మంటావా ?" అనడిగాడు, విమలబాబు.

"ఆ సంగతి నే చెప్పలేను. నా అంతరాత్మలో అనుకుంటున్న మాటే మీతో అంటున్నా"నన్నది. సవిత.

"నీ పరిచయంవల్ల నాకు కలిగిన లాభం ఏమిటోతెలుసా. సవితా!— నరకం నుంచే స్వర్గం, కష్టంనించే సుఖం, అమంగళంనుంచే శుభశ్రేయస్సు, ఇవి జీవితాన్ని స్పర్శిస్తాయని ఇక్కడే మొదటిసారిగా తెలుసుకున్నాను."

"మీమాట నిజం. అమంగళప్రదమైన జీవితపథంలో దీర్ఘయాత్ర చేశాను. అలసి సొలసి సంధ్యావేళ మిమ్మల్ని కలుసుకున్నా. విరుద్ధ సమయంలోనే తల వని తలంపుగా మనకీపరిచయం కలిగింది. ఆ నాడు మీరు నన్ను చూడటానికి రావడం నా అదృష్టమే!" అన్నది సవిత.

"గత జీవితంలో విధాత నా కిటువంటి శాశ్వత కళంకాన్ని కల్పించడం నా శ్రేయస్సుకోసమే ననిపిస్తున్నది" అన్నాడు, విమలబాబు,

"అంటే. దీని అర్థం ?" అనడిగింది సవిత ఆశ్చర్యంగా.

"అర్థంకాలేదా ? ఈనాడు లోభంతో స్పర్శించి నిన్ను అపవిత్రం చేయలేను కళంకపూరితమైన నా హృదయపీఠంలో నిన్ను అధిష్టింప చెయ్యలేను. అంతటి అశక్తుణ్ని, ఇతరులదృష్టిలో నువ్వెలాంటిదాన వైనప్పటికీ, నువు నాజీవితంలో పరమ కళ్యాణ రూపిణివి! నిజం, అనివార్య పరిస్థితిలోకూడా స్వేచ్ఛగా జీవిస్తున్న నిన్నుచూడగానే, నా గత జీవితమంతా గుర్తొచ్చింది. సరిగ్గా నా లాగే ఈ లోకంలోక్లిష్టమయ జీవితాన్ని అనుభవిస్తున్న మరొక ప్రాణితో తొలి పరిచయం నీతోనే కలిగింది !"

"సహజ వాంఛల్ని త్యజిస్తూ, శరీరాన్ని క్షీణింపజేసుకుంటూ, క్రమంగా జీవన సమాప్తికోసం నిరీక్షించడమే ఈనాటి నా ధ్యేయం ! మానసికఅనుభూతిలో నువ్వూ నేనూ, ఇద్దరం ఈ నాడు ఒక్కటే ! అందుకనేకాబోలు మనిద్దరిహృదయాలు ఏకత్వాన్ని సాధించడం, ఇది సంభవమేకాదు, సహజమేకూడా !"

"భగవంతునిదయవల్ల మీరునన్నేవిధంగా వూహిస్తున్నారో, మీసాన్నిధ్యంలో నేను అలాంటి మరీచికనుమాత్రం కాదు !" అని చెప్పింది సవిత.

## 24

వ్రజబాబునీ రేణునీ బృందావనం పంపించటానికని వెళ్లాడు రాహుల్. తీరా రాహుల్‌కోసరమని విమలబాబు కలకత్తావెళితే. అక్కడ అతడు లేకపోయాడు.



అంచేత విమలబాబుకి కొంచెం చిరాకే వేసింది, తరవాత ఇద్దరూ తారసపడి నప్పుడు ఇలా అన్నాడు విమలబాబు—

"ఒక్కరోజు ఆగితే వ్రజబాబుని కలుసుకునేవాణ్ణికదా. ఆ మాత్రంఏర్పాటు చెయలేకపోయావా రాజూ ? ముందుగా ఉత్తరంకూడా రాశానే ?"

''మిమ్మల్ని కలుసుకోకుండా ఉండాలనే వాళ్ళఉద్దేశం. అందుకనే త్వరగా బయల్దేరాడు."

''ఏం ?"

"నాకు తెలీదు. కాని పెదనాన్నగారి కంటే రేణు పట్టుదలే ఎక్కువ కావటాన్ని ఆయన ఒప్పుకోక తప్పలేదు,''

''ఓహో, అదా సంగతి! అర్థమయింది" ఒక్కక్షణం ఆగి, అడిగాడు: "వాళ్ళని బృందావనంలో ఎక్కడ ఉంచివచ్చావ్ ?"

''దేవాలయం వీధికి చేరిన ఒక సందులో ఒక ఇల్లు మాట్లాడాను. చుట్టూ చిన్నచిన్న కుటుంబాలింకా వున్నయ్. రెండు చిన్న పడకగదులు, వంటకు చిన్న పంచపాళీ – అద్దె అట్టేలేదు,"

విచారంతో అన్నాడు విమలబాబు; ''నువు తప్ప అక్కడ వాళ్ళని పలకరించే వాళ్లెవరుంటారు? కొన్నాళ్లు నువ్వూ వాళ్లతోపాటు ఉండలేకపోయావా ?"

''ఉండొచ్చు, దానికేం ? కాని ఇక్కడ నా జీవనాధారం కాస్తా పోతుందే !" అన్నాడు రాఘవ్.

ఆలోచనలోపడ్డాడు విమలబాబు.

"నీకు తెలుసో లేదో, తారకుడు హైకోర్టు ప్లీడరయ్యాడు. మంచి భవిష్యత్తు ఉన్న దశదికి. అలాంటివాడికి రేణుకనిచ్చి పెళ్లిచేస్తే ఎలా ఉంటుందంటావ్?" అనడిగాడు.

వింటూ ఊరుకున్నాడు రాఘాల్, "మీ కొత్తమ్మకే ఈ వుద్దేశమున్నది" అని చెప్పాడు విమలబాబు.

"తారకుడి ఉద్దేశం?"

"మీ కొత్తమ్మ సూచనచేసి ఉండవచ్చు."

"మరి మీ అభిప్రాయం!"

"నిక్షేపంలాంటి పిల్ల! తండ్రి పేదవాడే కానీ, తల్లి దగ్గర బోలెడంత ఆస్తి. అదంతా రేణుకదేగా? పైగా, తారకుడు మీ కొత్తమ్మదగ్గరే ఉన్నాడాయె. కనుక ఆమెమీద శ్రద్ధా భక్తులెక్కువ. ఈ పరిస్థితుల్లో అతను ఒప్పుకోడంటే నేను నమ్మలేను. నువ్వొకపని చెయ్యాలి రాజూ!—తారకుడితో నువ్వే ఈ సంగతి ప్రస్తావించాలి!"

"అసలు రేణుకే చేసుకోను అంటున్నది!"

"నీకెందుకా సంశయం? నువు ముందు తారకుణ్ని వప్పించు, నేను స్వయంగా బృందావనం వెళ్లి రేణుకని వెంటబెట్టుకువస్తే సరికదా"

"సరే, మీమాట కాదనట మెందుకూ?" అని ఊరుకున్నాడు.

* * * *

ఇటీవల రాఘాల్‌కు బద్ధకం ఎక్కువైపోయింది. చివరికి వేళకు తిండిధ్యాస కూడా మరిచిపోతున్నాడన్నమాట. చీటికీ మాటికీ ఆవూరూ ఈవూరూ తిరగడంలో వున్న కొద్దిట్యూషన్లు చెయిజారి పోయినై. గతంలో ఒక ఇంటి వాళ్లకు చాలా సేవ చేసిఉండటంచేత, ఆ ఒక్క ట్యూషన్‌మట్టుకు ఇంకా నిలిచి వుంది. సమాజాలకోసం నాటకాలు రాయడమూ తగ్గిపోయింది. చదువులూ రచనలూ అడుగున పడిపోయాయి. బ్యాంకులో పైసా నిలవలేదు. ఎక్కడ చూసినా చిల్లర ఋణాలు! ప్రతివాళ్లదగ్గరా చేబదుళ్లు!

మిఠాయి దుకాణంనించి వేడివేడి సమోసాలు తెప్పించుకుందా మనుకుని 'నీలూ'ని పంపించాడు. తను స్టవ్ ముట్టించి టీనీళ్లు కాగబెడుతున్నాడు, ఈ పళంగా శారద దగ్గరికెళ్లి "రాత్రల్లా భోజనం లేదు, వేళగాని వేళ

తున్నాను' అని మాటమాత్రం చెబితేచాలు! కావలసిన ఏర్పాట్లన్నీ ఆమె చకచక చేసేస్తుంది కదా !"

శారద గుర్తురాగానే పెద్దగా నిట్టూర్చాడు. అక్కడికి వెళ్లడంభావ్యం కాదు. ఈ సంగతి ఆమెకు తెలిస్తే ఎంతో బాధపడుతుంది తనను దేవతగా భావించిన శారదకు తనపట్ల ఎంత అనురాగం ఉన్నదో, ఎంత హృదయపూర్వకంగా సేవించటానికి అపేక్ష పడుతుందో రాఘాల్‌కు స్పష్టంగా తెలుసు.

* * * *

సవితా, శారదా కూర్చుని మాటాడుకుంటున్నారు "మీ సునార్‌పూర్ విశేషాలు చెప్పమ్మా, శారదా !" అన్నది సవిత. అందుకు శారద కుట్టుపని చేసుకుంటూనే చెప్పింది—"అమ్మా, మిమ్మల్ని ఒకసారి చూస్తేచాలు, రేణుక సాక్షాత్తు మీ కూతురేనని ఎవరైనా చెప్పకోగలరు. ఒక్కరూపమే కాదు. బుద్ధి, మర్యాద, హృదయం అంతా తల్లి పోలికే !"

"ఎక్కడ నేర్చావమ్మా శారదా. ఈ మాటలన్నీ ? ఇవి నీ సొంతం కాదు సుమా !" అనేసరికి సిగ్గుతో తలవంచకుంది.

"అయితే, రేణుకని గురించి మరెవరితోనయినా మాటాడావేమో నని పిస్తుంది ?" అన్నది సవిత,

"సునార్‌పూర్‌లో దేవతతో మాటాడా"నని చెప్పింది, సందేహిస్తూ.

వాత్సల్యంతో శారద తల నిమిరి, "నువు మంచి బుద్ధిమంతురాలివి తల్లీ! నాకు బాగా తెలుసు !" అంటూ ఉత్సాహపరిచింది. తరవాత బాబుగారి సంగతులడిగింది సవిత.

అందుకు శారద చెప్పింది — "ఎంత మంచివారో బాబుగారు అంత అమాయకులు. గోవిందుడే ఆయనకు సమస్తమూ. ఆశలూ, దుఃఖాలూ అన్నీ ఆ గోవిందుడి చరణాలకే అర్పించారు. దుఃఖించి మానవులు సాధించేదేముందమ్మా..."

"రేణుకను గురించి ఆయనలాగా నేను నిశ్చింతగా ఉండలేనమ్మా ! రోజు రోజల్లా ఆ గోవిందుడి భజనలతోనే అంతా నాశనమైపోయింది. అయినా ఆయనగారికి జ్ఞానోదయం కాలేదు. సంసారంలో ఇంత ఉదాసీనత! ఇంత నిర్లక్ష్యం ఉండే మనిషి అసలు పెళ్లేచేసుకోకపోతే నేమంట ! శారదా ! నువు మహత్యం అంటున్నావే అదేం కాదమ్మా, అంతా విరుద్ధం..."

"ఏమిటి విరుద్ధం !" అంటూ లోపలికి వచ్చాడు రాఘాల్.

"మీ పెదనాన్నగారి సంగతే నాయనా!" అన్నది సవిత. రాఘాల్ ముఖం కందిపోవటం గమనించి "పెదనాన్నగారిని ఒక్కమాటంటే కూడా సహించలేడు" మారాజు అన్నది మళ్లా సవిత, నవ్వుతూ.

రాఘాల్ శారదవేపు చూసి "తారక్ ఇవాళ ఇంటో ఉన్నాడా?'' అనడిగాడు.

"కోర్టు లేదుగా? కింది గదిలో ఉంటాడు బహుశా!'' అన్నది శారద.

"తారకుడితో కొంచెం పనుందమ్మా, వెళ్లొస్తా" నన్నాడు సవితతో.

"టీ తాగి వెళ్లు నాయనా! —శారదా! ఇవాళ మిపగారెలు చేశావుకదూ, టీతోపాటు రాజుకి అవికూడా టిఫిన్ పెట్టమ్మా!" అన్నది సవిత.

శారద అన్నది—"తినరమ్మా! అయనకు తిన్నా అవి రుచించవు!"

బాధతో చెప్పాడు రాఘాల్! "నిజమే శారదా, ఇంటో చేసిన టిఫిన్లు నాకంతగా రుచించవు. అసలు తినాలనికూడా లేదు. "ఎవరికోసం అవి తయారు చేశావో, వారికే తినిపించు!" అంటూ మాటాడక వెళిపోయాడు. శారద చాలా బాధపడింది మనస్సులో.

ఇది గమనించిన సవిత: "శారదా! నువ్వేం బాధపడకు. నామీదకోపంతో నిన్నామాట అన్నాడు. అదీగాక ఈమధ్యని రాజుకి మనసేం బావుంటంలే!" అన్నది.

కన్నీళ్లతో తడిసిన ముఖంతో అన్నది శారద — "నేనేం అపరాధం చేశానమ్మా! దేవతకి ఎప్పుడెవరిమీద కోపమొచ్చినా నన్నే బాణాల్లాంటి మాటలంటారు!"

"నువ్వంటే అతనికెంతో అభిమానం తల్లీ! 'నా' అన్నవాళ్లు అని చెప్పుకోవటానికి నీకంటే మరెవరున్నారమ్మా అతనికి?" అని శారదను సవిత సముదాయించింది! కన్నీళ్లు తుడుచుకుంటూ శారద అక్కణ్నించి వెళిపోయింది.

* * * *

తారకుడి గదిలో రాఘాల్ అడుగు పెట్టేసరికి తారకుడు ఏవో దావా కాయితాలు చూసుకుంటున్నాడు. చెప్పుల చప్పుడువిని, తలెత్తిచూసి ఆశ్చర్యంతో, "ఓహో! రాఘాల్ బాబుగారా!" అని పలకరించాడు.

"రావచ్చా?"

"తప్పకుండా రావచ్చు. రావటంలేదు కనుకనే ఆశ్చర్యం.

"అప్పుడప్పుడు వస్తూనే ఉన్నానే?''




"తెలుసు. కాని, ఆ రావడం నాదగ్గరకు కాదుగా ? లోపలికివచ్చి, వచ్చి నట్టుగానే వెళ్ళిపోతుంటారు..."

"లోపల్నించే ఎవరో పిలుస్తుంటారు—"

"అయితే ఇవాళ ఈగది పిలిస్తే వచ్చారన్నమాట ?"

"అహః—ఈ గదిలో పనుండి, నా అంతట నేనే వచ్చా !"

"ఏదయినా దావా ఉన్నదా ?"

"పని ఉన్నమాట నిజమేకాని, దావా మాత్రం కాదు."

"నీ ప్రాక్టీసు జోరుగా ఉన్నదట !"

"ఎవరన్నారు నీతో ? విమలబాబు చెప్పారా ? అసలు వారిని ఎప్పుడు కలిసావ్ నువ్వు ? ఏమేం సంగతులు చెప్పారూ ?"

"చాలా చాలా చెప్పారు. వినడానికి నీకు వ్యవధి ఉంటుందా అని..."

తారకుడు గబగబ కాయితాలన్నీ ఎక్కడివక్కడ సర్దేసుకున్నాడు. తోటలోకి పోయి కూచుని మాటాడకుందా మనుకున్నారు, ఇద్దరూ. "ఒక్కక్షణం ఆగు, టీతాగి పోదా"మన్నాడు, తారకుడు. పనిమనిషి ట్రేలో టీ కప్పులూ, మినప గారెలూ పెట్టుకు వచ్చింది.

* * * *

సంధ్యవేళ. తారక్‌బాబూ, రాహుల్‌రాజూ పార్కు చేరుకున్నారు. "మళ్లా

మనం ఇక్కడ ఎన్నాళ్లకు కలుసుకున్నాం!" అన్నాడు తారకుడు, కూర్చోబోతూ. విమలబాబు తనని గురించి ఏమేమిటి చెప్పాడో తెలుసుకోవడానికి ఆత్రంగా ఉన్నాడతను

"నువు బాగా కష్టపడి పని చెయ్యగలవు. నీకు మంచి భవిష్యత్తు ఉన్నది. నీలాంటి శ్రమజీవులు ముందు ముందు చాలా సుఖపడతారు అని చెప్పా" రన్నాడు, రాఘూల్. ఇందులో ఏమీ వ్యంగ్యం లేకపోయినా, తారకుడుమరోలా అపార్థం చేసుకున్నాడు.

మరి కాసేపయ్యాక ఇలా అన్నాడు—"చెప్పేది ఏదో త్వరగా చెప్పు పార్కులో స్తిమితంగా కూర్చుని పిల్లగాలుల సుఖం అనుభవించేంతటి అదృష్ట వంతుణ్ణి కాదు నేను!"

"వకాల్తా వృత్తికి సహనం చాలా అవసరం! ఒక్క ముఖ్యవిషయం మాటాడ్డానికే నిన్నిక్కడికి తీసుకువచ్చా!" నన్నాడు రాఘూల్ నవ్వుతూ.

మౌనంగా కూర్చున్నాడు తారక్.

"నీ పెళ్లి విషయం ప్రస్తావిద్దామని..."

"నా పెళ్లా!! అదే అయితే, ఇంతటితో ఆపేస్తే మంచిది. నాకా అభిప్రాయమూ లేదు, పరిస్థితీ అందు కనుకూలంగానూ లేదు," అన్నాడు తారకుడు.

"పెళ్లిఅయితే పరిస్థితి బాగుపడుతుందోయ్!"

"వొద్దయ్యా బాబూ! నాకాళ్లమీద నేను నిలబడగలిగే స్థితి వచ్చినప్పుడు చూసుకుందాం!"—

"ఈ వివాహంవల్ల నీ ఆర్థికస్థితి చక్కబడితే? అప్పుడూ అభ్యంతరమేనా'?'

"ఎవరా అమ్మాయ్? వకీల్ కూతురా, బారిస్టర్ కూతురా?"

రాఘూల్ ఇలా చెప్పాడు—!! సౌందర్యవతి, గుణవతి, అనుకూలవతి, సుశిక్షిత, ఉత్తమ బ్రాహ్మణకుల సంజాత! పిల్లతండ్రి ఒకప్పుడు బహు భాగ్యవంతుడు, ఇప్పుడు మాత్రం...! పిల్లకు తండ్రి తాలూకు ఆస్తి ఏమీలేదు, అయినా తల్లికి ఉన్న చర-స్థిరాస్థులన్నీ పిల్లకే సంక్రమిస్తాయి! అస్తి తృణమో పణమో కాదు. పుష్కలంగా ఉన్నది. ఏవిధంగా చూసినా అ అమ్మాయి యోగ్యుడైన పురుషుడికి భార్యగా ఉండతగింది!"

"ఇంతకూ-ఎవరమ్మాయో ఏమిటో, వారెటువంటి పదవిలో వున్నారో ఆ సమాచారం చెప్పవయ్యా!" అన్నాడు తారక్.



''నీకు బాగా తెలిసినవాడే తారక్, పిల్లతండ్రి! వ్రజబాబు కుమార్తె గురించే నేను నీతో ప్రస్తావిస్తున్నది!!''

నివ్వెరపోయాడు తారకుడు. ''ఏమిటంటున్నావ్? వ్రజబాబు కుమార్తెల్లో ఎవర్ని గురించి నువు చెప్పేది?''

''రేణుకను గురించే!''

''రాహుల్! నీకేం మతిగానీ పోలేదుకదా?''

''పోతే నిజంగా బాగానే ఉండేది!''

''నిజంగానే పోయింది రాహుల్ నీకూ! ఇంకేంమిగల్లేదు. అందుకనేకొత్తమ్మ కూతురితో నాపెళ్లి మాటాడ్డానికి వచ్చావు.''

''ఎందుకని అంత ఉద్రేకపడతావ్ తారక్?''

''లేకేం? ఇదంతా నువు చేస్తున్న కుట్ర! ఆమెక్కూడా ఈ ఉద్దేశం నువ్వే కల్గించి వుంటావు!''

''లేదు లేదు. నేను నచ్చజెప్పాల్సినంత అవసరమేం లేదు. ఎన్నాళ్లకిందటో ఆమె నిన్ను మనస్సులో నిర్ణయించుకుంది.''

''అంతా అబద్ధం! పచ్చి అబద్ధం!!''

''నే నెన్నడూ అబద్ధమాడను. నీకు తెలుసుగా?''

''మరైతే రేణుకను నువ్వే ఎందుకు చేసుకోగూడదూ?''

"నేను తగినవాణ్ణి కాను. ఈసంగతి కొత్తమ్మకూ తెలుసు."

"అయితే, అంత యోగ్యుడైన మందభాగుణ్ని నేనే దొరికానన్నమాట!"

"నువ్వు యువకుడివి, విద్యావంతుడివి, బుద్ధిమంతుడివి, ఆరోగ్యవంతుడివి, సచ్చరిత్రుడివి!"

"ఇన్ని బాణాలతో నువు నన్ను హింసించే ముందు ఒక్క విషయం యోచించ లేకపోయావ్! ఆ పిల్లని నా వంశంలోకి భార్యగా తీసుకురాలేను!! దారిద్ర్య మంటే మర్యాదహీనంగా బతకటమని కాదు!!"

ఖిన్నుడైపోయాడు రాఘాల్!– "తారక్! తారక్!! ఏమిటీ నువ్వనేదీ?"

"భయపడక నిజం చెప్పు రాఘాల్! – పోనీ నువ్వు మాత్రం ఆమెను భార్యగా స్వీకరించగలవా?"

తారకుడివేపే సూటిగా చూస్తూ అన్నాడు రాఘాల్– "ఆ తల్లి ఆశ్రయం లోనే ఉంటూ, ఆమె నీకిచ్చే సంపూర్ణ సహకారంతో నీ భవిష్యత్తును తీర్చిదిద్దు కుంటున్నావు. నీ వంశమర్యాదనీ కులగౌరవాన్నీ పెంపొందించుకుంటున్నావు. అవునా తారక్? నీలో ఉండే మానవత్వాన్ని చంపుకుని భవిష్యత్తును రూపొం దించుకో దలిస్తే అది నీ పతనానికే, మరెందుకూ పనికిరాదు!"

తారకుడు మండిపడుతూ – "నోర్ముయ్! ఒళ్లు తెలిసి మాటాడు రాఘాల్! కావాలంటే వాళ్లతాలూకు డబ్బంతా అణాపైసలతోసహా లెక్కచూసి, ఇచ్చి పారేస్తా. ఏమనుకున్నావో! ఈ షరతుమీదే వాళ్ల సహాయాన్నీ సహకారాన్నీ అసలు నే స్వీకరించింది!"

"అదా సంగతి? మంచిదే! పోనీ వాళ్లతాలూకు రుణభారం తీర్చడంతోపాటు నీ కృతజ్ఞతా భారం కూడా తీరిపోతుందను కుంటా..."

"చూడు రాఘాల్! వేళాకోళమాడకు. ఏపనైతే నీకు అసాధ్యమో దాన్ని ఇతరుల్ని చెయ్యమని బలవంతపెట్టడానికి సిగ్గులేదూ!" అనడిగాడు తారకుడు.

"సరే, నేననుకున్నట్టే జరిగిందంతా. నువ్విలాంటి మాట అంటావని మొద ట్నుంచీ అనుకుంటూనే వున్నా. కాని, ముందుగానే కొత్తమ్మ నీకు సూచన ప్రాయంగా చెప్పింది కదా! అని తెలిసి, ఆ ఆశ కొంచెం మనస్సులో పెట్టు కున్నా నంతే!"

లేచి నిలబడ్డాడు తారకుడు: "నాతో ఎన్నడూ కొత్తమ్మ ఈ విషయం ఛాయామాత్రంగానయినా సూచించలేదు. తారకుడు ఎప్పటికీ రాఘాల్ కాలే

డని ఆమెకు బాగా తెలుసు. అంచేత ఇలాటి ప్రసక్తి ఎప్పుడైనా రాఘాల్‌తో తెస్తుందేమోగాని, తారకుడితో మాత్రం తీసుకురాలేదు !"

రాఘాల్ జవాబుకోసం ఎదురుచూడకుండానే తారకుడు చర్రుమని వెళి పోయాడు

## 25

ఆర్థికంగా తన భర్తకూ, సంతానానికీ సహాయం చెయ్యాలనే వుద్దేశంలోనే సవిత లోగడ ఒకసారి ఏం చేసింది ? — రమారమి పాతికవేలు విలువగల నామమాత్రపు ధరకు కొన్నది. ఈ విషయంలో రమణబాబు ఆమెకు సాయ పడ్డాడు. కాని, వాళ్లెవరూ ఆమె సహాయాన్నీ సహకారాన్నీ కోరలేదు, సరికదా కనీసం ఈ ఆస్తివేపు కంటిరెప్పనైనా ఇంతవరకూ చూళ్ళేదు. ఇహముందు కూడా చూస్తారనే నమ్మకం సిదాగా పోయిందామెకు. ఇదే సవిత హృదయం ముక్కముక్కలై పోవటానికి కారణం.

మరో సంగతి — ఒకప్పుడు, సీలువేసిన నగంపెట్టెను రేణుక పేరుమీద బ్యాంకిలో జమకట్టింది, సవిత. ఆ సొమ్ము కట్నరూపంలో పిల్లకు సంక్రమింప చేయాలని ఆమె వుద్దేశం. ఆ ఆస్తి ఎవరిదోకాదు, రేణుక తండ్రిదే ! ఆ కల కూడా ఫలించకుండా పోయింది : దురదృష్టం.

బిడ్డతోసహా భర్తదగ్గర ఉండి, ఇహనైనా హాయిగా జీవితం గడపాలనిఎంత గానో ఆశపడింది. కాని, ఇంత కాలమయ్యాక ఒక సంగతి రూఢిగా తెలుసు కున్నదామె — తన బిడ్డ జీవితంలో, భర్తజీవితంలో తనకి అవగింజంతైనా స్థానం లేదని.

*   *   *   *

సింగపూర్‌నించి ఇవాళ సాయంత్రం టపాలో విమలబాబు వద్దనుంచి వచ్చిన ఉత్తరంలో ఇలా వుంది — "సవితా ! శారద రాసినకార్డు వచ్చింది. అందులో నీ ఆరోగ్యం బాగా పాడైపోయినట్టు తెలిసింది. ఇలానె నిర్లక్ష్యంచేస్తే మంచం పట్టేస్తావు కూడా. కనుక త్వరగా విధానం మార్చుకోవాలి" ఉత్తరం చివర తాజాకలం కూడా ఉన్నది. అదేమిటంటే — "తారకుడు తన పెళ్లిసంగతి నీతో చెప్పే ఉంటాడు. నా అభిప్రాయంకోసం రాశాడు. నీ వుద్దేశమేమిటి? —పిల్ల మరెవరో కాదు. తారకుడి సీనియర్ వకీల్ తెలుసుగా, శివశంకర్‌బాబు? ఆయన మేనకోడలే ! ఈ సంబంధం తారకుడి ముందు జీవితానికి సోపానం లాంటిది..."

సవిత పెద్దగా నిట్టూర్చి, ఉత్తరం అక్కడ పెట్టేసి మళ్లా తనపనిలోపడింది. ఆమె మనస్సంతా దుఃఖభారంగా వున్నది.

*  *  *  *

రాత్రి తారకుడికి వడ్డిస్తూ 'తారక్ ! నీకు పెళ్లటగా ? సింగపూర్ నించి నాకుత్తరం వచ్చింది ?" అనడిగింది సవిత.

శారద నవ్వుతూ అన్నది: "మనింటి పెళ్లి సంగతి మనకి సముద్రతీరం అవతలి నించిగాని తెలియలేదు !"

తారకుడికి ఒళ్ళు మండింది. తప్పనిసరిగా సవితకు జవాబు చెప్పాడు — "శివశంకర్‌బాబు తన మేనకోడలి కోసరం నావెంట బడ్డాడు. నేనే మాటా చెప్పనూలేదు, ఒక్క విమలబాబుకి మాత్రం తెలియపర్చా" నన్నాడు.

"అన్నివిధాలా ఈ సంబంధం నీకు తగిందే నాయనా ! అలాంటి మామ దొరకటం ఎంత అదృష్టం !" అని ప్రోత్సహించింది సవిత.

శారద పైకి వెళిపోయింది. తరవాత తారకుడు తను ఇల్లరికం ఉండటం గురించిన షరతు చెప్పి "పిల్లకి తండ్రిలేడు, శివశంకర్‌బాబుకి ఆడపిల్లలెవరూ లేరు. అందుకని..." అన్నాడు

"అర్థమయింది. మేనకోడల్నే సొంత బిడ్డలాగా పెంచి పెద్దదాన్ని చేశాడన్న మాట: అంచేతనే ఆపిల్లని విడిచిపెట్టి ఉండలేడాయన:" అన్నది సవిత.

"ఆ తరవాత సావధానంగా మా కుటుంబానికి ప్రత్యేక ఏర్పాట్లు చేస్తాడట. అంతా బాగానేవుంది. కాని ఇక్కణ్ణుంచి నేనెలా వెళ్లేది ? నేను వెళిపోతే మీ మంచిచెడ్డలు ఎవరు..."

"నా గురించి నువ్వేం విచారించకు నాయనా ! ఇప్పుడైనా తీర్థయాత్రలు చేసుకు వద్దామని మనస్సు తహతహ లాడుతున్నది.

"ఇహ మళ్లా కలకత్తా రావాలని లేదు. ఆ ప్రాంతాల్లో ఎక్కడయినా నచ్చిన చోట ఒక చిన్న ఇల్లుకొని, ఉండిపోతా"నని చెప్పింది.

*  *

'నువ్వూ నాతోపాటు తీర్థయాత్రలకు వస్తావా, తల్లీ?' అని సవిత అడిగేప్పటికి, 'సంతోషంగా వస్తానమ్మా !' అని చెప్పింది శారద. వెంటనే మనస్సు మార్చుకుని, "యాత్రలు చెయనమ్మా ! నేను రాను. ఒకవేళ వాళ్లంతా నన్ను చూసే ?'

'ఎవరు?'




"మా పుట్టింటివాళ్లు !"

''అయితే, పోనీ రావొద్దులే. ఇక్కడే వుండి చదువు పూర్తిచేసుకో !" అన్నది సవిత.

"మిమ్మల్ని వొదిలిపెట్టి ఉండటానికి భయంగా వుందమ్మా !" అని చెప్పింది శారద.

''భయమెందుకమ్మా? నీలాంటి పిల్లలు ఎంతోమంది ఉన్నారుగా ? రాజూ కలకత్తాలోనే ఉంటాడుకదా, నీ మంచి చెడ్డలు చూస్తూండమని అతనితో చెప్పిపోతా. నీకేం కావాలంటే అదల్లా రాజుని అడగొచ్చుగా ?"

చీకట్లో మంచం పక్కన నిలబడి, 'అమ్మా!' అన్నది. "ఏం కావాలమ్మా శారదా! నేనింకా మెళుకువగానే వున్నా" నన్నది సవిత.

"ఇవాళ నా జీవితకథ అంతా మీతోచెప్పేయ్యాలనిపిస్తూందమ్మా !"

''చాలా రాత్రయింది, వెళ్లి పడుకో తల్లీ! మరెప్పుడయినా చెబుదువుగానిలే!" అని సవిత అంటేకూడా, మానక శారద ప్రారంభించింది—

"పన్నెండేళ్లకే అమ్మా! నాకు వైధవ్యం ప్రాప్తించింది. తరవాత మరెన్నడూ నేను అత్తారింటికి వెళ్లలేదు. మా అమ్మ నా చిన్నప్పుడే పోయింది. అందుకని మానాన్న మళ్లీ పెళ్లి...'

అంటూవుంటే మధ్యలోనే చెప్పింది సవిత : "నువ్వేం చెప్పక్కర్లేదు శారదా ఆ సంగతులన్నీ నాకు తెలుసు.''

*        *        *        *

మర్నాడే సవిత విమలబాబుకి ఉత్తరం రాసింది.

"ఇక్కడ ఉండాలని లేదు. ఎక్కడయినా దూరప్రాంతాలకు పోదామని మనస్సు తపిస్తున్నది. అందుకని తీర్థయాత్రలు సేవించుకోవాలని నిశ్చయించుకున్నాను. మరి కలకత్తా రావాలనే లేదు..."

తరవాత తారకుడి పెళ్లి భోగట్టా, అతను ఇల్లరికం ఉండాల్సిన షరతు, వివరించి, ఇందుకు తన సమ్మతి తెలియజేశానన్నది. శారద విషయంలో చదువు పూర్తయ్యే వరకూ హాస్టల్లోనే ఉంటుందనీ, అప్పుల్లో మునిగి తేలుతున్న రాజుకి మాత్రం ఏమీ చెయ్యలేక పోయాననీ అన్నది. తన సహాయంగాని, ఇతరుల సహాయంగాని అతను పొందటానికి ఇష్టపడటం లేదు. పోనీ, అతన్ని తీసుకెళదామంటే, బృందావనంనించి అతని కెప్పుడు కబురొస్తుందో తెలీదు. తారకుడికి ముమ్మరంగా కోర్టుపనులు, క్షణం తీరిక దొరకదు ... ఇలా సంగతి సందర్భాలన్నీ సవిత రాసింది.

*        *        *        *

"మీ రెందుకని వివాహం చేసుకోరు దేవతా ?'' అనడిగింది శారద.

"తారకుడితో పోటీ పడమంటావా ?'' అనడిగాడు రాజు నవ్వుతూ.

"స్వంత కుటుంబం ఏర్పాటు చేసుకోవాలని లేదా? ఎన్నాళ్లని ఇలా హోటళ్లలోతింటూ జీవితం గడుపుతారూ?"

"అనుకున్నంత మాత్రాన చేసుకోగలరా ? శారదా ! నీ సంగతే ఆలోచించి చూడూ, ప్రయత్నలోపం లేకపోయినా, నువు ఏర్పరచుకో గలిగావా?"

"నాసంగతి వదిలెయ్యండి—అంత చిన్న వయసులోనే నేనువిధవనుకాకుండా వుంటే, నాకు నిక్షేపంలాంటి సంసారమే ఏర్పడివుండేది. మళ్లీ ప్రయత్నించి ఎలా అయినా ఏర్పాటు చేసుకోవాలనుకున్నా. కాని భగవంతుడు సహించలేకపోయాడు. నేనేం చేసేది?"

"సరేకాని, కొత్తమ్మ కలకత్తా వదిలి, తీర్థయాత్రలకు వెళితే, నీసంగతి? నువ్వూ వెళ్తావా?"

"నే వెళ్లడం మీ కిష్టమా, కష్టమా ?"

"ఇష్టం లేకపోవచ్చు. కాని కష్టపెట్టుకునే అధికారం నాకు లేదుగా?"

"అయితే నేను కొత్తమ్మ వెంట వెళ్లడం మీకసలు ఇష్టం లేనట్టుంది."

"ఆ మాటా నిజమే. నీ శ్రేయస్సు కోసమే నాలోచిస్తున్నాను ఇందులో నా స్వార్థం ఉన్నదని మాత్రం ఎన్నడూ అనుకోకుసుమా!" అన్నాడు

"లోకంలో ఎవరి మనస్సులో ఏస్వార్థముందో నేను గమనించలేను దేవతా!" అన్నది నిరుత్సాహంగా. "నా చదువు పూర్తిఅయ్యేవరకూ హాస్టల్లోనన్ను అట్టేపెట్టాలని అమ్మ ఆలోచన. నా కీ చదువూ సంధ్యలూ ఎంతమాత్రం ఇష్టంలేదు, దేవతా!"

"మరి నీకేది ఇష్టం?"

"ఇదీ అని సరిగ్గా చెప్పలేను. కాని ఈ చదువులూ వాటికి బదులు కుటుంబ విషయాలే నాకెక్కువ ఆసక్తి. ఇల్లు చక్కా అలంకరించటం. అవసర వస్తువులన్నీ సమకూర్చుకోవడం, నాకెంతో సరదా! పసిబిడ్డలంటే నాకు ప్రాణం! అమ్మ యింటో అద్దెకుండేదాన్ని కదా! ఇరుగుపొరుగు పిల్లలందరూ నాదగ్గరే పోగయ్యేవాళ్లు, వాళ్లందర్నీ లాలించేదాన్ని!"

"సొంత కుటుంబం అనేది లేకపోబట్టి కదా, నీకు గృహస్థ జీవితమంటే ఇంత ఆసక్తి!"

"నిజమే కావచ్చు, దేవతా!—అందుకనే మీరు తప్పకుండా పెళ్లి చేసుకోండి, గృహస్థులు కండి. మీ దంపతులకు హృదయపూర్వకంగా సేవచేస్తూ, నా జీవితం పరమార్థం చేసుకుంటాను. స్వయంగా మీ యింటిని అలంకరిస్తా. చూసే వాళ్ళు ఆశ్చర్యపోయేలా చేస్తాను. ఈ కుట్లూ అల్లికలూ ఎందుకు నేర్చుకుంటు న్నాననుకున్నారు? నేనే స్వయంగా పిల్లని ఎన్నికచేస్తా. నేనే మీ వివాహం జరి పిస్తా. మీ పిల్లల్ని తీర్చిదిద్దుతా..." నంటూ ఇంకా ఏమేమో చెప్పింది అమిత

"అయితే ఇందుకేనా ఇప్పుడు నువ్వు స్కూల్లో చేరిందీ?"

"మీరుండగా నా పొట్టకోసరం ఇతరులకు చెయిజాపి యాచిస్తానా? ఎందు కనీ...?" అంటూ వుండగా ఆమె కంఠం కంపించింది.

"ఏమిటి శారదా నువ్వనేదీ?—జీవితమంతా ఇతరుల సేవచేస్తూ గడిపేస్తావా? నీకు భర్తలేడు, పిల్లలు లేరు, ఇల్లులేదు, వాకిలిలేదు. ఇలా జీవితం గడిపితే తృప్తి ఉంటుందా?'

శారద చెప్పింది "ఏ స్త్రీకయినా తన భర్త, సంతతి, కుటుంబం — ఈమూడే అమూల్య సంపద. ఈ మూడింటినే వాంఛించే స్త్రీ ఏవిధంగానూ అప్రతిష్ఠ తెచ్చుకోదు, కళంకాన్ని రానివ్వదు.

అపవిత్రత అనే మాయనిమచ్చ ఏనాడో ఏర్పడింది. భర్తను పొందలేకపోయాను. సంతతి అసలు లేదు. కానయితే, హృదయ పూర్వకంగా ఎవరిని గౌరవిస్తున్నానో. భక్తిరో పూజిస్తున్నానో—వారి సంతోషమే నా సంతోషం, వారి కుటుంబమే నా కుటుంబమూ, అనుకుంటున్నా."

## 26

రెండు ముఖ్యవిషయాలు— మొదటిది : తారకుడికి పెళ్లికావటం. తరవాత విమలబాబుతోపాటు తీర్థయాత్రలు సేవించటానికి సవిత నిశ్చయించుకోవడం. రేపే యాత్రికుల ప్రయాణం. పాతనవుకరు మహాదేవ్, ఒకదాసీ, వంటమనిషి— వీళ్ళు వెంటవెళ్లే పరివారం.

రాఘూల్‌ను పిలిపించింది సవిత తనకు భర్త లోగడ సీలువేసిన ఒక నగల పెట్టె ఇచ్చాడుగా ? అది అతనికిచ్చి చెప్పింది— "నాయనా, రాజూ : ఇవి రేణుక నగలు. ఒహవేళ రేణుక వొద్దంటే, తల్లిలేని ఆడపిల్లలకు వీటి నిచ్చెయ్ ఏ వుద్దేశంతో ఇంతకాలం వీటిని భద్రంగా దాచివుంచానో, అది ఈ నాటికి నా పాలిట పరమ దౌర్భాగ్యంగా, హృదయశల్యంగా తయారయింది ఇహ నెంత కాలం నేను నెత్తిమీద పెట్టుకు తిరిగేది ?

"ఇదుగో, ఈ పత్రాలు చూశావా ? లక్షాయాభైవేలు విలువచేసే ఆస్తిని రేణుక పేర రిజిస్టరీ చేశాను. వాటి తాలూకు డాక్యుమెంట్లు! ఈ ఆస్థినికూడా ఒకవేళ రేణుక స్వీకరించకపోతే నీఇష్టానుసారంగా మరొక విధమైన ఏర్పాటు నువ్వే చెయ్యి.

"మరొహ సంగతి—ఈ నగలూ గాజులూ పెళ్లిసమయమందు మా నాన్న గారు నాకు పెట్టినవి. వీటిని నా కోడలికి—అంటే నీకు కాబోయే భార్యకు నా కానుకగా ఇస్తున్నాను. మనసారా ఆశీర్వదించి ఇస్తున్నాను. ఈ కానుక వొద్దనిమాత్రం అనకు ."

దూరాన నిలబడి శారద ఇదంతా చూస్తూ వుంది. రాఘూల్ రుద్ధమైన స్వరంతో అన్నాడు—"అమ్మా : నీ బిడ్డ విద్య, బుద్ధి, జ్ఞానం నీకు తెలుసుకదా. ఇంత పెద్దభారం నాకు అప్పగిస్తే నే మోయగలనా ? దీన్ని తారకుడికి అప్ప గిస్తే బాగుంటుందని నా ఉద్దేశం. అతగాడు వకీలు! చరస్థిరాస్తుల విషయంలో గట్టి అనుభవం కలవాడు...."

"నాయనా, రాజూ :— నిశ్చింతగా నన్నికక్షణ్నించి వెళ్ళనియ్యవా ?— ఏ మనస్సుతో ఆ నాడు వీటన్నింటినీ ఆయన దగ్గర్నించి తీసుకున్నానో,



ఆ వుద్దేశం సార్థకం కాలేదు నాయనా! మీ పెదనాన్నగారి వ్యాపారం దివాళా తీసిన ఆరోజునే వాటితోపాటు ఇవీ పోయివుంటే బాగుండేది నిజంగా! భయ పడకు రాజూ! ఈ విషయంలో నువ్వు ఏ నిర్ణయం చేసినా అది శుభప్రదంగానే వుంటుంది!" అని చెప్పింది సవిత.

* * * *

యాత్రికులంతా కలిసి ముందుగా ద్వారక, అక్కణ్ణించి గుజరాత్, రాజ స్థాన్ పర్యటించి తరవాత ఆగ్రా చేరుకున్నారు. అక్కడికి దగ్గర్లోనే ఉన్నది మధుర బృందావనం. శ్రీకృష్ణుని లీలాభూమి తప్పక చూడాల్సిందే అన్నది సవిత.

మధురలో విమలబాబుకి ఒక ధనవంతుడైన మిత్రుడున్నాడు. ఆయన తన అతిథి భవనంలో విమలబాబుకి బస, సంచారానికి కారు. చక్కటి సదుపాయాలు అమర్చాడు. బృందావనంలో తప్పక చూచితీరాల్సింది, ఘనంగా జరిగే గోవిందుడి హారతి! చూసే వెళదాం అన్నాడు, విమలబాబు.

సూర్యాస్తమయం ఘంటానాదం వినిపించింది. విమలబాబూ వాళ్లూ మందిరంలో ప్రవేశించారు. హారతి ప్రారంభమయింది. గోవిందుడి విగ్రహానికి ఎదురుగా నిలబడి సవిత దర్శనం చేసుకుంటున్నది. అయితే ఆమెదృష్టి విగ్రహంమీద నిలవటం లేదు. అప్రయత్నంగానే చుట్టుపక్కలకి ప్రసరిస్తున్నది.

సరిగా అదే సమయాన...

వరండాలో ఒకమూల నిలబడి, ముకుళిత హస్తాలతో, మూసిన నేత్రాలతో భగవద్ధ్యానంలో మునిగిఉన్న తనభర్త ప్రత్యక్షమయ్యాడు!

హారతి పూర్తి అయింది జనం ఎవళ్లనూనాన వాళ్ళు వెళిపోతున్నారు. విమలబాబు ముందుకివచ్చి, వ్రజబాబు పాదాలకు నమస్కరించాడు. వ్రజబాబు తుళ్లిపడి, "గోవింద గోవింద! ఇదేమిటీ, భగవంతుడి ఆలయంలో నాకు నమస్కరిస్తున్నారా? నన్ను నరకంలో పడవెయకండి!" అన్నాడు.

"నాకు తెలియదీ సంగతి. క్షమించండి!"

"మీరా, విమలబాబూ!– పదండి, అలా పోయి తులసీకుంజం దగ్గర కూర్చుందాం!" అన్నాడు, వ్రజబాబు. మళ్లా మళ్లా ఆయన గోవిందుడికి సాష్టాంగ ప్రణామంచేసి, ముక్కూ చెవులూ పట్టుకు క్షమార్పణ చెప్పుకుంటున్నాడు. నేలపైన చాపకట్టుగాపడి నమస్కరిస్తున్న వ్రజబాబుని చూస్తూ నిలబడింది సవిత.

బాగా పెరిగినగెడ్డం, తెల్లబడిన పిలక, మెళ్లో తులసిదండ, నుదుట తిలకం చేతిలో జపమాల, బుజంమీద హరినామం వేసిఉన్న దుప్పటి – ఇది వ్రజబాబు వేషం. దబ్బపండులాంటి ఛాయ, ఆజానుబాహు; కాని, వృద్ధాప్యంవల్ల నడుం వంగింది.

ఆయన చెప్పాడు..."ఈ దీనుణ్ణి, దుఃఖితుణ్ని ఆ శ్రీగోవిందుడు అనుగ్రహించాడు. ఆయన అపారదయను ప్రసాదించాడు. యమునాస్నానం ఆచరించినవాడికీ, గోవర్ధనగిరిధారీదర్శనం చేసుకున్న వాడికీ ఇహ జీవితంలో లోటేమిటి? బృందావనమంతా హాయే. ఈ లోకంలో మరి నాకు ఎటువంటి కోరికలూ లేవు."



ముందుకొచ్చింది సవిత. ''ఇక్కర వైష్ణవబాబా దగ్గర దీక్ష పుచ్చుకున్నా రటగదా. రాజు చెప్పాడు, అయితే ఇహ రాత్రింబగళ్ళు ఆ జపమేనా" అనడిగింది.

"నీకేం తెలుసు కొత్తకోడలూ! ఆ గోవిందుడే, నా జీవిత చరమాధ్యాయంలో నన్ను ఇక్కడికి రప్పించుకున్నాడు. ఇక్కడికి వచ్చాకే సమస్త దుఃఖాలూ నమసిపోయినై."

"మరి నా బిడ్డ? నీ రేణుక సంగతి? ఎక్కడుంది రేణుక?" అనడిగింది సవిత గంభీరంగా.

అందుకు వ్రజబాబు ఇలా చెప్పాడు—

"ఎవరూ! నా బిడ్డా? యిలాంటి వ్యర్థమైన మాటలు యిహ మానెయ్ కొత్తకోడలూ! ఇక్కడ, తక్కిన విషయాలన్నీ తుచ్ఛమైనవే. ఇక్కడున్నది కేవలం ఒక్క వ్రజనందనుడు— శ్రీ కృష్ణుడే సర్వమూ, అంతేగానీ 'నా' అనే వాళ్లు ఎవరూలేరు. నా రేణుకను కూడా ఆయన పాదాలకే సమర్పించాను. 'నా బిడ్డ. నా రేణుక' అని అనుకున్నంత కాలమూ ఆమె భవిష్యత్తుకోసం యమ యాతన అనుభవించాను. యిప్పుడా గోవిందుడికే అర్పించెయడంతో ఎంతో నిశ్చింతగా ఉంటున్నాను. దాని భవిష్యత్తు ఏం చేస్తాడో ఆ బాధ్యతఅంతా గోవిందుడిదే; మనదేముంది? మనం కేవలం ఆ పరమాత్ముని చేతి కీలు బొమ్మలం! అంతా ఈశ్వరేచ్ఛ......!"

అంతలోనే అకస్మాత్తుగా "నాన్నగారూ!-" అన్న పిలుపు వినిపించింది, సవిత ఆశ్చర్యంతో వెనుదిరిగి చూసేటప్పటికి రేణుక నిలబడివున్నది!—ఏ స్థితిలో వుంది?- రూపం చూస్తే, ఒంటికి ఎటువంటి సంరక్షణా లేక దరిద్రదేవత పాదచిహ్నాలు ఆ ముఖంలో స్పష్టంగా కనిపిస్తున్నాయ్. సగం మాసిన బృందావన ధోవతి, మెళ్లో తులసిమాల, నొసట చందన తిలకం – ఇటువంటి రేణుకను చూడ్డంతో సవిత హతాశురాలైంది, ముతిపోయినట్టే అగుపించింది. అసలు ఆమె వైపు రేణుక చూడనైనా చూడలేదు, "నాన్నగారూ! ఇంటికి పోదాం పదండి, చాలా రాత్రయింది!" అన్నది.

"అమ్మా! నువ్వు మీ అమ్మని గుర్తించలేదా?" అనడిగాడు వ్రజబాబు

"గుర్తించాను, కాని ఆలయ ప్రాంగణంలో నమస్కరించ కూడదు!" అంటూ తల్లికేసి ఒక్కసారి చూసింది తరవాత మళ్ళా తండ్రితో – "నాన్నా, పదండి పగలంతా ఏకాదశి వ్రతంలోనే ఉంటిరి, ఇప్పుడయినా కాస్త ప్రసాదం......"

తన బిడ్డ తల్లిపట్ల పరాయిదానిగా ఉండటంచూసి వ్రజబాబు చాలా బాధ పడ్డాడు. "కొత్తకోడలూ! పోనీ ఒక్కరోజు గోవిందుడి సేవకోసం...... కుటీరానికి......" అనేసరికి సవిత అన్నది-

"నాలాంటి అపవిత్రురాలు మరోసారి ఇక్కడికి రావటం మంచిదికాదు!"

నాలిక కరుచుకున్నాడు వ్రజబాబు. "దీనబంధు, దీన దయాళువు, పతిత పావనుడు, ఆశ్రయదాత, ఆ గోవిందుడు. ఇదీ తెలియదా కొత్తకోడలూ,నీకూ?"

సవిత దుఃఖం సుడులు తిరిగిపోతున్నది. దిగమింగుకుంటూ అన్నది - "మీ మత ధర్మాలు చిలక పలుకులు. అవి మిమ్మల్ని ఏ స్థితికి తెస్తున్నాయో మీ కళ్ళతో మీరు చూడలేరు. క్షమాశక్తి లేని మతం మతం కాదు, అది ధర్మశాస్త్రం కాదు......" అని అనేసి అక్కణ్నించి మందిరం బయటికి వచ్చేసింది.

*  *  *  *

పిచ్చివాడిలా చూస్తున్నాడు వ్రజబాబు. ఆయన్ని విమలబాబు అడిగాడు: "మీతో కొంచెం మాటాడాల్సివుంది, ఎప్పుడు వీలుంటుంది?"

"-విమలబాబూ! రేపల్లా నేను మా గురుదేవులైన బాబా వైకుంఠదాసువారి కుటీరంలోనే ఉండిపోతా. కనుక ఎల్లుండి ఉదయమే నిరభ్యంతరంగా రావచ్చు మీరు. రేపొక్కరోజుకి నన్ను మన్నించాలి."

"సరే, ఎల్లుండి ఉదయమే వస్తా! నమస్కారం."

*  *  *  *

నిశ్చలమైన మనస్సుతో టీ కలుపుతూ అన్నది సవిత—"సింగపూర్ వెళ్ళటానికే నిశ్చయించుకున్నా."

"కొంతకాలం ఇలాగే యాత్రలు సేవిద్దాం. ఎప్పుడు మనస్సుకి నచ్చకపోతే అప్పుడే వెళ్లొచ్చుగా?" అన్నాడు విమలబాబు.

"వొద్దు, వొద్దు. ఏ క్షేత్రయాత్రలూ నే చేయదలుచుకోలేదు. మానవుడు నిర్మించిన ఈ గుళ్ళూ, గోపురాలూ దర్శిస్తూ తిరగటంవల్ల ఏమీ సార్థకం కనబడదు. ఇహ నాకు కావల్సింది విశ్రాంతి! విమలబాబూ!"

"నువు పూర్తిఅయిన విశ్రాంతి తీసుకుందా మనుకుంటున్న ఆ చోట కూడా నీ కోరిక సఫలంకాకపోతే?" అనడిగాడు.

దృఢమనస్సుతో చెప్పింది సవిత—"ఈ నా జీవిత చరమ అధ్యాయంలో ఆ భగవంతుడే నన్ను దయ దలిచి, మిమ్మల్ని నాదగ్గరకు పంపించాడు. మీ ద్వారానే భగవంతుడు నాకు సౌఖ్యాన్ని కల్పించాడు. అదే నిజంగా అక్షయ సంపద! రెమ్మనుంచి పువ్వు రాలిపోతే, మళ్ళా తిరిగి రెమ్మను చేరుకోలేదు. ఎండమావుల భ్రాంతిలోపడి జీవితంలో ఇంకా ఇంకా తిరగడం కేవలం వ్యర్థం తప్ప మరేంకాదు, ఈమాట నే ననుభవంవల్ల తెలుసుకోవటానికి ఇంతకాలం పట్టింది!''

'అయితే, సింగపూర్ టెలిగ్రాం ఇవ్వనా?'' ఓడలో మనకోసరం రెండు కేబిన్లు రిజర్వు చేయించనా?" అనడిగాడు.

మరునాడుదయం— మధురనుంచి కారులో బృందావనం బయల్దేరబోతూ, విమలబాబు అడిగాడు: "వారు నిన్నూ ఆహ్వానించారు కదా, వెళ్లిపద్దామా!"— ఇందుకు సవిత ఇష్టపడలే, చివరకు విమలబాబు ఒంటరిగానే బృందావనం చేరుకుని, వ్రజబాబు ఇల్లు వెతుక్కు వెళ్ళాడు.

అంతకు ముందురోజునే రేణుకకు కలరా తగిలింది. చికిత్సలేదు. వైద్యానికి ఏర్పాటులేదు, రోగికి హరినామ సంకీర్తన వినిపిస్తున్నారు. రేణుక తండ్రి భగవంతుడి విగ్రహం ముందు అల్లకల్లోలమై సాష్టాంగ పడుతున్నాడు గురువులైన బాబా వైకుంఠదాసు వారికి కబురు వెళ్ళింది సపర్యకోసమని ఆయన ఒక వైష్ణవ దాసిని పంపించారు. ఆవిడకేం అనుభవం లేదీవిషయంలో. తెరువు మరుపుల్లో వున్న రేణుక "దాహం—దాహం!!" అని చేత్తో సైగచేస్తే వైకుంఠదాసు గారు పంపిన మందు, లేకపోతే భగవత్ చరణామృతం నోట్లో పోస్తున్నారు

మంచం పట్టిన రేణుకనూ, శోచనీయమైన ఆమె దేహస్థితినీ విమలబాబు గ్రహించాడు, వెంటనే సవితను తీసుకురావడానికి మధుర ప్రయాణమయ్యాడు.

కబురు చెవిని పడటంతోనే సవిత కొయ్యబారిపోయింది తక్షణమే ఆమెను తీసుకుని బృందావనం బయల్దేరాడు, విమలబాబు

విమలబాబు ఏ మాట చెప్పి ఓదార్చుదామన్నా సవిత చెవులకు వినిపించటమే లేదు ఉన్నట్టేఉండి, ఆమె ఇలా అన్నది—"దయామయా! మీరెన్నో దేశాల కథలూ చరిత్రలూ చదివారు కదా. కుమార్తె జీవితానికి కన్నతల్లే కారకురాలైన కథ ఎక్కడైనా చదివారా?"

తొందరగానే వ్రజబాబు ఇంటికి చేరారు. అక్కడ కాషాయి వస్త్రాలు ధరించిన వైష్ణవుల గుంపు! ఇంటిముందు అంతిమయాత్రకు చేసే సన్నాహాలు. విమలబాబుకి అనుమానం కలిగింది, సవితవేపు చూశాడు. ఆమె స్థిరంగా ధీరురాలులాగా నిలబడివుంది. ముఖంలో దుఃఖపుఛాయలైనా కనిపించలే. ఆశ్చర్యపడ్డాడు విమలబాబు.

ఎంతో నిబ్బరంతో సవిత కారుదిగి సరాసరి ఇంట్లోకి వెళిపోయింది. ఆమెను చూడ్డంతోనే వ్రజబాబు పెల్లుబికే దుఃఖంతో అన్నాడు—"వచ్చావా, క్రొత్త కోడలూ! వీళ్ళందరూ రేణుకను తీసుకపోతామని హారం చేస్తున్నారు, చూశావా!

- యువ

నేనేమన్నానో తెలుసా?—'వీల్లేదు—ఈ 'సంపద' ఎవరిదో ఆ యజయాని రావాలి. ఆ తరవాత మీ ఇష్టమొచ్చినట్టు చేసుకుందురుగాని' అన్నాను. నీ 'సంపద'ను నేను భద్రపరచలేకపోయాను సవితా! క్షమించు సవితా, నన్ను క్షమించు!!"

మాటాడలేదు సవిత. గుండె బిగపట్టుకుని ఘాటిలో నిండిన ఆ వరండాలో మంచంవేపే చూస్తూవుంది. నేలమీద మురికి గుడ్డలతో చుట్టపెట్టిన శవాన్ని పడుకో బెట్టారు. దగ్గర్లోనే చరణామృతపాత్ర, నీళ్ళ గళాసు, మందులూ అవీ ఉన్నాయి. వణికిపోతున్న చేతులతో సవిత ముందుకొచ్చి శవం ముఖంమీద గుడ్డ తొలగించింది—నెత్తురుచుక్క లేక పాలిపోయిన ముఖం, లోపలికి పోయిన కళ్ళు, అస్థి పంజరమంతా కనిపిస్తూంది స్పష్టంగా!

ఆ క్షణాన తల్లి కళ్ళలో, ప్రపంచమంతుండే వాత్సల్యపూరితమైన సమస్త దుఃఖమూ ఆవరించింది. ప్రాణరహితమైన తన రేణుక శరీరాన్నితాకి, ఆ చల్లటి లలాటంపైన ఒక్కసారి సవిత ముద్దుపెట్టుకుంది! అంతే!! —తప్పుకుని పక్కన నిలబడింది.

తరవాత—జరగాల్సిన తంతు ప్రారంభమైంది. ముసలివాడైన తండ్రికి జీవితంలో సాధించిన సహనం, సాధన, భగవద్ధ్యానం — ఎక్కడికిపోయినాయో, పసిబాలుడిలాగా నేలమీదపడి దొర్లిదొర్లి ఏడుస్తున్నాడు! "అమ్మా, రేణూ! నీ ముసలినాన్నని ఎవరికి అప్పగించి వెళిపోతున్నావమ్మా! తల్లీ—"అంటూ ఒకే గోల!!

*           *           *           *

చాలా రోజుల తరవాత—

రేణుక పోయినట్టు తెలిసి రాజు వచ్చాడు. వ్రజబాబు చిన్నభార్య వచ్చింది.

దుఃఖంలో మునిగివున్న తన భర్త భారమంతా వహించి, రాత్రింబగళ్ళు ఆయన్నే కనిపెట్టుకుని ఉండటంలో సవితకు కొద్దిరోజుల్లోనే ముసలిరూపు ఏర్పడింది. పెదిమలు ఎండిపోయి లావణ్యం చెడింది!

వసారాలో కూర్చుని పేలపిండి విసురుతున్నదామె. చీరెనిండా నూనె మరకలు. బాగా మాసిపోయింది. తలపాపిట చెదిరిపోయి వంకరటింకరగా ఉన్నది.

సరిగ్గా అప్పుడే వచ్చాడు విమలబాబు.

మీ రిక్కడ ఎంతకాల ముంటారు?" అనడిగింది సవిత".

"చిన్నకోడలూ వచ్చింది, ఆమె రాకముందే నేను వెళ్ళిపోయుండవలసింది:— కాని వీళ్ళందరూ ఆయన్ని కలకత్తా తీసుకపోవటానికే వచ్చారు. కనుక నిశ్చింతగా ఉండనివ్వరు. అసహాయుడైన ఆయన చివరి దశలో బృందావనం ఆశ్రయించుకున్నాడు. దాన్నుంచి దూరం చెయ్యటం అపకారం కాదూ? ఆయన హృదయంలో ఉన్న ఆవేదనను అర్థంచేసుకున్న మనిషే అయితే, ఆమె ఇక్కడే కనిపెట్టుకునుండి సేవ చెయ్యాలి!"

జవాబు చెప్పలే, విమలబాబు. సవిత అన్నది—"ఈ దిక్కుమాలిన దేశంలో మీరు పడుతున్న బాధ నాకు బాగా తెలుసు. మీరిహ వెళ్ళిపోకూడదూ? నే నిక్కడేఉండిపోతా!" అంటూ దుఃఖపూరితమైన స్వరంతో మళ్ళా ఇలా అడిగింది:—"ఒక్కమాటకు జవాబు చెప్పి వెళ్ళండి–ఒకనాడు రేణుక నన్ను 'అమ్మా' అని పిలిచింది, ఎంతో ఆప్యాయంగా నాకు సపర్యలు చేసింది. అయినా కూడా నా జీవితం కళంకం పోనేలేదా?"

"దీనికి నీ అంతరాత్మే చెబుతుంది సవితా సరైన సమాధానం!" అన్నాడు విమలబాబు.

*　　*　　*　　*

తన చెల్లెల్ని వెంటబెట్టుకుని కలకత్తానించి వచ్చింది, వ్రజబాబు చిన్నభార్య. భర్తని అక్కడికి తీసుకపోవాలని ఆమె వుద్దేశ్యం, అయితే ఈ విషయంలో వ్రజబాబు ఏమాటా ఇంకా చెప్పలేదు. సవిత జోక్యం కల్పించుకుని అన్నది—"ఈ స్థితిలో ఆయన్ని కదిపి కలకత్తా తీసుకువెళ్ళడం మంచిదికాదు. చివరి దశలో, ఇహ ఈ కొద్ది జీవితకాలం వారిని బృందావనంలోనే గడపనివ్వండి!"

వెంటనే చిన్నకోడలు (వ్రజబాబు చిన్నభార్య) ఇలా అడిగింది – "ఇక్కడ ఎలాటి వైద్య సౌకర్యమూ లేక ఒక ప్రాణి ఇప్పటికే పోయె. ఈయనకూ్కడా మళ్ళా జబ్బుచేస్తే, మంచీ చెడ్డా చూసేవారెవరూ?"

"సేవచేయదలిస్తే నువ్వు ఇక్కడే ఉండవచ్చుగా? అభ్యంతర మేముందీ? కాని, ఆయన్ని ఇక్కణ్నించి మాత్రం తీసుకెళ్ళలేవు!" అన్నది సవిత.

"మీరెవరో నాకర్థం కావటంలేదు!" అన్నది చిన్నకోడలు.

"నేనా? మీ అత్తగారింటికి సంబంధమున్నదాన్ని. దగ్గిరి బంధువుని, ఇంతకు ముందెప్పుడూ మనం కలుసుకోలేదు. అందుకని నన్ను ఆనః పోయావ్!"



తెలివైనది కాదు చిన్నకోడలు, జవాబు చెప్పే తెలివి అసలే లేదు. ఒక్క క్షణం ఏమిటో ఆలోచించి ఇలా అన్నది — "నే నిక్కడికి రావటం అన్నయ్య కసలు ఇష్టంలేదు; ఎంతో బతిమాలితే, "సరే, రెండు రోజులుండి వచ్చెసెయ్!" అని చెప్పి పంపించాడు నన్ను. మా వారిని ఇక్కణ్నించి తీసుక వెళ్ళటమే సరైన పని."

"ఆయన దృష్టినించి ఆలోచిస్తే, ఈపని అన్నిందాలా అనుచితమే!" అన్నది సవిత.

"నావెంట రావడం అసాధ్యమయితే మరి, వారి మంచి చెడ్డలు ఎవరు చూస్తారూ? రేపొద్దిటికల్లా మేం విధిగా బయల్దేరి తీరాలి!" అని చెప్పింది, చిన్న కోడలు.

అందుకు సవిత ఇలా అన్నది — "బంధువులూ, ఆత్మీయులూ ఆయన్ని ఒకనాడు అందరూ నిరాదరణతో పరిత్యజించారు. నిరాశ్రయునిగా చేశారు. ఆ సమయంలో, వారి భారమంతా తనదిగా భావించిన వ్యక్తే, మళ్లా ఈనాడు ఆయన బరువు బాధ్యతల్ని స్వీకరిస్తుంది! ఈమాట మీ అన్నగారితో చెప్పు!"

''ఎవరా వ్యక్తి?'' అని ఆసక్తితో అడిగింది, చిన్నకోడలు.

''నువు గుర్తించలేవమ్మా చెల్లీ! — మీ అన్నయ్యతో చెప్పు, ఆయన గ్రహిస్తారు!"

చెల్లెల్ని తీసుకుని చిన్నకోడలు మళ్ళా కలకత్తా వెళిపోయింది. విమలబాబు సింగపూరు ప్రయాణమయ్యాడు! ఆయన బయల్దేరేముందు సవిత ఎదటికివచ్చి నమస్కరించింది. అపరాధినిలాగా తలవంచుకుని అన్నది — "నన్ను అపార్థం చేసుకోకండి దయామయా! ప్రతిసారీ ఆశ్రయ భ్రష్టురాల్ని కావటమే నానుదుట రాసిపెట్టాడు విధాత!"

మాటాడలే విమలబాబు. బృందావనంలో ధూళిరేపుకుంటూ ఆయన కారు క్రమశః సవిత దృష్టిపథం నుంచి అదృశ్యమై పోయింది. పాలిపోయివున్న సవిత ముఖాన్నిచూసి, కంపితస్వరంతో రాఘాల్ పిలిచాడు: "అమ్మా అమ్మా!! కొత్తమ్మా !!'

రాజు పిలుపు విన్నదామె, పొంగి పొరలుతున్న దుఃఖాన్ని అణచుకోలేక నేలమీద పడి భోరున ఏడుస్తూ అన్నది!—"నాయనా రాజూ! ఏనాడయితే నా రేణుకే నన్ను క్షమించలేదో, ఈ లోకంలో మరెవ్వరూ నన్ను క్షమించరని ఆనాడే రూఢిచేసుకున్నా, నాయనా!" అంటూ విలపించింది.

*  *  *  *

ఎన్నో నెలలు గడిచిపోయినై. సముద్రపు అవతలి తీరంనుంచి సవిత పేర ఒక ఉత్తరం వచ్చింది. అందులో ఇలా రాశాడు. విమలబాబు :

"నీ పరిచయ భాగ్యం నా జీవితంలో అమూల్యమైనటువంటిది. నా జీవిత కాలంలో ఎన్నటికీ నేను కుటుంబాన్ని ఏర్పరచుకోలేక పోయాను. ఇంత ధనార్జన మాత్రమే చెయ్యగలిగా. ఇప్పుడు నాకు ప్రౌఢవయస్సుకూడా దాటిపోతున్నది. జీవితపు ఆఖరుపాదంలో స్వకుటుంబ సుఖాన్ని నీద్వారా పొందగలిగా. ఇదే నా తృప్తి. ఇందుకు నీకు నేనెప్పుడూ కృతజ్ఞుణ్ని!"

"సవితా! — నీపట్ల నా మనస్సులో ఎంతో సానుభూతి, శ్రద్ధ, ఆసక్తి వున్నాయి. నాది ఒక్కటే నమ్మకం — ఈ నా జీవితనౌక సముద్రతీరానికి ఎంత దూరాన్నయినా ఉండనీ — దీని లంగరు మట్టుకు నీచేతుల్లోనే ఉన్నది సుమా! ఏక్షణమందైనా నా అవసరం కలిగితే, వెంటనే టెలిగ్రాం పంపించు. ఈ లోకంలో ఏమూలని, నే జీవించివున్నా, వచ్చి తప్పక నిన్నుకలుసుకుంటా!"






గంగానదీ తీరాన నీలాటిరేవులో అమ్మలక్కలంతా చేరుకున్నారు. అందులో కృష్ణప్రియ అనే ఆమె ఒక బ్రాహ్మణ వితంతువు. ఈమెకు కలహప్రియ అనే బిరుదు సార్థక మనిపిస్తుంది. ఏవేవో గొడవలు చెప్పుకుపోతూనే వుంటుంది. అవి కాదనటానికి ఎవ్వళ్లకూ దమ్ములుండవు.

అంది "సంపద తగ్గిపోవటం కూడా ఇలానే బిందూ!"

బిందువాసిని శ్రీమంతుల ఇంటిబిడ్డ. శ్రీమంతుల ఇంటి కోడలున్నూ! ఇప్పుడామె పుట్టింటికి వచ్చింది. ఆ చెప్పేది తనతోనే ననుకుని, "ఏమిటత్తా!" అనడిగింది బిందు.

"అదే. హారాన్‌ముఖర్జీ సంగతి జ్ఞాపకమొచ్చి, అంటున్నా. మట్టంచేసేదాకా వాళ్ళని పట్టిన దేవతలు వదిలేట్టు లేరు."

నెలకిందటే ముఖర్జీ కొడుకు, ఆరేళ్ళవాడు పోయాడు. అదే అనుకుని విచారంతో అన్నది బిందు "ఏంచేస్తాం అత్తా! చావు పుట్టుకలు మన చేతిలో వున్నాయా?"

"ఆ విషయం కాదు నే చెప్పేది. చావు బతుకులు దేవుడి చేతుల్లోనే వున్నాయి. కాని... ఇంతకీ ఆసంగతి నువ్వింకా వినలేదా అమ్మాయ్?" అనడిగింది కృష్ణప్రియ.

బిందు ఏంచెప్పలేక ఆమె ముఖంవేపు చూస్తూంది. "అయితే హారాన్‌ముఖర్జీ గొడవ నువ్వేం వినలేదా?" అని మళ్లీ అడిగింది, కృష్ణ.

"అదేమిటత్తా? దీనికి తోడు ఇంకో కష్టంకూడా వచ్చిపడిందా యేం ?"

"ఆ(—దేవుడూ... వంగిన వాళ్ళనే ఇంకా లొంగదీస్తాట్ట. ఆ ఇంటికోడలు, బంగారు బొమ్మ! కష్టమంతా ఆ యిల్లాలిదే అనుకో. ఆ దరిద్రుణ్ని కట్టుకుని ఒకనాడయినా సుఖపడ లేదుగా!"

బిందు కేం అంతుపట్టలే. కాని అక్కడున్న ఆడవాళ్ళందరికీ తాగుబోతు హారాన్ సంగతి తెలుసు. ఇంతలో కొత్తసంగతి ఏం జరిగిందా అని వాళ్ళంతా మళ్లీ ఆలోచనలో పడ్డారు.

"అత్తా! అసలు సంగతేమిటో చెప్పవూ?" అనడిగింది బిందు.

"ఎందుకు చెప్పనమ్మా! చెప్పటానికి మనస్సు వప్పడంలేదు. ఇంతకీ ఆ పిల్లవాడు దౌర్భాగ్యుడు. వాడి నొసట అంత కష్టం రాసిపెడితే, మనం ఏన్నను కుంటే మాత్రం తప్పుతుందా?"

"ఏం కష్టం, చెప్పత్తా!" అని ఎంతో ప్రాధేయపడింది బిందు.

వలవలు చిలవలు మలుపులు తిప్పింది గాని, కృష్ణప్రియ అసలు సంగతి చెప్పనేలేదు. "పరాయి గొడవలు కలగజేసుకోనని చెప్పానుగా!" అని అనేసి వెళ్లిపోయిందామె. ఆమెకు నోట్లో నువ్వుగింజ దాగదని అందరకూ తెలుసు.



ఆశ్చర్యపోయారు. స్నానాలు అయ్యాక ఎవరిళ్లకు వాళ్లు వెళ్లారు. బిందుకూడా ఇల్లుచేరుకుని, తడిగుడలు మార్చుకుని, తల్లిదగ్గరకొచ్చి కూచుంది.

"బిందూ! ఇంత సేపు నీళ్లలో నానితే, ఒంటికి రాదుటే?" అన్నది తల్లి.

"దానికేంగానీ, హారాన్ ముఖర్జీకి ఏం జరిగిందే?"

"ఏమిటి జరిగేది?"

ఆయనకి మళ్లీ ఏదో కష్టమొచ్చిందని కృష్ణప్రియఅత్త చెప్పిందే. రేవులో నీకు తెలీదూ?"

"తెలియదే. ఏమని చెప్పిందేం?"

"వాళ్లని దేవుడు నీళ్లలో ముంచేస్తున్నాట్ట. తాగుబోతు ఏం పట్టించుకోట్ట. కష్టమంతా ఇల్లాలిదేనుట. అయినా ఒకాళ్ల గొడవలో నేను కల్పించుకో" ననేసింది.

"పాపం! ఇప్పటికి జ్ఞానం తెలిసిందన్నమాట!" అన్నది తల్లి.

మధ్యాహ్నం కృష్ణప్రియ ఇంటికెళ్లి విషయ మేమిటో తెలుసుకుంటానని బిందు. వొద్దని తల్లి, వెళ్లే తీరతానని బిందు పట్టుపట్టింది. మన కళ్లముందు ఓ మనిషి మునిగిపోతూవుంటే చూస్తూ ఎలా ఊరుకోవడం? అని వాదించింది.

విరోధం కూడాను. వొద్దమ్మా!" అని పోరి చెప్పింది.

"నాకు తెలుసు. అయినా నేనతడి దగ్గరి కెళ్లడంలేదు. అతని భార్యని చూసి వస్తే, తప్పా? ఇరుగు పొరుగులు ఆపదలోవుంటే మనం కళ్లమూసు కూర్చో వడమా?" అన్నది బిందు.

చివరికి తల్లే ఈ సంగతి వెల్లడించింది—బ్రాహ్మణ పాడీ జమీందారు అయిన నందిబాబు కింద హారాన్ గుమాస్తా. లెక్కల్లోంచి హారాన్ రెండొందలదాకా కొట్టేశాడు అతన్ని తెలిసిన వాళ్లెవరూ జామీన్ ఉండలేదు. ఉంటే బిందు తండ్రి ఉండాలి. కాని ఈయనకీ అతడికీ పడదు.

మళ్లీ తల్లి నడిగింది బిందు, ప్రాధేయంగా. 'మధ్యాహ్నం ఒక్కమాటు వెళ్లి అవిణ్ని చూసొస్తానమ్మా!' అందుకు తల్లి 'మీనాన్నకి తెలిస్తే కోప్పడతా రమ్మాయ్!' అంటే కూడా 'భయంలేదులే' అనేసింది బిందు.

# 2

"హ్లాలాద్‌పూర్" గ్రామం చాలా అందమైంది. ఊరి పక్కనించే గంగానది ప్రవహిస్తూంటూంది. ఈవూరు పూర్వం ధనవంతులకు ఆటపట్టు. అక్కడ ఇప్పుడున్నదల్లా పదిళ్ళ బ్రాహ్మణ కాయస్థులవీ, రైతువాళ్ళ ఇళ్లు ఓ డెబ్బయి. ఇవి తప్పితే అంతా అడవి!

ఇక్కడే వుంది హారాన్ ముఖోపాధ్యాయుని రెండంతస్థుల ఇల్లు. ఈ హలాద్ పూర్‌కు ఓ కోసు దూరంలోనే "బ్రాహ్మణపాడ్"—అంటే నందిబాబుగారి జమీ. ఆయన దగ్గరే హారాన్‌కు నెలకు ఇరవై రూపాయిల మీద నవుకిరీ. ఈ ఇరవై రాళ్లతో మునుపెలా గడిచేదో గాని, ఇప్పుడు చాలడంలే.

ఇంటో చూడబోతే — భార్యా, ఇద్దరు కొడుకులూ, ఇద్దరు కూతుళ్లూ, ఓ ముండమోసిన అక్కగారు... మునుపటి రోజుల్లో సంసారంలో లోటు కని పించేది కాదు. ఇప్పుడు గుట్టుకాస్తా రట్టయింది. ఇవాళ బియ్యం లేవు, రేపు పప్పుల్లేవు, ఎల్లుండి కట్టెల్లేవు—ఇలా అది లేదు, ఇది లేదు, అనుకుంటూ రోజు రోజుకీ దరిద్రం పట్టి పీడిస్తూవుంటే—ఈ స్థితిలో అందరూ చేసే పనే అతడూ చేశాడు!

హారాన్ విశ్వాసపాత్రుడు కనుక మొదట్లో గౌరవంగానే గడుపు కొచ్చాడు. కాని, రానురాను మెల్లిమెల్లిగా జమీందారుకి హారాన్ పైన అనుమానం కలి

గింది. క్రమంగా అనుమానం స్థిరపడింది. దొంగతనం పట్టుబడింది. మూడువేలు లోటు కనిపించింది. జమీందారు అడిగాడు —

"ఇంత డబ్బేం జేశావ్?"

"ఖర్చయింది."

"అయితే దొంగతన మెందుకు చేశావ్?"

"సంసారం గడవక."

"జరిగిందేదో జరిగింది సగం జమకట్టు, వదిలేస్తాం."

"ఎక్కణ్ణుంచి తెచ్చేది? ఉన్నదల్లా ఒక్కిల్లు. కావాలంటే అది అమ్మేసి తీసుకోండి"

"మరి నీపెళ్లాం బిడ్డ లెక్కడుంటారు!"

"చెట్ల నీడన."

ఇలా జమీందారు ప్రశ్నలకు మొరాయించి జవాబులు చెప్పాడు హారాన్. అందుమీదట నందిబాబు ఇంకో ఉద్యోగస్తుణ్ని పిలిచి హారాన్ ఇంటివిషయాలు ఆరాతీయించాడు. గంజాయి తాగటంవల్ల హారాన్ కి క్లెప్టమేనియా వ్యగ్రగా జ్యోతుల్లా వుంటాయనీ, ఇంకా ఏమేమో దురలవాట్లూ వ్యసనాలూ ఉన్నాయనీ తేలింది. ఇది తెలిసిన మర్నాడే చోరీ నేరంతో, హారాన్‌ను పోలీసుల కప్పగించారు!

ఇంతా జరిగినా, గ్రామంలో పిట్టకి తెలీదు. ఒక్క బిందు లంగ్రీ భవతరణ గంగూలికి మాత్రం తెలుసు. జమీందారు నందిబాబే ఆయనకి చెప్పివుంటాడు

గంగూలీ మంచి పలుకుబడి కలవాడు. తలుచుకుంటే హారాన్‌ని క్షణంలో విడిపించగలడు. కాని ఆపని చేయలేదు. కలహప్రియ అయిన కృష్ణప్రియ చెవిని ఈవార్త ఎలాపడిందో ఆమెకే తెలియాలి, ఆ దేవుడికే తెలియాలి!

* * *

వంటింటి వసారాలో హారాన్ భార్యా, విధవ కూతురు లలనా, వాడిన మొహాలతో ఎదురు బొదురుగా కూచుని వున్నారు. లలనకు ఇవాళ ఏకాదశి. కాని తల్లి ఏమీ తినలేదింతవరకూ

"మూడురోజులయింది వెళ్లి, ఇవాళ కూడా వచ్చేట్టు లేదే నాన్న! మేఘాలు కమ్ముకొస్తున్నయ్. వర్షం వచ్చిపడిందంటే నించుందికి చోటుండదు. నువ్వు కాస్తా కూస్తో ఎంగిలిపడు!" అన్నది లలన.

ంచెను, నిత్యకర్మ ముగించుకుని తావళం తిప్పుకుంటూ వచ్చి, "అమ్మామ్! ఇంకా భోజనం కాలే!" అనడిగింది. "ఇంకాస్సేపు చూస్తా" నంది విచారంగా, హారాన్ భార్య.

"నా తలకాయలాగుంది. ఇంకా చూసేదేమిటీ? గంజాయి తాగి, తందనాలాడుతూ ఏ ముండకొంపలో పడిఉన్నాడో! ఆ పోరంబోకు వెధవ ఛస్తేగాని నా మనస్సు చల్లబడదు" అంది.

అందుకు లలన "అత్తామ్! ఏకాదశిపూట నాన్ననలా తిడతావెందుకు?"

రాసమణి రెచ్చిపోయి అన్నది—"గుడ్డొచ్చి పిల్లనెక్కిరించిందిట! నీకే తండ్రి కాబోల్నాయన, నాక్కాదు! నా మనసులో బాధ నీకేం తెలుస్తుందీ అంట", అని చెప్పి పైట కొంగుతో కళ్లనీళ్లు తుడుచుకుంది. "ఈ ముసిలిదాని నోట్లోంచి ఒక్కముక్క వస్తే పదిమాట లంటారా మీరు? నాకేం, నేనేం జోక్యం పెట్టుకోనులే ఉపోషాలతో మాడి, ఎండి పురుగవుతుంది మీ అమ్మ. దాని మొహం చూసిగానీ..." అన్నది.

ఇంత రాద్ధాంతమవుతుందని లలనకు తెలీదు. "తప్పేనత్తామ్! ఇహ నెప్పుడూ అనన్లే!" అంది.

అందరూ బలవంతం చేస్తే లలనతల్లి రెండు మెతుకులు కొరికిందో లేదో, ఇంతలో,—తన అయిదేళ్ల పిల్ల ప్రమీల చెయిపట్టుకుని బిందువాసిని చక్కా వచ్చింది.

ఏదురుగావున్న రాసమణి బిందును కుశలప్రశ్నలు వేసి, యోగక్షేమాలు కనుక్కుంది.

"కోడ లెక్కడా?" అనడిగింది బిందు.

"ఇప్పుడే రెండు మెతుకులు కొరికి, ఆ పిల్లాడి దగ్గిర కూచుంది. ఏం చెయ్యడం?"

"ఇంతాలస్యమేం?"

"ఇవాల్టికి మూడురోజులాయె, హారాన్ రాలేదుగా? వాడికోసం ఏదురు చూసి చూసీ..."

హారాన్ చిన్నకొడుకు మాధవుడికి ఏడాదినుంచి మలేరియా. తండ్రి ఉపేక్ష, చెయిసాగక సరైన మందూ మాకూ లేకపోవటం, దానాదీనా ఆ రోగం ఒంటిని జీర్ణించి పోయింది.

"నాన్న రావటం లేదేం, అమ్మా?" అడిగాడు మాధవుడు.





"మందు తేవటాని కెళ్లారు నాయనా!"

"తియ్యటిమందు తెమ్మని చెప్పేం. చేదు మందయితే తాగలేనమ్మా. అమ్మా, నాకు నయమవుతుందా ?"

తల్లి కళ్లనీళ్ల పెట్టుకుంది. ఏదో చెప్పబోయింది. అంతలో బిందు గబగబ వచ్చేసి "నయమవుతుంది నాన్నా ! నేను నీ దగ్గిరే వుంటాను. నయం చేయిస్తాగా?" అంటూ ధైర్యం చెప్పింది. బిందుని మాధవుడూ చూడలే, అతడి తల్లీ చూడలే. అంచేత వాళ్లకి ఆశ్చర్యమయింది !

మంచంమీదే కూచుంది, బిందు. "ఇంతకీ నోట్లో నీళ్ల పోసుకున్నావా, సుభద్రా ?" అనడిగింది.

సుభద్ర హారాన్‌ముఖర్జీ భార్య. వయసుకి బిందు చిన్నదైనా, ఆమెను పేరెట్టి పిలవడం అలవాటు.

"ఊఁ—" అంది సుభద్ర, తలొంచుకొని.

"మీ పెద్దమ్మాయేదీ ?"

"పైనుందేమో !"

"లలనా!" అని తనే పిలిచింది బిందు, "కొంచెం కిందికి దిగిరా అమ్మా !" లలన వచ్చాక, తన కూతుర్ని ఆమెకి అప్పగించి "ప్రమీలా, నువ్వా తమ్ముడి దగ్గిర కూచోండి. చాలా రోజులయింది, అమ్మా నేనూ కాస్సేపు మాటాడుకుంటాం" అని చెప్పింది.

సుభద్రను చెయిపట్టుకు తీసుకెళ్లింది, పైన గదిలోపలికి. హోరాన్ గురించి భోగట్టా లెన్నో చేసింది. లోకుల మాటలన్నీ నమ్మటానికి వీల్లేదని చెప్పింది.
"హోరాన్ అన్నయ్య మూడురోజులాయె రావటం లేదంటే ఏదయినా ఆపద కలగలేదు కద! అనుకుంటున్నా నేను" అన్నది బిందు.

ఒక్కమాటుగా సుభద్ర ఒళ్లు జలదరించింది. "వారు లేరంటావా" అంటూ వణికింది.

"పిచ్చిదానా! ఎందుకు లేరూ? హాయిగా వున్నారు!"

"అయితే యేమిటీ?" అనడిగింది సుభద్ర.

"అదే చెబుదామని వచ్చా, నువ్విలా భయపడితే నే చెప్పనే చెప్పను సుమా!"

"లేదమ్మా. భయపడను. ఏం జరిగిందో చెప్పు."

"దొంగతనం నేరంమీద నందిబాబు ఆయన్ని పోలీస్‌ఠాణాకు వప్పగించారు!"

"పోలీస్ ఠాణాకా !!" సుభద్ర ముఖం పాలిపోయింది. "అయితే, ఇప్పు డేమవుతుంది, బిందూ?"

"ఏమవుతుందీ, ఆయన్ని విడిపించుకు రావాలి!"

"బిందూ!—ఒకసారి మీనాన్నగారి దగ్గరకెళ్లి వస్తా, దయదలిచి ఏమన్నా సాయంచేస్తారేమో!"

"అందరికీ సాయపడే దేవుడే వున్నాడు. వొద్దు. మానాన్నగారి దగ్గిరి కెళ్ళొద్దు. మా నాన్నకీ హోరాన్ అన్నయ్యకీ పడదు. విరోధం."

"అయితే, మరిప్పుడేం చెయ్యనూ ?"

"అందుకనే వచ్చా. నే చెప్పినట్టు చేస్తావా ?"

"చేస్తా !"

"ఎన్ని కష్టాలు వచ్చినా ?" "ఆ".

"అయితే విను: రెండు మూడొందలు దొంగతనం చేశాడనే నేరంమీద నందిబాబు అతన్ని అరెస్టు చేయించాడు."

"ఒక్కమాటుగా అంతడబ్బు కాజేశారా? చేస్తే, ఎక్కడ పెడతారు? చేసి ఉండరు, బిందూ!"

"చెయ్యకపోతే మంచిదేగా? పోయిన డబ్బు నందిబాబు కిచ్చేస్తే వొదిలే స్తారు."

"ఎలా సాధ్యమవుతుంది, ఈపని? ఇంత డబ్బు నేనెక్కణ్ణించి తెచ్చేది?"

యువ



"అదే చెబుతూంట; ఇది సిగ్గుపడాల్సిన సమయం కాదు. ఇదిగో, నా మురుగులు రెండూ పట్టుకుని, ఈ రాతిరే నువు నందిబాబింటికి వెళ్లు. తరవాత చూసుకుందాం."

"నీ మురుగులా?" అన్నది ఆశ్చర్యంగా, సుభద.

"అవును, నావే! నాలుగొందలు చేస్తాయి. ఇది ఆయన కిచ్చి, మంచిమాటలు చెప్పి, బతిమాలుకో. అన్నయ్యని వొదిలేస్తారు."

"కానీ, బిందూ!"

"కానీ, గీనీ కాదు. ముందిప్పుడు వెళ్లు, భర్తను రక్షించుకో. సిగ్గుపడాల్సిన సమయం కాదు. నా డబ్బు గురించి బాధపడకు. నీ కొడుకు పెద్దవాడయ్యాక తీర్చుకుంటాడులే!" అంటూ వేగిరపెట్టింది, బిందు.

"ఎవర్నయినా తోడు తీసుకు...?"

"వొద్దు వొద్దు. తోడు ఎవరూ వొద్దు. ఒక్కత్తవే వెళ్లు. నలుగురుకి తెలిస్తే నాలుగు విధాల చెప్పుకుంటారు."

"సరి, సరి, ఇవాళే వెళ్తా."

"చీకటి పడ్డాక, మాసినగుడ్డలు కట్టుకుని, ముసుగులేకుండా వెళ్లు. రేపీపాటికి మళ్లీ నే వస్తా," అని చెప్పి వెళ్లబోతూండగా, సుభద కళ్లనీళ్లు పెట్టుకుంది.

బిందు ఆమె కన్నీళ్ళు తుడిచింది. "దిగులు పెట్టుకోకు సుభద్రా! దేవు డందిర్నీ కాపాడతాడు. చీకటిరోజులు ఎప్పుడూ వుండవు" అంటూ, కొంగునుంచి ఓ ఐదురూపాయల కాగితం తీసి సుభద్ర పిడికిట్లో అదిమిపెట్టింది. "మీ అమ్మకి నేనోవిధంగా దగ్గిర చెల్లెల్ని. నా దగ్గిర సంశయించకు. ఇది తీసుకో. పిల్లాడి కెందుకయినా పనికివస్తాయి," అని చెప్పి కిందికి దిగివచ్చింది. ప్రమీల చెయ్యి ట్టుకుని, "చాలా ఆలస్యమయింది, పదమ్మా, పోదాం ఇంటికి" అన్నది. విధవరాలైన లలనని స్నేహంతో అభిమానంతో పలకరించి, వెళ్ళిపోయింది, బిందు.

ప్రళయంగా మబ్బులు కమ్ముకున్నాయి. గాలికి విడిపోయి, అవి మళ్ళీ కలుసుకుంటున్నాయి. ఈ వాలకం చూసి రాత్రి కెలాగూ వర్షం వచ్చితీరుతుందని అందరూ సంతోషపడుతున్నారు. కాని, సుభద్రకు మాత్రం ఆ సంతోషం లేదు.

తన గ్రామంనించి బ్రాహ్మణపాడ్‌కు అంతా అడవిదారి. ప్రయాణానికి మబ్బులూ గాలీ అనుకూలంగా లేవు. అయినా సుభద్ర తెగించి, పైటచెంగులో మురుగులు రెండూ భద్రంగా మూట కట్టుకుని, కంబళితో ఒళ్ళంతా కప్పుకుని, బైటకు వచ్చింది.

ఆ వూరెప్పుడూ ఇంతకు ముందు వెళ్ళలేదామె. ఉత్తరవేపు అరకోసు వెళ్ళి, కొంచెం ముందుకు సాగితే ఆ వూరు కనిపిస్తుందనీ, జమీందారుగారిల్లు సులువుగానే తెలుసుకో వచ్చుననీ చెప్పారు.

'హాలాద్‌పూర్' దాటింది సుభద్ర. అంతా కొత్తకదా! దారి కనుక్కోవడమే కష్టం. పైగా చీకటి. చిన్నచినుకులు ప్రారంభమై హోరుమని వర్షం. ఈ స్థితిలో సుభద్ర ఓ చెట్టుకిందికి చేరుకుని నించుంది. ఆ కాళరాత్రిలో నలువేపుల్నించీ అడవి జంతువుల పరుగులు. భయంచేత తను ఈ చెట్టుకిందికి వచ్చింది. అలానే వర్షానికి భయపడి దొంగలు ఇక్కడికి వస్తే? ఆమె తన ప్రాణం కోసమే కాదు. కాని, భర్తకోసమని పట్టుకెళ్ళే ఆ రెండు కంకణాల్ని గురించే...! ఆ భయంతో చెట్టుకిందినుంచి పారిపోయింది.

ఆమె శీదాగా బురదతో నిండిపోయింది. దారిలో మధ్య మధ్య ముళ్ళమొక్కలూ అవ్వీ తగిలి, ఒళ్ళంతా గీచుకుపోయింది. అయినా పట్టించుకోలే. వర్షం తెరిపి లేదు, మేఘాల గర్జన తగ్గలేదు.




చాలాసేపటి కొక పెద్దదారి కనిపించింది. ఆ దారి వెంబడి పోతూంటే ఓ పెద్ద మేడ, చుట్టూ గొప్ప తోటా చూసింది. ఇదే జమీందారుగారి ఇల్లయివుండా లనుకుంది.

అయితే—ఇప్పుడు వారిని కలుసుకోవడమెలా ? ఇంత రాత్రప్పుడు వారు మాటాడతారా ? సందిగ్ధంలో పడింది. సుభదకు ఏడుపొచ్చేసింది. శ్రమ వృధా అనుకుంది.

వర్షంలోనే తడుస్తూ ఆ యింటి కెదురుగావున్న శివాలయంలోకి వచ్చి పడుకుంది. చూస్తుండగానే వర్షం తగ్గింది, మేఘాలు మాయమైనాయి. చంద్రబింబం కనిపించింది. చందమామ తోడుగావున్నాడుగదా, ఇంటికి పోవచ్చునని ధైర్యపడ్డదామె.

తడిసిపోయిన గుడ్డలు పిడుచుకుంటూ వుంటే జమీందారుగారింటి తలుపు తెరుచుకుని ఒక వృద్ధుడు గుడికేసి వస్తున్నాడు. ఆయనకో నవుకరు చేత లైటు పట్టుకుని దారి చూపిస్తున్నాడు !

ఆయన్నడిగి తెలుసుకుందామని ఆమె ఒక పక్కకి ఒదిగి నించుంది. ఆమె వేపు చూసి లోపలి కెళ్ళాడు వృద్ధుడు. చాలా సేపయ్యాక ఇవతల కొచ్చాడు.

ఆమె ఇంకా అక్కడే వుంది. చూస్తే ఎవరో పెద్దయింటి ఆడబడుచు అని తోచింది. కుశల ప్రశ్నలు వేసి, ఆమె భోగట్టా యావత్తూ తెలుసుకున్నాడు.

"భగవాన్‌బాబుగారికోసం వెళుతున్నా," నని చెప్పిందామె. ఆయన విస్మయం పొందాడు.

"అయితే నావెంట రా!" అంటూ ముందుకి నడిచాడు.

సంకోచం లేకుండా ఆయనవెంట వెళ్ళిందామె. దారిదాటి, తోటలోంచి వెళ్ళి, ఓ గది తలుపు తెరిచాడు. "ఇలా రా అమ్మాయ్!" అని పిలిచాడు. ఆ గది కుర్చీలు, పరుపులూ, పాన్పులూ ఇంకా వేటివేటితోనో అలంకరించబడింది.

ముఖమల్ పాన్పుపైన కూర్చున్నాడు, వృద్ధుడు. ముసుగులోవున్న సుభద్రను శిరస్సు మొదలు చిరు పాదాల వరకూ చూశాడు. ఇప్పుడంటే కష్టాలకు లొంగిపోయి, ఉపవాసాలు చేసి రూపం చెడిందేమోగాని, మునుపొకప్పుడు మంచి రూపసి! కొంత సేపయ్యాక, "అమ్మాయ్! దారితప్పి ఇటు వచ్చావనుకుంటా. వినోదబాబు కోసమా?" అనడిగాడు.

"వినోదబాబెవరు ?"

"భగవాన్‌బాబు చిన్నతమ్ముడు!"

"అహ—నాకు భగవాన్‌బాబుతోనే పనుంది."

"అలానా? నన్నే భగవాన్ నందిబాబు అని పిలుస్తారు. ఇంత రాత్రప్పుడు నాతో నీకేం పనో తెలియడంలే."

జవాబు చెప్పలే, సుభద్ర.

"మరి మీ యిల్లెక్కడ ?"

"హోలాద్‌పూర్."

"హోలాద్‌పూరా!! నాతో పనా ? అటయితే నువు హోరాన్ భార్యవా?"

"ఊఁ—"

"మరి నాతో పనేమిటీ ?"

పైటకొంగునవున్న కంకణాల జత తీసి బాబుగారి పాదాల దగ్గిరుంచింది. గద్గద స్వరంతో "వారిని విడిచిపెట్టండి!" అన్నది, ప్రాధేయంగా.

అంతా గ్రహించాడు వృద్ధుడు. కంకణాలు రెండూ తీసుకుని, పరీక్షగా చూస్తూ, "సరి, ఇప్పుడు నీకివైనా ఇచ్చినందుకు సంతోషంగావుంది" అనిచెప్పి, అవి రెండూ కిందని పెట్టాడు : "వీటిని తిరిగి నువ్వే తీసుకు వెళ్లు ! బ్రాహ్మణ పిల్ల చేతి కంకణాలు నేను తీసుకోను. అతన్ని వదిలిపెట్టాలనుంటే ఇవెందుకు,




ఊరికినే వదిలేస్తా. అత నెంత వాడుకున్నాడో తెలియకపోయినా యిబ్బందిలేదు. ఇవేమీ తీసుకోకుండానే వదిలెయ్యగలను" అన్నాడు.

సుభద కన్నీళ్ళు తుడుచుకుంటూ "అయితే, వారిని వదిలిపెట్టేస్తారు కదూ" అనడిగింది.

"ఇప్పటిదాకా వదులుదామని అనుకోలేదు. ఏమంటే, అటువంటి దుష్టుడికి తగిన ప్రాయశ్చిత్తం చెయ్యడమే మంచిది. అయితే, నీ కోసం అతన్ని వదలి పెడతా."

ఆమె కళ్ళవెంట బాష్పాలు రాలినై. మనస్సులోనే ఎన్నో ధన్యవాదాలు అర్పించి, ఇహ సెలవు తీసుకు వెళదామనుకుంటూ నిల్చుంది. "ఈ రాత్రిపూట ఇప్పుడే వెళతావా ఇంటికి?" అని అడిగాడాయన.

అవునని తలూపింది.

ఇంత రాత్రప్పుడు ఒంటరిగా వెళ్ళడం మంచిది కాదని చెప్పి, సాయం కోసం ఒక నవుకరు నిచ్చి పంపించాడు. మళ్లీ అడవుల వెంటబడి, ఇంటికి వచ్చింది.

—తెము ఇల్లు చియకునటప్పటికి సరిగ్గా ఉదయమయింది. లలన లేచి, ఇంటి పన్లు ప్రారంభించింది. తడిచిన బట్టలతో తల్లి రావడం చూసి, "అమ్మా! ఇంత పొద్దున్నే వెళ్ళొస్తున్నావేం, గంగాస్నానానికి?" అనడిగింది.

పుణ్యమొస్తుందనే వుద్దేశంతో సామాన్యంగా సంతతికి దేవుళ్ళ పేర్లు పెట్టు కుంటారు. పుణ్యంమాట దేవుడెరుగు, పాపం చుట్టుకుంటుందని సుభగ అభి ప్రాయం. ఆమె తన ఇద్దరు కూతుళ్ళకూ రామామణి, దుర్గామణి అని గాకుండా లలన, చలన అని నామకరణం చెయ్యటం మేనత్త రాసమణికి ఇష్టంలేదు. ఛ, ఇవేంటి బజారు పేర్లకుమల్లేనని ఆమె అసహ్యించుకుంది.

హారాన్ పెద్దకూతురు లలనామయి, పాపం బాల వితంతువు. రెండోది ఇంకా చిన్నపిల్ల చలనామయి. లలన మితభాషిణి, ఇతర పనుల్లోకి పోదు. చిన్నది ఇందుకు కేవలం విరుద్ధం. పోట్లాటంటే చెవికోసుకుంటుంది. ఊరి గొడవలన్నీ తనే తలపైన వేసుకుంటుంది. నగనాణ్యాలు లేవని ముఖంముడుచు కుంటుంది. ముతక బియ్యపు అన్నమైతే కంచం విసిరికొడుతుంది. రోజూ ఇలాంటి పేచీలూ అలకలూ ఎన్నో...

అమ్మాయి లిద్దరూ కుందనపు బొమ్మలు! చలన అద్దంచూచుకుని, తన ఒంటిమీద ఎక్కడ ఏ ఆభరణం పెట్టుకోవాలో అన్నీ మనసులో ఊహించుకుని, అక్కదగ్గరికి పరుగెత్తింది. "మనవూళ్ళో చెయిచూసే జ్యోతిష్యుడెవడైనా వున్నాడా?" అనడిగింది. "ఎందుకని?" అని అక్క ప్రశ్నిస్తే, "పెద్దయ్యాక నేను నగలు పెట్టుకుంటానో లేదో చూపించుకోవా" లన్నది. "ఎందుకు పెట్టు కోవు? ఓ రాజుకి రాణివవుతావు నువ్వు, చెల్లీ!" అని అక్క హుషారు చేసే ప్పటికి, చలన సిగ్గుపడేది, బుగ్గలు ఎరుపెక్కేవి.

వాళ్ళకుటుంబ పేదరికం, పాపపుణ్యాలు, వీటిని గురించి చిలిపి ప్రశ్నలువేసి వాదించేది చలన. తన అక్క విధవ అని తెలుసు. అయినా చిన్నతనంవల్ల కొన్నిమాటలు నోరు జారేవి. అంచేత, జవాబుచెప్పటం ఇష్టంలేక, "అమ్మ పిలుస్తోంది, వెళతా" నని చెప్పి తప్పించుకునేది లలన.

యువ



నిజంగానే వాళ్ళమ్మ లలనని పిలిచింది. "ఎందుకమ్మా?" అనడిగితే, "మీ నాన్నగారు వచ్చారు. ఆ గదిలో..." అని ఇంకా మాట పూర్తిచెయ్యక ముందే లలన వెళ్ళిపోయింది.

*　　　　*　　　　*

భోజనంముందు కూచున్న హారాన్‌ను అడిగింది రాసమణి "ఇన్నాళ్ళాయె ఎక్కడికెళ్ళావురా?" నోట్లో ముద్దపెట్టుకుంటూ హారాన్ చెప్పాడు : "అదంతా బోలెడంత గ్రంధముందిలే! పిడుగులాంటి అపవాదొకటి వచ్చి నా తలపైన పడింది!" అన్నాడు. విప్పి చెబితేగాని వీల్లేదని కూచుందామె.

"చవితి చంద్రుణ్ని చూస్తే వస్తుందిగా, నీలాపనింద? అలాంటిదే నందిబాబు నామీద దొంగతనం కట్టి, నాపేరు వీధిన పెట్టాడు. అబద్ధం ఎంత కాలం దాగుతుంది? అంతు దొరక లేదాయనకి. చేసేది లేక విడిచిపెట్టేశాడు. అఖండ విజయంగా ఇంటికి వచ్చేశా!" అని చెప్పాడు.

రాసమణి అడిగింది! వాళ్ళు నిన్నిపుడు మళ్లీ నవుకిరీలో ఉంచుకుంటారా?"

"ఎందుకుంచుకోరూ? ఇంతకీ నేనసలు నవుకిరీ చెయదలుచుకుంటేగా?"

"మరి ఖర్చులకి డబ్బో?"

మూస్కో ఇంకో ఉద్యోగంలో ఉంటాగా!"

"సరే, ఎలా నచ్చితే అలా చెయ్. లేకపోతే పిల్లా జెల్లా ఎంతో కష్టపడి పోతారు," అంటూ హితవు చెప్పిందామె.

*

భోజనం కాగానే కుర్రవాడి దగ్గరి కెళ్ళాడు. తండ్రి వచ్చాడని తెలిసి, ముందే లేచి కూచున్నాడు మాధవుడు.

"ఎలావుంది మాధవ్?" "బాగానేవుంది, నాన్నా. మందుకోసం వెళ్ళావుగా తెచ్చావా?"

"తెచ్చాను." "అయితే తే" అని చెయిజాపాడు మాధవుడు. చిక్కులోపడ్డ హారాన్ "ఇప్పుడు కాదు, రాత్తిరి పుచ్చుకుందువుగాని" అని చెప్పి తప్పించు కున్నాడు.

"నాన్నా, ఓ ఆపిల్‌పండు తెచ్చిస్తావా?" అనడిగాడు కుర్రవాడు. "సరే" నంటూ సుభదను "రెండణాలుంటే ఇవ్వ" మన్నాడు. పెట్టె తెరిచి ఇస్తూంటే ఇంకా డబ్బులు కంటబడ్డాయి. "మరి నాలుగణా లిటివ్వు, అబ్బాయికి ఆపిల్ పండు తీసుకురావాలి" అన్నాడు.

భర్త వెళ్ళాక మళ్ళీ పెట్టెతెరిచి చూసింది సుభద. మిగిలిందల్లా ఒక్క రూపాయి. ఆనాడు బిందు ఇచ్చిన అయిదు రూపాయిల్లోనూ మిగిలివున్నదే ఈ ఒక్క రూపాయి. ఇదే ఆమెకు ఆసరా కనక, రహస్యంగా దాన్ని ఎక్కడో పదిలపరుచుకుని, మాధవుడి దగ్గరికి వచ్చి కూర్చుంది.

"అమ్మా, నాన్నారు ఆపిల్‌పండు ఎప్పుడు తెస్తారే?" అంటూ కుర్రవాడు ఎన్నోసార్లు అడిగాడు. సాయంకాలమయింది, రాత్రి అయింది. ఎంతకూ హారాన్ రాలేదు. రకరకాల ప్రశ్నలు వేశాడు మాధవుడు. చివరికి ఏడ్చాడు. వాణ్ని మరిపించాలని చూసింది తల్లి. కాని, కుదరలే.

ఎలా అయితేనేం, మర్నాడు సాయంత్రానికి కొంప చేరుకున్నాడు హారాన్. అసలే మండిపోతున్న సుభద, రాసమణి, మాటాడలే. ఒలనే కాళ్లు కడుక్కోమని నీళ్ళు ఇచ్చింది.

స్నానపానాదు లయ్యాక "మాధవుడికి ఆపిల్‌పండు తెచ్చారా?" అనడిగింది సుభద.



"అరెరే... అదా? జేబు చిరిగింది కామాలు, వేసుకున్న డబ్బంతా ఎక్కడో జారిపోయినట్టుంది. సరేగాని, నాలుగణాలుంటే ఇవ్వు. సాయంకాల మిస్తాను" అన్నాడు, హారాన్.

ఏమీ లేవంటే ఊరుకోలేదు. "ఎందుకు లేదూ? నిన్న రూపాయి వుందిగా?"

మాటాడలే, సుభద.

"ఛ ఛ — మహా రూపాయిలైతే ఏమో అనుకోవచ్చు. ఒక్క నాలుగణాలకు నన్ను నమ్మలేకపొయ్యావ్!— వెధవ డబ్బులు!" అంటూ ప్రారంభించాడు.

ఇహనేం మాటాడకుండా ఆమె ఆ డబ్బులిచ్చేసి వూరుకుంది.

'ప్రహ్లాద్‌పూర్' దాటి 'బ్రాహ్మణపాడ్' సమీపించి, ఒక చిన్న సందున పడ్డాడు హారాన్. పేడతో అలికిన అదొక చిన్న కొంప. అందులోకి వెళ్ళాడు. అక్కడ మతిలేని వాళ్ళలా కూర్చున్నా రెంతోమంది. హారాన్ కంటబడగానే పట్టలేని సంతోషంతో 'బాప్పా!' అని, మరొకడు 'అన్నా!' అని, ఇంకోడు 'తాతా!' అని, నాలుగోవాడు 'మామా!' అని, ఇలా వరసలతో పిలిచారు.

ులు తారు. పెగ్‌మీద పెగ్గు వేస్తున్నకొద్దీ ఎన్నెన్నో దానాలు, వాగ్దానాలు, అపురూప సంఘటనలు కళ్ళెదుట వెలుగుతాయి. లక్షల మొహిరీలు క్షణంలో మాయమవుతాయి. అదే సారా దుకాణం!

లోపల్నుంచి ఒక్కొక్క పెద్దమనిషే బయటికి వస్తున్నాడు. హారాన్‌ వచ్చాడు. రాగానే మంచంపట్టిన మాధవుడూ, వాడు ఆపిల్‌ఫ్రండు కావాలనడం గుర్తుకొచ్చింది. జేబులో చెయ్యి పెట్టాడు. ఏముంది? వాడి బొంద!— నాలుగు డబ్బులూ, గంజాయి గొట్టమూ!

ఆ డబ్బులతో గంజాయి కొనుక్కు తాగి, తూలుతూ ఓ పూరిల్లు చేరుకున్నాడు. "ఓ కాత్యాయినీ!" అని పిలిచాడు.

చాలా సేపటికి "ఎవరూ?" అని బదులు.

"నేనే, నేనే!"

"వంట్లో బాగోలేదు, కడుపునొప్పి, లేవలేను!"

లోపలికి దూరాడు, హారాన్‌. తలుపు బంధించి కాత్యాయినివేపు చూసి, "ఓ, ఓ, కడుపులో నొప్పా? నాకు తెలవదే?"

"అందరికీ తెలుసుగాని, నీకెలా తెలుస్తుంది? నేనెలా ఛస్తే నీకేం? ఇంత రాత్రప్పుడు వచ్చావేం?"

ఓ చిన్నపనుంది. ముందు ఈ చిలుములో పుగాకు నింపు." ఆమె కోపంగా "నువ్వే నింపుకు తాగు. నన్ను విసిగించకు. నే నిద్దరోవాలి కాస్సేపు..." అన్నది. హారాన్‌, ఆమె పక్కనే మంచంమీద కూర్చుని ఒక్క రెండు రూపాయలివ్వు, అర్జెంటు!"

ఎన్నివిధాల అడిగినా ఆమె లేదంది.

"నీ దగ్గిర లేవంటే నమ్మను. తిండికి గింజల్లేక అందరం ఛస్తులుంటున్నాం. జబ్బుతోవున్న నా కొడుకుని తలుచుకుంటే గుండె పగిలిపోతూంది. నన్ను రక్షించాలి, తప్పదు." దమ్మిడీ కూడా లేదనేసింది. బండ బూతులు తిట్టింది.

"నీ ప్రియుడి కీమాత్రం ఉపకారం చెయ్యలేవూ?" అనడిగాడు.

"ప్రియుడట, ప్రేమట! మూడు నెల్లాయె దమ్మిడీ ఇచ్చిన పాపాన పోలేదు. ప్రేమించాలా నిన్ను? పోపో!— అర్ధరాత్రప్పుడు గొడవ చెయ్యక... నువ్వేదో పెద్దమనిషివనుకున్నాను. నీకు మర్యాదేమిటి? మరెప్పుడూ నా దగ్గిరకు రాకు. రావొద్దు, తెలుసా?" అని ఖచ్చితంగా చెప్పింది కాత్యాయిని.



"అంత ఇష్టంలేకుంటే రాన్లే, కోప్పడకు. నీకోసం నే దొంగనయాను, జైలుకెళ్లాను, నవుకిరీ పోగొట్టుకున్నాను. నీకోసం నా పెళ్ళాం బిడ్డల్ని వొదులుకున్నాను చివరికి నువ్విలా..." అట్టే ఆగి, మాట పూర్తి కాకుండానే "ఇప్పుడే కళ్లు తెరిచా!" నన్నాడు.

మండిపడింది కాత్యాయిని: "ఆ భగవంతుడు నీ కంటిపొరలు ఎప్పుడు విడగొడతాడా అని చూస్తున్నా; మే ,నీచ జాతివాళ్ళమే.' అయినా ముందు మీ

ఎన్నాం బిడ్డలూ, ఇళ్ళూ వాకిళ్ళూ, ఆ తరవాతే మేమన్న సంగతి నాకు తెలుసు! నే నెప్పుడూ నీ మంచినే కోరుతున్నాగాని, చెడుగు కోరటంలేదు. ఇహ ఇక్కడికి రాకి. సారా కొట్టులోకి దూరక, ఇంటికి పో. పిల్లా జెల్లా చూసుకో! యజమాని దయ సంపాదించుకుని మళ్లీ నవుకిరీలో అమరుకో. రేపనేది ఒకహ టుందని గుర్తుంచుకుని, పిల్ల పాపలకోసం ఇంత వెనకేసుకో! తరవాత, మనసుంటే ఎప్పుడయినా ఇక్కడికి రా!" అంటూ లేచి, పెట్టిలోంచి పది రూపాయిల నోటు తీసి "ఇది తీసుకువెళ్ళు" అన్నది.

"వొద్దులే."

కాత్యాయిని నవ్వి, అతడి గెడ్డం పట్టుకుని, "ఇది తీసుకెళ్లు. లేకుంటే రేపు మీరంతా ఉపవాసమే!" "ఇంట్లో ఏమీ లేదని నీకెలా తెలుసు?"

"నాకంతా తెలుసులే. నేను స్వయంగా మీ ఇంటికెళ్ళి, సంగతి అంతా కనుక్కున్నా."

"నువ్వెందుకని కనుక్కోవలసి వచ్చిందీ?"

ఎందుకా?— "మగాళ్ళతో సంబంధమున్న ఆడవాళ్ళకు వాళ్ళ స్థితిగతులు తెలుసుకోవాలనుంటుంది. నలుగురూ నాలుగు విధాలా చెప్పుకునే మాటలు వినిపించుకోకుండా ఉండటం మా చేతకాదు! స్త్రీలకున్నపాటి ఇంగితజ్ఞానం కూడా లేని మూఢులు మగవాళ్ళే. పెళ్లాముంది, బిడ్డలున్నారు, బంధువులూ స్నేహితులూ వున్నారు, ఎన్నో మోసాలు చేసికూడా మరిచిపోయినట్టు నటిస్తావే! మాకంటావా? ఎవళ్లూ లేరు, ఒకసారి పడిపోతే ఇహ లేవలేము! ఆకలితో చస్తున్నా ఎవరూ కనిపించరు. నీతులు మాత్రం బోధిస్తారు. అందుకని ఇవన్నీ చూస్తూ, వింటూ కూచుంటే మేం బతగ్గలమా?

"నే చెప్పేదంతా వింటున్నారా? ఈ నోటు మీ భార్య చేతికివ్వండి, రెండు రోజులయినా ఇంట్లో హాయిగా గడుస్తుంది. ఇది మాత్రం మీ దగ్గిరుంచుకోవద్దు, తెలిసిందా?"

"ఆఁ—"

"చాలా పొద్దుయిపోంది గానీ, ఇహ ఎక్కడికీ వెళ్ళక, ఈ రాత్రి కిక్కడే పడుకోండి!" అని హితవు చెప్పింది, కాత్యాయిని.

౧

సదానంద చక్రవర్తి హాలాద్‌పూర్‌వాడు. అతన్ని 'సదాన్నయ్యా !' అని పిలుస్తారు కొంతమంది. మరికొంతమంది అతడు పిచ్చివాడంటారు. మ్లేచ్ఛభాష అయిన ఇంగ్లీషు చదివిస్తే ధర్మం నశిస్తుందని, తండ్రి అతడికి ఇంగ్లీషు చెప్పించలేదు. ఇంతకూ, హాయిగా పది పన్నెండెకరాల పొలముంది. అంచేత చదువెందుకు, నవుకిరీ ఎందుకు? ఇప్పుడూ అప్పుడూ అనకుండా బజార్లలోనూ, పొలాల్లోనూ పాడుకుంటూ తిరుగుతాడు సదానందుడు. ఇది చూసే అందరూ అతన్ని పిచ్చివాడనటం!

అందరూ సదానందుడికీ ఆత్మీయులే. ఎవరింటికెళ్లాలన్నా అతడికి అభ్యంతరం లేదు. తండ్రి బోలెడంత డబ్బు ఖర్చుపెట్టి పెళ్లిచేశాడు. కాని ఏడాది తిరక్కముందే ఆ అమ్మాయి చచ్చిపోయింది. డబ్బు ఖర్చు ఇష్టంలేక మ పెళ్ళి చేసుకోలేదు. ఇప్పటి కారేళ్లనుంచీ సదానందుడిది ఒంటరి జీవితమే.

*　　*　　*

మబ్బు కమ్మింది. గొప్ప వర్షం కురిసే సూచన లగపడుతున్నాయి అత్త రాసమణి, "ఓ లలనా !— ఇంటో ఒక్క చుక్కయినా నీళ్లు లేవు. గబుక్కున పోయి ఓ బిందెడు నీళ్ళు పట్రా" అని చెప్పింది.

బిందె చంకనపెట్టుకుని రేవు కెళ్లింది లలన. తిరిగి ఇంటి కొస్తుంటే వాన పట్టుకుంది. దారిలోనే సదానందుడి ఇల్లు. వసారాలో కూచుని పాడుకుంటున్న సదానందుడు లలనను పలకరించాడు. నించోగానే "వొద్దులే, ఇంటి కెళ్లిపో!" అన్నాడు.

లలన రెండడుగులు వేసి మళ్లీ ముందుకువచ్చి నించుంది. "మళ్లీ వచ్చావేం?" అడిగాడు సదానందుడు. "నాకు జ్వరమొస్తోంది, తడిస్తే ఇంకా ఎక్కువవుతుంది." "అయితే వెళ్లకు. ఇక్కడే వుండు" అన్నాడు.

సదానందుడు పాట ఆపివేశాడు.

"ఆపావేం ?" అనడిగితే, "ఇహ పాడను. తరువాతి చరణం గుర్తులే" దన్నాడు.

పనికిమాలిన ప్రసంగాలు ఎన్నో చేశాడు.

కాస్సేపయాక "లలనా! శారద మీ ఇంటికొస్తుంటాదా?" అనడిగాడు. ముఖం తిప్పేసుకుంది లలన.

"ఏం ?"  "తెలవదు."

సదానందుడు పాట మొదలెట్టాడు. పాట ఆగింది కాని, వర్షం ఆగలేదు. బింకె ఎత్తుకుని లలన పోబోతోంది. "ఎక్కడికి కెళ్తున్నా?" వని అడిగాడు.

"ఇంటికి."

"వర్షంలో వెళితే జ్వరం ఎక్కువవదూ?"

"ఏం చేసేది ?"

లలన వెళ్లింది. మళ్లీ పాట ఆరంభించాడు సదానందుడు.

భార్యచేతిలో ఒక్కమాటుగా పదిరూపాయలు పెట్టాడు, హారాన్ చంద్రుడు.

ఆమె పైకి నవ్వలేకపోయింది. "ఈ డబ్బెక్కడిదీ?"

"నేనేం దొంగతనం చేశాననుకున్నావా, సుభద్రా?"

ఎన్నో విషయాలు మనస్సులో మెదిలి, ఆమె కుంగిపోయింది. అన్నం నీళ్లూ లేకపోతే చావొచ్చు గాని, దొంగసొమ్మంటే మనస్కరించదు. కాని ప్రాణానికి మించిన పిల్లా పిల్లవాళ్లూ జ్ఞాపకం రాగానే, ఇహ తర్కించడం మంచిది కాదని, ఆ సొమ్ము పెట్టెలో పదిలపరిచింది.

సుఖంగానే గడిచిపోతూంది. కాని హారాన్ మట్టుకు ఎక్కువగా ఇంటిపట్టున కనిపించటంలే. ఓనాడు ఇంటికి రాగానే రాసమణి అడిగింది : "పగలంతా ఎక్కడుంటున్నావురా అబ్బాయ్!"

"ఎక్కడేమిటి, ఎన్నో పనుల్లో తిరుగుతున్నా. నవుకిరికోసం దేవుల్లాడుతున్నా" అనేవాడు. మునుపటిలా "దేపిస్తా, మాపిస్తా—నాలుగణాలుంటే యివ్వు" అనడగటం లేదు. అంచేత భర్తమాటలు నిజమేననుకుంది సుభద్ర.

తిండితిప్పలు లేకుండా పగలంతా కాళ్ళరిగేట్టు నవుకిరీకోసం తిరిగేవాడు, హారాన్. ఎంత తిరిగినా లాభంలేకపోయింది.

లోగడ అతడిచ్చిన పదిరూపాయిలూ ఇహ రెండుమూడు రోజులకి సరిపోతుంది. అంతే. ఈమాట మనస్సులోనే ఇముడ్చుకు మధనపడేదిగాని, వెల్లడించలేదు. మూడురోజులయాక రాత్రిపూట, అలసివచ్చిన భర్త పాదాలొత్తుతూ, "డబ్బంతా అయిపోయింది, ఇంకేంలేదు" అన్నది, నోరువిప్పి. హారాన్ కళ్ల




మూసుకుని, ఏమంత పట్టించుకోకుండానే అలక్ష్యంగా "ఆఁ– పదిరూపాయిల భాగ్యం, ఎన్నాళ్ళకొస్తుంది మరీ " అన్నాడు.

"రేపటి మాటేమిటి?" అని అడుగుదా మనుకుందామె. కాని ఏదో అపరాధం చేస్తున్నట్టు అనిపించి, మాటాడక ఊరుకుంది.

మర్నాడుదయమే హారాన్ వెళ్ళిపోయాడు. రోజూలాగే లలన పనిలో మునిగింది. రాసమణి పూజలో కూర్చుంది. సుభద మాత్రం అటూ ఇటూ తిరుగుతూ వుంది.

"అమ్మా, ఇంకా స్నానానికెళ్ళవేం?" అనడిగితే, "ఇదిగో వెళతా" నంది. మళ్లీ వచ్చి చూసేప్పటికి అలా నించునేవుంది. ఇంకోమాటు వచ్చి చూస్తే అక్కడే కూచునివుంది. కళ్ళనీళ్ళు పెట్టుకుని "ఇవాళ యేమీ లేదు!" అంది. "ఈ పూట వంటకి ఒక్క బియ్యపుగింజయినా లేదు!"

ఒక్కసారి నీ బిందు అత్తయ్య దగ్గిరకెళ్ళిరా తల్లీ, ఏమైనా ఇస్తుందేమో!" అంటూ, మళ్లీ కన్నీళ్లు రాల్చింది. లలన వెళ్ళాక, సుభదకు కడుపు దేవినట్టయింది. చెంపకు చెయిపెట్టుకుని కూచుంటే, పొద్దు రెండుఝాములు తిరిగింది.

అంతలో రెండోపిల్ల చలనామయి వచ్చి, "అమ్మా, ఆకలే! అన్నంపెట్టే!" అనడిగింది.

మాటాడలే సుభద. మళ్ళీ అడిగింది, చలన. ఏమనుకుందో యేమో, వంటింట్లోకి పోయి చూసొచ్చి, "ఇంకా నిప్పు రాజెయ్యలేదేమే?" అంది.

"చేస్తానమ్మా, తొందరగానే చేస్తా" నంది తల్లి.

"అలా వున్నావేమే అమ్మా?" అని చలన అడిగేటంతలో మంచంమీదవున్న మాధవుడు "అమ్మా!" అని కేకేసినట్టయింది. గాభరాతో లేచింది, సుభద.

చలన కూడా లేచింది. "నువు కూర్చో అమ్మా! నే వెళతా! తమ్ముడి దగ్గిరకి!" అన్నది.

*　　　*　　　*

ఇంటినించి బయల్దేరిన లలన భవతరణ గంగోపాధ్యాయుడి ఇంటికి వెళ్ళింది. బిందు అక్కడ లేదు. ఏదో అర్జంటుగా రాత్రికి రాత్రి అత్తారింటికి వెళ్ళిందట. లేకపోతే సుభదని కలుసుకునేదే.

ముఖం వేలవేసుకుని బయటికి వచ్చేసింది. ఇంటికి పోదామంటే కాళ్ళాడవు. చాలాసేపు ఓ చెట్టుకింద నించుని, యోచన చేసింది. తిన్నగా గంగానదివేపు నడక సాగించింది.

ఆ దగ్గిర్లోనే సదానందుడి ఇల్లు. గది బయట అతగాడు ఓ పిట్టని పట్టుకుని, పేర్లుపెట్టి పిలుస్తున్నాడు.

"లలనా! నువ్వేనా?'' అన్నాడు.

"అత్త ఇంటోవుందా?"

"లేదు. ఇప్పుడే ఎక్కడికో వెళ్ళింది. ఏమన్నా పనుందా అత్తతో?"

"అవును."

"ఆవిడ ఇంటో లేదు, నాతో చెప్పకూడదూ?"

ఈ ప్రశ్నకు లలన సిగ్గుపడింది నిజం చెప్పడం మంచిదికాదు ఒక్కరోజు అన్నం లేకపోతే గడవదా యేం? మరి పిల్లల మాట? ఈ సమస్యే లోగడ సుభదకూ ఎదురయింది. ఏమైనా, లలన నోరు విప్పి ఏమీ చెప్పలేకపోయింది. ఆమె మనస్సు కనిపెట్టి, సదానందుడు నవ్వుతూ ఆమె చెయి పట్టుకున్నాడు. అతను పిచ్చివాడు! ఎవరూ చెయలేని పని అమాంతంగా చేసెయగలడు!

"సదానందన్నయ్య పిచ్చివాడు. పిచ్చివాడి దగ్గిర నీకు సిగ్గెందుకూ?" అనడిగాడు.



లలన ముఖం వంచుకుని కన్నీళ్ళతో, బొంగురు గొంతుతో "ఒక్క రూపాయి కావాలి, ఇస్తావా?" అన్నది.

"ఒక్, ఈ కాస్తమాటేనా అన్నయ్యకు చెప్పలేకపోయ్యావ్? అయినా, రూపాయేం జేస్తావ్?"

"నాన్నారింటో లేరు."

సదానందుడు ఇంటోంచి తెచ్చి అయిదు రూపాయిలు లలన చేతిలోపెట్టాడు: "పిచ్చివాడిముందు సిగ్గుపడతారా ఎవరైనా? ఎప్పుడైనా అవసరముంటే, ముందుగానే వచ్చి ఈ పిచ్చివాడితో చెప్పు. ఏం, చెబుతావా?" అన్నాడు.

"ఇన్ని రూపాయలే!" అన్నది లలన.

"ఉంచుదూ, అవే పనికొస్తాయ్!"

"అయినా ఇన్ని రూపాయిలు మాకవసరం లేదు." అని, ఇచ్చేయటానికి తిరిగివస్తూంది.

సదానందుడు మళ్లీ చెయిపట్టుకుని, "ఛ! చిన్నపిల్లల చేష్టలు చెయకు. దివ సరం లేకపోతే మరోనాడు తెచ్చివ్వు. ఈ సంగతి ఎవళ్ళకు చెప్పకుమా. ఒహ వేళ చెబుదామనుంటే, పిచ్చిసదానందన్నయ్య దమ్మిడీలనుకుని రూపాయి లిచ్చే శాడు! అని చెప్పు."

వచ్చిమంచినీళ్ళయినా ముట్టలేదు. రాసమణి ఎన్నో చెప్పింది. లలన బతిమ లాడింది. ఊహుఁ— తినలేదు.

చీకటి పడుతూండగా — చింపిరి జుట్టుతో, మోకాళ్ళదాకా మట్టికొట్టుకుని కొంపకి చేరాడు హారాన్. అతని కండువా చెంగున రెండుశేర్ల బియ్యం, రెండో అంచున పప్పూ, ఉప్పూ, ఉల్లిగడ్డలూ, ఏమిటేమిటో మూటకట్టి వున్నాయి. ఒక కుండ తెచ్చి, అన్నీ విప్పి అందులో పోశాడు.

సుఖద ఏడ్చింది. అందులో అన్ని రకాల బియ్యాలూ కలగలుపుగావున్నాయ్. కుటుంబ పోషణకోసం ఇవన్నీ ముష్టెత్తి తెచ్చాడని సుఖద ఇట్టె గ్రహించింది.

# 8

మాధవుడు అడిగాడు : "పెద్దక్కాయ్! ఇహ నాకు బాగవదా ?" తమ్ముడి తల నిమురుతూ అన్నది : "ఎందుకని బాగవదూ? రెండురోజుల్లో నయ మయిపోతుంది" అంటూ బుజ్జగించింది, లలన.

"నయం కాకపోతే?"

"ఛ !—అలాంటి మాటలనకూడదు. చూడు, తమ్ముడూ!—ఇదుగో, ఒక్క చెంచాడు మందు తాగమ్మా !"

"తాగను" అని చెప్పి మందు ఒలకబోశాడు.

"నా మాట వినవూ?"

"ఎవరూ నా మాట వినటంలే. నేను మట్టు కెందుకు వినాలి;"

"నీ మాట ఎవరు విన్లేదురా తమ్ముడూ?"

"నీక్కోపం, నేనేదన్నా అంటే అమ్మకి కోపం, నాన్నకి కోపం,— అత్త మాటాడనే మాటాడదు..." అని చెబుతూంటే వాడికి కళ్ళనీళ్ళు తిరిగాయి.

మాధవుడు ఆమె ముఖంలోకి చూశాడు, కొంచెంసేపు: "అక్కాయ్ ? మన చిన్నతమ్ముడు మధు జబ్బుపడి తేరుకోలేదుగా, చచ్చిపొయ్యాడుగా ? అప్పుడు నాన్న ఏడ్చాడు, అమ్మ ఏడ్చింది, అత్త ఏడ్చింది, నువ్వేడ్చావు, అందరూ ఏడ్చారు. అయినా, వాడు తిరిగి రాలేదుగా...నేనూ వాడిలా చచ్చిపోతేనో...?"

రెండుచేతులతో ముఖం కప్పుకుంది లలన.

"చెప్పక్కా, చచ్చిపోతే యేమవుతుందో ?"



ఏడుస్తూనే చెప్పింది : "ఏమీకాదు, అందరూ ఏడుస్తారు, అంతే!"

"అక్కా! చచ్చిపొయ్యాక ఎక్కడికెళ్తామే?" అనడిగాడు.

"అక్కడికి......ఆకాశంలోకి."

"అక్కడ నేనెవరి దగ్గిరుండటం, మరి?"

"నాదగ్గిర."

మాధవుడు సంతోషించాడు, నవ్వుతూ అడిగాడు : "అక్కడ మన కిల్లుంటుందా? మనమిద్దరం హాయిగావుందాం కదూ? మనకి మంచి భోజనం, ఆపిల్ పళ్లూ దొరుకుతాయికదూ?"—అన్నింటికీ అవునంది లలన.

"అమ్మకూడా మనతో వస్తుందా?" అని మళ్లీ అడిగాడు.

"ఇంకొన్నాళ్ళు పోయాక."

"అయితే మనం ముందే వెళదాం! అమ్మని అడగనా?"

"వొద్దు. అడిగావంటే అమ్మ రానేరాదు, నన్నూ రానివ్వదు, తెలుసా?"

"అలా అయితే అడగన్లే. నువు నాకు మందిచ్చి అన్నానికి వెళ్లు. నేను మందుతాగి పడుకుంటా."

యి తన, కంబళి కప్పుకుని మాధవుడు స్తిమితంగా పడుకున్నాడు. తనూ, తన అక్కా వెళ్ళబోయే "ఆకాశాన్ని" గురించి సరదా అయిన కలలు కంటూ వుంటే నిద్రపట్టేసింది.

ఆ రాత్రి తల్లీ, చెల్లీ, రాసమణీ ఎవరు పిలిచినా "తలనొప్పిగా వుంది, లేవలేను, నన్నెవరూ పిలవకండి!" అని చెప్పి, తలుపు తియ్యలేదు లలన.

మర్నాటినించీ మాధవుడి స్థితిలో మార్పు కనిపించింది. ఇప్పుడు మొండిపట్టు పట్టటంలే. ఏమన్నా తింటావా, అని అడిగితే సరి, "తే" అంటున్నాడు. పెద్దక్క వచ్చి కూచుంటే, ఇద్దరూ ఏమిటేమిటో మంతనాలున్నూ ఎవరైనా వస్తున్న అలికిడయితే గప్‌చిప్—అంతే!—

ప్రస్తుతం హారాన్ గృహకృత్యం సుఖంగానే సాగిపోతూంది. అవసరమొస్తే లలన ఒకటీ రెండు రూపాయిలు సర్దుతూవుండేది. ఈ డబ్బెక్కడిదో సుభదకు తెలుసు!— ఇదంతా హారాన్ ఎక్కణ్ణించైనా తెస్తున్నాడు కాబోలు ననుకునేది రాసమణి.

* * *

కొన్నాళ్ళ తరవాత—

సదానందుడి అత్త అతడి వెనకాలే సణగటం ప్రారంభించింది : "నాయనా, సదా : ఈ ఘటంకాస్తా ఎప్పుడు రాలిపోతుందో తెలియదాయె. ఈ గుక్కెడు ప్రాణం పోకముందే నన్నోసారి కాశీయాత్ర చేయించు బాబూ! ఆ విశ్వేశ్వరుణ్ని దర్శించుకు మరీ ఛస్తాను!" అని ఈ ధోరణితో.

అత్తమాట తీసెయ్యలేదు, సదానందుడు. మరి రెండు రోజుల్లోనే ప్రయాణానికి ముహూర్తం. ఇహ బయల్దేరుతా మనగా ఆ సాయంకాలం పైకి వెళ్ళి, "లలనా, లలనా!" అంటూ పిలిచాడు. లలన లేచి వెంచుంది.

ఒక గుడ్డమూట విప్పి, అందులోవున్న యాభై రూపాయిలూ ఆమె కిస్తూ : "మేం కాశీ వెళ్తున్నాం. మళ్లీ ఎప్పుడు తిరిగివస్తామో తెలీదు. అవసరమొస్తే ఈ డబ్బు ఖర్చుపెట్టుకో!" అని చెప్పాడు.

"ఇన్ని రూపాయలే?" అని ఆశ్చర్యపోయింది. "ఎన్నిరూపాయలేం? చూడటానికి పెద్దగా కనిపిస్తోంది గాని, ఖర్చుపెట్టేప్పుడు ఏమంత ఎక్కువ కాదులే!" అన్నాడు.

అంటూ కిందికి దిగివచ్చి, వంటచేస్తున్న సుభద దగ్గరికి వెళ్ళి "పిన్నీ! ఇవాళ మేం కాశీ వెళుతున్నాం!" అన్నాడు.

"మళ్లీ ఎప్పుడు రావటం?"

"ఎలా చెప్పేది? అత్తయ్య కాశీ అంతా చూశాకగానీ రానంటుంది."

"సరే నాయనా! జాగ్రత్తగా వెళ్ళిరండి!"

నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు సదానందుడు.

*　　　*　　　*

రెండవనాడు లలిన సగంసొమ్ము దగ్గరుంచుకుని, తక్కింది తల్లికిస్తూ చెప్పింది: "అమ్మా! సదాన్నయ్య కాశీకి వెళుతూ ఇదిచ్చి వెళ్ళాడే!"

కళ్ళింత చేసుకు చూసి ఆ సొమ్ము లెక్కపెట్టింది సుభద. కూతురువేపు చూస్తూ: "అమ్మా! లలనా! సదానంద పూర్వజన్మలో మనకి దగ్గిర బంధు వేమోనే! లేకపోతే ఇంతడబ్బు ఎవరిస్తారేం ఊరికినే! వాడు పిచ్చివాడేనా?"

"కష్టాల్లో ఆదరించే వాళ్ళంతా పిచ్చివాళ్ళేనా, అమ్మా?"

ఇప్పుడు హారాన్‌ముఖర్జీ కుటుంబస్థితి అనుకూలంగానే వుంటూంది, కూటికీ గుడ్డకీ లోటులేకుండా. అందుకని, లోకులు రకరకాలుగా చర్చలకు దిగారు: నందిబాబుని లూఠీచేసి, పెద్దవాడయాడని వాదు ప్రచారమైంది.

ఇలా ఉండగా, ఒకనాడు హఠాత్తుగా కృష్ణప్రియ వాళ్ళింటికి వచ్చి, కుశల ప్రశ్నలు వేసి, గుచ్చిగుచ్చి యోగక్షేమాలన్నీ కనుక్కుంది!

ఏంచేస్తాడు? నవుకిరీకోసం తెగ తిరుగుతున్నాడని చెప్పింది, సుభద. "ఆ బ్రాహ్మణ పాడుముండాకోడుకే దీనికంతికీ కారణం. వాణ్ని చంపినా పాపం లేదు" అంటూ, కృష్ణప్రియ, ఊళ్లోవ్యాపించిన పుకార్లన్నీ పేరుపేరు వరసలుగా చెప్పింది. "దేవుడు లేడూ? బ్రాహ్మణ్ని నాశనం చేసి, నీలాంటి పతివ్రత కంటనీళ్ళు తెప్పించిన ఆ దుర్మార్గుణ్ని భగవంతుడు దండించడనుకున్నావా? అలానే చూస్తూవుండు, నామాట అవునో కాదో తెలుస్తుంది."

"అక్కాయ్! బిందు అంత హఠాత్తుగా ఎందుకెళ్ళినట్టూ అత్తారింటికీ?" అనడిగింది.

"మామగారికి సంధి పుట్టిందిట, రాత్రికి రాత్రే. సరేగాని ఈ సంసారం ఎలా ఈదుకొస్తున్నావో నువ్వు. ఇదే ధ్యాస నాకు!"

"ఎలా యేమిటక్కాయ్! దేవుడెలా రాసిపెడ్తే అలా నడుస్తుంది."

పెద్ద నిట్టూర్పుతో అన్నది కృష్ణప్రియ: "అవునే! మనచేతిలో ఏముంది గనకా? దానికేంగాని, మీ చిన్నపిల్ల సంగతి గుర్తొస్తే నా కెలాగో వుంటుంది... మెల్లిగా పెద్దదవుతూంది...తొందరగా పెళ్ళి చేసెయ్యాలి, లేకుంటే నలుగురూ

నాలుగు విధాలా అనుకుంటారు. ఇంతకీ ఆ విషయ మేమన్నా ఆలోచించావా?"
అనడిగింది.

సుభద ముఖం అదోలా అయిపోయింది. నిట్టూర్పు విడుస్తున్న సమయంలో లలన వచ్చిందక్కడికి. చలనను గురించి వాళ్ళనుకునే మాటలు ఆమె చెవుల్లో దూరాయ్! మంచిరోజులే కానీ, చెడరోజులే రానీ హిందూ కుటుంబాల్లో ఆడ పిల్లల్ని పెళ్ళిచెయ్యకుండా వుంచటం జరగదు.

# 9

ప్పిండి ఆరబోసినట్టు మంచి పండువెన్నెల. అర్ధరాత్రి, ఎవరికోసమో నిరీక్షిస్తున్నట్టుగా శారదాచరణుడు చాలా సేపట్నుంచి గంగానదిఒడ్డు చెట్టునీడల్లో కూచునివున్నాడు.

అతనిది హోలాద్‌పురం. శ్రీమంతుడైన రామమోహనబాబు కొడుకు. చదువూ తెలివితేటలమాట అటుంచి, తండ్రి ఆస్తి అంతా తనే చక్కబెట్టుకుంటున్నాడు.

శారదాచరణుడికి తల్లి లేదు. ఆమె బతికున్నప్పుడు హోరాన్ ముఖర్జీకీ వీళ్ళకీ స్నేహం; ఆమెకూ రాసమణికీ కూడా మంచిస్నేహం. కాని ఆమె చని పోయాక వారిమధ్యని రాకపోకలూ లేవు, సంబంధమూ పోయింది. పేదవాళ్ళతో సంబంధం కలుపుకోవటం రామమోహనబాబు కిష్టంలేదు.

చిన్నప్పటినించీ లలన శారదాచరణుణ్ని ప్రేమించింది. తరవాత ఆమెకి పెళ్ళయింది. ఆ రోజుల్లో హరాన్ స్థితి అంత పరవాలేదు అంచేత, ఉంటున్న ఆ చిన్న ఇంటోనే కూతురిపెళ్ళి గొప్పగా చేశాడు. కాని, దురదృష్టవశాత్తు రెండేళ్ళకే లలన భర్త పోవటం, పిల్ల పుట్టింటికి చేరుకోవడం జరిగింది. అయినా, అప్పట్నించికూడా లలన శారదాచరణుణ్ని ప్రేమిస్తూనేవుంది. ఆ ప్రేమకు మచ్చలేదు, పైగా వృద్ధిపొందింది. దానివల్ల ఇద్దరి అవస్థలూ వికటించాయి. కనుక ఆ ప్రేమ సుఖంగా పరిణమించేట్టు లేదని తెలిసిపోయింది.

ఈ సంగతి అతను తెలుసుకోలేక పోయాడుగాని, లలన ఇట్టే గ్రహించింది. ప్రేమ అనే దుకాణపు తలుపులు ఒక్కొక్కటే మెలిమెల్లిగా మూస్తూవచ్చింది. ఇప్పుడామె అతని దగ్గరికి వెళ్ళటం లేదు. అతన్ని రమ్మనటంలేదు. తన ప్రేమ వెల్లడించడంలేదు. మునుపటిలా రహస్యలేఖలు రాయదు.




శారద కలవరపడ్డాడు. ఎంతకూ లలనకు నచ్చజెప్పలేకపోయాడు. 'ఇదంతా మంచిది కాదుసుమా' అని లలన చెప్పింది.

"మంచిది కాకపోతే ఇన్ని రోజుల్నించీ ఎందుకని చేశావ్?" అని అడిగాడు కోపంతో.

"ఇన్నాళ్ళూ తెలియనిదాన్ని. ఇప్పుడు పెద్దదాన్నయ్యాను. బాగుండదు. ఇహముందు నాకీ చెడ్డ సలహాలు చెప్పకండి!" అన్నది లలన.

"సరే, ఇవాళే అవన్నీ పోయేట్టు చేస్తాలే"

"మంచిదే!"

"ఈ జన్మలో ఇహ నీతో మాటాడను."

"మానెయ్!"

ఇలా చెకాపికీ మనుకుని ఎవరి దోవన వారు వెళ్ళిపోయారు. ఇది జరిగి నాలుగేళ్ళయింది.

[illegible] మళ్ళీ ఇప్పుడు, [illegible]
లలనకోసం కనిపెట్టుకూర్చున్నాడు.

వెనక జరిగిన సంగతి మరిచిపోయాడు. అయినా, లలన ఇక్కడికి రమ్మని కబురంపింది. అందుకని లోగడ సంగతులన్నీ మళ్ళీ ఒక్కమాటు గుర్తు కొచ్చాయి.

రాత్రి ఒంటిగంట. అతడి దగ్గరికొచ్చింది ఒకమూర్తి! లలనే!! ఎంత పెద్దదిగా మారిపోయిందీ! "కూర్చో!" అన్నాడు. ఒకరికొకరు మళ్ళీ ఎదురుగా మెట్ల మీద కూచున్నారు. చాలా సేపు మౌనంగానే వున్నారు.

"ఎందుకు రమ్మని కబురుచేశావ్?"

"పనుంది.

మళ్ళీ నిశ్శబ్దం.

"చెప్పవేం?"

"లోగడ మీరు నన్ను ప్రేమించారుకదూ? ఇప్పుడూ ప్రేమిస్తున్నారా?"

"ప్రేమిస్తున్నానని అంటే?"

"నన్ను పెళ్ళిచేసుకుంటారా?"

"ఉహుం—"

"ఎందుకని?"

"నిన్ను పెళ్ళిచేసుకుంటే నా జాతీ గౌరవమూ మంట కలుస్తాయి. కలిస్తే బతుకులేదు. పైగా మా నాన్నగారు ఒప్పుకోరు."

"మీకు మనసుంటే తప్పకుండా ఒప్పుకుంటారు. ఒక్కగానొక్క కొడుకు మాట తీసేస్తారా?"

"మా నాన్నగారు ఒప్పుకున్నా నేను చేసుకోలేను. చేసుకుంటే మా జాతీ మర్యాదా పోతాయి. ఆ రెండూ పోయాక, మేమీ హాలాద్‌పూరులో ఉండలేము. పోనీ నీతో వేరింటికాపరం పెడదామంటే తగినంత డబ్బులేదు. అయిందేదో అయింది. గతాన్ని గురించి తవ్వుకోవడం మంచిదికాదు. దీనివల్ల మనకు చాలా మేలుంది."

"అవును, మంచిదే. అయినా, ఈ పనికిమాలినదానికి ఓ చిన్న ఉపకారం చేసారా?

"చేతనయితే!"

"చేతనయ్యేదే. కాని, చేస్తారో లేదో!



"శక్తివంచన లేకుండా చేస్తాం, ఏమిటో చెప్పు."

"నా చెల్లెలు చలనని పెళ్ళి చేసుకోండి!"

శారదాచరణ్ నవ్వుతూ, "ఏం, తగిన వరుడు దొరకలేదా?" అనడిగాడు.

"ఎక్కడ దొరుకుతాడు! మేమూ పేదవాళ్ళం. పైగా కులీనులం. తక్కువ కులంలో అయితే గబుక్కున దొరుకుతాడు. అయితే, కులానికి తిలోదకాలివ్వాల్సి వస్తుంది. ఈ దీనురాలిమాట తోసెయ్యకండి, మా చెల్లాయిని పెళ్లాడండి, మమ్మల్ని రక్షించండి చేసుకుంటారా, చెప్పండి!" అంటూ ఆత్రంగా బతిమలాడింది

"నేను పూర్తిగా నాన్నగారి చేతుల్లో వున్నాను. నాకింకా స్వాతంత్ర్యం రాలేదు. వారి కిష్టంలేనిపని చెయ్యలేను."

అయితే వారిని ఇష్టపరిచే చేసుకోండి!" అన్నది లలన.

"ఆయన వప్పుకోరు. నాకు బాగా తెలుసు. చెబుతున్నా విను. నాన్న వట్టి లోభి. నా పెళ్ళిచేసి కొంత డబ్బు సంపాయిద్దామని చూస్తున్నాడు... అందుకనే ఈ పెళ్ళి కాదు..."

"చెప్పే విధంగా చెప్పండి. మీ మాట తప్పక వింటారు."

"అయితే ఎలా? అసలీ పెళ్ళి చేసుకోవటానికి మీకే ఇష్టంలేదనుకుంటానే?"

"అదేంకాదు."

"చలనలాంటి పిల్ల మీకు కావాలంటే దొరకదు. అందం చందం, బుద్ధి తెలివి, అన్నీ పన్లూ చేతనవు. చేసుకుంటే ఒక బీద కుటుంబానికి ఉపకారం చేసిన వారవుతారు. పాటి బ్రాహ్మణ కులాన్ని రక్షించిన వారవుతారు ఇంతకంటే నేనేం చెప్పేది? మీమేలు జన్మ జన్మలకూ మరవను. చేసుకోరూ?"

"నాన్నగారేం చెప్తే అది చేస్తా."

"ఇహ నా జీవితంలో మరో సమయం దొరకదు. నా అన్ని సంగతులూ విప్పి చెప్పేస్తున్నా. మీ దగ్గిర సిగ్గుపడను. మిమ్మల్ని ఎప్పుడూ ప్రేమిస్తూనే వుంటిని. ఈ సంగతి ఎన్నోసార్లు మీకు చెప్పా. ఇప్పుడు చివరిసారిగా మళ్లీ ఒక్కమాటు చెబుతున్నా. ఇంతకూ జరగవలసిందేదో జరిగేపోయింది. ఉత్తనే మిమ్మల్ని కష్టపెట్టా. నన్ను క్షమించండి!"

అంటూ వెళ్ళబోతున్న లలనను చూసి "ఈ సంగతి నాన్నారితో తప్పకుండా చెబుతానులే!" అన్నాడు శారదా చరణుడు, మనస్సులోనే కొంచెం కష్టపడి.

ఆతనివేపు చూడకుండానే "చెప్పండి!" అన్నది లలన

"అయినా నేను నాన్నగారి చెప్పుచేతల్లో వాణ్ని" అన్నాడు శారదాచరణుడు.

"తెలుసు, ఆ సంగతి నాకు తెలుసు!" నన్నది లలన, వెళుతూ వెళుతూ.

"నే చేయగలిగిందేమన్నా వుంటే తప్పకుండా కబురు చేస్తానుగా!"

"సరే"

"నన్ను క్షమించాలి లలనా!"

"క్షమించాను."

# 10

ఆ రాత్రంతా గడిచేప్పటికి, ఆటలో గెలుచుకున్న డబ్బుతో హారాన్ కండువా కొంగునిండి బరువెక్కింది. రెండో రోజుకూడా ఇంకా ఆడి సాయంత్రం నాలుగ్గంటలకి మెల్లిగా కొంప చేరుకున్నాడు, గంజాయి కంపుతో.

భోంచేసేటప్పుడు "ఇంత ఆలస్యమయిందేం?" అని భార్య అడిగితే, ఏం చెయ్యను, పనికోసం తిరుగుతున్నా" నని బొంకాడు.

హుషారుతో నవ్వుతూ చెప్పాడు: "నా కండువా కొంగుని ఎనిమిది రూపాయి లున్నాయి. అందులో అయిదు రూపాయిలు తీసుకో!" "ఇంత డబ్బెక్కడిది?" అనడిగింది సుభద. "మనకి లోటేమిటీ? తలలో మెదడు వుంటే ఎక్కడ పడితే అక్కడే డబ్బు!!" అన్నాడు.

* * *

రెండు నెలల తరవాత ఒకనాడు—

"లలనా! ఈపూట కేమైనావుందా?" అడిగింది తల్లి.

"ఏం లేదమ్మా!"

"అలా అంటూనే ఎప్పటి కప్పుడు పావలా అర్థా సర్దుతూనే వున్నావు. అలానే ఏమైనా వుందేమో చూడమ్మా. లేదంటే మనంఎరం వస్తే!" నిజంగానే లలన దగ్గిర ఏమీలేదు. సదానందు డిచ్చిన యాభై రూపాయిలూ ఇవాళ పొద్దు టితో సరిపోయినై. అమ్మ అడిగినందుకు ఇప్పుడేమీ ఇవ్వలేకపోతినే. ఏమను కుంటుందో అని లలన ఏడ్చింది.

లలన మనసు కష్టపెట్టానే అని సుభద ఏడ్చింది. ఇప్పుడు పొద్దున్నే ఎవరింటి కెళ్ళడం ముష్టికి? లలనకు దుఃఖం ఆగలేదు.

బిందూలేదు, ఊళ్ళో సదానందా లేడు. రెండు రోజులాయె తండ్రి ఇంటి మొహం చూడకపోయె! ఏ నల్లమందు కొట్లో పడివున్నాడో; ఏ గంజాయి కొట్టులో దేవుల్లాడుతున్నాడో, హేరాన్‌కు పట్టిన దుర్గుణమేమిటంటే— ఎక్కడ పుడితే అక్కడల్లా బాకీలు చెయ్యడం. దీనివల్లనే మొదట్లో 'హేలాద్‌పూర్' లోనూ, తరవాత బ్రాహ్మణ ఫాడ్‌లోనూ ఉండడం కష్టమే అయింది.

మొత్తంమీద ఇంటికెళితే తిండికి గడిచిపోయేది. ఇంటో ఎవరికి లేకపోయినా అతనికి మాత్రం దొరుకుతుంది. పైగా సుభద చేతిలో ఎప్పుడూ ఏదో కొంత వుంటుందని ఒక నమ్మకం.

ఆనాడు అతగాడింటికి రావటం చాలా రాత్రయింది. మామూల్లాగా భార్య తనకోసం ఇవాళ ఎదురుచూళ్లేదు. ఓ మూలని ఓ దీపం మినుకు మినుకు మంటూంది. వత్తి ఎగసంతోదామని దగ్గిరికెళితే, లాంపులో చమురులేదు. ఇది చూసి ఏదో ఆలోచనతో మెల్లిగా కూర్చున్నాడు. ఏమాలోచించాడో ఏమో, తెల్లారగట్టే తెగిపోయిన చెప్పులు చేతపట్టుకు బయటికి వచ్చాడు.

అంత పొద్దున్నే ఇవాళ ఎందుకనో లేచి, చలనాహయి మెట్లమీద కూర్చుని వుంది.

"ఎప్పుడొచ్చావ్ నాన్నా?" అనడిగింది గట్టిగా.

"రాత్రి..." బిడియపడుతూ చెప్పాడు హారాన్.

"నీకేం మతుందా లేదా నాన్నా?" నిన్నను అమ్మ, అత్త, అక్క అందరూ పస్తు. ఇవాళ మేమంతా ఏం తినాలో చెప్పు. చెప్పులట్టుకు మెల్లిగా జారుకుంటున్నావే?" అనడిగింది.

"నిజమేనా చలనా?" అనడిగాడు చేతిలో చెప్పులు వాటంతటవే జారిపడినై.

"అత్తాయ్, ఓ అత్తాయ్! నాన్న మాటలు విన్నావా? నే నబద్ధం చెబుతున్నానట..."

ఇహ నిలవలేక హారాన్ చెప్పులట్టుకు పారిపోయాడు. "అరె అరె! నాన్న పరుగెత్తుకు పోతున్నాడే!" అంటూ గోలచేసింది చలన.

ఇంతలో లలన వచ్చింది. "చలనా! నీకేమైనా బుద్ధుందా పోయిందా? ఎవరి దగ్గిర ఎలా మాటాడాలో తెలియదేమే. ఇన్నేళ్ళొచ్చీ? ఛ-ఛ! నాన్నని అలా అనొచ్చా?"— అంటూ మందలించింది.

"ఎందు కనగూడదేం? ఇలాటి వాళ్ళని తప్పకుండా అనాలి. నల్లమందూ గంజాయీ తిని. బిడ్డల్ని పోషించకుండా దిక్కులేవి వాడిలా ఏ తండ్రి పారిపోతాడు? నే తప్పకుండా అంటాను. అస్తమాను అంటూనే వుంటాను."

కోపమొచ్చింది లలనకి. "ఇక్కణ్ణుంచి వెళ్ళిపో, చలనా!"

"నే నెందుకు పోవాలీ? నువ్వే వెళ్ళు. నువు నాకేం చెప్పక్కర్లే!"

మాటాడక అక్కణ్ణుంచి వెళిపోయింది లలన.

## 11

"ఇంత పొద్దుపోయింది. ఇహ వొచ్చేదేమిటి? ఈ బిందె తాకట్టు పెట్టి ఏమైనా పట్రా. వెళ్ళు!" అని సుఖద రాసమణికి చెప్పింది.

"సిగ్గుగా వుంటుందమ్మా" అంది రాసమణి.

అక్కడే వున్న లలన "నే వెళ్లొస్తాలేవే అమ్మా, హరిపాలఘోష్ కొట్టుకి." అంటూ ఆ బిందె తను తీసుకుంది.

"నువ్వే వెళతావా?"

"ఏం, నేనే వెళతా. నన్నీ పల్లెలో అందరూ ఎరుగుదురు. నాకేం సిగ్గు? మంచి రోజులూ చెడు రోజులూ ఎవరింటో లేవు?"




"అయితే నేనే వెళతాలే!" అంటూ రాసమణి బింకె లాక్కుని తనే బయల్దేరింది.

అందరూ అన్నాలు తిన్నారు. తల్లి ఒక మూలకి తీసికెళ్ళి, "లలనా! ఎవరికీ తెలీకుండా కాసిన్ని బచ్చలాకులు తీసుకురా అమ్మా!" అని చెప్పింది. ఎందుకోసమని ఎంత అడిగినా "పనుంది" అంటుంది గాని అసలు సంగతి తల్లి బదులు చెప్పలేదు.

"నా దగ్గిర దాచకే అమ్మా!" అంటూ లలనతల్లి కాళ్ళమీద పదాలకి వంగింది. ఆమె చేతులు రెండూ పట్టుకుని, సుభద కూతురి ముఖంమీద పడుతున్న కురులు చెవుల పక్కకి ఒత్తిగించి సరిజేస్తూ అన్నది: "ఒక మనిషికి చాలీ చాలకుండా వుందే తల్లీ అన్నం. ఒహవేళ వారువస్తే?"

"అయితే బచ్చలాకులు తినివుంటావా?"

"తినకూడనివి కావుగా? అయినా, నువ్వే చెప్పావుకదే అమ్మా, కష్ట సుఖాలు ఏయింటో లేవూ అని?" అంటూంటే కన్నీళ్ళు రాలాయి.

ఏడుస్తూ వెళిపోయింది లలన.

* * *

ఇహ పొద్దుపోతుందనగా, బ్రాహ్మణపాడ్‌లో ఒక చిల్లర కొట్టుదగ్గిర నించున్నాడు హారాన్. పొద్దుట్నించీ అక్కడక్కడా అడుక్కు తెచ్చుకున్న బియ్యం మూట చంకని తగిలించుకుని వున్నాడు.

"ఏం కావాలండీ?" దుకాణదా రడిగాడు.

"ఏమీ వొద్దు"

"మరిక్కడెందుకు నించోవడం?"

అక్కడ ఏదో కొనుక్కుంటున్న ఆసామీ "అడుక్కునేవాడు కాబోలు!" అన్నాడు.

"పోపో, ఇక్కడేం దొరకదు. వేళగాని వేళ ముష్టేమిటి?" అని కసిరి కొట్టాడు దుకాణంవాడు. హారాన్ కొంచెం దూరం వెళ్ళి, మళ్లీ వచ్చి అక్కడే నించున్నాడు.

"మళ్లీ వచ్చావేం?"

"బియ్యం కొంటావా?"

"ఎలా? ఏవి చూపించు."

"ఛ!— అడుక్కు తెచ్చుకున్న బియ్యం లాగున్నాయ్? ఎన్ని రకాలో! సరే, ఎంత?"—

"రెండణాలు."

"అబ్బో, రెండణాలు కావాలా, ఈ ముష్టి కాసిని గింజలకీ?"

"ఓ అర్ధణా ఇస్తా, కావాలంటే ఆ డబ్బాలో పొయ్యి."

"సరే, ఏంచేస్తాం మరి!" ఆ అర్ధణా తీసుకుని బియ్యం పోసేశాడు హారాన్. వస్తూ దారిలో పెద్దగా నవ్వాడు— "పిచ్చివాడు! బలే టోకరా కొట్టించా" ననుకుంటూ, చీకటి పడుతుండగా నల్లమందు కొట్టులో దూరాడు.

## 12

"నే నిహ ఉండలేను, లలనా!" కూతుర్ని పట్టుకునేడ్చింది, సుభద్ర. మూడు రోజులు వరసగా ఉపవాసంచేసి, మరి తట్టుకోలేక ఈమాట అన్నది. సుభద్ర ఏడుపు చూస్తే రాళ్ళుకూడా కరుగుతాయి. లలన ఓదార్పు పని చెయ్యలేదు. చాలా రాత్రిదాకా తల్లీ కూతుళ్ళు ఏడుస్తూ ఏడుస్తూ అక్కడలానే నిద్రపోయారు.




సగం రాత్రప్పుడు— గబుక్కున కూతుర్ని లేపింది సుభద: "వారేమై పోయారే?" అనడిగింది కంగారుతో.

"ఎవరే అమ్మా?"

"ఆయనిప్పుడు లేరే! కల వచ్చింది"

"అమ్మా! ఇలా అయిపోతున్నావేమిటే?" అంటూ తల్లిని పట్టుకుని ఏడ్చింది.

* * *

ఉదయం పదిగంటలకి కృష్ణప్రియ స్నానంచేసుకు వస్తూ, దారిలో హారాన్ ఇంటికి వచ్చి "ఏం అక్కాయ్, కూర్చో!" అన్నది.

హారాన్ సంగతి ఏమయినా తెలిసిందేమోనని భోగట్టా. "బ్రాహ్మణఫాడ్‌కు ఎవరినయినా పంపలేకపోయావా?" అని సలహా. "చేతులో ఏమైనావుందా లేదా. లేకపోతే ఎలా జరుగుబాటు?" అని ఒక కుశలప్రశ్న. పిల్లవాడి కెలావుందని యోగక్షేమం కనుక్కోవడం. "లలనను నా ఇంటికి పంపు" మన్నది, కృష్ణ ప్రియ. యీ మాట కూతురితో చెప్పింది సుభద.

లలన కృష్ణప్రియ ఇంటి కెళ్ళివచ్చి, తల్లిచేతిలో రెండు రూపాయిలు పెట్టి "అమ్మా! అత్తయ్యిచ్చిందే! నాన్న ఇంటికి రాగానే కబురు చెయ్యమని కూడా చెప్పింది" అన్నది.

ఆ రోజున తులసెమ్మకు మొక్కింది. తిండికి కావలసిన దినుసులు తెమ్మని డబ్బిచ్చి తను గంగాస్నానానికి వెళ్ళింది.

బాగా చీకటిపడింది. ముఖం దాచుకుంటూ హారాన్ ఇంటికి చేరాడు. గుడ్డలు తెగమాసి వున్నాయి. అన్నీ చినుగులే. అతడిలో మార్పేమీలేదు.

అనుకున్నట్టుగానే లలన కృష్ణప్రియ దగ్గిరకెళ్ళి, "నాన్నారు రాత్రి వచ్చా"రని చెప్పింది.

"సరి, బాగా వున్నాడా?"

"ఆః''

"ఇన్నాళ్ళూ ఎక్కడున్నట్టూః"

"తెలవదు"

"మరి, అమ్మ అడగలేదా?"

"లేదు."

"పోనీ, మీ అత్తా అడగలేదా?"

"నాన్నకీ ఆవిడకీ మాటల్లేవు."

పన్నెండు గంటలకి కృష్ణప్రియ అరటాకు మూతవేసుకుని ఓ రాచ్చిప్పతో కూర తెచ్చి, హారాన్‌కు వెయ్యమంది. రాచ్చిప్ప అందుకుని, పక్క గదివేపు చూపించింది సుభద. "అదిగో, ఆ గదిలో వున్నారు."

''ఇప్పుడు కాదులే. పనుంది, పోవాలి. ఇన్నాళ్ళుగా హారాన్ ఎక్కడున్నాడో ఆ సంగతి ఒక్కమాటడుగు, సుభదాః'' అన్నది.

''సరే," అని చెప్పింది. ఆనాడు భోంచేస్తుండగా అడిగింది సుభద. అందుకు ముఖం దించి, ''చెట్లనీడల్లో...'' అంటూ జవాబు చెప్పాడు హారాన్.

రెండోనాడు కృష్ణప్రియ వచ్చి మళ్ళీ యీ మాట తర్కించింది సుభదను. భర్త ఏమన్నాడో చెప్పింది సుభద. ఆ మాటా యీ మాటా అయాక కృష్ణప్రియ ఒడిలోంచి ఓ తాను తీసిచ్చి, "ఇది హారాన్‌కు కుట్టించు. ఇంటో వడివుంటే తెచ్చానులే." అని అంటూ, "ఎవరిచ్చారని అడిగితే, కొంపదీసి నాపేరు చెప్పేవు సుమాః చెప్పావంటే, నా తల పగలగొట్టినంత వొట్టూః" అని చెప్పి హెచ్చరించింది.



మళ్లీ రోజులు నెమ్మదిగానే గడుస్తున్నాయ్. ఇల్లుచేరిన హారాన్ మళ్లీ వెళ్ళిపోలేదు. అంచేత సుభద కిప్పుడు కాస్త భయం, విచారం తగ్గింది. కాని, రోజువారి జరుగుబాటు ఎలా అనేదే ఆమెకు పట్టుకున్న సమస్య.

కనికరించి ఎవళ్ళన్నా ఓ రూపాయిస్తే, ఇంకొకరు రెండు రూపాయయిలిస్తే, ఇప్పుడు కుటుంబపు ఖర్చు సాగుతున్నది. మాధవుడి శరీరస్థితి మరీఅధ్వాన్నంగా తయారైంది. ఒంటి రక్తం సగం అప్పుడే నీరుగా మారిపోయింది.

వీటన్నిటికంటే, చలన బరువు ఇప్పుడెక్కువుగా నెత్తిమీద వుంది. పిల్ల బాగా ఎదిగి, పెళ్లీడుకి వచ్చేసింది. ఇన్ని సమస్యల మధ్యని సుభదకు ఏదారీ తెన్నూ తోచలే.

# 13

ఏకాదశి. ఇంటిపనులన్నీ అయాక లలన మాధవుడి దగ్గిరవచ్చి కూర్చుంది.

"అక్కాయ్, అదేమయింది? అక్కడికెళ్ళే విషయం?" అంటూ, లేనిశక్తి తెచ్చిపెట్టు కూర్చున్నాడు. మార్చి మార్చి లక్షరకాల ప్రశ్నలు వేశాడు. అన్నింటికీ ఓరిమితో వాడి మనస్సుకి నచ్చేట్టు జవాబు లిచ్చింది. చివరికి — తను ముందుగా వెళతాననీ, తన కోసం తమ్ముణ్ణి ఏడవ్వొద్దనీ వొప్పించింది.

అక్క కళ్ళవెంట బాష్పాలు రాలటం మాధవుడు గమనించలే. ఆమె వాడి తల నిమురుతూ, "నే వెళ్లాక యీ గొడవంతా అమ్మతో చెప్పకేం?" అన్నది.

"ఉహుఁ — చెప్పన్లే," అని మాట యిచ్చాడు.

కేపించకూ. వేళకి మందు తాగూ.

తెలిసిందా ?'

'ఆ...!'

''మధూ!— సదాన్నయ్యని మరిచిపోలేదుగా?'' అనడిగింది.

''లేదు. ఎందుకు మరిచిపోతానూ?''

''ఒహవేళ ఆయనెప్పుడైనా వస్తే... నిన్ను చూసేందుకు... అక్కయ్య వెళ్ళిపోయిందీ అని మాత్రం చెప్పు. ఆ మాట కూడా, ఎవరూ లేకుండా చూసి మరీ చెప్పాలిసుమా!''

''సరేలే!''

అప్పుడే వచ్చింది సుభద. ''పొద్దుపోయింది, పోయి పడుకో తల్లీ?'' అని చెప్పింది లలనతో.

''అమ్మా, అక్కాయ్‌ని నాదగ్గిర పడుకోమనవే'' అన్నాడు మాధవుడు. ''సరే, నువ్విక్కడే పడుకోవే లలనా, నేను చలన దగ్గిర పడుకుంటా'' నంటూ పైకి వెళిపోయింది. అక్కాతమ్ముళ్ళ మధ్యని ఎన్నెన్నో ఊసులు నడిచాయి. తరవాత మాధవుడూ నిద్దరోయాడు.

మర్నాడుదయాన లలన ఎవరికీ కనబడలేదు. రోజూ పొద్దుటే లేచి పని చేసుకునేది, కనబడక పోయేప్పటికి ''అక్కయ్యేదిరా, మాధవా?'' అనడిగింది సుభద. చలననూ అడిగింది. ఏవరూ తెలియదనే చెప్పారు.

ఇంటిపని సుభదే చేసుకుం దివాళ. మధ్యాన్నమయినా లలన జాడలేదు! వీధివీధీ వెతకబోయింది చలన. రాసమణి తిరిగితిరిగి వచ్చి ''కనిపించ లేదమ్మా, మీ యింటికేమయినా వచ్చిందా?'' అనడిగింది.

''ఈ వూళ్లోనే లేదమ్మా!'' అన్నది, చలన.

బాగా రాత్రి అవుతూందిగాని, లలన రాలే. హారాన్ ఈ మాటు ఇల్లు వదిలి బయటికి పోలేదుగా? ''అసలది ఎక్కడికి వెళ్ళిందో! అదే...అదే... ఏం పాలుపోవడంలేదు'' అన్నాడు. సుభదా, రాసమణీ, చలనా అంతా రాగాలు మొదలెట్టారు. ఒక్క మాధవుడు మాత్రం వీళ్ళతో కలియలేదు. వీళ్ళ ఏడుపులూ, గాబరాలూ చూసి నిజం చెప్పేద్దామా అనుకున్నాడు. కాని, అక్కకు ఇచ్చిన మాట గుర్తుకొచ్చింది. అందుకనే మాటాడక ఊరుకున్నాడు.




రాత్రింపగళ్లు వరసగా గడిచిపోతున్నాయి. లలన రాలేదు. ఈ వార్త చుట్టు పక్కల గ్రామాల్లో వ్యాపించింది. అందరూ దుఃఖించారు కొంతమంది సుభదకు ధైర్యం చెబుదామని వచ్చారు. ఇలా అయిదారు రోజులు గడిచిపోయినై.

సుభద మాధవుడి ముందుకూడా ఏడ్చింది. కాని పసివాడికి కష్టమనిపించలే. అసలు సంగతి వాడు వెల్లడించనూలేదు. అయితే, ఇంతమంది ఇలా కంగారు పడుతుంటే మాధవుడు ఒక్కమాటయినా అక్కని గురించి అడగడేం? మారాం చెయ్యడేం? ఈ గొడవ వాడికే మాత్రమూ తెలిసుంటుందేమోనని కూడా అనుమానం కలిగిందామెకు. కాని నోరువిప్పి అడగలేకపోయింది.

ఆరు రోజులయాక ___

వాళ్ళింటి పక్కనేవున్న 'నందు' అనే బెస్తవాడు గంగానదికి చేపల వేటకి వెళ్లాడు. వలవేసినపుడు ఎర్రంచు చీర ఒకటి సగం నీళ్ళలో మునిగివుంది. సగం బయటికి కనబడుతోంది. లలన కట్టుకునే చీరె అదేనని వాడికి బాగా తెలుసు.

పెడుతూ ఆ చీర ఇంటికి తెచ్చిందామె.

సుభద, హారాన్, చలన, ఆ వీధివాళ్ళంతా చూశారు. ఆ చీర లలనదే! చీరంచు లలనే స్వయంగా చేత్తో కుట్టుకుంది. ఓ పక్కని ఆమె పేరుకూడావుంది. ఇంకేం కావాలి రుజువు!

సుభద చాపకట్టుగా మూర్ఛపడిపోయింది! హారాన్ పెద్దకూతురు లలన గంగలో పడి చచ్చిందనే వార్త ఊరంతటా వాయువేగంతో వ్యాపించింది.

# 14

శ్రీమాన్ సురేంద్రనాథ్ చౌదరిగారు నారాయణపురపు జమీందారు. వయసు పాతిక లోపు. కాని బలే రాబడి. రాబడిని బట్టె జీవిత వైభోగమున్ను. ఆ చిన్నప్రాయంలోనే ఆయనగారికున్న వ్యసనాలు అన్నీ ఇన్నీ కావు. అమ్మాయిలను కుదిర్చే ఆంతరంగికులే బోలెడంత మంది!

చౌదరిగారికి ఆరోగ్యం చెడింది. డాక్టర్లవల్ల నయంకాలేదు. గనుక గాలి మార్పు కావాలని ఒక నమ్మకం కలిగింది. ప్రాణస్నేహితు లందరినీ సలహా చేశాడు. అందరూ "భేష్ భేష్! గొప్ప సంగతి" అంటూ తలలూపారు.

సమస్తమైన సరంజామాతోనూ ప్రయాణానికి ఓడ సిద్ధమయింది. ఆంత రంగికులూ బాజా భజంత్రీలతో ఓ చక్కనయిన గాయకీ పరివారమూ జమీం దారుకి మద్దతు. పల్లెవాళ్ళు దేవుణ్ని తలచుకుని, ఓడ లంగరెత్తి నారాయణ నదిలో వొదిలారు.

గాలి అనుకూలంగా వుంది. ఓడ రాజహంసలా ఈదుతోంది. ఆయనకి సరదా పుట్టిన చోటల్లా లంగరు దించేవారు. ఎన్నెన్నో ప్రదేశాలు చూశారు. షికార్లు చేశారు. కలకత్తా రేవు ఆయన కంతగా నచ్చలేదు! ఓడ ఉత్తర దిశకు తిప్పమన్నారు.

అదే పనిగా ఇన్నాళ్ళు ప్రయాణం చేసేప్పటికి ఓడలో స్నేహితు లంద రికీ విసుగెత్తి, భార్యా బిడ్డల్ని చూసుకోవాలని భ్రమపుట్టింది. "తమకు ఒళ్ళు బాగయింది కనక మేం సెలవు తీసుకుంటాం" అన్నారు. సురేంద్రుడు అడ్డు చెప్పలే. సరే అన్నాడు. ఇప్పుడొక వస్తాదు, నర్తకీ, నవుకరులూ మాత్రమే ఉన్నారు. వీళ్ళతోనే ముందుకు సాగాడు సురేంద్రబాబు.



ఒక సాయంకాలం మేఘాలు విపరీతంగా గుమికూడుతున్నాయి. కప్తానుని పిలిచి "హరిచరణ్! ఇదేమన్నా తుఫాను సూచనా?" అనడిగాడు. అవునన్నట్టు చెప్పగానే, "ముందు లంగరు విసురు!" అన్నాడు. ఓ మంచిచోట దించాడు, కప్తాను.

ఓడ పై అంతస్తుకి వచ్చి కూర్చున్నాడు సురేంద్రుడు. నవుకరు హుక్కా-గొట్టం తెచ్చిపెట్టాడు. బాబుగారు గొట్టం నోట్లో పెట్టుకుని, "వుస్తాద్!" అంటూ పిలచాడు.

"బాబూ!"

"అవతలి ఒడ్డుని ఏదో నల్లగావుంది, లోపలికి దిగుతున్నట్లుంది?" "అవునండి, మనిషి తలపాగా వుంది!" అన్నాడు. "కొంచెం సేపు ఆటాపాటా!" అన్నాడు బాబు. ఒక యువతి వచ్చి తివాచీమీద కూచుంది. "వుస్తాద్ నువ్వెళ్ళు. ఆట వద్దులే. వూరికినే పాట పాడుతుంది!" అన్నాడు. ఆ యువతి పేరు జయావతి. సామాన్యపు దుస్తులు మాత్రం వేసుకునుంది. వంటిమీద వస్తువులేం లేవు. జయ పాట మొదలెట్టింది. కాని, సురేంద్రుడి దృష్టి ఎంత సేపూ అవతలి ఒడ్డునున్న ఆ నల్లటి వస్తువువేపే వుంది.

'జయా! - అది అటూ యిటూ కదుల్తూంది కదూ?'

అవునండి. అలానే కనిపిస్తుంది

దుర్భిణీ తెప్పించి చూశాడు. లేచి నుంచున్నాడు. "ఎవరో మనిషిలా వుం"దన్నాడు. ఇంత సేపట్నించి నీళ్ళలో ఏం చేస్తున్నట్టు? చూసి వద్దామని తనే స్వయంగా బయల్దేరాడు ఓడ వెనక కట్టివున్న చిన్న డింగీ తీసుకుని.

చూస్తే,—ఓ అమ్మాయిగొంతు లోతు నీళ్ళలో వుంది! అటు ఇటు చూసి అడిగాడు, సురేంద్రుడు:—

"దగ్గర్లో వూరేదయినా వుందా?"

"లేదనుకుంటా"

"మరెక్కణ్నించి వచ్చావ్ నువ్వు?"

"మీ ఇల్లు ఈ దగ్గర్లోనేనా?"

"ఉహూఁ—చాలా దూరం."

"మరిక్కడి కెలావచ్చావ్?"

"మేం ఎక్కి వచ్చిన నావ మునిగిపోయింది."

"ఎప్పుడు."

"రాత్రి

"తక్కిన వాళ్లెక్కడ?"

"తెలీదు."

"అయితే, ఇంత సేపై నీళ్ళలో ఎందుకు నించున్నావు? దగ్గర్లో ఊరుందేమో చూసుకుందామని ఎందుకు దేవుల్లాడలేదూ?

"మీ వూరెంతదూరం ఇక్కడికి?"

"ఓ పది కోసులుంటుంది."

"ఎటువేపు?"

"అటు" అన్నది, ఓడ వెళ్ళే దిక్కుకి చూపిస్తూ. కొంచెం ఆలోచించాడు సురేంద్రబాబు "నేనూ అటేవెళ్ళేది. ఓడలో ఇంకో అమ్మాయి కూడా వుంది. కావాలంటే మాతో రావచ్చు. మీ ఇంటికి నిన్ను నేనే పంపిస్తా" నని చెప్పాడు.

"వస్తావా?"




"వస్తా"

"అయితే రా."

"నా బట్టలు నీళ్ళలో కొట్టుకుపోయినై"

ఈ మాటనగానే ఇంత సేపట్నించీ ఆమె ఎందుకని అంతలోతు నీళ్ళలో నానుతూవుందో గ్రహించాడు.

"సరే, గుడ్డలుంటే వస్తావా, నాతో?"

"ఆ..." అంటూ తలూపింది.

నావికుడు బట్టలు తెచ్చి ఇచ్చాడు. కొంచెం సేపయాక సురేంద్రుడామెను తీసుకు ఓడలోకి వెళ్ళి, జయావతికి అప్పగించాడు. జయావతి ఆ పిల్లని ఎంతో ఆదరించి, భోజనం పెట్టి, "నీ పేరేమిటి, చెల్లీ?" అనడిగింది.

పేరు మాలతి అనీ, ఇల్లు మహేశపూర్ అనీ, ఆవూరు ఉత్తరపు వేపున పది పన్నెండు కోసులుంటుందనీ చెప్పింది.

"మీ అత్తారి వూరేది?"

"ఏ వూరూ లేదు"

"అదేమిటి చెల్లీ! పెళ్ళి కాలేదా?"

"అయింది... అదంతా ఓకలలే!... నా కవన్నీ సరిగ్గా జ్ఞాపకం కూడా లేదు." అన్నది మాలతి. జయావతి గుచ్చి గుచ్చి వేసిన కుశల ప్రశ్నలకు ఇంకా

ఇలా జవాబులు చెప్పింది— "మా ఇంటో ఎవ్వరూ లేరు. ఒక మేనత్త ఉండేది. ఆమెకూడా ఇప్పుడు లేదనుకుంటా. మేం "సాగర ద్వీపం" వెళుతున్నాం. వెంట ఉన్నవాళ్ళేమయారో తెలవదు."

"మరైతే, ఇప్పు డింటికెళతావా?"

"అదే ఆలోచిస్తూంట"

"పోనీ, నా వెంట వస్తావా?" అనడిగింది జయావతి, నవ్వుతూ

"తీసుకెళ్తే తప్పకుండా వస్తా, నాకు మాత్ర మెవరున్నారూ?"

మాలతిని తీసుకెళ్ళడం జయావతి కిష్టంలేదు. అయినా, సురేంద్రబాబు...

మాలతి ఆమె నడిగింది "మీ వూరెక్కడ?"

"నారాయణపురం."

"ఎక్కడి కెళుతున్నారు?"

"ఎక్కడికని చెప్పను? హాయిగా తిరుగుదామంటే బాబుగారి ఆరోగ్యం సరి లేకపోయె. అందుకనే ఈ ప్రయాణం," అన్నది జయావతి. ఇంకా ఏమేమో మాటాడుకున్నారు చాలా సేపు! ఇద్దరికీ నిద్దరట్టేసింది.

# 15

సురేంద్ర బాబుకి ఆ రాత్రి సరిగా నిద్ర పట్టలేదు. అందుకని పెందలాడే లేచి, హుక్కా గొట్టం తీసుకుని ఓడ పైఅంతస్థుమీద కూర్చున్నాడు. గాలి అనుకూలంగా వుంది. నావికులు లంగరెత్తి ఓడ నడుపుతున్నారు.

కాస్సేపయాక జయావతిని పిలిచి, "ఆమెను గురించి భోగట్టా చేశావా ఏమైనా?" అనడిగాడు. అందుకు జయావతి "ఏదో కొంచెం" అంటూ ఈ వివరాలు చెప్పింది— వూరు మహేశపురం ఇక్కడికి పది కోసులుంటుందిట, ఉత్తరంగా! తండ్రి పేరు అడగలేదు. భర్త లేరట! అత్తారి వూరు చెప్పలే. పేరు "మాలతి."

అభ్యంతరం లేకపోతే ఆమెను తన గదిలోకి రమ్మనమనీ, ఆమె సంగతి తనే స్వయంగా కనుక్కుంటాననీ అన్నాడు. సురేంద్రుడు గదిలోకి వెళ్లాడు. కింద పరిచివున్న తివాసీమీద మాలతి తలవంచు కూర్చుని వున్నది. పక్కనే నించున్న జయావతి సురేంద్రబాబు రాగానే బయటకు వెళిపోయింది.

సురేంద్రుడు కుర్చీలో కూచుని, మాలతిని చూశాడు చాలా సపు. ఇంత అందాన్నిచ్చాడు. కాని ఈ విధంగా విధవను చేశాడేమా అని అనుకున్నాడు.

"మీ నాన్నగారి పేరేమిటి?"

"హారాన్ చంద్రముఖోపాధ్యాయులు"

సాగర ద్వీపం వెడుతూంటే నావ దారిలో మునిగిపోయిందని చెప్పింది. మామగారి వూరు కాలీపాడు, కాని అక్కడెవర్నీ గుర్తించలే నంది. పెళ్ళయాక అత్తారింటికి ఒక్కసారి మాత్రమే వెళ్లానన్నది.

ఆలోచించి అడిగాడు సురేంద్రుడు— "నీకు పుట్టింటా ఎవరూ లేరు, అత్తింటా లేరు. మరెక్కడికెళ్తావ్?"

"కలకత్తా"

అక్కడా ఎవరూ లేరుట. "ఎవరి ఇల్లన్నా వెతుక్కుంటా" నంది. ఎందుకని అంటే జవాబు లేదు. "వంటపని తెలుసా?" కలకత్తాలో వంటపని చేదామనా?" అనడిగాడు. "అవు" నంది. కలకత్తాలో కాకుండా మరెక్కడయినా అలాటి పని దొరికితే చేస్తావా?" అనడిగాడు. "చెయ్య"నన్నది.

"తెలీని వాళ్ళకి కలకత్తా పెద్దవూరు. నీ ఇష్టమే కానీ, కాని చాలా జాగ్రత్తగా వుండు. మరో విషయం— నా పేరు సురేంద్రనాథ్ చౌదరి. ఏదయినా కష్టం కలిగితే, నా ఉపకారం కావలిస్తే నారాయణపురానికి నాకు కబురంపు. లేకపోతే తిన్నగా అక్కడికి వచ్చేసెయ్!"

తల వంచుకుని అలానే కూచుంది. మాలతి.

"ఓ పక్షం రోజుల్లో మేం తిరిగి కలకత్తా వేపు వెళతాం. అందాకా ఇక్కడే వుండు."

సురేంద్రుడు వెళ్లాక మాలతి తన చోటికివచ్చి ఏడుస్తూ కూచుంది. సురేంద్రబాబు మాటలకి ఆమె నొచ్చుకున్నది. ఆ ఏడుపుకి ఇంకా బోలెడు కారణాలున్నాయి.

ఆమె మర్యాద కాపాడి, ఓడలో జాగా ఇచ్చాడు సురేంద్రబాబు. ముందు ముందు ఎన్నో ఉపకారాలు చేస్తానని మాట కూడా ఇచ్చాడు: అయితే తను ఎవరి కోసమని వంట చేసుకునేందుకు కలకత్తా వెళుతున్నది? కన్నతల్లీ, పుస్తీగావున్న తమ్ముడూ, దిక్కూ మొక్కూలేని ఆ పరివారాన్ని వదిలేసి, తన పొట్ట నింపుకునేందుకే వచ్చిందా?



వంటపని అడ్డుపెట్టుకుని డబ్బు సంపాయిద్దామని వుద్దేశం. సంపాదించే విధం కూడా ఆమెకి తెలిసింది. మాలతి మంచి అందకత్తె! కలకత్తా వంటి పెద్దబస్తీలో తన అందాన్ని సులువుగా అమ్ముకోవచ్చు. బోలెడంత సంపాయించవచ్చు. కొద్దికాలంలో ధనవంతురాలు కావచ్చు. ఇన్నాళ్లూ జీవితం కష్టంతో గడిపినా, ఇహ సుఖపడవచ్చు!

రెండవరోజు—

ఓడ 'హోలాద్‌పురం' కిందుగా వెళుతూంది. మాలతి కిటికీ తెరిచి, తిన్నగా ఒడ్డువేపు చూస్తూంది. ఒడ్డున ఎవరూ లేరు. మాలతి ఆశ తీరలేదు. పల్లెకు చాలా దూరంలో నడుస్తున్నది ఓడ. అంచేత మాలతి కిటికీ మూసి, వెక్కెక్కి ఏడ్చింది.

జయావతి దగ్గిరకొచ్చి కూచుంది. నావ మునిగి తన వాళ్ళందరూ చచ్చిపోయారని జ్ఞాపకమొచ్చి మాలతి ఏడుస్తున్న దనుకుంది.

"ఎందుకు చెల్లీ ఏడుస్తున్నావ్? వాళ్ళకి కాలం తీరిపోయింది. అందుకనే గంగాభవాని వాళ్ళని లాక్కుపోయింది. ఏంచేస్తాం!" అంటూ ఓదార్చింది.

మాలతికంటె వయసులో పెద్దది జయావతి. కనుక ఆమెను చెల్లెలుగా చూసుకుంటూ వుంది.

ఇప్పుడు మాలతి కలకత్తాలో దిగిపోతుందనే కబురు తెలియగానే ఇద్దరి మధ్యనీ స్నేహం ఇంకా ఎక్కువయింది. మాలతి లేచి కూచోగానే జయావతి ఆ మాటా ఈ మాటా చెప్పి, దుఃఖం మరిపిద్దామని ఇంకా చూస్తూ కూచుంది.

# 16

"కాశ్యాం తు మరణా న్ముక్తిః" అని కదా హిందువుల విశ్వాసం! అందుకని సదానందుడి అత్త కాశీకివెళ్ళి మరి తిరిగిరాలేదు. అదృష్టవంతురాలు. ఆమె భౌతిక శరీరాన్ని గంగలో కలిపి, శివ సాయుజ్యం ప్రాప్తింపజేసి అతగాడు ఒక్కడూ హోలాద్‌పురం వచ్చేశాడు.

ఇల్లు చేరుకునేప్పటికి అర్ధరాత్రి. స్వయంపాకం చేసుకు తిన్నాడు. హోరాన్‌బాబింటికి వెళ్ళి క్షేమ సమాచారాలు కనుక్కుందామనుకున్నాడు కాని, ఇంత రాత్రప్పుడు కూడదనుకుని, పడుకున్నాడు. అక్కడ అత్తగారి సేవ చేస్తున్నా వీళ్ళని మరిచిపోలేదతడు. హోరాన్‌బాబు దుశ్చరిత్రం. సుభద దౌర్భాగ్యం లలన దుఃఖ జీవితం— ఇవే ఆలోచించే వాడెంత సేపూ, కాశీలో కూడా.

మర్నాడు ప్రసాదాలూ అప్పీ పట్టుకు వచ్చాడు, హోరాన్‌బాబింటికి. వసారా ఊడుస్తున్న సుభద బొంగురు గొంతుతో "ఎప్పుడొచ్చావ్ సదా...? అందరూ బావున్నారా?" అని పలకరించింది

అందుకు సద "రాత్రి వచ్చా. అందరూ ఎవరున్నారు, నేనేగా? అత్త కాశీలో స్థానం సంపాదించుకుంది." అని చెప్పాడు. విచారించింది సుభద. చాలా సేపు ఏడ్చి "నాయనా, లలన కూడా లేదు" అన్నది దుఃఖంతో.

"ఎక్కడికెళ్ళింది?" అనడిగాడు ఆత్రంగా. విషయంచెప్పి వెక్కి వెక్కి ఏడ్చింది, సుభద. సదానందుడూ కళ్ళు తుడుచుకుని, "ఏమయినా చెప్పి వెళ్ళిందా?" అనడిగాడు. "ఏంచెప్పలే"దన్నది సుభద.

ఆ తరవాత హోరాన్ తాత భోగట్టాలు తెలుసుకున్నాడు. మాధవుడి ఆరోగ్యస్థితి విన్నాడు. తనే స్వయంపాకం చేసుకుంటున్నాడని తెలిసి, ఇక్కడే తింటూండమని చెప్పింది సుభద. సరేనంటూ "ఇవాళ కాదులే. అత్తగారికి తర్పణం వదలాలి" అని చెప్పి ఇంటి కెళ్ళాడు. పడుకుని లేచేటప్పటికి రాత్రి ఎనిమిదయింది. మంచి పండు వెన్నెల. తిన్నగా బైటికి వచ్చి "శారదా!" అని కేక వేశాడు.

[redacted]
శారదాచరణుడూ సందానందుడూ సమావేశమై, మంచీచెడ్డా ప్రసంగించుకున్నారు

"లలన చనిపోయినట్టు తెలుసా నీకు?" అనడిగాడు సద.

"తెలుసు" నన్నాడు శారద, ఉదాసీనంగా. మరికొన్ని ప్రశ్నలకూ కూడా అదోరకం ధోరణిలో సమాధాన మిచ్చేసరికి సదానందుడు తీక్షణంగా చూస్తూ "నువ్వు వట్టి మూర్ఖుడివి. ఓ మనిషి డబ్బులేక, కష్టాలు భరించలేక, ఆత్మహత్య చేసుకుంటూవుంటే సాయం చెయకుండా చూస్తూ ఊరుకుంటావా? అని కచ్చితంగా ప్రశ్నించాడు చిన్నప్పటి స్నేహాన్నిబట్టీ, చనువుతో,

"సదా, ఎందుకా లాభంలేని మాటలన్నీ? మా నాన్న ఉండగా నే నెవరికీ సాయం జేయలేను. మరచిపోకు. అదీగాక, ఆమె నాతో ఏమీ చెప్పనూలేదు, నన్నడగనూ లేదు."

"ఏం చెప్పలేదు? అస లిటు రానేలేదా?"

"ఓసారి వచ్చింది. ఎప్పుడో నెల రోజుల క్రిందట, పొద్దుపోయాక శివాలయంలోకి నన్ను రమ్మని కబురు చేసింది. ఇష్టం లేకపోయినా వెళ్లా. తనని పెళ్ళిచేసుకోమన్నది.

"మరి నువ్వేమన్నావ్?"

చిన్నప్పటి సంగతులు జ్ఞాపకమొచ్చి శారద చిన్నమొహం చేసుకున్నాడు. నేనేం చెయను సదా, నువ్వేచెప్పు మా నాన్నుండగా..."

"మీ నాయన బతికివుండి సార్థకమేమిటీ?"

శారద క్కోపమొచ్చింది. "ఆయనకేం తెలుసు. లాభనష్టాల సంగతి? ఈ విషయం ఆలోచించేందుకు నా కధికారం లేదు. అయిందేదో అయిపోయింది. నేను పెళ్ళాడనని చెప్పేశా.

"అనగానే ఆమె వెళ్ళిపోయిందా?"

"లేదు. చలననన్నా చేసుకోమని బతిమలాడింది. అంతా నాన్నారి ఇష్టమన్నాను.. ఉన్నమాట చెబుతాను విను, సదా!—నా పెళ్ళికేమైనా డబ్బొస్తుందేమో చూస్తున్నాడు నాన్న. హారాన్ బాబే మివ్వగలడు?"

"మీ నాన్న ఎంత అడిగాడు?"

"చెప్పలేను"

"అడిగినంతా ఇస్తే అభ్యంతరం లేదుకదా? నీ అభ్యంతర మేమయినా వుందా?"




"ఏం లేదు"

"అయితే సరే," నంటూ లేచి వెళ్ళబోయాడు. కాస్సేపు కూచోమంటే పనుందన్నాడు.

"సదా, ఇందులో నా తప్పేం లేదుసుమా!"

"ఆ సంగతి దేవుడికి తెలియాలి."

"కోపమా?"

"లేదు."

సదానందుడు ఇంటికి వచ్చి, గదులన్నింట్లో వరసగా పచార్లు మొదలెట్టాడు. తరవాత తిన్నగా గంగానదికి వెళ్ళాడు. ఆ కెరటాలూ, ధ్వనీ చూస్తూ నించు న్నాడు కొంచెంసేపు. ఆ తరవాత రేవులో చివరి మెట్టుపైన కూచుని, కాళ్ళు నీళ్ళలోకి జాపి, సరదాగా పాటలు ప్రారంభించాడు.

# 17

పుచ్చపువ్వులాంటి వెన్నెల. గంగా ప్రవాహంలో సురేంద్రబాబుగారి ఓడ మెలి మెలిగా ఉత్తరం నించి దక్షిణవేపు సాగిపోతూవుంది.

మాయిటి సుబ్రమ్మణ్యం జయావతి మాటాడుకుంటున్నారు. దిగువ తెరిచిన కిటికీలోంచి మాలతి కెరటాలు చూస్తూ, కన్నీళ్ళు తుడుచుకుంటూంది. ఇది హోలాద్‌పూర్ దాటిపోతుందనగానే, ఆ తీరాన చిటికేసరపుచెట్టు ఆనవాలు కనిపించింది. దాని వెనకనే హోలాద్‌పురం నిశ్శబ్దంగా నిద్రిస్తూంది.

ఆవూరి ఆడవాళ్ళూ మగవాళ్ళూ అందర్నీ ఒకొక్కొక్కళ్ళనే ఆమె మనసులో ఊహించుకుంది. గంగలో స్నానంచేసి గుడ్డలుతకటం కూడా జ్ఞాపకమొచ్చింది!

మాలతి ఇప్పుడు లలన కాదు. అయినా సుభద, మాధవుడు, చలన, హారాన్ ఎవరినీ మరచిపోలేదు. ఆమె హృదయంలో సగభాగం సదానందుడే చోటుచేసుక్కూర్చున్నాడు అతడి పాటలు ఆమె చెవుల్లో గింగురుమంటున్నాయ్!

కొంచెం ముందుకి వెళ్లేసరికి, రేవులో చివరిమెట్టుమీద కూచుని ఎవరో నీళ్ళలో కాళ్ళాడించటం కనిపించింది. అప్పటికి పాటా ఆగిపోయింది. ఈ ఆటా పాటా సదానందుడిదేనని ఆమె గ్రహించింది. ఇలాంటివన్నీ ఆ పిచ్చివాడి పనులే! మాలతి మళ్లీ ఏడుపులో మునిగి, ఒక రాత్రప్పుడు నిద్రపోయింది.

మెలకువ వచ్చేటపట్పికి పొద్దు నెత్తికెక్కింది. ఆమెకి వంట్లో నలత. దాసీది వచ్చి, చెయిపెట్టి చూసి, "మీకు జ్వరం వచ్చిందమ్మా!" అని చెప్పింది.

జయ వచ్చింది. సురేంద్రుడు వచ్చాడు. తన దగ్గరున్న హోమియో మందిచ్చి, జయావతిని ఆమె దగ్గిర కూచోబెట్టి వెళ్ళాడు.

ఇప్పుడు మాలతికి గాలి తగలకుండా కిటికీలన్నీ మూసివున్నాయి. అంచేత స్టీమరు నడుస్తూందో ఆగిందో ఆమెకు తెలియలేదు.

"అక్కాయ్, కలకత్తా ఇంకెంతదూరం?" అనడిగింది.

ఇంకా రెండురోజుల ప్రయాణమని జయ చెప్పింది. స్టీమరు కలకత్తా చేరే నాటికి మాలతి జ్వరం తగ్గిపోయింది. అక్కడి దృశ్యాలన్నీ చూసి, కలకత్తా అంటే ఇదేనా అనుకుంది. ఇదంతా నరకకూపంగా తోచింది. అయితే ఇవాళ గాకపోతే రేపయినా తను ఈ ఆశ్రయాన్ని వదలిపెట్ట దలచుకుందిగా, మరి భయపడి లాభమేమిటీ?

రెండోరోజు మధ్యాహ్నం పట్నం చూడ్డానికి రమ్మని సురేంద్రబాబుని బతిమలాడింది జయావతి. రానంటే రాననేశాడు సురేంద్ర. మాలతిని తీసుకువెళ్తే ఆమెకు సుస్తీ ఎక్కువవుతుందన్నాడు. సరేనని జయ ఒక్కత్తే వెళ్ళింది.

మాలతి గదిలో పడుకుని వుంది. తలుపు తెరుచుకు లోపలికెళ్ళాడు సురేంద్రబాబు.

'నిజంగానే నువ్విక్కడ దిగ

పిల్లవు. గొప్పవారి ఇంటి బిడ్డవు. ఈ వయస్సులో గౌరవ మర్యాదలు కాపాడు కోవటం కష్టం సుమీ! నువ్వొ అమాయకురాలివి. ప్రజలు అడుగడుగునా మోసం చేస్తారు. యుక్తవయస్సులో నువ్వు యమయాతనలు పడాల్సి వుంటుంది. ఆలోచించుకో బాగా!" అంటూ ఎంత చెప్పాలో అంతా నూరిపోశాడు. "ఇదంతా డబ్బుకోసమే కదా?" అనడిగాడు.

మాలతి ఏడ్పు మొదలెట్టింది.

"ఛ—ఛ— ఇంత సౌందర్యవతివి, యువతివి, వెళ్ళేది కలకత్తా! మహాబస్తీ— డబ్బు కురుస్తుంది, చూస్తావుగా?" అంటూ నవ్వాడు సురేంద్రబాబు. మూర్ఛ పడిపోయింది మాలతి. తెలివొచ్చి చూస్తే, తను పక్కమీద వున్నట్టు తెలుసు కుంది. సురేంద్ర ఆమె ముఖంలోకి చూస్తూ కూర్చున్నాడు. ఆమె ముఖం ఎర్రబడింది.

"మాలతీ! రేపొద్దున్నే స్టీమరు ఇక్కణ్నించి బయల్దేరుతుంది. నిన్ను మాత్రం నే వదలిపెట్టను. నువు నా వెంటే రావాలి, నా దగ్గరే ఉండాలి. తెలి సిందా? దేనికోసమని నువ్వు కలకత్తా వెళుతున్నావో, ఆ పని నీ చేతకాదని నే నెరుగుదును. నీకెంత డబ్బు అవసరమో ఎంత డబ్బు కావాలో అదంతా నీకు నేనిస్తా. సరేనా?"

మాలతి కళ్ళు రెండూ నీళ్ళతో నిండినై. ప్రేమతో ఆమెను సురేంద్రుడు కౌగిలిలోకి తీసుకున్నాడు. "మాలతీ! నా వెంట వచ్చెయ్! నేను పెద్ద ధనికుణ్ని కాకపోయినా పేదవాణ్ని మాత్రంకాను. నీ బరువు మోయడం నాకేమంత కష్టం కాదు..." అని ఇంకా దగ్గిరికి తీసుకున్నాడు. కన్నీళ్ళు తుడిచి మాలతిని ముద్దు పెట్టుకుంటూ "ఏం, వస్తావు కదూ?" అనడిగాడు.

మాలతికి ఒళ్ళు పులకించింది. అవయవాలన్నీ కంపించాయి. ఆమె ఇప్పుడు మునుపటి మాలతికాదు, లలనకాదు, ఎవరూ కాదు. ఆమె ఆమే! సురేంద్రుడి హృదయరాణి! సురేంద్రుడి కౌగిలిలో ఆమె కరిగిపోయింది! సంకుచితమైన మాలతి పెదిమలు మళ్లీమళ్లీ నవ్వినయ్. మాటిమాటికీ సురేంద్రుడు వాటిని ముద్దు పెట్టుకుంటూనే వున్నాడు! ఇప్పు డామె స్వర్గసుఖాన్నే అనుభవిస్తూంది!! మాలతీ, నాతో వస్తావా?" అనడిగాడు సురేంద్ర.

"వస్తా"

"అయితే ఇప్పుడే"

"ఏ అక్కాయ్"

"మీ భార్య"

"నా భార్యా? ఎప్పుడో పోయింది."

"జయావతి"...

"మాట పూర్తి కాకుండానే సురేంద్రుడు చెప్పాడు: "జయ నా భార్య కాదు. ఆమెను నే పెళ్ళిచేసుకోలేదు."

"అయితే మరేం కావాలి, మీకూ?"

"ఏమీకాదు. నువ్వే నా సర్వస్వమున్నూ!"

మాలతి అతని ఛాతీలో తన తలను దాచుకుంటూ, నేను మీ పాదదాసిని, నన్నెప్పుడూ వదలకండి!" అన్నది.

"ఎప్పుడూ వదలను" అన్నాడు సురేంద్ర.

"సరే, ఈ క్షణాన్నే వెళదాం" అన్నది మాలతి.

ఆ

"పట్టుకోండి, పట్టుకోండి! వెళ్ళా, పో! తప్పుకో, పోయింది, పోయింది. మునిగిపోయింది...ఓ...ఓ...ఓ...!"

పరుగెత్తుకు డెక్ మీదికి వచ్చాడు, సురేంద్రుడు. మాలతి వెంటబడింది. అల్లంత దూరాన ఓ నావ స్టీమరుకి తగిలి మునిగిపోతోంది.

"అందులో నా జయ వుంది. నా జయ!!" అంటూ గట్టిగా అరుస్తూ దూకేందుకు సిద్ధమయాడు సురేంద్రుడు. అతడి చెయి పట్టుకుంది మాలతి.

పిచ్చివాడిలా అరుస్తున్నాడు సురేంద్ర: "వొద్దు, పట్టుకోవద్దు, నా జయ మునిగిపోతూవుంది..."

బ్రహ్మాండమైన ఆ పెద్ద స్టీమరుకింద ఓ చిన్న నావ మునిగిపోయింది. సురేంద్రుడు తెలివితప్పి పడిపోయాడు, మాలతి చేతుల్లో.

# 18

"ప్రియా!"—తెలివిరాగానే సురేంద్రుడు కళ్ళువిప్పి మొదటిసారిగా పిలిచాడు.

కన్నీళ్ళు తుడుచుకుంటూ మాలతి అతడి తలపక్కనే వున్నది. కాని సురేంద్రుడు చూడలేదు.




నిట్టూర్పుతో అడిగాడు : "జయ సంగతి ఏం తెలియలేదా? బతికలేదా?" ఏమీ బదులు చెప్పలేకపోయాడు నవుకరు. నిరాశుడై సురేంద్రుడు తలకొట్టుకుంటూ "మీరంతా ఇక్కణ్నించి వెళ్ళండి. కలకత్తా నగరం, గంగానది ఒడ్డూ, అంతా వెతకండి!" అన్నాడు. "తమ ఆజ్ఞ!" అంటూ నవుకరు వెళ్ళిపోయాడు.

గదిలో మాలతి ఒక్కర్తే ఉన్నది. ఏడుస్తూనే వుంది, ఏమీ మాటాడక. సురేంద్రుడు గబుక్కున లేచి కూచుని "ఎందుకిలా మేలుకోవడం రాత్రంతా? పోయి పడుకో!" మన్నాడు. వెళుతున్న మాలతిని మళ్లీ పిలిచి, "వెళ్ళకు. కూచో. నీతో ఓ సంగతి చెప్పా" లన్నాడు.

"ఎవరి పాపంవల్ల ఈ అనర్థం కలిగిందంటావ్?" అనడిగాడు. పిడుగులా పడిం దీప్రశ్న మాలతికి. ఏం చెప్పటానికీ ధైర్యంచాలక, తలవంచుక్కూచుంది. "సరే, నువ్విప్పటికి వెళ్లు" అనేసరికి ఆమెపోయి తన గదిలో పడుకుంది. ఎంతోమంది దేవతల్ని తల్చుకుంది. ఎన్నో విషయాలు గుర్తుకొచ్చినవ్. ఏవేవో కలలుకన్నది. పొద్దెక్కాక మెలకువొచ్చి, బైటికివెళ్ళింది.

ఆ రోజంతా ఆమె సురేంద్రుణ్ని చూడలే. ఓడ వదిలి ఎక్కడికో వెళ్ళా డతడు. మర్నాడూ రాలేదు. మూడోరోజున సాయంకాలం వచ్చి, గదిలోకి

సాలుగ ం జూన మాలతిని పిలిపించాడు. ఆమె వెళ్ళి గదిలో ఒక పక్కన నుంచుంది.

అతగాడు ఏదో రాస్తూ కూచున్నాడు. అది ఉత్తర మనుకుంది మాలతి. సగంరాసి ఓ పక్కనివుంచి, ఆమె అరోగ్యస్థితి కనుక్కున్నాడు. బాగానే వున్న దని చెప్పింది.

"నే నివాళే ఓడ వదిలేస్తున్నా. నీ యిష్టమొచ్చినచోటికి వెళ్లొచ్చు", అన్నాడు. ఈ మాటకు మాలతి కన్నీళ్లు రాల్చింది. కాని ఏమీ అనలేదు. సురేంద్రుడు పక్కనేవున్న కాగితం తీసుకుని, "ఇక్కడ నాకొక స్నేహితుడున్నాడు. ఆయన దగ్గరి కీవుత్తరం తీసుకువెళ్లు. ఏదైనా దారి చూపిస్తాడు" అని చెప్పాడు. ఆమె కన్నీటి బిందువు రాల్చటం చూశాడు.

"నీ దగ్గర డబ్బేమీ లేదని తెలుసు నాకు. ఇదిగో, ఇది తీసుకో. ఈ పర్సులో వున్నదాంతో ఓ ఏడాదివరకూ హాయిగా గడిచిపోతుంది నీకు. తర్వాత భగవంతుడి కృప!" అంటూ దిండుకిందనుంచి ఓ మనీ-బ్యాగ్ తీసి ఆమె కాళ్ల ముందు విసిరాడు. ఇంకో కన్నీటిచుక్క రాలిందామె కళ్లనుంచి.

"ఆనాడు పిచ్చివాణ్ణయి, ఎవరి పాపంవల్ల ఇలా జరిగిందని నిన్నడిగాను. ఇప్పుడు జ్ఞానం కలిగింది. నా పాపఫలితమే ఇదంతా. నువ్వు నిర్దోషివి, నా జయను నేనే చేతులారా చంపుకున్నాను... ఈ చేతులమీదుగా ఎన్నో అకృత్యాలు జరిగిపోయినై. ఇహ పాపం చెయ్యను. మంచిదారిని నడిస్తే ఇకనైనా సుఖపడ గలనేమో చూస్తా".

మాలతి నించునే వుంది. ఉత్తరం పూర్తిచేసి, మడిచి, కవర్లోపెట్టి, చిరునామా రాసి ఆమె కాళ్లముందు విసిరాడు: "ఇదీ తీసుకో, శ్యామ్‌బజార్లో అతడెక్క డుంటాడో తెలుసుకో, తప్పకుండా నీకు పని దొరుకుతుంది!" అని చెప్పాడు.

వణుకుతున్న చేతులతో ఉత్తరం తీసుకుంది మాలతి.

"ఆ పర్సుకూడా తీసుకో!" ఆమె తీసుకుని ఒక అడుగువేసింది. సురేంద్రుడి హృదయంలో ఏమిటో ఇదిగావుంది. "ధర్మంగా నడువు!" అన్నాడు.

మాలతి ఇంకో అడుగువేసింది. ఈమాటు సురేంద్రుడు కంపించిన కంఠ స్వరంతో "మాలతీ! ఆనాటి సంగతి మరిచిపో!" అన్నాడు. "కష్టాల్లోనూ ఆపద ల్లోనూ నాకు ఉత్తరం రాస్తూవుండు!" అన్నాడు. మాలతి బైటికి వచ్చింది.

తక్షణమే "మాలతీ!" అని పిలిచాడు. కళ్లనిండా నీళ్లతో ఆమె నించుంది. మళ్లీ పిలిచాడు. లోపలికి వచ్చి, తలుపును ఆనుకు నిల్చుంది. జయవల్ల

కలిగిన విచారం మరిచిపోలే" నన్నాడు. ఆమె కూచుండిపోయింది. కా
పలికాడు!

"మాలతీ! ఇహ నెవరి అండతో నేను బతికేది ఈలోకంలో?" అంటూ ఏడ్చాడు. "నువ్వు కూడా నన్నొదిలేసి వెళ్ళిపోతావా?" అంటూ తివాసీమీద పడుకున్నాడు.

దగ్గిరకు వచ్చి కూచుంది మాలతి. అతడి తలను తన ఒళ్లో పెట్టుకుని, "నేను వెళ్లనులెండి!" అన్నది. ఇద్దరూ ఏడ్చారు చాలాసేపు. "ఆ రోజున నువ్వేమన్నావో జ్ఞాపకముందా?"

"మీ పాదదాసిని అన్నా. ఇప్పటికీ మీ పాదదాసినే!"

వెంటనే సురేంద్రబాబు "హరిచరణ్!" అని పిలిచాడు. అతడు డెక్ పైకి వచ్చాడు.

"ఇప్పుడే, ఈక్షణాన్నే ఓడ లంగరెత్తి పోనియ్!"

# 19

ఓడ కనుమరుగయేదాకా పిచ్చి సదానంద పాట మాని, దానివేపే చూస్తూ కూర్చున్నాడు. ఇవాళ అతడికి మనస్సు ఏంబాగాలేదు, నిద్రపట్టలేదు. పొద్దున్నే సుభద దగ్గిరకొచ్చి "నేను రెండుపూటలా ఇక్కడే భోంచేస్తూవుంటే బాగుంటుందా?" అనడిగాడు. "ఏం, బాగానేవుంటుంది నాయనా!" అన్నది సుభద.

అత్తగారితాలూకు ఆస్తి వాళ్ళ మామగారిదగ్గరుంది. రెండు మూడురోజుల్లో అక్కడికెళ్లి తెలుసుకువస్తానన్నాడు. సరేనన్నది సుభద. ఈలోగా సదానందుడి సామానంతా హారాన్ ముఖర్జీ ఇంటికి చేరింది.

ఇది చూసి లోకులు తలోమాటా ప్రారంభించారు— నిజంగా పిచ్చివాడేననీ, చలనని పెళ్లాడటానికి వేసిన ఎత్తు అనీ, ఇంకా ఏమేమో. విని తనలో నవ్వుకున్నాడు సదానందుడు.

అందరూ నోరుమూసుకున్నారు కాని, ఈర్ష్యతోవున్న భవతరణ గంగోపాధ్యాయుడుమాత్రం అతన్ని చేరబిలిచి ఉపదేశం మొదలెట్టాడు. అందుకు సదానంద చెప్పాడు: "మా అత్తారింటికి వెళ్ళొచ్చాక నా సామానులన్నీ తెచ్చి మీదగ్గర పెడతాన్లే!"

"కుర్రవాడివి, నీకేం తెలీదు, చెడిపోతున్నావులే!" అంటూ హెచ్చరించాడు గంగోపాధ్యాయుడు. చివరికి తన ఎదటినించి లేచి పొమ్మన్నాడు.

సదానంద బయటి కొచ్చేసి, తెగ నవ్వాడు.

* * *

ఒకనాడు భోంచేస్తూ సదానందుడు "చలన పెద్దదయిం" దన్నాడు, సుభద మొహం చూస్తూ.

"అవున్నాయనా!" అన్నదామె.

అటుపైన పెళ్ళిగొడవ తెచ్చి, "హరమోహన్ కొడుకు శారదాచరణుడి కిచ్చి చేస్తే ఎలావుంటుంది?" అనడిగాడు. నిరాశ సూచించింది సుభద. ఏమంటే, కొడుకు ఇష్టపడినా, తండ్రి ఎందుకని పడనివ్వడో ఆమెకు తెలుసు. మౌనంగా ఉన్నది.

పిచ్చి సదానంద ఆ మౌనభాష కూడా గ్రహించాడు. "నీ కెందుకు అతని తండ్రిని వప్పిస్తా, చలన పెళ్ళి చేసేతీరాలి" అంటూ నిష్కర్షగా చెప్పాడు. సంతోషం పట్టలేక వెళ్ళి పాలు తెచ్చింది. ఆ గ్లాసులో ఆమె కంటినుండి ఆనందాశ్రు వొకటి జారిపడింది. "ఉండు, సదా! పాలు మార్చి తెస్తా"నని చెప్పి మళ్ళీ లోపలికెళ్ళింది.

* * *

భోజనం కాగానే అతడు మైదానంవేపు బయల్దేరాడు. అక్కడ దతని పొలముంది. రైతులు దున్నుతున్నారు. అతడు దుర్గాదేవిని తలుచుకుని, రెండు గుక్కలు పొగపీల్చి, హరమోహనుడి ఇంటి కెళ్ళాడు.

ఇతన్ని చూస్తూనే ఆ వృద్ధుడు, "అరే! చాలా రోజులై కనిపించలేదే! ఆ, ఆ— అన్నట్టు మీ అత్తగారు కాలం చేసిందిటగా కాశీలో? పాపం, ఎప్పుడొచ్చావ్ నువ్వు? రా, కూర్చో!" అంటూ ఆదరించాడు.

పెళ్ళి విషయమై వచ్చానన్నాడు సదానంద.

"ఎవరి పెళ్ళి?" అనడిగాడు మోహన్.

"తమ అబ్బాయిగారి పెళ్ళిని గురించే!"

"సరే, అక్కడుంటాడు శారద, వెళ్ళు," అంటూ వేలెట్టి లోపలికి చూపించాడు.




"నాకు అతడితో పనిలే, మీ దగ్గిరికే వచ్చా." ఆ తరవాత ఇద్దరి మధ్యనీ ఎన్నెన్నో ప్రశ్నలూ జవాబులూ జరిగాయి. ఇది చూసి, లోకులనుకునేటంత పిచ్చివాడు కాదు సదానందుడు అని మోహన్ నిశ్చయించుకున్నాడు.

సదానంద నవ్వాపుకోలేక అన్నాడు: "శ్రీమాన్‌గారికి ముందే నివేదించుకున్నా, పెళ్ళిమాటలు నా దగ్గర జరిగితే వచ్చే చెడుగేంలేదు. స్థిరపరచడం కోసమే నేను తమ వద్దకు వచ్చా" నని చెప్పాడు.

పిల్ల ఎవరు? ఏవూరు? ఏమిస్తారు? లాంటి ప్రశ్నలన్నీ వచ్చాయి. అన్నింటికీ యుక్తంగా జవాబులు చెప్పాడు సదా. ఏమిస్తారు అనే ప్రశ్నకు "మీరు ఏం కోరితే అది!" అన్నాడు.

వృద్ధుడు నవ్వి, "మాకేం కుందనపు బొమ్మ అక్కర్లే. సంసారపక్షంగా ఇంటి పనులు చేసుకోగలిగితే చాలు!" అన్నాడు. అనుకూలంగానే జవాబిచ్చాడు సదానంద.

"హారాన్ స్థితి బాగా లేదంటారు కదా, ఈ రోజుల్లో అత నేమివ్వగలడు?" అనడిగాడు మోహనుడు.

"నిజానికి అతని స్థితి ఏం బాగాలే. కనుక మీరే ఆలోచించి చెప్పాల్సి వుంటుంది."

"ఏం చెప్పను నాయనా ? పెళ్ళి కర్చు కొంత వుంటుందని తెలుసుగా ? ఒక వేయికి తక్కువైతే శారద పెళ్ళి చెయదలుచుకోలేదు."

"అయితే, స్థిరమే!" అన్నాడు సదానంద.

అనేప్పటికి పదిహేను వంద లడిగి వుండవలసింది అనుకుని బాధపడ్డాడు మోహన్. తీరా నోరు జారిందాయె. మాట అతిక్రమించలేక ఇలా అన్నాడు : "పిల్లకి సొమ్ములూ అవీ చేయించే విషయం మీరే భరించాలి" అన్నాడు.

"తప్పకుండా."

ఒక నెల్లాళ్ళ తరవాత మంచిరోజున రాతకోతలు జరిపించుకోవటానికి నిశ్చయమయింది.

చివర్న "నాదో చిన్న ప్రార్థన!" అన్నాడు సదానంద.

"ఏమిటది?"

"ఈ ఇచ్చి పుచ్చుకోవడాలు మనిద్దరి మధ్యనే తప్ప మూడో చెవిని పడ కూడదు! దానికీ చిన్న కారణముంది!" అన్నాడు.

"ఏం, గుప్తదానం చెయ్యాలనుకున్నావా?"

ఆ మూగనోమూ, సదానందుడి దయా చూసి హరమోహనుడు సిగ్గుపడ్డాడు. "నాయనా! హారాన్ సంగతి నాకు తెలియదా ? నువ్వు గుప్తదానం చేస్తానంటే, నేనూ గుప్తంగానే గ్రహిస్తాను, సంశయించకు" అన్నాడు.

సదానందుడు సంతోషంతో అతనికి నమస్కరించి వెళ్ళిపోయాడు.

# 20

సుభద, హారాన్, చలన, రాసమణి అందరికీ తెలిసిపోయింది — ఈ పెళ్ళిని గురించి సదానందుడే వప్పుకుని వచ్చాడని. ఒకనాడు అతడు అత్తారి వూరెళ్ళి, ఆస్తి విడుదల చేసి, తిరిగి వచ్చాడు. చలన పెళ్ళికి కావలసిన రాత కోతలూ, సొమ్ములూ అన్నీ సిద్ధం చేసుకున్నాడు. శారదాచరణుణ్ని కలుసు కున్నాడు. ఇద్దరూ గంగ ఒడ్డున కూర్చుని చిన్ననాటి కబుర్లు ఊసులాడసాగారు.

లలన ప్రసంగం వచ్చింది. శారద ఒకచోట వేలితో చూపుతూ "ఆమె అక్కడే మునిగి చచ్చిపోయిం" దన్నాడు. ఆమె చీర పడివుండటం చూసినట్టు ఆనవాలు చెప్పాడు. ఆ ప్రదేశం చూసి వద్దామనుకున్నారు. ఇద్దరూ కాళ్ళూ చేతులూ కడుక్కు వచ్చి కూచున్నారు.

"సదా! నాకు చాలా విచారంగా వుంది. ఆమెను నేనే చంపానేమోననిపిస్తూ వుంటుంది. ఆమెని నేను పెళ్ళాడివుంటే చచ్చిపోయేది కాదేమో!" అన్నాడు శారద.

"ఏందుకలా అనుకుంటావ్? చావొస్తే ఎవళ్ళూ తప్పించలేరు."

"కాదు కాదు. ఆమె చివరి కోరిక తీర్చివుంటే"

"ఏమిటది?"

"ఒక పేద కుటుంబాన్ని ఉద్ధరించిన వాడవవుతావ్, చలనను పెళ్ళి చేసుకో మన్నది."

*　　　　*　　　　*

సదానందుడు లేచి లలన చీర పడినచోట మట్టిని తీసుకున్నాడు. ఎందుకని స్నేహితు డడిగితే శివాజీపూజ కోసమని చెప్పాడు. ఆ మట్టిని పిండంకిందచేసి, దాన్ని నీటిలోకి విసిరి, ముఖం కడుక్కొని వచ్చి, "శారదా! ఇంటికి పోదాం పద!" అన్నాడు.

"మట్టిబొమ్మ చేసి నీళ్ళలో పారేశావేం?"

"నీ కళ్ళతో నువ్వే చూశావుగా?"

"శివాజీపూజకోసం మట్టి కావాలన్నావ్?"

"లేదు, ఇహ శివాజీపూజ చెయ్యను."

"ఏం?"

"ఆ సంగతి మరోసారి చెబుతాలే."

అక్కడితో ఎవరింటికి వారు వెళ్ళారు. సదానందుడు గది తలుపులు వేసుకున్నాడు. రాత్రి అత్తా, చలనా అన్నానికి లెమ్మని ఎన్నోమాట్లు పిలిచారు. ఒంటో బాగుండలేదని చెప్పి, తలుపు తియలే. సుఖద వచ్చి చూస్తే నిద్రలో ఉన్నాడు. పిలిస్తే పలకలే. మర్నాడు మామూలుగా భోంచేసి పనిపాటులు చూసుకున్నాడు.

దగ్గరి కొచ్చేసింది పెళ్ళిరోజు. అందరి ముఖాలూ కలకల్లాడుతున్నాయి, సంతోషం తాండవిస్తూంది. సదానందుడిదే కదా పెత్తనం? ఊపిరిపీల్చుకోవటానికూడా తీరికలేదు! అత్తగారు మాత్రం దుఃఖంఆపుకోలేక, వచ్చిన వాళ్ళందరితోనూ లలన లేక మనస్సు వికలంగా ఉన్నదని చెబుతూంది. ఒక్క సుఖదే చలించకుండా, గుండెనిబ్బరంతో మసులుకుంది.

ఎలా అయితేనేం, చలనకు పెళ్ళయింది.

# 21

లలన వెళ్ళాక మాధవుడిలో ఎంతో మార్పు వచ్చింది. అన్నీ తెలిసిన జ్ఞానిలా వృద్ధుడిలా మాటలు. అస్తమానం ఆలోచన, విచారమూ. సదానందుడు కన బడగానే "సదాన్నయ్యా, నువ్విప్పుడు నాదగ్గిరకి రావటం లేదేం?" అని పలక రించాడు, లక్షప్రశ్నలు వేశాడు. అన్నింటికి సదానందుడు ఓపిగ్గా సమాధానా లిచ్చాడు.

"అక్కయ్య నాకంటే ముందుగా వెళ్ళింది. అక్కడ అన్నీ సిద్ధంచేసి నన్నూ తీసికెళతానంది. వస్తుంది. మే మిద్దరం అక్కడ హాయిగా వుంటాం" అంటూ ఆనాటి అక్కాతమ్ముళ్ళ మధ్య బాధ అంతా చెప్పాడు.

సదానందుడికి కళ్ళనీళ్ళు ప్రవహించాయి. కుర్రవాడికి రోజులు దగ్గరికొచ్చా యని గ్రహించాడు. విరక్తిచేత వెనకటిలా పాటలూ అవ్వీ మానేశాడు,

ఆ రాత్రి మాధవుడి స్థితి ఏం బాగాలే. ఇవాళ మరీ గాబరాగా వుంది. పక్క మీద అటూ యిటూ దొర్లుతున్నాడు. అంతా వాడి తలాపున కూర్చున్నారు. సుభద వంటింటో పనిచేస్తూ ఏడుస్తూంది. హారాన్ పొద్దుట పోయి ఇంతదాకా రానేలేదు. కృష్ణప్రియ అవసాన గడియలు లెక్కస్తూ, డాక్టర్ కోసం ఎదురు చూస్తూవుంది.

మాధవుడికి అంతకంతకు ఎక్కువవుతూ వుంది. డాక్టరొచ్చి "ఈ రాత్రి గడవడం కష్టం, కనిపెట్టుకు వుండండి," అని చెప్పేశాడు.

ఎప్పటికో వచ్చాడు హారాన్. "మధు ఎలా వున్నాడు?" అనడిగాడు. "ఎలా వుందని చెప్పడం? మించిపోయింది" అన్నది సుభద. అనేటప్పటికి తన వంట్లోనూ బాగాలేదని పడుకున్నాడు హారాన్. "జన్మకు సిగ్గనేది ఉండాలి!" అని తిట్టింది కృష్ణప్రియ. ఈ మాట విని రాసమణి నాలికొర్కురుక్కుంది. అందరూ ఒకరిముఖా లొకరు చూసుకుంటున్నారు. కాస్సేపయాక పీలగొంతుతో కుర్రవాడు "దాహం!" అన్నాడు. నోట్లో నీళ్ళుపోసింది అత్త. నాడి చూసి "ఇహ దించెయ్యండి" అన్నది కృష్ణప్రియ.

అందరూ గొల్లుమన్నారు

మళ్ళీ ఒక్కమాటు నోరు తెరిచి, బలం వచ్చిందేమో నన్నట్టుగా నవ్వుతూ "సదాన్నయా...! అక్క... వ...చ్చిం...ది..." అన్నాడు.




ఇప్పుడింకా ఎక్కువగా యాతన పడుతున్నాడు మాధవ "ఎగ పోసిరి, చూస్తారెందుకు, మీ పనుల్లో మీరుండండి తులసి తీర్థం పొయ్యండి..." అన్నది రాసమణి.

ఏడుపులూ, గోలా విని హారాన్‌కు మెలకువొచ్చింది. వాడ్ని బయటికి తీసుకు రావడం చూసి "నాయనా, మధూ! మధూ!!" అని ఏడ్చాడు.

మాధవుడు ఎక్కడో వినిపిస్తున్న కంఠస్వరంతో "నానా!" అన్నాడేమో!

## 22

పెద్ద భవనం. ప్రతి గదిలోను ఫర్నిచరూ అవీ జమీందారీ ఫాయిలో అమర్చబడివున్నాయ్. ఒక కుషన్‌లో కూచుని మాలతి పుస్తకం చదువుతూంది. ఎంత తిరగేసినా ఆమె మనస్సుకి ఒక్క అక్షరమైనా ఒంటబట్టినట్టులేదు. ఒకే యేడుపు. ఏడుపు ఆపుకోటానికే పుస్తకం అడ్డుపెట్టుకుందా అనిపిస్తుంది. సురేంద్ర నించుని చూస్తున్నాడు. అతడు రావడం ఆమెకు తెలియనే తెలీదు.

"మాలతీ!"

రాండి!"

ఆమెను తన చేతుల్లోకి తీసుకున్నాడు సురేంద్రుడు. ఎంత ప్రయత్నించినా, నిన్ను సంతోషపెట్టలేకపోతున్నా. ఎవరికి ఆనందం కలగాలని ఇంత గొప్పగా అలంకారాలు చేయించానో, ఆ శ్రమ సార్థకం కాలే. ఒక్క క్షణమైనా నీ పెదిమలమీద చిరునవ్వు చూళ్లేకపోయాను కదా మాలతీ! నావేపు కన్నెత్తి చూడవా? ఇంతేనా?"

మాలతి అతడి వక్షస్థలాన్ని చేత్తో నిమురుతూ "నువు నన్ను చూడలేదనలే, నేను. నా మనస్సులో బాధలు దాచకుండా ఇవాళ చెప్పేస్తా" నన్నది. అందుకు సురేంద్ర "తక్కువజాతి స్త్రీలు తిండీ, గుడ్డా, నగా, డబ్బూ, వీటికి తప్ప మరి దేనికీ ఆశించరు, దుఃఖించరు. నువ్వలాంటి దానివి కావని నా మనస్సు చెబుతూంది. మరి, నిన్నెలా సుఖపెట్టగలనో నాకు తెలియడంలే...మాలతీ! నీ భర్త బతికే వున్నాడా?" అనడిగాడు.

"లేదు..." అన్నది, అతని గుండెపైనే చేతులు తిప్పుతూ.

"అయితే మరి, నిన్ను నేను పెళ్ళిచేసుకుంటే నీకు సంతోషంగా వుంటుందా?"

అతడి పాదాలమీద పడి ముఖం దాచుకుంది మాలతి.

ఆమె కన్నీటితో పాదాలు తడిసిపోతున్నా అతడు లేవదీయలే.

"మాలతీ!— నీ సౌందర్యం నన్ను పిచ్చివాణ్ణిగా చేసింది. నాలో వివేకం పోయింది. నీవేమని చెప్పినా చెయ్యడానికి ప్రాణాలైనా అర్పిస్తాను. జాతీ, కులం, గౌరవం ఇవన్నీ చూడను. నువు కాదంటే, ఆత్మహత్య చేసుకుని నేను నరకానికి పోతా!"

"అలాంటి మాటలనకండీ! నా ప్రాణం రక్షించారు. మానం కాపాడారు. ఇంత ఆశ్రయాన్ని కల్పించారు. లేకపోతే ఎప్పుడో పోయేదాన్ని. మీరు చూపిన దయ, ప్రేమ జన్మలో మరవలేను. దీనికంతా ప్రతిఫలమా మీరు ఆత్మహత్య చేసుకోవడం? అంత నీచురాల్ని, విశ్వాసఘాతకురాలినీ కాను!" అంటూ ఏడ్చింది.

నిట్టూర్పు విడిచి అన్నాడు సురేంద్రుడు— "ఒక నెల్లాళ్ళుగా ఈ కొద్దిరోజుల స్నేహానికే, నేనొక ఆడదానికి బానిసగా మారిపోయానంటే నాకే సిగ్గవుతూంది... నువ్వెవరవో తెలియకపోయినా, మా పితరుల వంశ గౌరవాన్ని కూడా అగౌరవపరచేందుకు తయారయ్యాను."

ఏడుస్తూ చెప్పింది మాలతి: "నే నెవరినని ఇంతగా మనస్సు పాడుచేసుకుంటున్నారు? మీ దాసదాసీలకన్నా దాసిగా ఉండే అర్హత లేదు నాకు. జన్మాంతం దుఃఖితురాలిని. తలచుకుంటే ఆ పరమేశ్వరుడే నన్ను ఆఖరు చేస్తాడు... మేం పేదవాళ్ళం..."

"నేను మాత్రం బీదవాణ్ని కాదు. నాకున్నదంతా నీదే."

"నన్ను గురించి కాదు చెప్పేది."

"మరి నీ కెవరూ లేరుగా?"

"ఇప్పు డెవరున్నారో, ఎవరులేరో, నేను వచ్చేప్పటికి అందరూ వున్నారు."

"అదేమిటి? పడవ మునిగిపోయి...?"

"అంతా వట్టి అబద్ధం. పడవా గిడవా మునిగిపోలేదు." మాలతి ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు. ఇదంతా నిజమా అబద్ధమా అని అనుమానం కలిగింది. ఈ కన్నీళ్ళలో మోసముందా అనుకున్నాడు.

మాలతి అతని ముఖంలోకి చూస్తుండగానే ఆమె కళ్ళు రెండూ అశ్రువులతో నిండిపోయినై. ఆమె కన్నీళ్ళు తుడుస్తూ అసలు సంగతేమిటో మనస్సు విడిచి చెప్పమని మరి మరి అడిగాడు

మాలతి చెప్పింది— పుట్టినుంచీ నేను కష్టాల్లో పెరిగాను. ఉన్నవాడికే ఇచ్చి పెళ్ళిచేశారు మావాళ్ళు. కాని, ఈ అభాగ్యురాలు ఏడాది తిరక్కముందే విధవ అయింది. అప్పట్నించీ పుట్టింటనే వుంటున్నా. మా నాన్నకు హేలాద్‌పురానికి మైలు దూరాన ఒక జమీందారువద్ద పని. జీతం నామ మాత్రం. ఎలాగో కాలం గడిచింది.

"ఇంట్లో అందరూ ఉన్నారు— అమ్మా, నాన్నా, అత్తా, ఇద్దరం అక్కాచెల్లెళ్ళం, ఓ తమ్ముడూ... దొంగతనం మిషమీద నాన్నకి నవుకిరీ కాస్తా పోయింది. అప్పట్నించీ ఆ యింటా ఈ యింటా .. ఓ రోజు తిండివుంటే మర్నాడు లేదు. వుండేది కాస్తా అమ్మ మాకు పెట్టి తను పస్తుండేది..."

వెక్కివెక్కి ఏడ్చింది మాలతి. మళ్ళీ చెప్పింది—

"నాన్నకు ఇంటి గొడవ పిసరంతా లేదు. నల్లమందు మింగడం, గంజాయి పీల్చటం, రోజుల తరబడి ఇంటి ముఖమే చూడకపోవటం, ఇదీ వరస. ఏడాది నించి మా చిన్న తమ్ముడు మాధవుడికి జ్వరం, ఖాయిలా వాడిప్పుడు బతికున్నాడో లేదో!" అంటూవుంటే, సురేంద్రుడికూడా కళ్ళనీళ్లు తిరిగినై.

తరవాత —కృష్ణత్తయ్యా, సదానందుణ్ని గురించి చెప్పింది [illegible] పేదరికం వల్ల చెల్లెలు చలనామణికి పెళ్ళికాలేదనీ, పెళ్ళి కాకపోతే బ్రాహ్మణ జాతే పోతుందనీ అన్నది. నాన్నకి చీమ కుట్టినట్టు లేదు. సదానందుడు —అత్త గారిని తీసుకు కాశీయాత్ర వెళ్లాడనీ చెప్పింది

"ఇరుగు పొరుగులు ఎంతకని సాయంచేస్తారు? కాశీ వెళ్లేటప్పుడు సదాన్నయ్య ఇచ్చిన యాభై రూపాయలూ అయిపోయినై —" అనగానే "చాలు. మిగిలింది తరవాత చెబుదువిగానిలే" అన్నాడు దుఃఖంతో సురేంద్రుడు.

"ఎందుకు, ఇవాళే చెప్పేస్తా" నన్నది మాలతి.

అందరూ మాలతిని అందాల బరిణె అనేవారు. అందుకని కలకత్తాపోయి అక్కడ డబ్బు ఆర్జించుదా మనుకున్నది. ఓ రాత్రి గంగఒడ్డున ఒక్కర్తే వెళుతుంటే ఓడ కనిపించింది. ఈదుకుంటూ వెళ్ళేటప్పటికి కోక కాళ్ళకూ చేతులకూ చుట్టుకుంది. అపాయం!—కాళ్ళూ చేతులూ ఆడక చీర విప్పేసి, ఓడ అంచు పట్టుకుంది. ధైర్యంగా పట్టుకు చాలాదూరం వచ్చింది. ఉదయానే నదికి స్త్రీలు స్నానానికి వస్తారుగా? ఒంటిని గుడ్డలేని ఈ స్థితిలో ఏ తల్లికయినా దయపుట్టి బట్ట పడెయ్యకపోతుందా అని కనిపెట్టుకునుంది.

"ఆ తరవాత సంగతి మీకు తెలిసిందే!" అన్నది మాలతి.

"ఎవరి కోసమయితే ఇంత సాహసాన్ని తలపెట్టానో వాళ్ళకు ఇన్నిరోజులు గడిచినా ఏమీ సహాయం చెయలేకపోయ్యావు కదూ!"

"ఊఁ!"

"నే నప్పుడే అనుకున్నా. సరి. నెలకు వాళ్ళ ఖర్చుల కెంతయితే సరి పోతుంది?"

"ఇరవై రూపాయలు."

"అయితే నెలనెలా యాభై రూపాయల చొప్పున పంపుతూ వుండు...... కావాలంటే ఇంకా ఎక్కువే ఇస్తాను."

ఈ క్షణాన తన జన్మ సఫలమైం దనుకున్నది మాలతి.

"తరవాత ఇంకోపని చెయ్యాలి. నన్ను పెళ్లి చేసుకో. నీది నిర్మల హృదయం అటువంటి దాన్ని కళంకితం చెయ్యనివ్వను."

"వద్దు!"

"ఎందుకని వద్దు? నా జాతి భ్రష్టమవుతుందనా నీ భయం. నే నీవూరికి జమీందారు; శ్రీమంతుణ్ణి! ఎవర్నీ నేను ఖాతరు చెయ్యను!"




"వొద్దండీ, అల్లరవుతుంది!"

"కాదనను. అయినా అది ఎంతోకాలం వుండదు"

"అయినా వంశం, కులం, గౌరవం...!"

"మాలతీ!— ఒక్క రోజునయినా ఇవన్నీ మరిచిపోనివ్వు! ఈ లోకంలో సమస్తమూ అనుభవించాను, కానీ సుఖమనేది పొందలేకపోయాను. ఒక్క రోజన్నా నన్ను సుఖపడనీయ్!"

"నా జీవితమంతా మీ దగ్గరే వుంటా!"

"అలాగే ఉండాలని భగవంతుడికి నా ప్రార్థన. మాలతీ! ప్రపంచాన్ని నేను చూసినట్టు నువు చూడలేవు. నేను నమ్మతగిన వాణ్ణి కాను. ఆ సంగతి నాకే తెలుసు. ఏ ప్రేమలో స్వేచ్ఛగా నువు జీవితం గడుపుదామని ఆశించావో దాన్ని మధ్యలోనే నేను తుంచిపోతే నీ గతేంకాను? ఆలోచించు మాలతీ; ఆలోచించు. నన్ను పెళ్ళి చేసుకో!"

"మీ ఆశ్రయం ఎప్పుడయితే దొరికిందో ఈ దీనురాలికి, ఆ క్షణాన మిమ్మల్ని చేసుకున్నట్టే!"

బంధమూ అవసరం లేదూ..."

"నీ కవసరంలేదు, నా క్కావాలి!"

"కావలసినా సరే, పెళ్ళిమాత్రం కాదు!"

"ఎందుకని? విధవని పెళ్ళాడకూడదా?"

"చేసుకోవచ్చు, అయినా..."

"నీ వుద్దేశం చెప్పూ"

"చెబుతా. మీరు తప్ప నన్నింతవరకూ ఎవరూ ముట్టుకోలేదు. అయినా, ఒక మనిషికి ప్రాణ మర్పించివున్నా, నన్ను పెళ్ళిచేసుకోమని అతన్ని ప్రోత్సహించా. తన జాతి భ్రష్టమవుతుందని అతను ఇష్టపడలే."

"పిచ్చి సదానందుడేనా అతను ?"

"కాదు, మరొకరు,"

"అయితే మనిషిని గుర్తించలేదా నువ్వు? అతనికి నువ్వెందుకు చెప్పలేదూ? అతను నిన్ను ప్రేమించాడా?"

మాలతి శరీరంలో మెరుపు మెరిసినట్లయింది. పిచ్చివాడి ముఖం, ఆనాడు వర్షంలో తను సదానందుడి ఇంటివద్ద నించోవడం, రోజూ ఏదోవిధంగా అతడు తన పిడికిలి నింపి పంపడం, ఆపద సమయాల్లో అతడు చూపిన సానుభూతి, అన్నీ జ్ఞాపక మొచ్చి, కళ్ళనీళ్ళు నిండినై.

"మాలతీ! ఆ తరవాత?"

"కలకత్తా వద్దామని బయల్దేరా."

"ఊ! (——"

"దయతో మీ పాదాల వద్ద ఇంత ఆశ్రయాన్ని కల్పించి మీరు నన్ను రక్షించారు."

"మాలతీ! నువు రత్నంలాంటి దానివి. పొరపాటున అది చెడ్డప్రదేశంలో పడినా, దానికి ఆదరం పోదు."

"ఎవరన్నారు ఆ మాట? ఒకరు ప్రేమతో మెడలో కట్టుకున్న రత్నాన్ని ఇంకొకరు కాళ్ళదగ్గర కూడా ఉంచుకోరు. మీరు నా కాశ్రయమిచ్చారు. నేను రత్నాన్నే కావచ్చు. ఆ గౌరవం అలానే ఉండనివ్వండి. అదే పరమ సౌభాగ్యమనుకుంటా!"

తెలిసింది!"

మెల్లిగా నవ్వింది మాలతి. ఇంత కాలానికి ఇదే ఆమె తొలిసారి నవ్వడం.

ఆ క్షణమందే దాసీది పిలిచింది : "బాబూ! అఘోర్‌బాబూ, అమ్మా బయట నిలుచున్నారు!"

"అఘోర్‌బాబా? ఇక్కడి కెందుకూ?"

"ఏదో తొందర పనుందట మీతో!"

లేచాడు సురేంద్రుడు. "మాలతీ! నే వెళ్తున్నా!"

"వెళ్ళండి. అఘోరబా బెవరూ?"

"తరవాత చెబుతాలే...!"

# 23

పుట్టుక ఎప్పుడుందో చావూ అప్పుడే వుంది. అలానే ప్రేమతోపాటు దుఃఖం ఉండటంకూడా అంత నిజం. ప్రేమించేవాళ్ళు ఏడవక తప్పదు.

సురేంద్రుడు వెళ్లాక తలుపులు వేసుకుని, కిందపడి మాలతి ఎంతెలా ఏడ్చిందో చెప్పలేం. చిన్నప్పటిప్రేమ వేరు. ఇప్పుడామె తన సర్వస్వమూ అర్పించి ప్రేమించింది. అందువల్ల కృతజ్ఞత ఏర్పడింది. తనలో తనే ఇలా అనుకుంది :

"మీరు నన్ను ఎంతగానో ప్రేమించారు. ప్రాణం బలివ్వటానిక్కూడా సిద్ధపడ్డారు. అయినా నాకోసం మిమ్మల్ని కళంకితుల్ని చెయ్యనివ్వను. నాకోసం మిమ్మల్ని నలుగురూ నాలుగువిధాల అంటూంటే నే వినలేను. నేనొక అనామకు రాల్ని, కులం లేనిదాన్ని. నన్నెవరూ గుర్తుపట్టలేరు. మీరలా కాదు. గొప్ప జమీందారులు. మిమ్మల్ని అందరూ పూజిస్తారు. కనుక ఈ కళంకమనేది లోకానికంతటికీ ఇట్టె తెలిసిపోతుంది. జాతిలేనిదాన్ని పట్టుకున్నాడని లోకం కోడై కూస్తుంది. సమాజంలో మీకు గౌరవం ఉండదు. మీకు తెలియకుండానే మీ హృదయాన్ని గాయపరుస్తారు లోకులు. అంచేత మీ వంశానికీ ప్రతిష్ఠకీ మచ్చ రానివ్వను."

తరవాత కొంచెం స్తిమితపడి, కళ్ళు తుడుచుకుని, చేతులు జోడించి ప్రార్థించింది— "భగవాన్! ఈ జన్మలో నే చేసిన పాపాలూ, అపరాధాలూ అవన్నీ

నాకు తెలుసు. నాకు వేరే గతిలేదు, శరణ్యంలేదు. పతితను. నీ పాదాలవద్ద ఇంత ఆశ్రయమివ్వు, తీసుకుపో, నన్ను తీసుకుపో ప్రభూ !"

ఆ రాత్రంతా అక్కడే నిద్రపోయింది. మర్నాడూ సురేంద్రుడు రాలే. ఎదురు చూసింది. అతడు అర్ధరాత్రికి వచ్చాడు. ముఖం అదోలా వుంది. "ఆ విషయం ఏం చేశావ్ ? మరిచిపోయావా ?" అనడిగాడు.

"జ్ఞాపకముంది, ఆలోచించాను. కానీ పెళ్లిచేసుకోలేను, ముందేచెప్పాను."

"పెళ్లి చేసుకు తీరతా !"

"నేనుమాత్రం కానివ్వను. వచ్చి నెలయినా పూర్తికాలేదు. జయావతి పోగానే అప్పుడే ఇంకోదాన్ని కలకత్తానించి తీసుకొచ్చి పెట్టుకున్నాడని లోకంలో హోరెత్తిపోతూంది "

"నాకూ తెలుసు, ఆ సంగతి."

"మీరు బలవంతాన పెళ్లి చేసుకుంటే, నే విషం తాగుతా."

"వీల్లేదు. ఇంకో వారంరోజుల్లోనే పెళ్లి ప్రయత్నం"

"నే నిక్కడుంటేగా ?"

"ఏం చచ్చిపోతావా ?"

"ఉహుఁ— దేనికోసమయితే ఇల్లు వొదిలి ఇక్కడకు వచ్చానో, దాని కోసమే మళ్లీ బయల్దేరతా."

"అయితే ఇంతకూ ఇష్టపడవన్నమాట ?"

"చేసుకోలేను"

"సరే కానీ, ఇంటికి డబ్బు పంపావా ?"

ఏడుస్తున్న మాలతి తల అడ్డంగా తిప్పింది.

"ఏం, ఎందుకని పంపలేదూ ? నీదగ్గర డబ్బులేదా ?"

"లేదు."

"ఇంత కాలమయింది వచ్చి, ఏం తీసుకోవేం ?" అంటూ ఆమెచేతిని తన ఒడిలో పెట్టుకుని అన్నాడు... "ఒక్కచీర కట్టవ్. నగ పెట్టుకోవు, ఏది ఇష్టమో మనసు విడిచి చెప్పవు. ఇలా తెలియనిదానిలా వుంటే నేనేం చేసేది ?" అని చెప్పి జేబులోంచి ఓ నోట్లకట్ట బయటికి లాగి—

"ఇదిగో ఇది వుంచుకో. కావలసినంత ఇంటికి పంపు. తక్కింది ఇష్ట మొచ్చినట్టు ఖర్చుపెట్టుకో. ఇంకా కావాలంటే సంశయించక అడుగు. ఇహ

గురు న




ముందైనా డబ్బు కూడబెట్టడం నేర్చుకో!'' అన్నాడు. "మరిచిపోకుండా ఇవ్వాళే మీవాళ్లకి పంపించు" అని మళ్లీ హెచ్చరించాడు.

"నాచేతకాదు. మీరే మరెవరి పేరుతోనయినా పంపించండి. పట్టుబడిపోతే ప్రమాదం!'' అన్నదామె.

"సరే, అయితే మా వకీలు అఘోరబాబుతో చెప్పి ఏర్పాటుచేస్తా. అతనుండేది కలకత్తాలోనే గనక అక్కణ్నుంచే పంపుతాడు."

"అలాగే చెయ్యండి అయినా, కొంపదీసి ఎవళ్లయినా మీజాడ తెలుసుకొవస్తే?''

"చూస్తాగా, ఎలా వీలయితే అలా చేద్దాం"

"వొద్దు, మీపేరుమట్టుకు బైటకు రానివ్వద్దని వారితో మరీమరీ చెప్పండి!'' అన్నది.

## 24

జయావతేమో చచ్చిపోయింది గానీ, ఆమె తల్లి బతికేవుంది. నారాయణపురానికి సమీపంలో 'బాన్‌పుర్' గ్రామంలో ఆమెకు ఇల్లు వుంది.

జయావతి జమీందారు బిడ్డ ఆశ్రమంలో మెల్లిగా ఓ ఇల్లూ అదీ సంపాయించింది. స్థావరం కుదిరాక తల్లి కూడా వచ్చి జయావతి దగ్గరే కాలక్షేపం

ఇంటికే చేరుకుంది. ఈ యిల్లు వదలిపెట్టడం ముసలిదాని కిష్టంలేదు.

పోతూపోతూ ఎన్నో మాటలని మరీ వెళ్ళింది. అప్పట్నించీ సురేంద్రుడు ఆ పాడుముండని ఇంట్లో అడుగు పెట్టనివ్వలేదు. కానీ మళ్ళీ మళ్ళీ వస్తూనే వుందామె. నానాతిట్లూ తిట్టి, జుట్టు పీక్కుని, చివరికి గెంటివేస్తే తప్ప 'నారాయణ పురం' తిరిగి వెళ్ళేదికాదు.

అయితే కూతురంటే వల్లమాలిన ప్రేమ. అంచేతనే సానివృత్తికి మరుగడిన కూతుర్ని మళ్ళించుకోలేకపోయింది. తరువాత—కూతురు గంగలో మునిగి చచ్చిందని వినగానే, ఇరుగు పొరుగుల్ని పోగుచేసి ఏడుస్తూకూచుంది.

"జయతల్లి బంగారపు బొమ్మ! సాక్షాత్తు దేవీప్రతిమ. అహా, ఆ ముక్కూ, ఆ కన్నులూ, ఆ రెప్పలూ ఏమని చెప్పను ఆ అందం!..."అంటూ ఏడ్చింది.

"బాబుగారు దాన్నెంత ఇదిగా ప్రేమించారు! ఎప్పుడేం కావాలని అడిగితే వెంటనే పాదాలముందు వచ్చి వాలేదన్నమాట! ఆ మారాజు దృష్టిలో పడడమంటే సామాన్యమా!—" ఈ సంగతి సందర్భాలన్నీ అందరికీ తెలుసు.

"నేనూ ఇహ నెంతోకాలం బతకను. ఈ దుఃఖమే నన్ను మింగేస్తుంది" అని తనని తనే నిందించుకుంది.

"మరైతే జమీందారుగా రేమయారు!" అని ఒక దడిగాడు. "ఆయనకేం, బాగానే వున్నాడు. టింగురంగా అంటూ ఇంకో ఓడలో ఉండడం మూలాన ఆయనగారు బతికిపోయాడు. ఇంతకూ దాని ఖర్మంగాకపోతే, మా అమ్మాయి వెంట ఉండేవాళ్ళంతా కూడా చచ్చారు!" అని చెప్పింది.

* * *

మర్నాడు ముసలిది నారాయణపురం చేరుకుంది. చివరికి సురేంద్రుడి విలాస భవనం కనిపించింది. జయావతి తల్లికి ఎన్నెన్నో సంగతులు జ్ఞాపకాని కొచ్చి, గుండె గుబులెత్తింది. వెళ్ళడానికి ఆజ్ఞ లేకపోయినా, సాహసంతో నెట్టుకు లోపలి కెళ్ళింది.

భోజనానంతరం కొంచెం విశ్రమిస్తాడు సురేంద్ర. వచ్చీ రావడంతోనే ముసలిది అతడి దగ్గరగాచేరి "నా జయని నా కివ్వు" మంటూ కూర్చుంది. ఇంకా ఎన్నోఎన్నో కావాలని అడిగి, అతడికి విసుగెత్తించింది. "చేతిలో చిల్లి గవ్వయినా లేదు, నాయనా! నువ్వు దయదలిస్తే బతుకుతాను. లేకపోతే అంతే. కూటికి లేక చావాల్సిందే!" అన్నది.

నేనూ వచ్చి ఆ సొమ్ము పట్టుకెళుతూ వుండు" అన్నాడు. అందుకామె ఎంతో తియ్యతియ్యగా మాటాడి సురేంద్రుణ్ని పంపించి, దాసదాసీలున్న చోటికి వెళ్ళింది. సురేంద్రుడు తనమీద దయదలచడంగురించి చాలాచాలా చెప్పింది అందరితోను.

మాటల సందర్భంలో—తన కూతురు స్థానే బాబుగారు మరో అమ్మాయిని ప్రేమించి, తోట మహల్‌లో పెట్టారని వినేటప్పటికల్లా ఆమె ఆకృతి మారి పోయింది. కళ్ళెర్రబడ్డాయి. కొత్తగా వచ్చినామెను తిట్టి, శాపనార్థాలు పెట్టి జుత్తు పీక్కోవటం మొదలెట్టింది.

తోటలో మహల్‌వేపు వెళ్ళింది. తన కూతురిని చంపి, ఆ స్థానాన్ని ఆక్రమించిన దెవరో అనే క్రోధంతో గర్జిస్తూ, గర్జిస్తూ అక్కడున్న దాసీదాన్ని "ఎక్కడా? ఆ దయ్య మెక్కడా?" అనడిగింది.

కొత్తగా వచ్చిన దాసీది భయంతో వెనకడుగు వేస్తూ, "అక్కడ... అక్కడ..." అని అంది. "ఎక్కడా?" అంటూ మళ్ళీ రంకెవేసింది ముసలిది. వేలితో ఒకవేపు చూపి దాసీది వెళ్ళిపోయింది.

ఆ అలంకారాలన్నీ చూసి, "ఇవన్నీ నా జయావతివేనా?" అని మనసులో తర్కవితర్కాలు చేసుకుంటూ వెళ్ళగా, ఓ గదిలో ఒక అమ్మాయి కనిపించింది. వెనకనించి చూసి అదీ ఒక దాసీయే అనుకుని, "ఏదే, మీ యజమానురాలు ఎక్కడుందే?" అని కేకవేసింది. ఆ కర్కశ స్వరంవిని ఆమె వెనక్కు చూచింది. ఆ అమ్మాయి సామాన్యపు గుడ్డలు కట్టుకుని మామూలుగానే వుంది గాని అపురూపం అట్టహాసం ఏమీ కనపడలే. అందుకని కాస్త మెత్తబడి, "నువ్వెవరవు?" అనడిగింది ముసలిది.

"ఇక్కడే వుంటున్నా. మీరు కూర్చోండి!"

"ఎంతకాలమైం?"

"నెల రోజుల్నించి".

"ఓహో, మీ యజమానురా లెక్కడ? ఆమె వెంట వచ్చిన దానివే కాబోలు!"

"ఆమెతో పనుందా మీకు?"

"మెల్లిగా అడుగుతావేం? ఆ దయ్యం ముండని నమిలి తినేస్తా. నే నెవరో తెలుసా? జయావతి తల్లిని. నన్నందరూ ఎరుగుదురు. ఆ దయ్యం నా కూతుర్ని చంపింది. ఇవాళ దాన్ని తినేస్తేగాని ఊరుకోను. ఇక్కణ్నించి కదలను. ఏదీ...?

దాన్ని బతకనివ్వను. తల పగలగొట్టి ఎముకలు ఏరతా. గుండె చీల్చి రక్త తాగుతా. ఏదీ? ఎక్కడా దెయ్యం??" ఈ ధోరణిలో విపరీతమైన హంగామా చేసేసింది జయావతి తల్లి. మాలతి ఆమె చెయి పట్టుకుని, ఓదార్చ జూచింది. ముసిలిది లెక్కచెయ్యలే. భోజనానికి లెమ్మంటే వినిపించుకోలే. అంతకంతకి మరీ బిగుసుకుపోతున్న దామె వ్యవహారం.

* * *

ఉగ్రావతారం దాల్చిన ఆ ముసిల్దాన్ని ఎంతో నేర్పుతో లాలించి బేలించి. శాంతపరచి ఒకదారికి తెచ్చింది మాలతి.

"నువ్వామెను చూశావా?" అడిగింది ముసిలిది.

"చాలాకాలం ఆమెవద్దే వున్నా. మా వూరినుంచి నన్ను లాక్కొచ్చింది. ఎన్నో సంగతులు చెప్పేది అన్నింటికన్నా మిమ్మల్ని గురించే మరీ మరీ ఎంతో ఇదిగా చెప్పేది."

"మరి మా అమ్మాయిని...?"

"అవును, ఆమె ఎంతో మంచిది. నాకు తెలుసుగా?"

"అలాంటి కూతురు పోయింది. ఇంతకూ ఆ ద య్యం ఎక్కణ్నుంచి వచ్చింది?"

"కలకత్తా నించి"

"బాబుగారికి మందో-మాకో పెట్టిందా యేం?"

"అవునట."

"పెట్టిందీ? ఉండు. అదంతా ఇవాళే వదిలిస్తా. దాని మంత్రాలూ తంత్రాలూ నాకు తెలుసు."

"ఎందుకు తెలవ్వూ! మధ్యాహ్నం వస్తుంది, చూపిస్తాగా?"

"సరే, ఇప్పుడు కాదులే. బోలెడన్ని పనులున్నాయ్. రేపొస్తా!" నంది.

కాదు కాదు. వేళమించింది, భోంచేసి మరీ వెళ్లమని మాలతి పట్టుపట్టింది. సరైతే, తొందరగా కానివ్వమంది ముసిల్ది.

"నీ పేరేమిటమ్మా?"

"మాలతి!"

"చాలా మంచిపేరే!"


92



జయావతితల్లి రెండు మెతుకులు కొరికి లేచి, "మరి వెళ్తానమ్మా!" అన్నది.

"మీతో చెప్పడం మరిచా! జయక్కయ్య దగ్గిర పదిరూపాయలు బదులు తీసుకున్నా. ఆ రుణం తీరేదాకా మనస్సు బాధిస్తూంది" అంటూ పదిరూపాయలు తెచ్చి ఆమె చేతిలో పెట్టింది మాలతి.

"అమ్మాయ్! నువు నిజంగా పెద్దఇంటి పిల్లవిగా కనిపిస్తున్నావ్. నా జయ చేతులో ఎంతో డబ్బు మెలిగేది. ఏం లాభం? తల్లినిగదా, ఒక ఎర్రనేగాణి అయినా ఇచ్చేరగదు!" అంటూ కళ్లు తుడుచుకుంది.

"మేం పేదవాళ్లమే అయినా ఒహళ్ల రుణాన ఉండం. తిండికి లేకపోయినా దానం, ధర్మం మానం. మరి, రేపొస్తావా?"

"ఆ_ఎందుకని రానూ?"

"యజమానురాలు రాగానే మీరొచ్చి వెళ్లారని చెబుతాలెండి"

"వొద్దు వొద్దు. చెప్పనక్కర్లేదు. మరి వెళతా. నీ దగ్గరికి వస్తుంటానులే" అన్నది.

"అలాగే వస్తూండండి!" అని చెప్పింది, మాలతి.

బ్జెంహావతితల్లికీ తనకూ మధ్యని జరిగిందంతా పూసగుచ్చినట్టు చెప్పింది మాలతి. అంతా విని కడుపు చెక్కలయ్యేట్టు నవ్వాడు. మళ్లీ మళ్లీ వినోదంగా లక్షప్రశ్నలు వేశాడు. ఆ సందార్భాలన్నీ గుచ్చి గుచ్చి అతడడిగిన దానికల్లా వివరంగా విశదంగా జవాబులు చెప్పింది మాలతి.

గట్టిగా నవ్వుతూ "అయితే పారిపోయిందనుకుంటాను" అన్నాడు సురేంద్ర.

''అవును. వెంటనే వెళ్ళిపోయింది. లేకపోతే నేను పచ్చడయేదాన్ని..."

''ఇహ ఇక్కడికి రాదనుకుంటా" అన్నాడతడు

"నా దగ్గిరికిమాత్రం వస్తుంటానంది''

"ఎవరిదగ్గిరకైనా రానీ, రాకపోనీ, నువుమాత్రం ఇలా రా.''

దగ్గరకు రాగానే మాలతి చేతులు పట్టుకుని ''మాలతీ! నీ చేష్టలు నాకేం నచ్చలే. ఎన్నాళ్లిలా గడుపుదామని?"

"సొమ్ములు పెట్టుకుంటే వస్తుందా అందం?''

"అలా అని కాదు. అలంకారంలేని నీ మూర్తిలో ఓ పెద్ద జ్యోతి వున్నది. నీ నిర్మల తేజస్సు ప్రకాశిస్తున్నకొద్దీ నిన్ను ముట్టుకోటానికే నాకు భయమవుతూంది నీదగ్గిర నించునే ధైర్యంకూడా నాకు లేదు. నీ అందాన్ని కొంతవరకైనా నగలు కప్పిపుచ్చితే మంచిదని..."

రాత్రి నిశ్శబ్దం. గదిలో మాలతికి భ్రమ కలిగింది— ఎదర నిలువుటంలో తన ఆరాధ్యదేవుడైన సురేంద్రుడు కనిపించాడు. ఆనందంతో ఆశ్చర్యంతో ఆమె కళ్లు మూసుకుంది.

మర్నాడు సాయంత్రం సురేంద్రుడు సాక్షాత్తు ప్రత్యక్షమయ్యాడు. మెళ్లో పూలదండ, చెంకీదండలు – మెడలోను ఛాతీపైన వేలాడుతూ గులాబీ పువ్వులు. ఈ అలంకారాలతో ఒక పువ్వులగుత్తి చేతపట్టుకు వచ్చాడు గదిలోకి.

నవ్వుతూ మాలతి అన్నది: "ఏమిటీ వేషమంతా?"

''నువ్వు రోజూ పూజ చేస్తావుకదా, బరిణెలో కుంకుమతీసి నన్ను అభిషిక్తుణ్ని చెయ్! దాపరికమెందుకూ? ఇప్పటికి నా కళ్యాణఘడియ తోసుకు వచ్చింది.''

"ఎవరితో?"

''ముందు నా నొసట తిలకముంచు!"



బొట్టుపెట్టి "ఇప్పుడు చెప్పండీ!" అంటూ అతడి కళ్లలోకి చూసింది. అప్పుడతడు ఒకటొకటిగా ఆ దండలు ఆమెకు వేశాడు. ఒక బరిణలోంచి తీసి, అపరూపమైన రకరకాల ఆభరణాలతో ఆమెను అలంకరించాడు.

ఆమెను ముద్దుపెట్టుకుని "నీతో ఇప్పటికి పెళ్లయింది. ఇహ నువు నా భార్యవు. నన్నువదిలి నువ్వెక్కడికీ పోలేవు. ఈ నా చేతుల్తో వేసిన హారాలను జన్మాంతరాలకూ నువు తియలేవు" అన్నాడు. ఇద్దరికీ బాష్పధారలతో కళ్ళు నిండినై. "ఇహ ఇంటికి పద గృహస్థధర్మం నెరవేరుద్దువుగాని, నీ జీవితమంతా సుఖ సంతోషాలతో గడపాలని నా ఆశీర్వాదం!"

మాలతి ఇంకా ఎక్కువగా దుఃఖంలో మునిగిపోయింది. "మాలతీ ! ఏం, అలా వున్నావ్ ? అమ్మా నాన్నా జ్ఞాపకమొచ్చారా ?" అనడిగాడు.

"అవును"

"నే ననుకున్నపని నువ్వే చెయనీయడంలేదు. నువు దొరికినప్పుడే నాకు భాగస్వామి లభించిందనుకున్నాను. మళ్లీ ఒకపర్యాయం గృహస్థుణ్ణవుదామనీ, నీ తల్లిదండ్రుల్ని ఇక్కడికి తీసుకువచ్చి సుఖంగా వుంచుదామనీ అనుకున్నాను. ఆ ఆశ నిరాశ అయింది..." అంటూ నిట్టూర్చాడు...ఇహ ఇంటికి వెళదామా?" అంటూ ఆమెకేసి చూశాడు.

"ఎక్కడికీ ?"

"నేనుండే చోటుకి"

"ఇది నా యిల్లు కాదు."

"అయితే అక్కడికి రావా ?"

"రాను"

"నాకు తెలుసులే, నువు రావని."

# 26

కష్టపురోజులు కాపురమున్నట్టే అనిపిస్తాయిగాని, గబగబ నడిచినట్టు తోచవు.

మాధవుడు పోయాక సుభద్రస్థితి అలానే వుంది. అందులోనూ అది గడ్డు వర్షాకాలం. ఆ తేమలో బురదలో రేవుకి వెళ్లడం, స్నానంచెయ్యడం, వండటం, పెట్టడం ఎలా చేసుకువచ్చేదో ఆ తల్లి ! ఆమెను చూసినవాళ్లు 'పగవాళ్లకూ కూడా వొద్దురా దేవుడా, ఇలాంటి కష్టాలు' అనుకుని జాలిపడేవారు.

ఇప్పుడు సుభద్రలో నవ్వూ లేదు, ఏడుపూ లేదు. పైగా ఇల్లంతా శూన్యంగా వుంది. చలన ఏమో అత్తారింటికి కెళ్లిందాయె. రాసమణి పగలంతా ఇంటో ఉండదు. ఇహపోతే, హారాన్ చిన్నపిల్లాడిలాగా బెల్లించుకుని రోజూ రెండు పూటలా పావలా బేడ ఒడుక్కుపోతుంటాడు. సదానందుడికి భోజనం పెట్టేసి సుభద్ర వంటింటోనే పమిటపరుచుకు పడుకునేది. ఇవాళ మధ్యాహ్నం అలానే పడుకునుందామె.

"పోస్ట్ !—" అని పిలుపు.




ఆశ్చర్యంతో వెళ్ళి చూసింది. ఆమెకే రిజస్టరీ ఉత్తరం, సంతకం పెట్ట మన్నాడు పోస్టుమన్. ఎలానో బ్రహ్మాండం మీద సంతకం పెట్టింది. గదిలోకి వెళ్ళి కవరు చించి చూస్తే అందులో యాభై రూపాయలనోటున్నది. అదెవరివో తనకిచ్చి పోయాడనుకుంది. తీరా వెనక్కి పిలుద్దామనుకునేప్పటికి బంట్రోతు వెళ్ళేపోయాడు; పోనీ అంటే మర్నాడు కూడా అతడు రాలేదు.

తరవాత సదానందుడితో చెప్పిం దీసంగతి. అడ్రస్సు ఏమీ తప్పులేదనీ అది సుభదకేననీ రూఢిగా చెప్పాడతడు. ఆ కవరు కలకత్తానించి వచ్చినట్టు రాసి వుంది. అందుకని సదానందుడు పోస్టాఫీసుకి వెళ్ళి కనుక్కు వచ్చి సుభదతో చెప్పాడు: "అఘోరనాధ్ అనే వకీలు ఈడబ్బు పంపించాడు."

"కలకత్తాలో నాకెవరూ బంధువుల్లేరు, ఇది నాక్కాదు. పస్తు అయినా వుంటా గాని ఒహళ్ల డబ్బు నాకొద్దు. ఉపాయం ఆలోచించి ఇది తిరిగి పంపించెయ్ నాయనా!" అంటూ ప్రాధేయపడింది, సుభద.

ఆమె పట్టు పట్టింది. సరే అని చెప్పి కలకత్తా వెళ్ళి నిజానిజాలు కనుక్కో టానికే నిశ్చయించుకున్నాడు సదానంద.

27

విశాలమైన ఆఫీసు, చక్కటి ఏర్పాట్లు. అఘోరనాధ్‌వసు ఓ కుషన్‌లో కూర్చుని వున్నాడు. ఇంకో మెత్తటి కుషన్ కుర్చీలో నారాయణపురప్పు జమీందారు సురేంద్రనాధ్. వసుగా రెదట పెద్దటేబిల్‌మీద దావా కాగితాలు గుట్టగుట్టలుగా వున్నాయ్!

"ఇంత మాత్రానికే అధైర్యపడితే ఎలా? ఇంకా హైకోర్టుందిగా?" ప్రశ్న వేశాడు వసు.

"ఉన్నా, అంతదూరం వెళ్లటం ఇష్టంలే" అన్నాడు సురేంద్ర.

అయితే మాల్‌పూర్ సంపదంతా వదలుకోవటమే? పెద్ద రాబడి పోతుందే?"

సరిగ్గా అప్పుడే నవుకరొచ్చి "ఎవరో బ్రాహ్మణ పండితుడిలా వున్నాడు. మిమ్మల్నిప్పుడే కలుసుకోవాలిట. మళ్లీ తొందరగా వెళ్ళిపోవాల్ట!''

"ఏం, గదిలోకి పిలవనా?" అనడిగాడు వసు.

"తప్పేముంది, పిలిపించండి!"

కొత్తవ్యక్తి గదిలోకి వచ్చాడు. కూర్చోమన్నాడు అఘోర్‌బాబు.

"నేను అఘోర్‌బాబుగారి కోసం......"

"నా పేరే అఘోరనాధ్ బాబు."

వెంటనే బొడ్డులోనించి ఓ కాగితం బైటికితీసి, "ఈ రూపాయలు సుభదా దేవికి పంపింది మీరేనా?" అవుననగానే మళ్లీ మళ్లీ రకరకాలుగా తర్కించి అడిగాడు: ఎందుకు పంపారనే ప్రశ్నకు "మా యజమానిగారి అనుమతితో" అన్నాడు గాని, పేరు చెప్పలే.

"అయితే ఈ డబ్బు తిరిగి తీసుకోండి. ఆమెకు తీసుకోవడం ఇష్టంలేదు. ఎవరికో పంపాల్సింది ఆమెకు పంపారనుకుంది. ఇంతకూ ఇదేవిటో కనుక్కు-రమ్మని నన్ను పంపింది."

"ప్లీడర్ల వద్ద అలా పొరపాట్లు జరగవ్."

"తెలుసు. అయినా, ఆమెగారు ఇచ్చేసి రమ్మన్నారు."

"నా యజమాని అనుమతిలేందీ నేను తీసుకోలేను."

"వారిని కనుక్కోండి. మళ్లీ నేను రేపొస్తా" అని లేవబోతుంటే "తమ పేరు?" అనడిగాడు, సురేంద్రబాబు,

"నా పేరు సదానంద చక్రవర్తి."

తుళ్ళిపడ్డాడు సురేంద్ర. "మీరీవూళ్ళో ఎక్కడ దిగారు?"

"ఇంకా ఆలోచించుకోలేదు. పని పూర్తి అయితే ఇవాళే వెళ్తాను..."

సురేంద్రుడు "రాత్రికి వస్తానండీ!" అని వకీలుకు చెప్పి, సదానందుడితో "మీతో కొంచెం మాటాడాలి మా ఇల్లిక్కడే దగ్గర్లోనే. ఇప్పుడు లేచిపోతే ఓమాటు వస్తారా?"

ఇద్దరూ బండిలో కూర్చున్నాక సదానందుడు "మిమ్మల్ని నే నెప్పుడూ చూళ్లేదు. నన్ను మీ రెక్కడయినా చూశారేమో గుర్తులేదు" అన్నాడు.

"మీరు నన్నెక్కడా చూడలేదు. కాని మీరెవరో నాకు తెలుసు" అన్నాడు సురేంద్రుడు.

బండి ఇంటికి వచ్చి ఆగింది. సురేంద్రుడు వచ్చి "మేమూ బ్రాహ్మలమే? ఇప్పటికే చాలా వేళయిపోయింది. లేచి మడి కట్టుకోండి" అన్నాడు. భోజనాదులు ముగిశాక ఇద్దరూ తీరికగా కూర్చుని ప్రసంగం మొదలుపెట్టారు.

"సుభద్రాదేవి పేదరాలు కదా!"

"ఆమె పేదతనంతో మీకేం పని?"

"ఎవరైనా ధర్మమిస్తే పుచ్చుకోదూ?"

"తెలియని వాళ్ళిస్తే ఎందుకు పుచ్చుకుంటుంది?"

"దానం చేయటానికి ఎవరికైనా అధికారముంది."

"చెయ్యొచ్చు కాని, పుచ్చుకునేవాళ్ళ కిష్టం ఉండొద్దూ?"

"జరగనప్పుడు ఇష్టమొహటా?"

"ధర్మభిక్ష తీసుకోకపోయినా సుభద్రకు గడుస్తుంది" అన్నాడు, కోపంగా సదానందుడు.

"ఇప్పుడు గడుస్తుందేమో, కాని మునుపు?"

"మీ కిదంతా ఎలా తెలుసు?"

హారాన్‌బాబు, అతని వ్యసనాల గొడవా వొచ్చింది. "మీరే వాళ్ళకి సాయం చేస్తున్నారటగా?" అనడిగాడు సురేంద్ర.

"దేవుడు చేస్తున్నాడు. నేనో దరిద్రుణ్ణి!" అన్నాడు సదానంద. తరువాతి ప్రశ్నలకు చలనకు ఫలానా సంబంధం అయిందనీ, మాధవుడు పోయాడనీ, సుభద్ర పెద్దకూతురు ఆత్మహత్య చేసుకుందనీ భోగట్టా లందించాడు. "ఆమె

నదిఒడ్డున పడివుంది. దాన్నిబట్టి ఆమె [illegible] అన్నాడు. ఈ విషయంలో ఎవరికీ అనుమానం కూడా లేదని చెప్పాడు.

"సరే బాగానేవుంది. ఒకవేళ ఈ రూపాయిలు ఆమే మీకు పంపివుంటే?"

"ఎవరు, లలనా?"

"ఆఁ—అవును—లలన. పొరపడ్డాను. అన్నట్టు, లలనా చలనా అక్కా—చెల్లెళ్లే కదూ?"

"అవును అయినా, చచ్చిపోయిన మనిషి డబ్బు పంపడ మేమిటి?"

"గంగ ఒడ్డున చీర దొరికితే, అంతమాత్రాన చచ్చిపోయినట్టే? ఒకవేళ ఆమె బతికివుండి, తన తల్లికి ఈ డబ్బు పంపివుంటే...?"

"బతికేవుంటే ఎప్పుడో ఉత్తరం రాసును!"

"సిగ్గువల్ల రాయలేదేమో?"

"లలన సంగతి నాకు తెలుసు. సిగ్గుపడాల్సిన పని ఆమె ఎప్పుడూచెయ్యదు."

"అయితే వినండి! మీరనుకున్నట్టు ఆమె చావలేదు, బతికే వుంది, నిక్షేపంలా. దారీ తెన్నూలేని తలిదండ్రులకోసం ఆమె ఇప్పుడీ డబ్బు పంపింది. ఇకముందు నెలనెలా పంపుతూ వుంటుంది కూడా."

ఆశ్చర్యంతో "అయితే లలన బతికి వుందంటారా? తమ పేరు?"

"సురేంద్రనాథరాయ్, మాది నారాయణపురం."

"హారాన్ సంగతి ఎలా తెలుసు మీకు?"

"లలన చెప్పింది."

"లలన చెప్పేదేమిటి, ఆమె చచ్చిపోయింది!"

"లేదు, హాయిగా బతికేవుంది"

"అవును, హాయిగా స్వర్గంలో..." అంటూ, "నాకు పనుంది, వెళ్ళాలి. మీరన్నట్టు ఆమె బతికేవుంటే, మమ్మల్ని ఎప్పుడైనా కలుసుకుంటే, నా ఆశీర్వాదాలు చెప్పండి మరచిపోకండి!"

"ఈ సంగతి ఆమె తల్లితో చెబుతారు కదూ!"

"ఆఁ—స్వర్గంలో వుందని..." అని చెప్పి, మెల్లి మెల్లిగా జారుకున్నాడు. మరి రాలేదు.

సదానంద వెళ్లాక సురేంద్రుడు చాలాసేపు కూచున్నాడు. ఇలాంటి సంఘటన మునుపు జరిగినట్టయితే అతడు నవ్వుకునేవాడే. కానీ ఇప్పుడు మాత్రం అతడికి కళ్ళనీళ్ళు తిరిగినై!

యువ




"బాబూ! బండీ సిద్ధం చెయ్యమన్నారా?" అన్నాడు నవుకరొచ్చి, అంతలో.

"ఊఁ—చెయ్!"

## 28

చాలా రాత్రయినా, మాలతి ఇంకా మేలుకునే వుంది. "సీతాదేవి వనవాసం" చదువుతూ ఎన్నోసార్లు ఏడ్చింది. కన్నీళ్ళు తుడుచుకుంది.

"లలనా!" బయటినుంచి పిలుపు.

కంపించింది మాలతి. పుస్తకం కిందికి జారిపోయింది!

"లలనా!"

"ఎవరూ?"

"లలనా?" మళ్లీ పిలుపు.

"మీరా?"

"అవును నేనే. పట్టుబడి పొయ్యావ్. పేరెందుకు మార్చుకున్నావ్? నన్నెందుకని మోసపుచ్చావ్?"

"ఎక్కడ?"

కున్నాడు. "అంతా విన్నానులే, కలకత్తాలో!"

"నన్నెవరూ ఎరగరే అక్కడ?"

"లేదులే, హోలాద్‌పూర్‌నించి నిన్ను తెలిసినవాళ్ళు వచ్చారు."

"ఎవరండీ వారు?"

"ఇంకెవరూ? మీ సదాన్నయ్యే! ఆ నోటు తిరిగివ్వడానికి వచ్చాడు!"

"సదాన్నయ్యా! ఎలా వున్నాడూ?"

"బాగానే ఉన్నాడు. మీ అమ్మ బాగానే వుందిట. మునుపటంత బీదస్థితిలో లేదుట. వాళ్లకి సదానందుడే అన్నివిధాలా సాయంచేస్తూ చేదోడుగావుంటున్నాడు."

"నాపేరు మీకెవరు చెప్పారూ?"

"అతడే. నువ్వు చచ్చిపోయ్యా వనుకుంటున్నారట అందరూ. బతికే వున్నా వని నే చెప్పా.

"ఎందుకలా చెప్పారూ?"

"బతికి సుఖంగా ఉండగా అబద్ధ మెందుకు చెప్పాలీ?"

"సదాన్నయ్యే అడిగాడా ఈ సంగతి?"

"లేదు. నేనే చెప్పా. మీ అమ్మకూ్కడా చెప్పమన్నా. నువ్వే ఈ డబ్బు పంపావని కూడా..."

"హయ్యో, ఎందుకు చెప్పారండీ? నా జీవితమంతా నాశనం చేశారు. అసలే అతడు పిచ్చిమనిషి, ఇహ ఈగొడవ ఊరంతా చెప్పుకుని అదేపనిగా తిరుగు తాడు. నేను చచ్చిపోయినట్టు వాళ్ళంతా అనుకుంటూవుంటే మధ్యని ?"

"మీ రనుకుంటున్నారు గాని, అతడిలో పిచ్చేమీలేదు. ఎంచక్కా మాటా డాడు! నీ చెల్లికి పెళ్లయిందని కూడా చెప్పాడు."

"అయిందా? ఎవరితో?" సంతోషంతోను ఆశ్చర్యంతోను అడిగింది.

"ఆవూళ్లోనే. శారదాచరణుడితో!"

"అనుకుంటూనే వున్నా, ఇదే ఖాయమవుతుందని. లోగడ ఒకసారి ప్రార్థించాను, చలనను జేసుకోమని. అప్పుడు తండ్రికి భయపడి వప్పుకోలేదు. నేను చచ్చిపోయానని జాలితో చేసుకున్నా డనుకుంటా."

"అన్నట్టు మాధవుడి సంగతేమన్నా అడిగారా?"

"బాగానే వున్నాట్ట?"

పెద్దగా నిట్టూర్చింది మాలతి. రాత్రి ఎంతకూ నిద్రపట్టలేదు. ఎన్నెన్నో విషయాలు జ్ఞాపకానికి వచ్చి, ఆమె మనసులో తిరిగినై.

సదానందుడు ఇంటికి మళ్లుతున్నాడు. దారి పొడుగునా ఏవో ఆలోచనలే. ఇల్లు చేరాడు. ఆ నోటు సుభద కిచ్చి "సంగతేం తేలలే" దన్నాడు.

"అయితే, వెళ్ళిన పని కాలేదన్నమాట? మరి, ఈ పైకం ఏంచెయ్యాలి?" అనడిగింది.

"మీ ఇష్టం, మీ డబ్బు, కావాలంటే పేదవాళ్ళకి పంచిపెట్టండి, లేదా ఖర్చు చెయకుండా అలానే వుంచండి జాగ్రత్తగా. ఎప్పటికయినా అంతు తెలిస్తే :రే సరి. నే చెప్పేదేముంది?"

సుభదకు విసుగెత్తింది. పెట్టెలో పెట్టి తాళం వేసేసింది.

ఆవేళ సాయంకాలం పెద్ద గాలివాన. ఉదయాన్నే వంటచేసేసింది సుభద. తిండి తిన్నాక దబ్బేమన్నా ఉంటే కొద్దిగా ఇమ్మన్నాడు హారాన్. "మేఘాలు జోరుగా పరుగెడుతున్నాయి. మళ్లీ గొప్ప వర్షం పడేలావుంది. ఎక్కడికీ వెళ్ళకండి. ఇంటోనే వుండండి" అన్నది సుభద.

"వస్తే రానీ వర్షం. ఇవాళ తలమునిగే పనులు బోలెడు వున్నయ్. వర్షానికి ఝడిస్తే ఎలా?" ఆ పన్లేమిటో సుభదకు తెలుసు. ఏం చెప్పినా, ఎంత చెప్పినా, వినిపించుకోలేదు హారాన్. డబ్బు బొడ్లో దాచుకుని, తలమీద గుడ్డ వేసుకుని, ఆ బురదతో వున్న పంచెనే పైకి ఎగదోపుకుని వెళ్ళిపోయాడు. నిట్టూర్చింది సుభద.

ఇటీవల సుభదకు రోజూ జ్వరంకాస్తూంది. కాని ఎవళ్ళకీ తెలియనివ్వలే దామె. అందులోనూ ఇప్పుడు వర్షం చలీవల్ల జ్వరంతో ఒళ్ళుతెలియని స్థితిలోవుంది. చేతికి దొరికిందాంతో ముసుగు కప్పుకు పడుకున్నది సుభద.

ఇటువంటి సమయంలో—ఎవరో తలుపు తట్టినట్టయింది. టకటకమని చప్పుడుతో తలుపు తెరుచుకోనే తెరుచుకుంది. సన్నటి దీపపు వెలుగులో ఓ మనిషి గదిలోకి రావడం కనబడింది. ఆ మనిషిచేతిలో వెదురుకర్ర ఒకటీ, ఒళ్ళంతా నల్లటిరంగు పూత, దానిపైన తెల్లటి మచ్చలు!

"బాబోయ్! ఎవరో!—"అని అరిచింది సుభద.

"నోర్ముయ్!" భయపెట్టిందా గంభీరమైన కంఠం.

ళాలు...! అంటూ మంచం దగ్గరికొచ్చి రెండుసార్లు టకటక కొట్టింది ఆ ఆకృతి! అతడి కంఠస్వరం ఏదో బొంగురుగా తెచ్చిపెట్టుకున్నట్టుగా వినిపించింది.

మాటాడలేదు సుభద్ర.

"తే, తే, చప్పున తాళం! ఊఁ—లేకపోతే గొంతు పిసికేస్తా! చంపేస్తా! హూ!!—" అంటూ మళ్లీ టకటక నేలపైనకొట్టిం దా స్వరూపం!

సుభద్ర లేచింది, కూచుంది. తలగడ కిందినుంచి తాళంగుత్తితీసి అతడివేపు విసిరేసింది! తరవాత శాంతంగా, మెల్లిగా చెప్పింది—"నా పెద్దపెట్టె కుడిపక్కన సొరుగులో యాభైరూపాయల నోటుంది. అది తీసుకో నువ్వు! ఎడం పక్కన విశ్వనాథబాబా ప్రసాదముంది, దానిమీద మాత్రం చెయివెయ్యక!"

ఏనాటినించో ఆ పెద్దపెట్టె మర్మం తెలిసిన వాడిలాగా అతడు గుత్తిలో చెవి తీసి తాళం తెరిచాడు. చెప్పినట్టుగానే ఎడంపక్కన మాత్రం చెయి వెయలేదు. సుభద్ర ఎలా చెప్పిందో సరిగ్గా అలానే కుడిపక్కన సొరుగులోంచి ఆ యాభై రూపాయలనోటు తీసుకొని, బొడ్లో దోపుకున్నాడు!

అతడు వెళ్ళిపోతూంటే సుభద్ర పెద్దగా నిట్టూర్చింది. మెల్లిగా ఇలా సలహా మాత్రం చెప్పింది—"ఇదిగో చూడూ, నోటుమీద పేరు రాసుంది సుమా! నంబరు కూడా ఉన్నదేమో. కాస్త జాగర్తగా మార్చుకో!!"






వైశాఖమాసంలో ఒకనాటి మధ్యాహ్నన ఎండ మహా తీక్షణంగా ఉన్నది. ఇక తాపం చెప్ప శక్యమేగాదు. సరిగ్గా ఇలాంటి సమయాన ముఖర్జీలవారి అబ్బాయి దేవదాసు పాఠశాలలో ఒక మూలను చింకి చాపపై కూర్చుని, కళ్ళు మూస్తూ, తెరుస్తూ, కాళ్లు చాపి, పలక క్రిందపెట్టి, ఆవలించి, చివరకు మహా ఆలోచనలో పడిపోయాడు. పడి, ఇలాంటి చక్కటి సమయాన గాలిపటం ఎగరవేసుకుంటూ పొలాలమీద తిరగటానికి బదులు పాఠశాలలో కట్టుపడి వుండటం ఏమాత్రం మంచిది కాదని స్థిరపరచు

[illegible]

పలక చేతపుచ్చుకుని లేచి నిలబడినాడు

[illegible] తండ్రి కూడా వదలవద్దన్నాడు. ఈ కారణాలన్నిటి [illegible] ఈ సమయంలో బడిపెద్ద 'భోలా' ఆవార్తిలో ఉండవలసి వచ్చింది.

పాఠశాలలో ఇపుడు పంతులుగారు ఒక్కరు మాత్రం మధ్యాహ్నపు బడలికచేత కళ్ళు మూసుకొని కునుకుతున్నారు. బడి పెద్ద భోలా ఒకమూలను వీపూ కాళ్ళూ విరిగిన బెంచిమీద చిన్నపంతులుగారి టీవితో కూర్చుని, మధ్య మధ్య మహానిర్లక్ష్యంగా ఒకమాటు పిల్లలకేసి చూస్తూ మరోమాటు దేవదాసు పార్వతుల మీద యాదృచ్ఛికంగా ఒకచూపు పారవేస్తూ ఉన్నాడు. పార్వతి రెండుమూడు మాసాల క్రిందటనే పంతులుగారి అదుపు ఆజ్ఞలలోకి వచ్చింది. బహుశా, ఈ కొద్దికాలంలోనే పంతులుగారు ఆ పిల్ల మనస్సును రంజింపజేసి ఉండవచ్చును. అందుచేతనే, ఆ పిల్ల ఏకాగ్రచిత్తంతోనూ, పరిశీలన ధైర్యంతోనూ, నిద్రిస్తూ ఉన్న పంతులుగారి చిత్రాన్ని బాలశిక్ష [illegible] పేజీ మీద సిరాతో గీస్తూ అప్పుడప్పుడు, దక్ష చిత్రకారిణివలె- తాను మహాశ్రద్ధతో గీస్తూ ఉన్న చిత్రంలో తన ఆశయా లెంతవరకు ఫలించాయా అని- [illegible] వంగి చూస్తూ ఉన్నది- ఎక్కువ ఫలించిందనటానికి వీలులేదు. కాని అంతకే పార్వతి మహా ఆనందమూ, తృప్తీ, అనుభవిస్తూ ఉన్నది.

ఈ సమయంలోనే దేవదాసు పలకచేతపుచ్చుకొని లేచి నిలబడి, భోలాను ఉద్దేశించి బిగ్గరగా- 'లెక్క కుదరటంలేదు' అని అన్నాడు.

"ఏ లెఖ్ఖ?" అని భోలా శాంత గంభీరస్వరంతో అడిగాడు.

"మణుగు ల్లెఖ-"

"పలకేదీ?"

దీని అర్థం ప్రతివిషయానికీ పలక తనకు తెచ్చి చూపించమని. దేవదాసు పలక చేతికిచ్చి దాపునే నిలబడ్డాడు. భోలా బిగ్గరగా పైకి అంటూ వ్రాయ నారంభించాడు: "ఒక మణుగు నూనె ధర పద్దానుగురూపాయలా, తొమ్మిదణాలా, మూడు పైసలైతే."

ఈ సమయంలోనే ఒక ఘటన ఘటిల్లింది. కాళ్ళూ వీపూ విరిగిన ఈ బెంచీని





బడిపెద్ద భోలా తన పదవికి తగిన ఆసనంగా నిర్ణయించుకుని, నియమం తప్పకుండా ఇప్పటికి మూడు సంవత్సరాల నుంచీ కూర్చుంటూ వస్తున్నాడు. బెంచీకి వెనక ఒక బొడి సున్నపురాసి వృక్షంది. పంతులుగారు దీన్ని ఎప్పుడో, ఏ యుగంలోనో చాక ధరకు కొని దాస్తోపెట్టారు. రోజులు సవ్యంగా ఉంటే దీనితో గట్టికొలువ చేయించాలని వీరి ఉద్దేశము. ఆ శుభముహూర్తం ఎప్పుడు వస్తుందో తెలియదనుకొండి. ఈ శ్వేత చూర్ణంమీద వీరికి శ్రద్ధా, భ్రమా మాత్రం విపరీతంగా ఉండేది. అవనిశా వదన్నలూ, ప్రపంచ జ్ఞానశూన్యులూ అయిన విద్యార్థులు దీనిలో ఒక్క రేణువు కూడా నష్టం చేయకుండా ఉండగలందులకు, తనకు ప్రియప్రాప్తుడూ, అందరిలోకీ వయసుకు కొంచెం పెద్దా అయిన భోలానాధునికి—తాను మహాయత్నంతో కూడబెట్టిన వస్తువును—జాగ్రత్తగా కనిపెట్టి ఉండేభారం వప్పగించాడు. అందువేతనే భోలా ఈ బెంచీ మీద కూర్చుంటూ ఉండేవాడు.

భోలానాధుడు వ్రాస్తున్నాడు:— "ఒక మణుగు నూనెధర పద్దానుగురూపాయలా, తొమ్మిదణాలా, మూడుపైసలైతే....అమ్మనాయనో"— తర్వాత పెద్ద గందరగోళం అయింది. పార్వతి బిగ్గరగా చీత్కారంచేసి, చప్పట్లు కొట్టుతూ నేలమీద పొర్ల నారంభించింది. నిద్రాభంగం కావడంచేత, గోవిందపండితుడు రక్త నేత్రాలతో చివుక్కుమని లేచి నిలుచున్నాడు. చెట్టుక్రింద వున్న పిల్లలు వరసగా నిలబడి 'ఛక్ ఛక్' మంటూ పరుగెత్తుతూ వీరి కంటపడ్డారు. అటునుంచి దృష్టి మరల్చి పాత

ఉన్నాయి;
సున్నం మధ్యనుంచి అగ్నిపర్వతంలోంచి వచ్చినట్టుగా పొగ వస్తూ ఉన్నది.

"ఏంటి? ఏంటి? ఏంటిరా?" అని కేకపెట్టారు.

చెప్పటానికిక అక్కడ మిగిలిందల్లా పార్వతి. కాని, ఇంకా ఆ పిల్ల నేలమీద పొర్లుతూ చప్పట్లుకొట్టుతూ ఉన్నది. పంతులుగారి విఫలప్రశ్న, క్రుద్ధభావంతో 'ఏంటి? ఏంటి? ఏంటిరా?' అని తిరిగి వచ్చింది. తర్వాత శ్వేతమూర్తి భోలానాధుడు సున్నం పడనెట్టుకొని లేచి నిలబడ్డాడు. పంతులుగారు మరల చీత్కారం చేశారు : 'కోతి వెధవా! నువ్వేనా దాంట్లో?"

"ఊఁ- ఊఁ- ఊఁ-"

"మళ్ళీ?"

"దేవాయ్- పడేసి- ఊఁ-ఊఁ- మణుగుల్లెఖ-"

"పైగా పితుర్లా!"

కాని తర్వాత సంగతంగా గ్రహించి చాపమీద కూర్చుని- 'దేవాయ్ పడేసి పారిపోయాడా?' అని అడిగాడు.

"ఊఁ, ఊఁ, ఊఁ' అని భోలా పెద్ద పెట్టున ఏడ్చాడు.

తర్వాత కాసేపు సున్నం దులిపారు. కాని, తెలుపు పూర్తిగా పోకపోవడంచేత నల్లని భోలా భూతం మాదిరిగా కనిపించ నారంభించాడు. అప్పటికీ వాడి ఏడుపు తగ్గలేదు.

"నిజంగా దేవాయేనా పడేసి పారిపోయింది?" అని పంతులు మళ్ళీ అడిగాడు.

"ఊఁ——ఊఁ——"

"వాడి పని చెపుతాలే!"

"ఊఁ——ఊఁ——"

"మిగతా వెధవలేరీ?"

పిల్లలు కొందరు జేవురించిన ముఖాలతో రొప్పుకుంటూ వచ్చి దేవదాసు చిక్క లేదని చెప్పారు.

ఒకడు——"అబ్బా, రాయి ఎంత గురిగా——"

పంతులు——"చిక్కనే లేదా?'?

ఇంకో కుర్రవాడు వెనకటివాడి మాటనే ప్రతిధ్వనింపబోయాడు :

'అబ్బా, రాయి——'

'నువ్వూరుకోరా వెధవా——'

వాడు మాటదిగమింగి పక్కకుపోయి నిలబడ్డాడు. నిష్ఫల క్రోధంచేత మొదట పంతులు పార్వతిని బెదిరించాడు. తర్వాత, భోలానాథుని చేయిపట్టుకుని- 'పద, ఒకమాటు కచేరీ చావిడికి పోయి కనపడివద్దాము' అన్నాడు.

దీని అర్థం ఏమిటంటే, జమీందారు నారాయణముఖర్జీగారి దగ్గిరికి పోయి వారి కొడుకుమీద ఫిర్యాదు చేద్దామని.

అప్పుడు మూడు గంటలై ఉంటుంది. జమీందారు నారాయణ ముఖర్జీగారు పంచపాళిలో కూర్చుని హుక్కా తాగుతున్నారు. నౌకరొకడు విసనకర్రతో విసురుతున్నాడు. విద్యార్థులను వెంట పెట్టుకొని వేళకాని వేళను పంతులు రావడంచూసి నారాయణబాబు కొంచెం విస్మితుడై- 'గోవిందుడా?' అని అన్నాడు. గోవిందుడు కాయస్థుడు. నేలకు వంగి నమస్కరించి, భోలాను చూపించి సంగతంతా సవిస్తరంగా వర్ణించాడు.

ముఖర్జీగారు విరక్తుడై—'అదే, చూస్తే దేవాయ్ చెయ్యి మిగిలిపోయేటట్టుగా ఉన్నాడు!' అన్నాడు.

'ఏమి చేయమంటారో తమరే సెలవివ్వండి.'

నారాయణబాబు హుక్కాగొట్టం క్రిందపెట్టి 'వాడు ఎక్కడికి వెళ్లాడు?' అని అడిగాడు.

'నాకెలా తెలుసునండీ? పట్టుకోబోయినవాళ్ళను రాళ్ళతో కొట్టాడట.'

కాసేపు ఇద్దరూ మాట్లాడలేదు. తర్వాత నారాయణబాబు 'ఇంటికి వచ్చాక ఏదో వొకటి చేస్తా'నని చెప్పి పంతుల్ని పంపించాడు.

గోవింద పండితుడు కుర్రవాడి చేయిపట్టుకుని పాఠశాలకు తిరిగివచ్చి కళ్ళతోనూ, ముఖంతోనూ, నానావిధ భావభంగులతోనూ, పిల్లకాయల నందరినీ భయపెట్టి- "దేవదాసుతండ్రి ఈ ప్రాంతానికి జమీందారయితే అయ్యాడు. కాని, వాణ్ణిమాత్రం ఇక బళ్లో అడుగుపెట్టనివ్వ"నని ప్రతిజ్ఞచేశాడు. ఆ రోజున బడి మామూలుకంటే కొంచెం ముందుగానే వదలిపెట్టాడు. దోవను వెళ్ళేటప్పుడు కుర్రాళ్ళు ఈ విషయమే చర్చింప నారంభించారు.

ఒకడు—అబ్బ! దేవాయి ఎంత పొగరుబోతురా!

ఇంకొకడు—భోలాకు బుద్ధి చెప్పాడురా!

మరొకడు—అబ్బ ఏం గురిరా!

వేరొకడు భోలాను సమర్థించాడు- -చూస్తారుగా, భోలా తప్పక వాడిపని పడతాడు.

"హుష్, వాడిక బళ్ళోకి వస్తేగా ఏమన్నా చేయటానికి?"

ఈ పిల్లల గుంపుకు ఒక పక్కగా పలకా పుస్తకాలూ చేత పట్టుకొని పార్వతి కూడా ఇంటికి వస్తూ ఉన్నది. ఈ సంభాషణ విని దగ్గరగా ఉన్న కుర్రవాడి చేయిపట్టుకుని— "మణీ! దేవదాదాను ఇక నిజంగా బళ్ళోకి రానివ్వరా?" అని అడిగింది.

"ఉహూ! అసలు అడుగు పెట్టనివ్వరు" అన్నాడు మణి.

పార్వతి ఏడంగా పోయింది—ఈ సమాధానం ఆ పిల్ల కేమీ బాగుండలేదు. పార్వతి తండ్రిపేరు నీలకంఠ చక్రవర్తి, జమీందారుగారికి పొరుగు. అంటే ముఖర్జీ గారి పెద్ద మేడకు ప్రక్కనే వీరి చిన్న పురాతనపు డాబా. వీరికి పది పన్నెండు ఎకరాల పొలం, నాలుగైదిళ్ళ పౌరోహిత్యం, జమీందారుగారితో లావాదేవీలు కూడా ఉన్నవి. స్వాతంత్ర్యప్రియుడు—ఉన్నదానితో కాలం హాయిగానే గడుపుతున్నాడు.

పార్వతికి మొట్టమొదట ధర్మదాసు కనపడ్డాడు. వాడు దేవదాసుగారింటి నౌకరు, పదో మాసంనుంచి ఈ పన్నెండో సంవత్సరం వరకు దేవదాసును వదలకుండా ఉంటున్నాడు. వేళకు పాఠశాలలో వదిలిపెట్టేవాడు—తిరిగి వదిలే సమయానికి హాజరై మళ్ళీ ఇంటికి తీసుకువచ్చేవాడు. ఈ నియమం ఎతను అతిక్రమించేవాడు కాదు. ఇవ్వాళ అందుకోసమే బడికి వెళ్లుతున్నాడు. "ఏడీ, పారూ! మీ దేవదాదా ఏడీ" అని పార్వతిని చూడగానే ప్రశ్నించాడు.

"పారిపోయాడు!"

ధర్మదాసుకు మహా ఆశ్చర్యం కలిగింది. "పారిపోవటం ఏమిటే?"

పార్వతికి మళ్ళీ భోలానాథుని దుర్దశ తలపుకువచ్చి మళ్ళీ కొత్తగా నవ్వ నారంభించింది—"ఇదిగో ధర్మదా—హీ, హీ, హీ—ఒక్కమాటే సున్నపు గుట్టలో— హీ, హీ—హహాహా—ఒక్కమాటే ధర్మా. చిత్తుగా—"

ధర్మదాసుకు ఏమీ అర్థం కాకపోయినా పార్వతి నవ్వటంచూసి తను కూడా మొదట నవ్వాడు. తర్వాత నవ్వు నాపుకుని—"చెప్పు. పారూ! ఏమయింది?" అని బతిమాలాడు.

"దేవదాసు వెనక్కు పడేసి-భోలాని-సున్నపు గుట్టలో—హీ, హీ —"

ధర్మదాసు ఈమాటు మిగతాదంతా గ్రహించి చాలా చింతితుడయాడు. "పారూ! ఇప్పుడు వాడెక్కడ ఉంటాడో ఎరుగుదువా?"

"నాకేం తెలుసు?"

"నీకు తెలుసులే చెప్పుదూ! పాపం వాడికి చాలా ఆకలయిందనుకుంటాను."

"ఆ మాట నిజమే—కాని నేను చెప్పను."

'నీళ్లెక్కడ తెచ్చేది?'

"ఏమీ తేకుండా ఎందుకువచ్చా? పో, నీళ్లు తీసుకురా!" అన్నాడు విసుక్కుంటూ.

అతని కర్కశ స్వరం పార్వతికి బాగుండలేదు—"నేను మళ్ళీ పోలేను. నువ్వే తాగివద్దువుగాని రా" అన్నది.

"నే నిప్పుడు రాగలనా?"

"మరి ఇక్కడే ఉండి పోతావా?"

"ఇక్కడే ఉంటాను—ఆ తర్వాత ఎటో అటు వెళ్ళిపోతాను."

దేవదాసు శ్మశాన వైరాగ్యం చూపేవరకు పార్వతి కళ్ళల్లో నీరు తిరిగింది. అతని మాటలు ఈపిల్ల మనసును కలచివేశాయి "నేను కూడా వస్తాను, దేవదా!" అన్నది.

"ఎక్కడికీ?—నా వెంటా?—అదెలా?"

పార్వతి తల తిప్పుతూ—"నేనూ వస్తాగా?" అన్నది.

"ఉహుం, రానక్కరలేదు, ముందు నువు నీళ్ళు తీసుకురా."

"నేనూ వస్తాగా!" అన్నది పార్వతి మళ్ళీ పూర్వం మాదిరిగానే.

"ముందు నీళ్లు తీసుకురా!"

"నేను పోను—నువ్వు పారిపోతావు."

"అబ్బే, పారిపోనుగా."

కాని పార్వతికి ఈ మాటమీద విశ్వాసం కుదరలేదు. అందుచేత అక్కడినుంచి కదలలేదు. "పో, చెప్తుంటే!" దేవదాస్ హుకుమిచ్చాడు.

"నేను పోలేను."

దేవదాసు కోపంతో, పార్వతి జుట్టు పట్టుకులాగి—"పో, చెప్తుంటే!" అని గద్దించాడు. పార్వతి మాట్లాడలేదు. తర్వాత వీపుమీద ఒక గుద్దు పడింది. "పోనా?"

"నేను చచ్చినా పోను" అన్నది పార్వతి ఏడుస్తూ.

దేవదాసు అక్కడినుంచి లేచి వెళ్ళిపోయాడు, పార్వతి ఏడుస్తూ తిన్నగా దేవదాసు తండ్రి దగ్గరకువచ్చి నిలబడింది. ముఖర్జీగారికి పార్వతి అంటే చాలా ప్రేమ,

"పారూ! ఎందుకమ్మా ఏడుస్తున్నావు?" అని బుజ్జగిస్తూ అడిగాడు,

"దేవదాసు కొట్టాడు."

"ఏడీ వాడు?"

"ఆ వెదురు గుమ్మెల్లో కూర్చుని హుక్కా తాగుతున్నాడు."

అసలు పంతులుగారు వచ్చినప్పటినుంచే వారు ఉడికిపోతున్నారు. ఈ మాట వినగానే భగ్గుమన్నారు, "దేవాయి హుక్కాకూడా తాగుతున్నాడా?"



"ఆఁ, రోజూ తాగుతున్నాడు. హుక్కా ఆ వెదురు గుమ్మెలో దాచిపెట్టాడు—"

"ఇన్నాళ్ళనుంచీ ఎందుకు చెప్పలేదు?"

"కొడతాడని."

ఈమాట యథార్థం కాదు. వెల్లడిచేస్తే దేవదాసుచేత దెబ్బలు తినాల్సి వస్తుందనే భయం పార్వతికి ఎప్పుడూలేదు. దేవదాసుకే దెబ్బలు తగుల్తాయని యిన్నాళ్ళనుంచీ దాచింది. ఇవ్వాళ ఆ ఉడుకుమీద వెళ్ళగక్కింది. ఆ పిల్లకు ప్రాయం కూడా ఎంత? —ఎనిమిదేళ్ళు సరిగ్గా నిండలేదు. ఇంకా కోపం చాలా ఎక్కువ. అలాగని ఆ పిల్లకు వివేచనాశక్తి లేదనడానికి వీల్లేదు. ఇంటికిపోయి పక్కమీద పండుకుని చాలాసేపు ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది. ఆ రాత్రి అన్నంకూడా తినలేదు.

* * *

మర్నాడు దేవదాసును బాగా కొట్టారు. ఆ పగలంతా గదిలో పెట్టి గడియవేశారు. వాళ్ళ అమ్మ చాలా ఏడ్చి గోలచేసినమీదట వాడిని వదలిపెట్టారు. మూడోనాడు తెల్లవారకముందే తప్పించుకుని పార్వతి యింటి కిటికీ దగ్గరకు వచ్చి నిలబడి— "పారూ!" అన్నాడు.

పార్వతి రెండో పిలుపుకు కిటికీ తెరిచి—"ఎవరు! దేవదా?" అన్నది.

"ఆఁ. నేను! దబ్బున రా." అని దేవదాసు చేయి ఊపాడు. ఇద్దరూ కలుసుకున్నాక- "నేను హుక్కా తాగుతానని ఎందుకు చెప్పావు?" అన్నాడు.

"నన్నెందుకు కొట్టావు నువ్వు?"

"నువ్వు నీళ్ళు తీసుకు రావటానికెందుకు రాలేదు?"

పార్వతి మాట్లాడలేదు.

"ఇవ్వాళ గొడ్డుపు ఇకెప్పుడూ యిలాంటివి చెప్పమాకు!" అన్నాడు దేవదాసు.

"చెప్పనులే!" అన్నది పార్వతి.

"ఐతేపద, గాలం కొట్టుకొద్దాం. ఇవ్వాళ చెరువులో చేపలుపట్టాలి."

వెదురుగుమ్మెకు దగ్గరగానే గానుగచెట్టు ఒకటి ఉన్నది. దేవదాసు అది యెక్కి చాలా కష్టంతో వెదురుచువ్వ ఒకటి వొంచి పార్వతిక పట్టుకోమని యిచ్చి "జాగర్త, దాన్ని వదిలిపెట్టేవు? నేను క్రిందపడతాను" అన్నాడు. పార్వతి ప్రాణాలన్నీ బిగపట్టి ఆ కొమ్మ పట్టుకొన్నది. దేవదాసు అది పట్టుకుని గానుగకొమ్మమీద కాళ్ళుపట్టి చువ్వ కోస్తూ ఉన్నాడు.

"ఇక బళ్ళోకిరావా, దేవదా?" అన్నది పార్వతి క్రిందనుంచి.

"ఊహుఁ"

"పెదబాబు నిన్ను పంపుతాడుగా?"

"నాన్నే ఇక పోవద్దని చెప్పాడు—పంతులే యింటికి వస్తాడట!"

పార్వతి కొంచెం ఆలోచనలో పడింది.

"రేపటినుంచీ యీ ఎండాకాలమల్లా ప్రొద్దుటపూట బడి పెడతారట—నే నిక పోతాను." అన్నది పార్వతి కాసేపు ఉండి.

దేవదాసు పైనుండే "వల్లకాదు!" అని గుడ్లు ఉరిమాడు.

పార్వతి యీ సమయంలో కొంచెం పరధ్యానంగా ఉండి చేతిలో చువ్వ వదిలిపెట్టింది. చువ్వ పైకిపోవటమూ, దేవదాసు క్రిందపడటమూ ఒక్కమాటు జరిగాయి. ఎక్కువ ఎత్తు లేకపోవటంచేత దెబ్బలు తగలలేదు కాని ఒంటిమీద చాలాచోట్ల గీచుకుపోయింది. దేవదాసు మండిపడుతూ లేచి, ఎండుపుల్ల ఒకటి తీసుకొని, పార్వతి వీపుమీదా, చెంపలమీదా—అందిన చోటనల్లా యిష్టంవచ్చినట్టు—కొట్టి "పో, నా ఎదటనుంచి!" అని హుంకరించాడు.

మొదట పార్వతి చాలా సిగ్గుపడింది. కాని దెబ్బలు ఎక్కువ తగిలినకొద్దీ అభిమానంతోనూ, కోపంతోనూ ఆ పిల్ల కళ్ళు నిప్పులు కక్కినవి. ఏడుస్తూనే-"నేను పెదబాబు దగ్గరికి పోతున్నాగా!" అని బెదిరించింది.

"పో, ఇప్పుడే చెప్పుకో, పో." అని దేవదాసు ఇంకోదెబ్బ వేశాడు.

పార్వతి వెళ్ళిపోయింది. కొంతదూరంపోయాక దేవదాసు పిలిచాడు. కాని పార్వతి వినిపించుకోలేదు. ఇంకా త్వరగా వెళ్ళిపోసాగింది.



"ఓ పారూ! ఒక్కమాట వినిపోవే!" అని దేవదాసు మళ్ళీ కేకవేశాడు. పార్వతి జవాబివ్వలేదు. దేవదాసు విరక్తుడై కాసేపు ఏమేమో వాగి, "పోయిచావు!" అని మనస్సులో తిట్టుకున్నాడు. పార్వతి పోయాక ఒకటి రెండు చువ్వలు నరికాడు. కాని అతని మనస్సు మాత్రం ఏమీ బాగాలేదు.

పార్వతి ఏడుస్తూ ఇంటికి వచ్చేసింది. చెంపమీద దెబ్బలు నీలిరంగుకు వచ్చాయి. వాళ్ళనాయనమ్మ చూసి "అమ్మయ్యో! ఎవరే ఇలా కొట్టింది, పారూ?" అని అడిగింది.

"పంతులుగారు." అన్నది పార్వతి కళ్ళు తుడుచుకొంటూ.

నాయనమ్మ పిల్లను చంకన వేసుకొని—"పద, ఒకమాటు నారాయణ దగ్గరికి వెళ్ళివద్దాము—ఎలాంటి పంతులో, వీడు! అహో, పిల్ల ప్రాణాలు తీశాడే!" అన్నది.

పార్వతి, నాయనమ్మ మెడ వాటేసుకుని—"పద!" అన్నది.

పార్వతి నాయనమ్మ ముఖర్జీ దగ్గరికి వచ్చి పంతులుగారి పూర్వీకుల నందరినీ, పై నాలవారీగా ఎత్తి, వారికి పారలౌకిక అశుభం కోరింది. తర్వాత గోవిందుని నానా తిట్లుతిట్టి—"చూడు నారాయణా! వాడి పొగరు! శూద్రాడై కూడా బ్రాహ్మణ పిల్లమీద చెయ్యివేశాడు ఎలా కొట్టాడో చూడు ఒకమాటు!" అని బుగ్గమీద దెబ్బలను, మహా వ్యథపడుతూ ముసలిది చూపించ నారంభించింది.

"ఎవరుకొట్టారు పారూ!" అని నారాయణబాబు ప్రశ్నించాడు.

పార్వతి మాట్లాడలేదు. అప్పుడు నాయనమ్మ "ఇంకెవరు? మన గొడ్డుమోతు పంతులే!" అని చీత్కారం చేసింది.

'ఎందుకు కొట్టాడు?'

పార్వతి ఈ మాటుకూడా మాట్లాడలేదు. ముఖర్జీగారు పార్వతి ఏదో తప్పుచేసి ఉంటుందని ఊహించారు. అయినా ఇలా కొట్టడం భావ్యం కాదని తన అభిప్రాయం వెల్లడించారు. వారి మాట విని పార్వతి—"ఇక్కడ కూడా కొట్టాడు." అని చొక్కా ఎత్తి వీపు చూపించింది.

వీపుమీద దెబ్బలు ఇంకా స్పష్టంగానూ ఇంకా బలంగానూ ఉన్నాయి. అంచేత వారిద్దరికీ మహాకోపం వచ్చింది. ముఖర్జీగారు పంతులును పిలిపించి సంజాయిషీ తీసుకుంటానని చెప్పారు. ఇలాంటి పంతులు దగ్గిరికి ఇక పిల్లలను పంపటం కూడా మంచిది కాదని తీర్మానించారు. తీర్మానం విని పార్వతి, నాయనమ్మచంక ఎక్కి సంతోషంతో ఇంటికి వచ్చేసింది. కాని ఇంటివద్ద తల్లి క్రాస్‌లో పడిపోయింది.

"ఎందుకు కొట్టాడో చెప్పు?"

"ఊరకనే కొట్టాడు" అన్నది పార్వతి.

"ఊరకనే కొడతారా ఎక్కడన్నా?" అని తల్లి పార్వతి చెవి మెలేసింది.

పార్వతి నాయనమ్మ ఆ గదిముందుగా పోతూ ఇది చూచి ఆగి—"అదికాదే పిల్లా! తల్లివై ఉండి నువ్వు కొట్టుతున్నావు కాని ఊరక, ఇక ఆ ముండాకొడుకు చెయిచేసుకో లేదటే!" అన్నది.

"ఉత్త పుణ్యానికి ఎప్పుడూ కొట్టడు. ఇంత బుద్ధిగల అమ్మాయి—ఏమి చేసిందో, అందుకే దెబ్బలు తిన్నది."

"సరే, అలాగ అనుకో. కాని, నేనుమాత్రం [illegible]

"ఇక రాత కూతలు నేర్చుకోదా?"

"ఎందుకమ్మా అంత చదువు? కాస్త ఉత్తరం గీకటం, రెండుసాలు రామాయణం చదవటం వస్తే సరిపోయె. పారూ ఏమన్నా ప్లీడరు కాబోతున్నదా, జడ్జీపని చేయబోతున్నదా?"

తల్లి ఇక మాట్లాడలేదు. ఆ రోజున దేవదాసు చాలా భయపడుతూనే ఇంటికి చేరాడు. పార్వతి తప్పక అంతా చెప్పి వుంటుందని అతని నమ్మకం. కాని ఇంట్లో ఆ లక్షణాలేవీ కనబడలేదు. పైగా ఇవ్వాళ పంతులు పార్వతిని బాగ చితకకొట్టాడనీ, రేపటినుంచి ఇక బళ్ళోకి పోదనీ, తల్లిదగ్గర విని మహా సంతోషంతో ఆ పూట సరిగా అన్నంకూడా తినలేదు. ఎలాగో రెండు మెతుకులు మెక్కి— పోటా కుక్కుకుని పార్వతి దగ్గరికి రొప్పుకుంటూ పరుగెత్తుకొచ్చి—"పారూ, నువ్వింక బళ్ళోకి పోవటగా!" అన్నాడు.

"పోను."

"ఎందుకనీ?"

"పంతులుగారు కొట్టారని చెప్పాను."

దేవదాసు పకపక నవ్వుతూ పార్వతి వీపు చరచి, "నీ సంటి బుద్ధిమంతురాలు లే ప్రపంచంలో ఇక ఎక్కడా లేదసలు. యోగ్యపాత్రం ఇట్లాగు!" తర్వాత నిమ్మళంగా పార్వతి బుగ్గ మీద దెబ్బలు జాగ్రత్తగా పరీక్షించి—'అబ్బా!' అని నిట్టూర్చాడు. పార్వతి అతనివంక చూసి మందహాసం చేస్తూ- 'ఏమిటీ?' అంది.

"దెబ్బలు బాగా తగిలాయి కాదూ, పారూ!"

"ఊఁ" అన్నది పార్వతి తల తిప్పుతూ.

"నువ్వలా ఎందుకు చేశావు? అందుకనే నాకు కోపంవచ్చి కొట్టాను."

పార్వతి కళ్ళల్లో నీరు తిరిగింది. ఏంచేశానని అడగాలనుకున్నది కాని, అడగలేక పోయింది. దేవదాసు పార్వతి తల నిమురుతూ- 'ఇక అలా చేయకు- ఏమంటావు?' అన్నాడు.

"చేయను" అన్నది పార్వతి తల తిప్పి.

దేవదాసు ఇంకోమాటు పార్వతి వీపు చరచి- 'శభాష్, ఇక నేను విన్నెప్పుడూ కొట్టను!' అని బరవాసా యిచ్చాడు.

"నువ్వు పోవటంలేదు సరే, దేవదాసు కూడా పోవటంలేదా?" అని అడిగింది నవ్వుతూ.

"ఉహూం. [illegible]

[illegible] — [illegible] వెళ్ళింది."

[illegible] పార్వతి [illegible] [illegible] పాట [illegible] ముగ్గురు సాతాని స్త్రీలు [illegible] పెట్టుకొని [illegible] చేత పట్టి బిచ్చం అడుక్కుంటున్నారు. పార్వతి వాళ్ళని కేకవేసింది. "ఓ అమ్మా, మీకు పాటలు వచ్చా?"

అందులో ఒక సాతాని తిరిగి చూచి 'ఎందుకు రావు తల్లీ?' అన్నది.

"అయితే పాడండి."

అప్పుడు ముగ్గురూ తిరిగి చూశారు. అందులో ఒకతె- 'ఊరక పాడము తల్లీ, బిచ్చం వేయాలి. మీ ఇంటికి పోదాం పద విందువుగాని' అంది.

"కాదు, ఇక్కడే పాడండి."

"కాణీ ఇవ్వాలి, తల్లీ."

"కాణీ లేదు, రూపాయి ఉంది" అని పార్వతి కొంగున మూట చూపించింది. మూట చూపి వాళ్ళు దుకాణం వదలి కొంచెందూరం వచ్చి [illegible]న్నారు. కంజరి వాయిస్తూ ముగ్గురూ గొంతులు కలిపి పాడారు. ఏమిపాడారో, దానికి అర్థం ఏమిటో- పార్వతికి బొత్తిగా తెలియలేదు. తెలుసుకోవాలని ప్రయత్నించినా తెలుసుకోలేదు. అసలు మనస్సే అక్కడలేదు—దేవదాసు దగ్గరకు ఎప్పుడో పరుగెత్తింది.

పార్వతి కొంగున ఉన్న మూటవిప్పి మూడు రూపాయలు వాళ్ళ చేతిలో పెట్టింది. వాళ్ళు ముగ్గురూ విస్తుపోయి ఆ పిల్ల ముఖంవంక చూస్తూ ఉండిపోయారు.

"ఈ రూపాయలు ఎవరివి తల్లీ?" అని ఒకతె అడిగింది.

"దేవ దాదావి."

"నిన్ను కొట్టడా?"

పార్వతి కొంచెం ఆలోచించి—'కొట్టడు' అన్నది.

"నూరేళ్ళు బ్రతుకమ్మా!" అని ఒకతె ఆశీర్వదించింది.

పార్వతి నవ్వుతూ 'ముగ్గురికీ భాగాలు చక్కగా కుదిరాయి కదూ?" అంది.

"ఆఁ, కుదిరాయి" అని తల తిప్పి, తర్వాత- 'రాధాకృష్ణులు నిన్ను కాపాడుతారు తల్లీ!" అని ఆశీర్వదించారు. ఈ దానశీల దెబ్బలు తినకుండా ఉండాలని వాళ్ళ కోరిక. పార్వతి ఆవేళ పెందలాడే ఇంటికి తిరిగి వచ్చింది.

గాలిపటం లేదు అదిప్పుడు కొనాలి.

"పారూ! రూపాయలు తే" అని పార్వతిని అడిగాడు

పార్వతి ముఖాన నెత్తురుచుక్కలేదు- 'లేవు' అన్నది.

"ఏమయినై?"

"సాతాని స్త్రీల కిచ్చాను—పాటపాడితే."

"అన్నీ ఇచ్చావా?"

"అన్నీ ఎన్నీ? మూడేగా!"

"సో, దెయ్యమా? అన్నీ ఇవ్వవచ్చా?"

"బాగా వుంది. వాళ్ళు ముగ్గురుండిరి! మూడురూపాయలు ఇవ్వకపోతే వాళ్ళకి భాగమెలా కుదురుతుంది?"

దేవదాసు గంభీరంగా—"నే నయితే రెండురూపాయ లిచ్చేవాడిని" అని దారపు కండెతో నేలమీద లెఖ్ఖవేసి—"అలాగైతే వారికి ఒక్కొక్కరికి ఎనిమిదణాల అర్థణా అరకానీ వచ్చేది!" అన్నాడు.

పార్వతి కొంచెంసేపు ఆలోచించి—"వాళ్ళను నీ మూదిరిగా మణుగు లెఖ్ఖలువచ్చా, పంచుకోటానికి?" అని అడిగింది.

దేవదాసు మణుగులెఖ్ఖలు కూడా నేర్చుకున్నాడు పార్వతి ఈ మాట అతనికి ఆనందం కలిగించింది—"అది నిజమే" అన్నాడు.

పార్వతి దేవదాసు చేయిపట్టుకుని—"నన్ను కొడతా వనుకున్నాను, దేవదా!" అన్నది.

"ఎందుకు కొడతాను?" అన్నాడు దేవదాసు విస్మయంతో.

"సాతాన్లు చెప్పారుగా నువ్వు కొడతావని"

ఈమాట ఆతనికి మహా ఆనందం కలిగించింది. పార్వతి భుజాన భారంవేసి—"ఛా, తప్పుచేయకపోతే ఎందుకు కొడతాను!" అన్నాడు.

పార్వతి చేసిన ఈ పని తన పీనల్‌కోడ్‌లో ఏ సెక్షన్ క్రిందికీ రాదని బహుశా దేవదాసు భావించి ఉంటాడు. ఎందుకంటే మూడురూపాయలు కాబట్టి ముగ్గురూ చక్కగా పంచుకో గలిగారు. పాఠశాలలో మణుగులలెఖ్ఖలు కూడా నేర్చుకోనటువంటి సాతాని స్త్రీలకు మూడు రూపాయలకు బదులు రెండు రూపాయలివ్వటం, వారిని బాధించ టమే అని కూడా ఇతను ఎంచాడు.

తర్వాత దేవదాసు దారపుబంతి వెదురుగుమ్మెలో దాచివచ్చి పార్వతి చెయ్యిపట్టు కుని గాలిపటం కొంటానికి కోమటింటికి బయలుదేరాడు.

ఈ విధంగా ఒక సంవత్సరం గడిచింది. ఇక గడవటం కష్టం. దేవదాసు పోరు నానాటికీ యెక్కువైంది. "చూడండి దేవాయి ఊరక గాలికి తిరిగి పాడవుతున్నాడు. వాడిని యిక చదివించడం లేదా?" అని భర్తను అడిగింది.

వారు కొంచెం ఆలోచించి—"దేవాయిని కలకత్తా పంపుతాను. నగేను యింట్లో ఉండి చదువుకుంటాడు" అన్నాడు. నగేనుడు దేవదాసుకు మేనమామ అవుతాడు.

ఈ సంగతి అందరికీ తెలిసింది. పార్వతి విని చాలా భయపడింది. దేవదాసు ఒంటరిగా కనపడగానే అతని చేతులు పట్టుకొని ఊగులాడుతూ "నువ్వు కలకత్తా పోతావటగా, దేవదా?" అని అడిగింది.

"ఎవరన్నారు?"

"పెదబాబు చెప్పాడు."

"ఛా—నేను పోను."

"మరి నిన్ను బలవంతంగా పంపితేనో?"

"బలవంతంగానా?"

దేవదాసు ఈ మాట అనేటప్పుడు పెట్టిన ముఖభంగిమను చూసి, ఈ ప్రపంచంలో ఎవ్వరూ అతనిచేత బలవంతాన ఏ పనీ చేయించలేరని పార్వతి స్పష్టంగా గ్రహించింది. పార్వతికి కావలసినది కూడా ఇదే. అందుకని మహా ఆనందంతో ఇంకోమాటు అతని చేతులు పట్టుకొని ఊగులాడుతూ, ముఖంవంక చూసి—"చూడు దేవదా, ఒకవేళ పోతావేమో!" అన్నది.

"ఎప్పటికీ పోను."

కాని ఈ ప్రతిజ్ఞ నిలువలేదు. తండ్రి అతన్ని తిట్టీ, భయపెట్టీ ఆఖరికి ధర్మదాసును తోడిచ్చి కలకత్తా పంపించాడు. వెళ్ళేరోజున దేవదాసు మనస్సు చాలా బాధపడింది. కొత్తచోటుకు పోతున్నాననే ఆనందంకానీ, కుతూహలంకానీ, అతని కేమాత్రం కలగలేదు. దేవదాసును వదలిపెట్టడం పార్వతి కెంతమాత్రం యిష్టంలేదు. ఏడ్చింది; గోలచేసింది; కాని ఆ పిల్లమాట ఎవరు వింటారు? మొదట అభిమానంచేత దేవదాసుతో మాట్లాడనే లేదు. కాని చివరకు, దేవదాసు పిలిచి—"పారూ! మళ్ళీ నేను త్వరలో వస్తాను. పంపకపోతే పారిపోయైనా వస్తాను" అని ధైర్యం చెప్పినప్పుడు పార్వతి అలకమాని, తన క్షుభితహృదయం విప్పి అనేక సంగతులు చెప్పింది.

పిమ్మట దేవదాసు, తల్లి ఆశీర్వాదంతోపాటు ఆఖరి కన్నీటిచుక్కకూడా శిరస్సున ధరించి—సూటుకేసు చేత పట్టుకుని గుర్రపుబండి ఎక్కి వెళ్ళిపోయాడు. పార్వతికి అప్పుడు చాలా వేదనకలిగింది. కళ్ళవెంట ఎంతో నీరు కార్చింది. అభిమానంతో



ఆమె హృదయం బ్రద్దలయిపోయింది. మొదట కొంతకాలం పార్వతి ఇలాగడిపింది. తర్వాత ఒకనాటి ఉదయాన లేచి చూచేవరకు, ఆమెకు చేసే పనులేవీ కనిపించ లేదు. ఇంతకుపూర్వం బడి మానేసి నప్పటినుండి, ఉదయం నుంచీ సాయం కాలంవరకు, ఉత్త అల్లరీ ఆగంతోనే సరిపోయేది. అప్పుడు చేయాల్సిన పనులు చాలా ఉండేవి—సమయం చాలేదికాదు. ఇప్పుడు సమయం చాలా ఉన్నది—కాని ఎంత వెదకినా, చేసేపని కనిపించలేదు. ఒకరోజున ఉదయం లేవగానే ఉత్తరం రాయటానికి కూర్చునేది. పది గంటలయ్యేది. తల్లి విసుక్కుంటూ ఉండడం చూసి- "అయ్యో, దాన్ని రాసుకోనియ్యవే. పొద్దుటిపూట ఊరిమీద తిరిగేకంటే రాసుకోటం మంచిది కాదూ!" అని నాయనమ్మ సమర్థించేది. ఇక దేవదాసు దగ్గరనుంచి ఉత్తరం వచ్చిన రోజున పార్వతికి పండగ; గదిలో కూర్చుని ఆ రోజెల్లా ఆ ఉత్తరం

ఇలా రెండు మాసాలు గడిచాయి. ఉత్తరాలు రాయటం, రావటంకూడా క్రమంగా మందగించాయి. ఉత్సాహం కొంత తగ్గిపోయింది.

అడిగింది.

"అలాగే పో తల్లీ! నిన్ను నేను బళ్ళోకి ఎప్పుడు పోవద్దన్నాను?" అన్నది ఆమె.

ఆ రోజున మధ్యాహ్నం, చాలా రోజులక్రిందట మూలపార వేసిన పలకాపుస్తకాలు బయటకు తీసి, దాసీ చేయిపట్టుకొని, మళ్ళీ వెనకటిచోటుకే పోయి శాంతంగానూ, ధైర్యంగానూ కూర్చున్నది.

"పంతులుగారూ! మా పారూను కొట్టాగిట్టా మాకండి, దాని యిష్టంతో అది బళ్ళోకి వచ్చింది. ఇష్టమైతే చదువుకుంటుంది. లేకపోతే ఇంటికొస్తుంది" అన్నది దాసీది పంతులుగారితో.

"తథాస్తు!" అని పంతులు లోపల అనుకుని, పైకి- "అలాగేలే" అన్నాడు. పార్వతిని కూడా కలకత్తా ఎందుకు పంపలేదని ఒకమాటు అడగా లనుకున్నాడు. కాని తన మనసులో ఉద్దేశాన్ని బయట పెట్టలేకపోయాడు.

భోలా వెనకటి బెంచిమీదనే కూర్చుని ఉన్నాడు. అతన్ని చూడగానే పార్వతికి నవ్వు వచ్చే పర్యంతమైంది; కాని మరుక్షణానే ఆమె కళ్ళలో నీరు తిరిగింది, తర్వాత భోలా మీద చాలా కోపంకూడా వచ్చింది, దేవదాసు ఇల్లు వదలిపెట్టడానికి కారకుడు వీడేనని ఆమె అనుకున్నది,

ఇలా కొన్నిమాసాలు గడిచాయి.

కొంతకాలానికి దేవదాసు తిరిగి ఇంటికి వచ్చాడు. రావటమే తడవుగా పార్వతి దగ్గరకు పరుగెత్తుకొచ్చాడు. అనేక సంగతులు మాట్లాడుకున్నారు, పార్వతికి చెప్ప వలసింది ఎక్కువేమీలేదు; ఉన్నా చెప్పలేకపోయింది. దేవదాసు అనేక సంగతులు చెప్పాడు-అన్నీ కలకత్తావే-కొన్నాళ్ళకు ఎండకాలపు సెలవులుకూడా అయిపోయాయి. దేవదాసు మళ్ళీ కలకత్తా వెళ్ళిపోయాడు. పార్వతి ఈమాటూ ఏడ్చింది. కాని మునుపు టంత గభీరత లేదు.

ఈ విధంగా నాలుగుసంవత్సరాలు గడిచాయి.

ఈ నాలుగు సంవత్సరాల్లో దేవదాసు స్వభావం చాలా మారిపోవటం చూసి పార్వతి చాటున అనేకసార్లు కళ్ళు తుడుచుకున్నది. ఇంతకు పూర్వం దేవదాసులో ఉండే పల్లెటూరుతన మంతా పట్టణవాసంతో తుడుచుకుపోయింది. పాలిష్ చేసిన బూట్లూ, మంచిచొక్కాలూ, సన్ననిధోవతులూ, చేతికర్రా, బంగారపు గడియారం గొలుసూ-వీటిలో ఏవి లేకపోయినా అతను బయటికి రావటానికి సిగ్గుపడేవాడు, ఇప్పుడు నదిఒడ్డుకు షికారు పోవటం అతనికి ఇష్టంలేదు. తుపాకి తీసుకుని వేటకు





పోవడంలోనే అతనికి ఆనందం. చిన్న చిన్న పక్కోపేపలకు ఎరలు పెట్టి పెద్ద వాలుగలు పట్టాలని ప్రయత్నించేవాడు. ఇంతటితో ఆగినా ఫరవాలేదు. సాంఘిక.. రాచకీయాలూ. క్రికెట్, ఫుట్‌బాల్ మొదలగువాటిని గురించి చర్చిస్తూ ఉండేవాడు. అయ్యో! ఎక్కడి పార్వతి.ఇంకెక్కడి తాల్‌సోనాపుర గ్రామం? బాల్యస్మృతిలో చిక్కి కొని పోకుండా వున్న ఒకటి రెండు ఆనందదాయక విషయాలు అతనికి జ్ఞాపకం లేదంటానికి వీల్లేదు. కాని, వివిధ విషయాలమీద ఉన్న ఉత్సాహంలో అవి అతని హృదయంలో ఎక్కువసేపు నిలిచేవికావు.

మళ్ళీ సెలవులు పూర్తికావచ్చినవి. క్రిందటి సంవత్సరం ఇతను రాలేదు. మిత్రులతో కలసి దేశాటనకి వెళ్లాడు. ఈ మాటు తల్లిదండ్రులు పట్టిగా రమ్మని ఉత్తరం వ్రాశారు. అందుచేత ఇష్టంలేకపోయినా బెడ్‌చుట్టి స్వగ్రామం రావటానికి హౌరాస్టేషను చేరుకున్నాడు.

ఇంటికి వచ్చినరోజున అతని ఒంట్లో బాగుండలేదు. అందుచేత ఆవాళ బయటకు రాలేదు. మర్నాడు పార్వతి ఇంటికివచ్చి- "అత్తయ్యా" అని పిలిచాడు.

"రా, నాయనా! కూర్చో" అని పార్వతితల్లి ఆదరంతో ఆహ్వానించింది. ఆమెతో కాసేపు మాట్లాడిన తర్వాత- "పారూ ఎక్కడ అత్తయ్యా!" అని అడిగాడు.

"అదిగో! ఆ వెనకగదిలో ఉంది."

దేవదాసు అక్కడకు వెళ్ళాడు. పార్వతి సందెదీపం వెలగిస్తూ ఉన్నది.

"పారూ!" అని పిలిచాడు. పార్వతి మొదట చకితురాలయింది. తర్వాత నమస్కారంచేసి ఎడంగాపోయి నిలబడింది. "ఏం చేస్తున్నావు, పారూ?"

ఇదంత ముఖ్యప్రశ్నకాదు— అందుకని పార్వతి జవాబివ్వలేదు. అసలు దేవదాసంటే కొత్త సిగ్గుకూడా పడుతున్నది.

"ప్రొద్దుపోయింది. వెళ్ళొస్తాను. ఇంట్లోకూడా బాగాలేదు" అని దేవదాసు వెళ్లిపోయాడు.

పార్వతి ఇప్పుడు పదమూడో ఏట పాదంపెట్టిందని వాళ్ళ నాయనమ్మ చెప్పుతూ ఉన్నది. ఈ వయస్సులో ఆడపిల్లలకు శారీరక సౌందర్యం అకస్మాత్తుగా యెక్కడనుంచో ఊడిపడుతుంది. వాళ్ళ చిట్టి ఒక్కమాటే పెద్దదయిందని తల్లిదండ్రులు ఆశ్చర్యపోతారు. ఇక ఎవరిచేతిలో పెడదామా అని త్రొక్కిసలాడుతారు. చక్రవర్తిగారింట్లో కూడా కొన్నాళ్ళనుంచి ఈ విషయమే చర్చ జరుగుతూ ఉన్నది. అందరికంటే తల్లికి ఎక్కువగా ఆతురత ఉన్నది. మాటల సందర్భంలో మాటిమాటికి—"అబ్బే! పార్వతిని ఇక ఉంచటం భావ్యంకాదు" అని భర్తతో అంటూ ఉండేది. వాళ్ళంత భాగ్యవంతులు కారు. ఐనా పిల్ల చక్కనిదనే ధైర్యం ఒకటి ఉన్నది. ప్రపంచంలో రూపానికి గనుక విలువ ఉంటే పార్వతిని గురించి వీరికి పనే ఉండదు. ఇంకో సంగతి కూడా ఉన్నది—ఇది ఇక్కడే చెప్పడం మంచిది. ఇంతకు పూర్వం కుమార్తెల వివాహం చెయ్యటానికి చక్రవర్తుల కుటుంబం అంత తొందరపడేదికాదు. కొడుకుల వివాహానికి పడేది. కుమార్తెల వివాహానికి శుల్కం తీసుకునేవారు. కొడుకులవివాహానికి పణం ఇచ్చి పిల్లని ఇంటికి తెచ్చుకునేవాళ్లు. నీలకంఠుని తండ్రి కూడా కుమార్తెవివాహానికి శుల్కం తీసుకున్నాడు. నీలకంఠునికి ఈ ఆచారమంటే తగని ఏవగింపు. పార్వతిని అమ్మి డబ్బు సంపాయించటం అతనికేమాత్రం ఇష్టంలేదు. ఈ సంగతి పార్వతి తల్లికికూడా తెలుసును. అందుచేతనే కుమార్తెకు త్వరగా వివాహంచేయమని భర్తను ఒత్తిడిచేసేది. ఇప్పటివరకు పార్వతి తల్లి తన మనసులో ఒక దురాశకు చోటిచ్చింది. దేవదాసుతో ఏదోవిధంగా పెళ్ళి కావచ్చునని అనుకున్నది. ఈ ఆశ గగనకుసుమమని ఆమెకు తోచలేదు. పట్టుపట్టితే దేవదాసు తప్పక పెళ్ళిచేసుకుంటాడని ఆమె విశ్వాసం. బహుశా ఆ నమ్మకంతోనే, నీలకంఠుని తల్లి దేవదాసు తల్లి దగ్గర ఒకనాడు ఈ ప్రసంగం ఎత్తింది.

"చూడు అమ్మాయీ! దేవదాసుకూ, మా పారూకూ ఎంత స్నేహమో! అలాంటి అన్యోన్యత నే నెక్కడా చూడలేదు."

"ఎందుకుండదు పెద్దమ్మా? వాళ్ళిద్దరూ ఒక్క కడుపునపుట్టిన బిడ్డల్లాగా చిన్నప్పటి నుంచీ పెరిగారు."

"అదేను, అమ్మాయీ. అందుకనే అనుకుంటూ ఉంటాను— వాళ్ళిద్దరికీ.... ఇదిగో దేవదాసు కలకత్తా వెళ్ళినప్పుడు చూచావుగా, దానికి ఏనాడు దేన్లోనూ కూడా నిండలేదు. ఆ వయస్సులోనే వాడికోసం తిండీతిప్పలు మాని ఓ పిచ్చిపిల్లలా గడిపింది. మనందరికీ తెలుసుగా—దేవదాసు దగ్గరనుంచి ఉత్తరంముక్క వస్తే దానికి పండుగలా ఉండేది!"

దేవదాసు తల్లి దీనిభావం గ్రహించింది. కొంచెం నవ్వింది కూడా. ఈ నవ్వులో హేళన ఎంత వున్నదో తెలియదు, కాని వేదనమాత్రం చాలా వున్నది. ఈ సంగతు లన్నీ ఆమెకూ తెలుసు; పార్వతి మీద ప్రేమకూడా వున్నది. కాని వారి వంశము పిల్లలను అమ్ముకొనేది; పైగా పొరుగుపిల్ల.

"ఇప్పుడు పెళ్ళిచేయడానికి వారికి బొత్తిగా ఇష్టంలేదు, అమ్మా! అందులో చదువు కొంటూ ఉన్నాడు. మా పెద్దబ్బాయి ద్విజదాసు పెళ్ళి చిన్నప్పుడే చేయటంవల్ల వాడి చదువంతా నాశనమయిందని నన్నిప్పటికీ చెప్తూనే ఉంటారు."

పార్వతి నాయనమ్మ నిరుత్సాహపడింది. అయినా అని చూచింది.

"అదంతా నాకూ తెలుసు అమ్మాయీ! నువ్వెరుగుదువుగా, పార్వతి కాస్త కాలుబారు పిల్ల —పైగా ఏపుగా పెరిగింది— అందుకనే, నారాయణ ఇష్టపడకపోతే—"

దేవదాసు తల్లి అడ్డువచ్చింది: "కాదు పెద్దమ్మా! నేనిక వారికి చెప్పలేను. ఇప్పుడు గనక దేవదాసు పెళ్ళి సంగతి ఎత్తితే, వారిక నా ముఖంకూడా చూడరు."

ఈ ప్రసంగం ఇంతటితోనే అణగిపోయింది. కాని ఆడవాళ్ళకడుపులో ఏదీ దాగదు. భర్త భోజనం చేస్తూఉండగా దేవదాసు తల్లి ఈ ప్రసంగం ఎత్తింది: "ఇవ్వాళ పారూ నాయనమ్మ దాని పెళ్ళిసంగతి తెచ్చింది."

"ఆఁ, పారూకు ఈడు వచ్చింది. త్వరగా పెళ్ళిచేయటమే మంచిది" అన్నాడు భర్త తలయెత్తి.

"అందుకనే, ఇవ్వాళ ఆ ప్రసంగం ఎత్తి దేవదాసుకు."

"నువ్వేమన్నావు?" అన్నాడు భర్త ముఖం చిట్లించి.

"నే నింకేమంటాను! పిల్ల లిద్దరికీ సావాసమని ఆ పిల్లను కోడలుగా తెచ్చు కుంటానా? అసలే పిల్లల్ని అమ్ముకునేవంశం, పైన పొరుగుకుటుంబం. ఛీ, ఛీ!"

భర్త సంతృప్తిపడ్డాడు: "అంతగాక! సాటివాళ్ళలో నవ్వించుకుంటామా? నువ్వు అసలు ఈమాటలేవీ చెవిని పెట్టబోకు" అన్నాడు.

"అబ్బే, నేను వింటానా? మీరుకూడా పొరబడకండి" అన్నది భార్య. పొడినవ్వు






నవ్వి. భర్త ముఖం గంభీరంగా పెట్టి-"అలాగైతే, ఈ జమీందారీ ఏనాడో పోయేది" అన్నాడు.

వారి జమీందారీ చిరస్థాయిగా ఉన్నా ఎవరికీ ఆక్షేపణలేదు. కాని, నేను పార్వతి దీన చరిత్ర మాత్రం చెప్తున్నాను.

ఈ సంగతి నీలకంఠుని చెవినిబడగానే తల్లినిపిలిచి- "నువ్వు వారితో యెందుకు చెప్పబోయావమ్మా?" అని తిరస్కారంగా అడిగాడు. తల్లి మాట్లాడలేదు.

"పిల్ల పెళ్ళిచేయటానికి మనకు కాళ్ళుపుచ్చుకు తిరగాల్సిన అవసరం లేదు- మనకాళ్ళే పుచ్చుకుంటారు. పైగా మన అమ్మాయి అనాకారీ కాదు. నేను యిప్పుడే చెప్తున్నాను, చూడు- ఒక్కవారంలో సంబంధం కుదుర్చుకువస్తాను! పెళ్ళికాదని దిగులెందుకు?" అని ప్రతిజ్ఞ చేశాడు.

కాని ఎవరికోసమైతే తండ్రి శొద్దిచేశాడో, ఆమె నెత్తిన పిడుగుపడింది! దేవదాసు మీద తనకు కొంచెం అధికారమున్నదని పార్వతి చిన్నప్పటినుంచీ నమ్మింది. ఈ అధికారం ఆమె కెవ్వరూ యిచ్చిందికాదు. ఆమెకు తెలియకుండానే ఆమె మనస్సు నెమ్మదిగా, నిశ్శబ్దంగా, దృఢంగా ప్రతిష్ఠించుకుంటూ వచ్చింది. దాని బాహ్య ఆకృతి

ఎము. ఇంతవరకు ఆమెకు కనపడకపోయినా యివ్వాళ ఆ అధికారం పోతున్నదని తెలియగానే ఆమె హృదయంలో భయంకరమైన తుపాను రేగింది.

దేవదాసు లెఖ్ఖ వేరు. అతడు చిన్నతనంలో పార్వతి మీద పూర్తి అధికారం సంపాదించాడు. చలాయించాడు కూడా. కలకత్తా వెళ్ళినతర్వాత చదువు-సంధ్యల్లోనూ, ఆట పాటల్లోనూ పడి పార్వతిని చాలాభాగం వదలివేశాడు పార్వతి గ్రామ్యజీవితంలో రాత్రింబగళ్ళు తననే స్మరించుకొంటున్నదని అతనికి తెలియదు. ఇంతేకాదు, చిన్నప్పుడు ఎవరినైతే తనవారని పూర్తిగా నమ్మాడో, న్యాయా న్యాయ విచక్షణ లేకుండా యింతకాలం ఎవరిమీద తన అధికారమంతా చలాయించాడో, వారిని, యౌవనంలో అడుగుపెట్టగానే- ఇలా హఠాత్తుగా వదిలిపెట్టవలసి ఉంటుందని అతను ఊహించలేదు. అప్పుడు వివాహం సంగతి ఎవరు ఆలోచిస్తారు? ఆ బాల్యబంధనం వివాహం మినహా ఏవిధంగానూ స్థిరపడదని ఎవరికి తెలుసు?

అందుకనే, "దేవదాసుతో వివాహంజరగదు" అనేవార్త పార్వతి హృదయంలోని కోరికల్నీ, నమ్మకాల్నీ తోసివేయ నారంభించింది. దేవదాసు ఆమెకు ఒంటరిగా కనిపించలేదు. అతను తరుచుగా బయటకురావటం లేదు. ఉదయం చదువుకుంటూ ఉండేవాడు. మధ్యాహ్నం ఎండగా ఉంటుందని యిల్లు కదిలేవాడుకాదు. ఒక్క సాయంత్రంమాత్రం-అదీ ఇష్టమున్నరోజున-బయటకు వచ్చేవాడు. కోటూ పంట్లాం తొడుక్కుని, బూట్లువేసుకుని, కర్ర చేతపట్టి చక్రవర్తిగారి ఇంటి ముందుగానే షికారుకు వెళ్ళేవాడు. పార్వతి కిటికీదగ్గర నిలుచుని కళ్లుతుడుచుకుంటూ చూసేది. ఎన్నో సంగతులు జ్ఞాపకం వచ్చేవి. ఇద్దరం పెద్దవారం అయామని అనుకునేది. చాలాకాలం ప్రవాసంలో ఉండడంచేత ఇద్దరూ సిగ్గుపడేవారు. ఆ రోజున దేవదాసు సిగ్గుపడి సరిగ్గా మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. ఈ సంగతి పార్వతి గ్రహించకపోలేదు.

దేవదాసు కూడా ఇలానే భావించేవాడు. అప్పుడప్పుడు మాట్లాడా లనుకొనేవాడు. కాని ఇది చూట్టానికి బాగాఉంటుందా అని మళ్ళీ సందేహించేవాడు. ఇక్కడ కలకత్తాలో మాదిరి కోలాహలం లేదు; సినిమా-డ్రామాలు లేవు, ఆట పాటలులేవు- అందుకనే చిన్ననాటిసంగతులు జ్ఞాపకం వచ్చేవి. "అరే, అలాంటి పార్వతి యిలా అయిపోయిందా," అని అనుకునేవాడు. పార్వతికూడా "అప్పటి దేవదాసు ఇప్పుడు దేవదాసబాబుగా మారాడా?" అని అనుకునేది. దేవదాసు యిప్పుడు విశేషించి చక్రవర్తిగారింటికి వెళ్ళటం లేదు. ఎప్పుడన్నా ఒకరోజున షికారుకు వెళ్ళేటప్పుడు వారి వాకిటిదగ్గరకు వచ్చి—"ఏం చేస్తున్నారు, అత్తయ్యా?" అని పిలిచేవాడు.

"రా నాయనా! వచ్చికూర్చో" అని పార్వతి తల్లి ఆహ్వానించేది.

"ఇప్పుడు కాదులే అత్తయ్యా. కాస్త తిరిగొస్తాను" అని అనేవాడు అతను.

ఇలాంటప్పుడు పార్వతి ఒక్కొక్కరోజున వెనక యింట్లో ఉండేది. ఒక్కొక్కరోజున ఎదుటపడేది. దేవదాసు తల్లితో మాట్లాడుతూ ఉంటే పార్వతి చల్లగా అక్కడనుంచి తప్పుకు వెళ్ళేది. రాత్రి దేవదాసు గదిలో దీపం వెలుగుతూ ఉండేది. ఎండాకాలం కాబట్టి కిటికీతలుపులు తెరచి ఉండేవి. పార్వతి చాలా ఓపికతో అటువైపే చూస్తూ ఉండేది—ఏమీ కనపడేదికాదు. పార్వతి మొదటినుంచి అభిమాని. ఎంత బాధ అయినా సహించేది కాని ఇతరులకు తెలియనిచ్చేదికాదు. ఇతరులకు చెప్పితే మాత్రం లాభమేమిటి? సానుభూతి ఆమె సహించ లేదు ఇక తిరస్కారం—వేళాకోళం?—అంతకంటే చావే మంచిది.

క్రిందటి సంవత్సరమే మనోరమకు వివాహమయింది. ఇంకా అత్తవారింటికి పోలేదు. అందుచేత మధ్య మధ్య వస్తూ ఉండేది. పూర్వం సఖులిద్దరూ కలిసినప్పుడు మాటల సందర్భంలో ఈ సంగతికూడా వస్తూఉండేది. ఇప్పుడు కూడా వస్తూఉన్నది. కాని పార్వతి ఇప్పుడందులో పాల్గొనటం లేదు. మెదలకుండానైనా ఊరుకునేది. లేక ప్రసంగమన్నా మార్చేది.

పార్వతి తండ్రి రాత్రే ఇంటికి తిరిగివచ్చాడు. ఇన్నాళ్ళనుంచీ ఆయన వరుణ్ణి వెతకటానికిపోయాడు - ఒక్కమాటే లగ్నంకూడా పెట్టుకొని వచ్చాడు. ఇరవై ఇరవై అయిదు క్రోసుల దూరములో వర్ధమాన జిల్లాలో ఉన్న హాథీపోతా గ్రామ జమీందారే వరుడు. స్థితి బాగా ఉంది. వయస్సు నలభై కిలోపే. గత వత్సరమే భార్యపోయింది, మళ్ళీ వివాహం చేసుకుంటున్నాడు. ఈ శుభవార్త ఇంట్లో అందరికీ

సంతోషం కలిగించిందనటానికి వీల్లేదు. పైగా దుఃఖకారణమైంది. కాని భువనచౌదరి (వరుని) దగ్గరనుంచి పెళ్ళి ఖర్చులకుగాను రెండువేలు వస్తాయని విన్న తర్వాత ఆడంగులు ఇక మాట్లాడలేదు.

ఒక రోజున, మధ్యాహ్నం దేవదాసు భోజనం చేస్తూ ఉండగా, తల్లి, దగ్గరకు వచ్చి కూర్చుని "పారూ పెళ్ళట!" అని అన్నది.

"ఎప్పుడు?" అని అడిగాడు దేవదాసు తలపైకెత్తి.

"ఈ మాసంలోనే. నిన్న పెళ్ళికొడుకు స్వయంగావచ్చి పిల్లను చూసిపోయాడు."

దేవదాసుకు కొంచెం ఆశ్చర్యంవేసి, "ఏదీ, నాకు తెలియనే లేదే, అమ్మా!" అన్నాడు.

"నీకెలా తెలుస్తుంది?—పెళ్ళికొడుకు కొంచెం బొద బొద లాడుతూ ఉంటాడు. వయస్సుకూడా మిగిలింది. అయితే డబ్బూ దస్కం మాత్రం చాలా వున్నదట. పార్వతి సుఖంగా బ్రతుకుతుంది."

దేవదాసు తలవంచుకు అన్నం తింటున్నాడు. మాట్లాడలేదు.

"ఆ పిల్లను నీకివ్వాలని చూశారు" అన్నది మళ్ళీ.

"తర్వాత?" అని అడిగాడు దేవదాసు తలఎత్తి.

తల్లి నవ్వింది—"ఛా, అదెలా కుదురుతుంది. అసలే పిల్లల్ని అమ్ముకునే వంశం, పైగా పొరుగుపిల్ల! ఛీ,-ఛీ" అని తల్లి పెదవి విరిచింది.

దేవదాసు అది గమనించాడు: తల్లి కొంచెం సేపుండి మళ్ళీ అన్నది:

"మీ నాన్నకు చెప్పాను"

"ఏమన్నాడు?"

"ఇంకా ఏమంటాడు? ఇంత గొప్పవంశాన్ని నవ్వులపాలు చేయనన్నాడు."

దేవదాసు ఇక ఏమీ అడగలేదు.

ఈ సమయంలోనే పార్వతికీ మనోరమకూ సంభాషణ జరుగుతూ ఉన్నది. పార్వతి కళ్ళల్లో నీరు-మనోరమ బహుశా, ఇంతకుముందే తుడుచుకుని ఉంటుంది. "అయితే ఇక కర్తవ్యమేమిటి చెల్లీ?" అని అడిగింది మనోరమ.

పార్వతి కళ్లు తుడుచుకుని - "ఇంకా కర్తవ్యమేముంది? నీ భర్తను నువ్వు ఇష్టపడే పెళ్ళి చేసుకున్నావా?" అన్నది.

"నా సంగతివేరు. నాకు ఇష్టమూలేదు; అయిష్టమూలేదు. అందుకని నా కిలాంటి కష్టాలేవీ లేవు. కాని, నీ చేత్తో నువ్వు గొంతు కురి పోసుకుంటున్నావు!"

పార్వతి జవాబివ్వలేదు. ఆలోచనలోపడింది. మనోరమ ఏమి ఆలోచించుకున్నదో కాని మందహాసం చేస్తూ—"పారూ, నీ భర్త వయస్సెంత?" అంది.

"ఎవరి భ ర్త?"
"నీ—"
పార్వతి లెఖ్ఖవేసి - "పందొమ్మిది ఉంటాయి." అన్నది.
మనోరమకు మహా ఆశ్చర్యం వేసింది—"అదేమిటే, నేను నలభై అని విన్నానే?" అన్నది.
ఈమాటు పార్వతికూడా మందహాసంచేసి—"మనోదీదీ! ఈ ప్రపంచంలో ఎంత మందికి నలభై ఏళ్లు లేవు? వాళ్ళందరి లెఖ్ఖలు నాదగ్గర ఉన్నాయా? నాభర్త వయస్సు మాత్రం 19-20 ఉంటవని నేను ఎరుగుదును."
"పేరేమిటి?"
పార్వతి మళ్ళీ నవ్వి "ఇన్నాళ్ళనించీ అదికూడా తెలియదూ?" అన్నది.
"నాకెలా తెలుస్తుంది?"
"తెలియదూ? సరే. నేను చెప్తాను!" అని మందహాసం చేసి, తర్వాత గంభీరంగా మనోరమ చెవి దగ్గర నోరుపెట్టి పార్వతి అన్నది—"తెలియదూ. శ్రీ దేవదాస—"
మనోరమ మొదట చకితురాలయింది. తర్వాత పార్వతిని వెనక్కు-పడనెట్టి—"ఇక వేళాకోళంతో లాభంలేదు. పేరు చెప్పదలచుకుంటే ఇప్పుడే చెప్పు. తర్వాత చెప్ప టానికి వీలుండదు." అంది.
"ఇప్పుడు చెప్పానుగా!"
"దేవదాసైతే ఇంతగా ఏడ్చి చస్తా వెందుకు?" అంది మనోరమ కోపంతో.
పార్వతి ముఖం ఒక్కసారిగా నల్లబడింది. కొంచెం ఆలోచించుకొని "అది నిజమే. నేను ఇక ఏడవను—" అన్నది.
"పారూ?"
"ఏమిటి?"
"సంగతంతా విప్పి చెప్పు చెల్లీ! నాకేమీ అర్థం కావటంలేదు."
"చెప్పాలిసిం దంతా చెప్పితినిగా."
"కాని, నాకేమీ అర్థం కావిదే?"
"ఎలా చెప్పినా కాదు!" అని పార్వతి ముఖం తిప్పుకున్నది.
పార్వతి కొన్ని సంగతులు దాస్తున్నదనీ, మనస్సులోని సంగతులన్నీ విప్పి చెప్పటం లేదనీ మనోరమ భావించింది. ఆమెకు అభిమానమూ దుఃఖమూ రెండూ కలిగాయి. "పారూ, నీ దుఃఖం నాది కాదా చెల్లీ! నువ్వు సుఖంగా ఉండటంకంటే నాకు కావలసింది ఏముంది?—నీకేమన్నా చెప్పకూడని సంగతులుంటే మానేయి, కాని నన్నిలా వేళాకోళం మాత్రం చేయకు!"

ఈ చీర నీకు బావుంటుందని
తెలుసు !!



ఈ మాటలు పార్వతికి చాలా కష్టం కలిగించాయి:—"వేళాకోళం చేయటం లేదక్కాయి! నాకు తెలిసినంతవరకు నీకు చెప్పనే చెప్పాను. నాకు తెలిసిందల్లా నా భర్త పేరు దేవదాసు; వయస్సు పందొమ్మిదీ-ఇరవై ఏళ్ళు. అదే నీకు చెప్పాను."

"కాని నేనిప్పుడేగా విన్నది—నీ కెక్కడో సంబంధం స్థిరపడిందని?"

"స్థిరపడ కింకేమున్నది! నాయనమ్మనిచ్చి ఎలానూ చేయరు. జరిగితే నాతోనే జరుగుతుంది. కాని నాకుమాత్రం ఈ సంగతులన్నీ తెలియవు."

మనోరమ విన్నదంతా ఏకరువు పెట్టబోయింది. పార్వతి అడ్డువచ్చి "అదంతా నేనూ విన్నదే—చెప్పనక్కర్లేదు" అన్నది.

"మరి దేవదాసు నిన్ను—"

"ఏమిటి నన్ను?"

"ఐతే స్వయంవరం అన్నమాట! చాటు చాటున అంతా గట్టి బందోబస్తు చేసుకున్నావా?" అన్నది మనోరమ నవ్వును అపుకుని.

"గట్టీ, ఓడూ ఇంకా ఏమీ తేలలేదు."

యా

మనోరమ వ్యధిత స్వరంతో
పారూ?" అన్నది.

"అలాగైతే దేవదాసు నడిగి నీకంతా తెలిసేటట్టు చెప్తాను."

"ఏమడుగుతావు? పెళ్ళిచేసుకుంటావా, లేదా అనేగా?"

"ఆఁ, అదే" అన్నది పార్వతి తలతిప్పుతూ.

మనోరమకు ఆశ్చర్యం కలిగింది: "ఏమిటి నువ్వన్నది పారూ! నీయంతట నువ్వే పోయి అడుగుతావా?"

"తప్పేముంది, అక్కయ్యా!"

మనోరమ కింకా ఆశ్చర్యంవేసింది: "ఏమిటీ నువ్వన్నది? నువ్వే వెళ్తావా?"

"నేను కాకపోతే నాకోసం ఎవరు అడగబోతా రక్కయ్యా?"

"సిగ్గువేయదూ?"

"సిగ్గు ఎందుకు? నీకు చెప్పటానికి నే నేమి సిగ్గుపడ్డాను?"

"నేనాడదాన్ని, పైగా నీ సఖినీ-కాని, అతను మగవాడుగా పారూ?"

పార్వతి ఈమాటు నవ్వింది:-"నువ్వు నా సఖివీ, నాదానివీ!- ఇక అతనేనా పరాయివాడు? నీతో అనగలిగినమాట ఇక అతనితో అనలేనా?"

మనోరమ విస్తుపోయి పార్వతి ముఖం వంక చూస్తూ ఉండిపోయింది.

పార్వతి నవ్వు ముఖంతో మరల అన్నది!—"మనో! మీరు కాళ్ళకు పసుప్పూ, నొసట కుంకుమా వృధాగా పెట్టుకుంటున్నారు. ఎవరిని భర్త అనాలోకూడా మీకు తెలియదు. అతను నాభర్త కాకపోతేనూ, నా లజ్జా సంకోచాలకు అతీతుడు కాకపోతేనూ, నేనిలా అతనికోసం చావటానికి కూర్చోను. ఇంతేకాక, చావదలచుకొన్న వ్యక్తి విషం తియ్యగా ఉంటుందా చేదుగా ఉంటుందా అని ఎప్పుడూ ఆలోచించదు. అతని దగ్గర నాకు రవ్వంతకూడా సిగ్గులేదు."

మనోరమ పార్వతి ముఖం వంక కాసేపు విస్మయంతో చూచి—"ఏమడుగుతావు? నీ పాదాల దగ్గర కొంచెం చోటివ్వమనేగా?" అన్నది.

పార్వతి ఔనన్నట్టు తలతిప్పి "సరిగ్గా అదే అడుగుతా నక్కయ్యా!" అంది.

"అతను చోటివ్వకపోతే?"

ఈమాటు పార్వతి చాలాసేపు జవాబివ్వలేదు: "అప్పటిసంగతి నాకిక తెలియదు అక్కయ్యా!" అన్నది తర్వాత కాసేపటికి.

ఇంటికి తిరిగి వెళ్ళేటప్పుడు మనోరమ—"అబ్బ, దీని గుండెధైర్యం చెప్పుకోవలసిందే. నేను చస్తున్నాగాని ఇలాంటి మాటను నోటినుంచి రానిచ్చే దాన్ని కాను" అని మనస్సులో అనుకున్నది.

ఈ మాట నిజము! అందుకనే పార్వతి వీరిని—మీరు అనవసరంగా పసుపూ కుంకుమా పాడుచేస్తున్నారని—అన్నది!

* * *

రాత్రి ఒంటి ఘంట కావచ్చును. వెన్నెల గుడ్డిగా ఉన్నది. పార్వతి పక్కమీదనుంచి ఆపాదమస్తకమూ చుట్టుకొని నెమ్మదిగా మెట్లుదిగి ఒకమాటు నాలుగుపక్కలా పరికించింది-ఎవ్వరూ మేలుకొని లేరుకదా అని. తర్వాత నిశ్శబ్దంగా తలుపు తెరచుకుని బయటకు వచ్చింది. పల్లెటూరు. చడీ చప్పుడూ ఏమీలేదు. ఎవరైనా ఎదురు పడతారేమో ననే భయంకూడా లేదు. ఈమె నిరాటంకంగా జమీందారుగారి ఇంటి ముందు వచ్చి నిలబడింది, సింహద్వారం దగ్గర వృద్ధదర్వాన్ కృష్ణసింగు కుక్కి మంచంమీద కూర్చుని ఇంకా తులసీ రామాయణం పారాయణ చేస్తున్నాడు. పార్వతి రావటంచూసి తల ఎత్తకుండానే "ఎవరువా"రని ప్రశ్నించాడు. పార్వతి "నేనే" అన్నది.

దర్వాన్ కంఠస్వరాన్నిపట్టి స్త్రీ అని గ్రహించాడు! దాసీ కావచ్చునని ఊహించి ఇక నేమీ అడగకుండా రాగంతీస్తూ మళ్ళీ రామాయణపారాయణలో పడ్డాడు. పార్వతి దాటిపోయింది. ఎండాకాలం. బయట చాలామంది నౌకర్లు పండుకొని ఉన్నారు. వారిలో కొంతమంది గాఢనిద్రలో ఉన్నారు. కొంతమంది అర్ధ సుప్తావస్థలో ఉన్నారు. నిద్రమత్తులో కొందరు పార్వతిని చూసినా చూసి ఉండవచ్చు—కాని, దాసీ అనుకొని ఎవ్వరూ పలకరించలేదు. పార్వతి నిరాటంకంగా లోపల ప్రవేశించి మెట్లగుండాపైకి ఎక్కింది, ఈ ఇంటి ప్రతి గదీ, ప్రతి గవాక్షమూ ఈమెకు పరిచితమే. దేవదాసు గది గుర్తించటానికి ఎక్కువసేపు పట్టలేదు. గది తలుపు తెరచే ఉన్నది. ఈ లోపల దీపంకూడా వెలుగుతూ ఉన్నది. పార్వతి లోపల ప్రవేశించింది. దేవదాసు మంచంమీద పండుకొని నిద్రపోతూ ఉన్నాడు. తెరచిన పుస్తకం ఒకటి తలవైపున పడి ఉన్నది—లక్షణాలను బట్టి చూస్తే అతనికి ఇంతకు ముందే కన్ను అంటినట్టుగా ఉన్నది. దీపం వత్తిని పెద్దదిచేసి, పార్వతి దేవదాసు కాళ్ళదగ్గర నిశ్శబ్దంగా కూర్చున్నది గోడనున్న పెద్దగడియారం మాత్రం "టిక్, టిక్" అని చప్పుడుచేస్తూఉన్నది. ఇది మినహా అంతా నిస్తబ్దం-అంతా సుప్తం.

కాళ్ళమీద చేయిపెట్టి పార్వతి—"దేవదా!" అని మెల్లగా పిలిచింది.

దేవదాసు నిద్రమత్తులో ఎవరో పిలుస్తున్నట్లుగా విన్నాడు. కాని కళ్లు తెరవకుండానే—"ఊ!!" అన్నాడు.

"ఓ దేవదా"—ఈమాటు దేవదాసు కళ్లు నులుపుకుంటూ లేచి కూర్చున్నాడు.




పార్వతి ముఖాన ముసుగు ఏమీలేదు. ఇంట్లో దీపం గంటంవలె వెలుగుతూ ఉన్నది. దేవదాసు పార్వతిని చాలా సులభంగానే గుర్తించాడు. కాని, మొదట అతనికి నమ్మకం కలగలేదు. "ఎవరు? పారూ?" అన్నాడు

"ఆఁ, నేనే."

దేవదాసు గడియారం వంక చూశాడు. అతనికి ఆశ్చర్యంలో ఆశ్చర్యం కలిగింది. "ఇంత పొద్దు పోయా?" అన్నాడు.

పార్వతి జవాబివ్వలేదు. తలవంచుకు కూర్చున్నది.

"ఇంత రాత్రిపూట ఒంటరిగానే వచ్చావా?" అని మళ్ళీ అడిగాడు.

"ఆఁ" అన్నది పార్వతి. దేవదాసు ఉద్వేగంతోనూ, సందేహంతోనూ కంటకితు డయ్యాడు. "ఏమిటీ! దోవలో భయం వెయ్యలేదా?" అన్నాడు.

"భూతాలకు నేనంత భయపడను!" అన్నది మందహాసం చేస్తూ.

"భూతాలకికాకపోయినా మనుషులకన్నా భయపడాలిగా! ఎందు కొచ్చావూ?"

పార్వతి జవాబివ్వలేదు. "అదే నాకింకా తెలియలే" దని మనస్సులో అనుకున్నది.

"ఇంట్లో ఎలా ప్రవేశించావు? ఎవరూ చూడలేదా?"

"దర్వాన్ చూశాడు."

దేవదాసు కళ్ళు పెద్దవిచేసి చూశాడు! "దర్వాన్ చూశాడా? ఇంకెవరూ-?"

"వరండాలో నౌకర్లు పండుకుని ఉన్నారు. వాళ్ళల్లో కూడా బహుశా ఎవరన్నా చూడవచ్చు."

దేవదాసు మంచం మీదనుంచి ఎగిరి దూకి తలుపు బిగించాడు. "ఎవరన్నా గుర్తించారా?"

పార్వతి ఏమాత్రం ఆదుర్దా చూపించకుండా చాలా సహజంగా "వాళ్ళంతా నన్నెరుగుదురు. ఒకవేళ ఎవరైనా గుర్తించినా గుర్తించవచ్చును." అన్నది.

"ఏమిటి పారూ! ఇలాంటి పని ఎందుకు చేశావు?"

"అది నీకే తెలుస్తుం"దని పార్వతి మనస్సులో అనుకున్నది. కాని, పైకి ఏమీ మాట్లాడలేదు.

"ఇంతరాత్రా! ఛీ! రేపు నీ ముఖమెలా చూపిస్తావు?"

"నా కా ధైర్యమున్నది" అన్నది పార్వతి తల ఎత్తకుండానే.

ఈమాటకు దేవదాసు కోపించలేదు. కాని చాలా ఉత్కంఠితుడై- "ఛీ ఛీ. ఇంకా నువ్వు చిన్నపిల్లవేనా పారూ! ఇలాంటి సమయంలో ఇక్కడికి రావటానికి నీకు కాస్తన్నా సిగ్గువేయలేదా?"—అన్నాడు.

"పీసం కూడా లేదు" అన్నది పార్వతి తలతిప్పుతూ.

"రేపు సిగ్గుతో నీ తల వాలిపోదూ?"

ఈ ప్రశ్నవిని పార్వతి తీవ్ర, కరుణాదృక్కులతో దేవదాసు ముఖంచూసి- "తల వాలిపోయేదే—నువ్వు నాసిగ్గును కప్పెడతావన్న నమ్మకం నాకు లేకపోతే." అన్నది విస్సంకోచంగా.

దేవదాసు విస్మయంతో హతబుద్ధుడై—"నేనా! కావి. నేను మాత్రం ముఖం ఎలా చూపిస్తాను?" అవి అడిగాడు.

పార్వతి అలాగే తొట్రుపడనిస్వరంతో—"నువ్వా? నీకేం దేవదా!" అవి, ఒక్క-క్షణం ఆగి—"నువ్వు మగవాడివి. ఇవ్వాళ కాకపోతే రేపైనా నీ కళంక చరిత్ర అందరూ మరిచిపోతారు. ఫలానారోజున మందభాగిని పార్వతి- ప్రపంచాన్నంతా తుచ్ఛంగా చూసి—నీ పాదాలమీద పడటానికి వచ్చిందని ఎవ్వరూ గుర్తుపెట్టుకోరు."

"అదేంటి పారూ?"

"ఇక నేను-"

"ఇక నీవు?" అన్నాడు దేవదాసు మంత్రముగ్ధునివలె.

"నా కళంకం సంగతి అడుగుతావా? ఉహుం—నా కేమీ కళంకం లేదు. నీ దగ్గరకు చాటుగా వచ్చానని నన్నెవరైనా నిందించినా ఆ నింద నాకు అంటదు."

"అదేంటి పారూ! ఏడుస్తున్నావా?"

"దేవదా, నదిలో ఎంత నీరున్నది! అంత నీరు కూడా నా కళంకాన్ని కప్పిపెట్టలేదా?"



దేవదాసు చప్పున పార్వతి రెండు చేతులూ పట్టుకుని— "పార్వతీ!" అన్నాడు.

పార్వతి దేవదాసు కాళ్ళమీద తలపెట్టి—"ఇక్కడే కొంచెం చోటివ్వు దేవదా!" అని గద్గదస్వరంతో అన్నది.

తర్వాత ఇద్దరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు. దేవదాసు కాళ్ళమీది నుంచి అశ్రు బిందువులు తెల్లని శయ్యమీద పడ నారంభించాయి.

చాలసేపయిన తర్వాత దేవదాసు పార్వతి ముఖం పైకెత్తి—"పారూ, నేను తప్ప నీకిక గత్యంతరం లేదా?" అని అడిగాడు.

పార్వతి జవాబివ్వలేదు. మరల అలాగే పాదాలమీద తలపెట్టింది. ఈమె అశ్రు వ్యాకుల ఘన దీర్ఘనిశ్వాసలు ఆ నిస్తబ్ధమైన గదిని ఆవరించినట్టుగా కనిపించినవి. గడియారం టంగ్, టంగ్ అని రెండుకొట్టింది.

దేవదాసు—"పారూ!" అని పిలిచాడు.

పార్వతి రుద్ధకంఠంతో—"ఏమిటి?" అన్నది.

"మా అమ్మకీ నాయనకీ బొత్తిగా ఇష్టంలేదు—తెలుసునా?"

పార్వతి "తెలుసు" నన్నట్లుగా తల తిప్పింది. తర్వాత ఇద్దరూ మాట్లాడకుండా చాలాసేపు కూర్చున్నారు.

"అయితే మరెందుకిలా అంటున్నావు?" అన్నాడు దేవదాసు నిట్టూర్చి.

నీళ్ళల్లో మునిగిన వ్యక్తి ఎలా గుడ్డిగా నేలను పట్టుకు కూర్చుంటాటో, అది వదల

బానిస ఎలా ఇష్టపడిద [illegible] అలానే—ప్రార్థిస్తే, పార్వతి [illegible] కాళ్ళు [illegible] పట్టుకుని—“నేను [illegible] [illegible]

“మరి [illegible] ఎదురు తిరగకుండా[illegible]

“[illegible] ఎదురు తిరిగా?”

“[illegible] నువ్వెక్కడి[illegible]”

పార్వతి ఏడుస్తూ అన్నది: “నీ పాదాల—”

తర్వాత ఇద్దరూ మరల మాట్లాడకుండా [illegible] నాలుగు గంటలు కొట్టింది. ఎండాకాలపు రాత్రి. ఇంకా రాసేపటికి తెల్లవారుతుంది [illegible] పార్వతి చెయ్యిపట్టుకుని—“పద, నిన్ను ఇంటి దగ్గర దిడిచిపెట్టి వస్తాను.” అన్నాడు.

“నా వెంట వస్తావా?”

“పోయేదేముంది? అంతగా అపవాదు వస్తే తర్వాత చూసుకోవచ్చు.”

“ఐతే పద.”

ఇద్దరూ చప్పుడు చేయకుండా బయలుదేరారు.

మర్రునాడు దేవదాసు, తండ్రితో చాలా కొద్దిసేపే మాట్లాడాడు.

తండ్రి—“నువ్వు పుట్టినప్పటినుంచీ నన్ను వేధిస్తూనే వచ్చావు. ఇక బ్రతికి నన్నాళ్ళుకూడా నీ బాధలు తప్పేటట్టు లేవు. నీ నోట ఈ మాట వినటంలో నాకేమీ ఆశ్చర్యం లేదు” అన్నాడు.

దేవదాసు మాట్లాడకుండా తలవంచుకు కూర్చున్నాడు.

తండ్రి—“నాకీ సంగతంతా తెలియదు. మీ అమ్మా నువ్వూ కలపి ఏదో ఒకటి చేసుకోండి” అన్నాడు.

తల్లి ఈమాట విని ఏడ్చింది:—“నాయనా, ఇది కూడా మా రాతలో ఉందా!” అన్నది.

ఆనాడే దేవదాసు పెట్టేబేడా సర్దుకొని కలకత్తా వెళ్ళిపోయాడు. ఈ సంగతులు తెలియగానే అసలే కఠినంగా ఉన్న పార్వతి ముఖం ఇంకా కఠోరమైంది. నవ్వి ఊరుకున్నది. క్రిందటిరాత్రి సంగతి ఎవ్వరికీ తెలియలేదు. తానూ చెప్పలేదు. కాని మనోరమ వచ్చి- “పారూ, దేవదాసు కలకత్తా వెళ్ళాడట నిజమేనా?” అని అడిగి నప్పుడు “ఆఁ” అన్నది పార్వతి.

“మరి నిన్నేమి చేసిపోయాడే?”

ఏమి చేసిందీ పార్వతికే తెలియదు. ఇతరులకేమి చెప్పుతుంది?

నేటికి కొన్ని దినాలనుంచి రాత్రింబగళ్లూ ఆమె ఈ సంగతే ఆలోచిస్తున్నది. కాని,



ఇందులో ఆమెకు ఆశ ఎంత ఉన్నదో నిరాశ ఎంత ఉన్నదో, ఏ మాత్రమూ స్థిర పరచుకోలేకపోయింది. ఇలాంటి చెడుసమయాల్లో, ఆశా నిరాశల ఒడ్డు ఏదీ దొరక నప్పుడు, మానవుని దుర్బల మనస్సు భయపడుతూనైనా సరే-ఆశ వైపుకే మొగ్గుతూ ఉంటుంది. ఏదైతే తనకు మేలో అదే ఆశిస్తుంది. ఇచ్ఛతో కానీయండి, అనిచ్ఛతో కానీయండి ఆ వైపే చూస్తూ ఉంటుంది. పార్వతి కూడా-ఈ స్థితిలో,కొంత బలవంతం గానే-నిన్నరాత్రి ప్రసంగం వృధాపోదని ఆశించింది, విఫలమైతే తన స్థితి యేమవు తుందని ఆమె ఆలోచించలేకపోయింది. అందుకనే ఆమె- "దేవదాసు మళ్ళీ వస్తాడు. నన్ను పిలిచి 'పారూ, నా బొందిలో ప్రాణముండగా నిన్నితరుల చేతికి పోనిస్తానా!' అని అంటాడని భావించింది. కాని రెండు రోజులు గడచిన తర్వాత పార్వతికి ఈ క్రింది వుత్తరం వచ్చింది.

"పార్వతీ, ఇవ్వాళిటికి రెండు రోజులనించి నేను నీ సంగతే ఆలోచిస్తున్నాను. నా తల్లిదండ్రులలో ఎవ్వరికి కూడా మన వివాహమంటే బొత్తిగా ఇష్టం లేదు. నిన్ను సుఖపెట్టాలంటే వారిని చాలా కష్టపెట్టాల్సి ఉంటుంది- ఇది నాకు అసాధ్యం. అదీకా వారిని ఎదిరించి నే నీ పని ఎలా చేయగలను? నీకు మరల ఉత్తరం రాస్తాననే నమ్మకం నాకు లేశం కూడా లేదు. అందుకని, ఈ ఉత్తరంలోనే అంతా విప్పి రాస్తున్నాను.

"కలకత్తా రావటంమూలాన నేను చాలా పోగొట్టుకున్నా"నని మనస్సులో అనుకున్నాడు. కిశోర వయస్సులో పోకిరీగానూ, పొగరుబోతుగానూ తిరుగుతున్నప్పుడు అతనికి అయాచితంగా లభించిన పదదళిట రత్నం. [illegible] గొప్పదిగానూ, విలువైనదిగానూ [illegible] కప్పిన తెర ఒకటి తొలగింది.

"చున్నీ! విద్య, బుద్ధి, జ్ఞానం, ఉత్సాహ- [illegible] సుఖం లేదు. ఏవిధంగానన్నా చూడు, ఇవి మన సుఖం [illegible] పనికిరావు!" అన్నాడు చున్నీ ముఖం చూస్తూ దేవదాసు.

చున్నీ మధ్యనే అడ్డుతూ—"అయితే నువ్వింక చదువు మానేస్తావా ఏమిటి?" అని అడిగాడు.

"తప్పకుండా, నేను ఈ కొద్ది జ్ఞానం కోసం ఎంతో పోగొట్టుకోవాల్సి ఉంటుందని నాకు పూర్వం తెలిసినట్లయితే, నేనసలు కలకత్తా ముఖమే చూసేవాణ్ణి కాదు!"

"నీకేమైనా పూర్తిగా ఏమిటి?"

"నీకు మళ్ళీ కనపడటం సంభవిస్తే అంతా చెబుతాను."

రాత్రి తొమ్మిది ఘంటలయి ఉంటుంది. మెస్‌లో ఉండేవాళ్ళంతా చున్నీలాలుతో సహా—సామానంతా బండి కెక్కించి దేవదాసు మెస్‌ను సలాం పెట్టిపోవటం—ఆశ్చర్యంతో చూశారు. అతను వెళ్ళిపోయిన తర్వాత చున్నీలాలు కోపంతో—'ఈరకం మనుష్యుల్ని ఆచరణను పట్టి కనుక్కోటం కష్టం—" అని మెస్‌లో వాళ్ళంతా వినేటట్టు కేకలు వేయనారంభించాడు.

* * *

కొన్ని దూరదృష్టి కలవారు, ప్రపంచం చూసినవారు, ఎవ్వరూ కంటితో చూడగానే ఏ వస్తువుమీదా తమ అభిప్రాయాన్ని వెల్లడించరు. రెండువైపుల చూసి నాలుగు వైపుల మాటలు చెప్పరు—పూర్తిగా తెలుసుకోనిది మంచో చెడో తేల్చరు; వీరు ఒక రకం. ఇంకోరకం మనుష్యులున్నారు. వీరు దీనికి పూర్తిగా వ్యతిరేకులు! దేన్ని గురించైనా ఎక్కువసేపు ఆలోచించే ఓర్పు వీరికి ఉండదు. చేతిలో పడటంతోటే మంచో చెడో తేల్చి పారవేస్తారు. త్రిప్పి చూసే పరిశ్రమకూడా చేయరు—నమ్మకం మీదనే పోనిస్తారు. ఇలాంటి మనుష్యులు ప్రపంచంలో ఏ పనీ చేయలేరు అంటానికి వీలులేదు. ఒక్కొక్కప్పుడు అందరికంటె ఎక్కువగానే చేస్తారు. అదృష్టం సరిగా ఉంటే కొండ కొమ్మున ఎక్కి కూర్చుంటారు. సరి తప్పితే అగాధంలో చిరకాలం విశ్రమిస్తారు. అక్కడనుంచి లేవలేరు—కూర్చోలేరు—వెలుతురు వంక చూడలేరు.

నిశ్చలంగా, జడపిండంలాగె శవంమాదిరి పడి ఉంటారు. ఈ తరగతికి వాడు దేవదాసు!

పిల్లాడు దేవదాసు [illegible] తిరిగి వచ్చాడు. కర్మి ఆశ్చర్యంతో "దేవా! కాలేజీకి వెళ్ళ [illegible] [illegible]?" అని అడిగింది.

"అం," [illegible] తండ్రిగారి ప్రశ్నకు కూడా ఇలాంటిదే ఒక జవాబుచెప్పి తప్పుకున్నాడు. వారికి ఏమీ అర్థం కాక భార్యను అడిగితే, ఆమె బుద్ధినంతా వినియోగించి—"ఇంకా ఎండలు తగ్గలేదు కదూ! మళ్ళీ సెలవ లిచ్చారు." అని అన్నది.

దేవదాసు రెండు రోజులు, కాలు కాలిన పిల్లిలాగా తిరిగాడు [illegible] అతని కోరిక నెరవేరలేదు. పార్వతి ఒంటరిగా కనపడలేదు. ఒకనాడు పార్వతి తల్లి దేవదాసును చూసి— "వచ్చినవాడివి ఎలాగూ వచ్చావు [illegible] వారం రోజులు ఉండి పో!" అన్నది. దేవదాసు "సరే!" అన్నాడు

మధ్యాహ్నంపూట భోజనాలవీ అయాక పార్వతి నిత్యమూ నదికి నీటికి పోతుంది. ఇత్తడిబిందె చంకనుపెట్టుకొని ఇవ్వాళకూడా నీళ్ళకు వచ్చింది. రేవుకు సమీపంలోనే రేగుచెట్టు చాగున దేవదాసు నీళ్ళల్లో గాలంవేసుకు కూర్చుని ఉన్నాడు అతన్ని చూసి పార్వతి తిరిగి పోదామా అని ఒకమాటు మనస్సులో అనుకున్నది. చప్పుడు చేయకుండా నీళ్లు ముంచుకుపోదామని మరోమాటు అనుకున్నది. కాని తత్తరపాటు వల్ల ఏ పనీ చక్కగా నెరవేర్చలేకపోయింది. బిందె క్రిందపెట్టుతూ ఉండగా బహుశా కొంచెం చప్పుడై ఉండవచ్చు, దేవదాసు తల ఎత్తి చూసి— "పారూ! ఒక మాట వినిపో!" అని చెయ్యి ఊపుతూ పిలిచాడు.

పార్వతి నెమ్మదిగా దగ్గరకువచ్చి నిలబడింది. దేవదాసు ఒకమాటు తలఎత్తి చూశాడు. మరల నీటివంక శూన్యదృక్కులతో చూస్తూ ఉండిపోయాడు. మాట్లాడ లేదు. "నాకేమైనా చెప్తావా!" అని అడిగింది పార్వతి.

దేవదాసు దృష్టి మరల్చకుండానే—"అం, కూర్చో!" అన్నాడు.

పార్వతి కూర్చోలేదు. తలవంచుకు నిలబడింది. చాలసేపు చూసినా మాట్లాడక పోయేసరికి, పార్వతి నెమ్మదిగా ఒక్కొక్క అడుగు వేసుకుంటూ రేవుకు పోసాగింది. దేవదాసు తల ఎత్తి పార్వతి పోతూ ఉండటం చూసి, "ఇదుగో మాట!" అన్నాడు మరల నీళ్ళవంక చూస్తూ.

పార్వతి తిరిగి వచ్చింది. కాని దేవదాసు అతీపతీ లేదు. పార్వతి తిరిగి పోయింది. దేవదాసు స్తబ్ధుడై కూర్చున్నాడు. కొన్ని క్షణాలు గడిచినతర్వాత తల



తిప్పి చూశాడు. పార్వతి నీళ్లుముంచుకొని వెళ్ళబోతూ ఉన్నది. అప్పుడు దేవదాసు గాలంతీసి చేతపట్టుకొని రేవుదగ్గరికి వచ్చి నిలబడి—"నేను వచ్చాను" అని అన్నాడు.

పార్వతి బిందె క్రిందకు దింపింది. మాట్లాడలేదు.

"నేను వచ్చాను, పారూ!"

పార్వతి కొంచెంసేపు మాట్లాడకుండా ఉండి—"ఎందుకూ?" అని మెల్లగా అడిగింది.

"నువ్వు రాస్త్రివిగా. జ్ఞాపకం లేదూ?"

"ఊహుఁ."

"అదేంటి పారూ! ఆ రాత్రి సంగతి జ్ఞాపకం లేదూ?"

"జ్ఞాపకముంది. కాని, ఇంకా దానితో అవసర మేముంది?"

పార్వతి కంఠస్వరం స్థిరంగానూ, చాలా కటువుగానూ ఉన్నది. దేవదాసు దాని మర్మం గ్రహించలేకపోయాడు.

"నన్ను క్షమించు పారూ! నే నపు డంత దూరం ఆలోచించలేదు."

"ఇక ఆపేసేయి. ఈ సంగతి నేనిక వినదలచుకోలేదు."

"నే నెలాగో ఒకలా నా తలితండ్రుల్ని ఒప్పిస్తాను. ఇక నువ్వు—"

పార్వతి దేవదాసు ముఖం వంక తీక్ష్ణంగా చూసి—"నీకేనా తలిదండ్రులున్నది. నాకు లేరా? వారి ఇష్టాయిష్టాలతో పని లేదా?" అన్నది.

"ఎందుకు జరు, పారూ? నాం కష్టముగా, ఇది నువ్వు—

"వారికిష్టమే నని ఎలా తెలుసుకున్నావు? బొత్తిగా యిష్టంలేదు!"

దేవదాసు [illegible] వృథా గ్రహమాపపడి—"కాదే, వారికి ఏమాత్రం అయిష్టం [illegible] మున్నా—"

పార్వతి [illegible] అడ్డు—"ఇక [illegible]—[illegible]—[illegible]" అన్నది.

[illegible] దేవదాసు [illegible]

"[illegible] [illegible] [illegible] [illegible] కొంచెం [illegible]—

[illegible]—"[illegible] [illegible] నాకు జ్ఞానం [illegible] నీకు భయపడుతూనే [illegible] అందుకే నన్ను భయపెట్టటా[illegible] వచ్చావా? సరే. [illegible] [illegible] అతని వంక చూస్తూ నిలబడింది

కాసేపు దేవదాసు నోటనుంచి మాట పెగులలేదు.

"చిన్నప్పటినుంచీ నాకు భయపడుతూనే వచ్చావా? ఇకేమీలేదా?"

"ఊహుఁ. ఇకేమీలేదు!" అన్నది పార్వతి దృఢ స్వరంతో.

"నిజంగా చెప్తున్నావా?"

"ఆఁ. నిజంగా చెప్తున్నాను. నీమీద నాకేమాత్రం గౌరవంలేదు. నేను ఎవరి దగ్గరికి పోతున్నానో వారు చాలా ధనవంతులు, బుద్ధిమంతులు, శాంతులు, స్థిరులు, ధార్మికులు. నా తల్లిదండ్రులు నా మేలే కోరుతారు. అందుకనే నీవంటి అజ్ఞానికీ, చంచల చిత్తునికీ, పోకిరికీ నన్నెంత మాత్రం ఇవ్వరు—ఇక దోవ వదులు!"

దేవదాసు కొంచెం తడబడి కాస్త దోవ ఇచ్చాడు. కాని మరుక్షణానే మరల అడ్డం వచ్చి—"ఇంత అహంకారమా?" అన్నాడు.

"ఎందుకుండదు? నీ కుండవచ్చు గాని నాకుండ కూడదా? నీకు రూపం ఉన్నది. కాని గుణం లేదు-నాకు రూపమూ ఉన్నది, గుణమూ ఉన్నది నువ్వు ధనవంతుడివి కాని మా నాన్నకూడా బిచ్చమెత్తుతూ తిరగటంలేదు. పైగా ఇకముందు నేనే విష యంలోనూ నీకంటె తక్కువగా వుండనని తెలుసుకో!"

దేవదాసు స్తంభితుడయాడు. పార్వతి చెప్ప నారంభించింది:

"నాకు చాలా చెరుపు చేయగలవని నువ్వనుకుంటూ ఉండవచ్చు. ఎక్కువ ఏమీ చేయలేవు గాని కొద్దిగా చేయగలవని నేను కూడా ఎరుగుదును. భేష్! అదే కానీయి. నాకు మాత్రం దోవ వదిలిపెట్టు!"

దేవదాసు హతబుద్ధుడై—"చెరుపు ఎలా చేయగలను?" అన్నాడు

"అపవాదు వేసి! అదే చేస్తా. పోయి." అన్నది పార్వతి తక్షణమే.

ఈ మాట వినేవరకు దేవదాసు మీద పిడుగుపడినట్లయింది. కాసేపు వెర్రివానివలె చూశాడు. అతని నోటినుంచి—"నేను అపవాదు వేస్తానా?" అని అస్పష్టంగా వెలువడింది.

కాని దేవదాసు హృదయంలో కోపమూ అవమానమూ జ్వాలలవలె ప్రజ్వరిల్లినవి. అవ్యక్త స్వరంతో—"నేను అపవాదు వేసి మనశ్శాంతిపోగొట్టనా?" అని. మరుక్షణానే గాలంతిప్పి గట్టిగాపట్టుకొని కర్కశ స్వరంతో "విను, పార్వతీ! నీకు అంత రూపం ఉండటం మంచిదికాదు. అహంకారాన్ని పెంచుతుంది." అని మరల గొంతు తగ్గించి—"చంద్రునికి అంత రూపం ఉండటంచేతనే ఆ కళంకం. పద్మాలు అంత తెల్లగా ఉండటం మూలానే అందులో నల్లని భ్రమరాలు ఉంటవి. ఇదిగో, నీ ముఖానకూడా కొంచెం కళంకచిహ్నం ఉండేటట్లు చేస్తాను" అన్నాడు.

దేవదాసు సహనశక్తి హద్దుమీరింది. అతను గాలంకర్ర గట్టిగా పట్టుకొని శక్తికొలది తిప్పి పార్వతి తలమీద కొట్టాడు. ఆ దెబ్బకు కపాళం దగ్గరనుంచి కుడి కనుబొమ్మ వరకు చీరుకుపోయింది. రెప్పపాటుకాలంలో ముఖమంతా రక్తకొల్లు అయింది.

పార్వతి నేలమీద విరుచుకుపడి—"ఏం పని చేశావు, దేవదా!" అని చీత్కారం చేసింది.

దేవదాసు గాలం తుంపులు తుంపులుచేసి నీళ్ళలోవేస్తూ—"మరేమీ ప్రమాదం లేదు. కాస్త చీరుకుపోయింది." అన్నాడు స్థిరంగా.

పార్వతి వ్యాకులకంఠంతో—"అమ్మో, దేవదా!" అంటూ ఏడ్చింది.

దేవదాసు వల్లవి చొక్కా కొంచెం చించి నీళ్ళలో తడిపి పార్వతి తలమీద కడుతూ—"భయమెందుకు పారూ! ఈ దెబ్బ త్వరలోనే మానిపోతుంది. మచ్చ మాత్రం ఉంటుంది. ఎవరయినా ఎప్పుడన్నా, ఆ మచ్చ ఏమిటని అడిగితే అబద్ధమాడు. లేకపోతే నిజం చెప్పి నీ కళంకాన్ని నువ్వే చాటుకో!" అన్నాడు.

"అమ్మో, నాయనో!"

"ఛీ, అలా ఏడవబోకు పారూ! నిన్నుంపకంచేసేముందు కాస్త జ్ఞాపకంపెట్టుకో తగిన చిహ్నం అట్టి పెట్టాను. ఇలాంటి బంగారంలాటి ముఖం నువ్వు అప్పుడప్పుడూ అద్దంలో చూసుకుంటావు కాదూ?" అని జవాబుకు ఎదురుచూడకుండానే వెళ్ళిపోవ టానికి రెండు అడుగులు వేశాడు.



పార్వతి వ్యాకులపాటుతో—"దేవదా!" అని పిలిచింది.

దేవదాసు తిరిగివచ్చాడు. అతని కనుకొలుకుల్ని నీటి బిందువు ఉన్నది.

"ఎందుకే పారూ?" అని స్నేహజడిత కంఠంతో అడిగాడు.

"ఎవరితోనూ చెప్పకు!"

దేవదాసు వంగి పార్వతి తలను ఓష్ఠాధరాలతో స్పృశించి—"ఛీ, నువ్వు నాకు పరాయిదానివా, పారూ? నీకు జ్ఞాపకం లేదూ? చిన్నప్పుడు కొంటెపనులు చేస్తే నీ చెవులు ఎన్నిసార్లు మెలిపెట్టాను!" అన్నాడు.

"నన్ను క్షమించు దేవదా!"

"అది నువ్వు చెప్పాలసే! నిన్ను నేనెప్పుడు కొట్టలేదు! ఎప్పుడు క్షమించలేను? —నిజం చెప్పు పారూ! నువ్వు నన్ను పూర్తిగా మర్చిపోయావా?"

"దేవదా!—"

"పార్వతీ! నాకు ఎక్కువ మాటలు చెప్పటం చేతకాదు. ఎక్కువ ఆలోచించి పనులు చేయననీ, తలచుకున్నది చేసిందాకా నిద్రపోననీ—నీకు తెలుసునుగా!" అని పార్వతి తలను చేతితో స్పృశించి. "నువ్వు మంచిపనే చేశావు. నా దగ్గర నువ్వు సుఖపడేదానివి కావు—కాని ఈ దేవదాసు స్వర్గసౌఖ్యం అనుభవించేవాడు!" అని ఆశీర్వదించాడు.

ఈ సమయంలో నదికి అవతలనుంచి ఎవరో వస్తూ కనపడ్డాడు. పార్వతి మెల్లగా నీళ్ళలో దిగింది. దేవదాసు వెళ్ళిపోయాడు. పార్వతి ఇంటికి తిరిగి వచ్చేవరకు వేళ చాలా మిగిలిపోయింది. పార్వతి నాయనమ్మ—"నదికి పోయి నీరు తెచ్చావా తల్లీ!" అని అనబోయింది. కాని పార్వతి మీద దృష్టిపడగానే "అయ్యో; కొంప మునిగిందే పారూ!" అని చీత్కారం చేసింది.

గాయంనుంచి అప్పుడుకూడా రక్తం కారుతూనే ఉన్నది. దాదాపు కట్టుగుడ్డ అంతా తడిసిపోయింది—"అమ్మయ్యో! నీ పెళ్ళి ఎలానే పారూ?" అన్నది ఏడుస్తూ.

పార్వతి స్థిరభావంతో బిందె దించింది. తల్లివచ్చి—"అయ్యో, కొంపమునిగిందే పారూ!" అని ఏడుస్తూ అన్నది.

పార్వతి—"రేవులో కాలుజారి పడ్డాను. కోసురాయి తగిలి తల గీచుకుపోయింది" అన్నది.

తర్వాత అందరూ కలిసి శుశ్రూషచేయ నారంభించారు. దేవదాసు చెప్పింది నిజమే....దెబ్బ అంత పెద్దదికాదు. నాలుగైదురోజులకే మానిపోయింది. ఇంకా ఒక వారం ఇలానే గడిచిపోయింది. తర్వాత ఒకనాటిరాత్రి హాతీపోతా గ్రామ జమీందారు —శ్రీ భువన మోహన చౌదరి—వరవేషం ధరించి వివాహం చేసుకోవడానికి వచ్చారు. ఉత్సవంలో విశేష ఆడంబరా లేవీ లేవు. భువనబాబు అంత తెలివి తక్కువవాడు కాదు. ప్రౌఢవయస్సులో పెళ్ళి చేసుకోవడానికి వచ్చి కుర్రవాని వేషం వేసుకోవటం మంచిదికాదని గ్రహించాడు.

వరుని వయస్సు నలభై కి తక్కువకాదు, కొంచెం ఎక్కువే. గౌరవర్ణం. దొందు రం. నెరసీ నెరవని మీసాలు, బట్టతల. వరుని చూసి కొందరు నవ్వారు. కొందరు మూతివిరిగించారు. భువనబాబు శాంత గంభీరముఖంతో—ఏదో తప్పుచేసిన ర కూర్చున్నారు. పెళ్ళిలో చెవులు మెలిపెట్టటం, గంధం

యా వ

మొదలగు ఆచారాలేవీ జరగలేదు. కారణం, ఇంత పెద్దనూ, ఇంత గంభీరునీ, చెవులు మెలిపెట్టటానికి ఎవరిచేతులూ లేవలేదు. శుభదృష్టి సమయంలో పార్వతి రెప్పవాల్చకుండా భర్తవంక చూసింది. ఆమె పెదవులమీద మందహాసం కనిపించింది—భువనబాబు పసిపిల్లవాడి మాదిరిగా తలవంచుకున్నాడు. స్త్రీలందరూ కిలకిల నవ్వారు. చక్రవర్తిగారు ఎక్కడా కాలు ఆనకుండా తిరుగుతూ ఉన్నారు. పిల్లతరపు పెత్తనమంతా జమీందారు నారాయణ ముఖర్జీగారిది. అనుభవజ్ఞుడు—పెళ్ళిలో ఏమాత్రం లోటు జరగనివ్వలేదు. శుభకార్యం నిర్విఘ్నంగా సమాప్తమైంది.

మర్నాడు ఉదయాన్నే చౌదరిగారు ఒక పెట్టెడు అలంకారాలు బయటకు తీశారు. పార్వతి సర్వాంగాలూ తళతళ మెరిసినవి. అవి చూసి పార్వతి తల్లి చీరెచెరగుతో కను కొలకులు ఒత్తుకున్నది. ప్రక్కనే నిలబడి ఉన్న జమీందారుగారి భార్య—"ఇవ్వాళ కళ్ళవెంట నీళ్లుకార్చి అమంగళం చేయబోకు!" అని స్నేహపూరితంగా మందలించింది.

సాయంకాలం మనోరమ పార్వతిని ఒంటరిగా గదిలోకి తీసుకువెళ్ళి ఆశీర్వదించింది. "జరిగిందల్లా మంచికే జరిగింది. ఇకనుంచిచూడూ, ఎంత సుఖంగా ఉంటావో!" అన్నది.

పార్వతి మందహాసంచేసింది: "ఎందు కుండను? నిన్ననేగా యముడితో పరిచయమైంది!" అన్నది.

"అదేమిటే!"

"దాని సమయం వచ్చినప్పుడు చెప్తాను."

"ఒకమాటు దేవదాసును పిలిచి ఈ బంగారాన్ని చూపించాలని ఉంది!"

పార్వతికి మత్తు వదలినట్టయింది. "ఆ పని చేయగలవా అక్కయ్యా! ఒకమాటు పిలుచుకు రాలేవా?" అన్నది.

"ఎందుకు పారూ?" కంఠస్వరంలో తొట్రుపాటున్నది.

పార్వతి దండకడియం తిప్పుతూ అన్యమనస్కంగా అన్నది. "ఒక్క మాటు పాదధూళి తీసుకోవాలని ఉన్నది. ఇవ్వాళ వెళ్తాను కదూ?"

మనోరమ పార్వతిని హృదయానికి దగ్గరగా లాక్కున్నది. ఇద్దరూ చాలాసేపు ఏడ్చారు. ప్రొద్దు కుంకింది. గదిలో అంతా చీకటి.

పార్వతి నాయనమ్మ తలుపునెట్టుకొని గదిలోకివచ్చి "ఓ పారూ, బయటికి రండి తల్లుల్లారా!" అని పిలిచింది.

ఆ రాత్రే పార్వతి కాపురానికి వెళ్ళిపోయింది.

ఇక దేవదాసు? ఆ రాత్రి అతను కలకత్తా ఈడెను గార్డెనులో ఒక బెంచిమీద కూర్చుని గడిపాడు. 'అతనికి చాలా క్లేశం కలిగింది అతని హృదయం వ్రక్కలైంది' అనటానికి వీల్లేదు. ఏదో జడత్వం, ఉదాసీనత నెమ్మదిగా అతని హృదయంలో కూడుకొంటూ ఉన్నది. నిద్రపోతూ ఉండగా శరీరంలో 'పాక్షికమైనా' పక్షవాతం వస్తే, నిద్రనుంచి మేలుకొనే ఆది మనం చెప్పుచేతల్లో ఉండకపోవడం చూసి — తన ఆజన్మ సంగీ, తనను నమ్ముకుందంటూ తన పిలుపుకి ఎందుకని జవాబివ్వటం లేదో తెలియక, మనస్సు మొదట విస్మయంతో ఎలా స్తంభించిపోతుందో, తర్వాత నెమ్మదిగా అది ఇక తనది కాదని ఎలా తెలుసుకుంటుందో, అలానే దేవదాసు ఇప్పుడు ప్రపంచానికంతకూ పక్షవాతం వచ్చిందనీ, దానితో తనకు విచ్ఛేదం కలిగిందనీ గ్రహించాడు అనవసరంగా ఇప్పుడు దానిమీద కోపించినా లాభంలేదు; భీష్మించినా ఫలముండదు. అసలు, ఒకప్పుడు దానిమీద తనకు అధికారి ముండినదని ఆలోచించటంకూడ వ్యర్థం!

సూర్యుడు ఉదయిస్తూ ఉన్నాడు. దేవదాసు లేచి నిలబడి, ఎక్కడికి వెళ్లిదామా అని ఆలోచించాడు. అతనికి మెస్ జ్ఞాపకం వచ్చింది. చున్నీలాల్ అక్కడే ఉన్నాడు. దేవదాసు బయలుదేరాడు. దోవలో ఒక రిద్దరితో ఢీకొన్నాడు—ఎదురు దెబ్బకు వేళ్ళన్నీ పగలగొట్టుకున్నాడు—తిప్పువచ్చి. ఒక మనిషిమీద పడబోయి అతనిచేత తాగుబోతని పడనెట్టించుకున్నాడు. ఇలా తిరిగి పొద్దు కుంకుతూ ఉండగా మెస్ దగ్గరకు చేరాడు. చున్నీబాబు గుడ్డలవీ వేసుకొని అప్పుడే బయలుదేరు తున్నాడు.

"ఎవరూ? దేవదాసా!" అన్నాడు చున్నీ. దేవదాసు మాట్లాడలేదు. గుడ్లు వప్పగించాడు.

"ఎప్పు దొచ్చావోయ్! ముఖమంతా వాడిపోయింది—ఇంకా స్నానం కూడా చేసినట్టు లేదే!—ఆఁ, ఆఁ! అదేమిటి! అదేమిటి!"

దేవదాసు రోడ్డుమీద కూర్చోబోతూ ఉండగా చున్నీ అతన్ని చేయిపట్టుకొని గదిలోకి తీసుకువెళ్ళాడు. తన పక్కమీద కూర్చోపెట్టి శాంతపరచి—"సంగతులు ఏమిటోయి దేవదాస్!" అని అడిగాడు.

"నిన్ననే ఇంటి దగ్గరనుంచి వచ్చాను."

"నిన్ననా! ఇవ్వాళ పగలంతా ఎక్కడున్నావ్? మరి రాత్రో!"

"ఈడెన్ గార్డెన్‌లో."

"పిచ్చా! ఏమిటి! అసలు సంగతేమిటో చెప్పు, వింటాను!"




"ఏం తే ప్రయోజన మేమిటి?"

"అయితే అక్కర్లేదు! ముందు తిండీ తిప్పలూ చూడు- సామానంతా ఎక్కడ?"

"తీసుకురాలేదు."

"మరీమంచిది—ముందు భోజనానికి లే."

బలవంతంగా చున్నీలాల్ అతన్ని భోజనం చేయించి, పండుకోమని చెప్పి తలుపులు వేస్తూ—"నేను రాత్రికివచ్చి లేపుతాను. కాస్త నిద్రపోవటానికి ప్రయత్నించు" అని చెప్పి వెళ్ళిపోయాడు. రాత్రి పదిగంటలకు వచ్చి చూస్తే దేవదాసు మంచంమీద గాఢనిద్ర పోతున్నాడు. చున్నీ అతన్ని లేపకుండా కంబళి ఒకటి లాక్కుని చాపమీద వేసి పండుకున్నాడు. ఆ రాత్రి దేవదాసుకు మెలకువ రాలేదు. ఉదయం పదిగంటలకు లేచి కూర్చుని—

"చున్నీ! ఎప్పుడొచ్చావోయ్?" అని అడిగాడు.

"ఇప్పుడే వచ్చాను."

"నీకేం ఇబ్బంది కలగలేదు కదా?"

"ఏమీ లేదు."

దేవదాసు కాసేపు అతనివంక చూస్తూ ఉండి—"చున్నీ, నా కిప్పుడు 'నా' అనేది ఏమీ లేదు! నువ్వు నన్ను పోషిస్తావా?" అని అడిగాడు.

చున్నీ నవ్వాడు. దేవదాసు తండ్రి చాలా భాగ్యవంతుడని అతనికి తెలుసు. అందు





అతనికి స్త్రీల పొడ అంటేనే గిట్టటంలేదు. ఈ సంగతి అతనికి తెలియనే తెలియదు. చంద్రముఖిని చూడగానే అతని అంతరంగంలో దాగిన ఏవగింపంతా, దావానలంవలె ఒక్కమాటు ప్రజ్వరిల్లింది. అతను చున్నీలాలు ముఖంవంక తీవ్రంగా చూస్తూ, కనుబొమలు చిట్లించుకొని "చున్నీ! నన్నీ నరకానికి తీసుకొచ్చావెందుకు?" అన్నాడు.

అతని కంఠస్వరమూ, చూపూ చూసి చంద్రముఖీ, చున్నీలాలూ స్తబ్ధులయ్యారు. కాని వెంటనే చున్నీ తనను సంబాళించుకున్నాడు. దేవదాసు చెయ్యి పట్టుకుని మెల్లగా —"పద. లోపలికి పోయి కూర్చుందాము" అన్నాడు.

దేవదాసు ఇకేమీ అనలేదు. గదిలోకి పోయి విచారంతో తలవంచుకు కూర్చున్నాడు చంద్రముఖి కూడా మాట్లాడకుండా దాపునే కూర్చున్నది. దాసీ వెండి పొదిగిన హుక్కాలో పొగాకు వేసుకొని, తీసుకువచ్చింది. దేవదాసు తీసుకోలేదు. చున్నీలాలు ముఖమంతా భారంగా పెట్టుకొని కూర్చున్నాడు. దాసీకి ఏమిచేయాలో తెలియక చివరికి చేతికిచ్చి వెళ్ళిపోయింది. చంద్రముఖి ఒకటి రెండుసార్లు

పిల్చింది. దేవదాసు ఆమె ముఖంవంక చుర చుర చూసి—"ఎంత అసహ్యం! ఎంత రోత!" అని చీదరించుకున్నాడు.

ఇంతకుపూర్వం మాటల్లో ఎవ్వరూ చంద్రముఖిని ఓడించలేకపోయారు. అస లామెను చిన్నబుచ్చటమే చాలా కష్టం. కాని దేవదాసు హృదయంలోనించి, ఏవగింపుతోవచ్చిన ఈ సరళ కఠినోక్తులు ఆమె హృదయంలోకి సూటిగాపోయి నాటినై! ఒక్కక్షణం ఆమె మతిపోయింది. కాని, కాసేపున్న తర్వాత ఒకటి రెండు సార్లు గుడగుడమని శబ్దం వినపడింది. పొగమాత్రం చంద్రముఖి నోటినుంచి రాలేదు తర్వాత హుక్కా చున్నీలాలు చేతికిచ్చి, దేవదాసు ముఖంవంక ఒకమాటు చూసి, మౌనంగా కూర్చున్నది. ముగ్గురినోటా మాటలేదు. హుక్కామాత్రం "గుడ గుడ" మని చప్పుడుచేస్తూ ఉన్నది—అదీ భయపడుతూ, భయపడుతూ! మిత్రులు నలుగురూ కూర్చుని చర్చిస్తూ ఉండగా, ఆ చర్చ అనవసరంగా కలహం క్రిందకుమారితే, చప్పున తర్కం ఆపివేసి, ప్రతివ్యక్తి లోపల ఉడికిపోతూ—"ఇలా ఎందుకు వచ్చిందీ!" అని ఎలా అనుకుంటారో, అలానే ఈ ముగ్గురూ, "ఇలా ఎందుకువచ్చిందీ!" అని మనస్సులో అనుకోసాగారు.

ఎలాగైనా రానీయండి, ఇందులో ఎవ్వరికీ స్వస్థతలేదు. చున్నీలాలు హుక్కా కిందపెట్టి క్రిందకు దిగిపోయాడు. అతనికి చేసే పనేమీ కనపడలేదు-బహుశా అందుకనే కావచ్చును. గదిలో దేవదాసు ఒక్కడే ఉండిపోయాడు.

"నువ్వు డబ్బు తీసుకుంటావా?" అని దేవదాసు తల ఎత్తి ప్రశ్నించాడు.

చంద్రముఖి వెంటనే జవాబివ్వలేకపోయింది. ఇప్పుడామెకు ఇరవైనాలుగో ఏడు. గత తొమ్మిది సంవత్సరాల్లో, ఎన్నోరకాల స్వభావంకల వ్యక్తులతో ఆమెకు దగ్గరి పరిచయం కూడా వున్నది. కాని ఇలాంటి చిత్రమైత వ్యక్తిని ఆమె ఎప్పుడూ చూడ లేదు. కొంచెం సంకోచిస్తూ అన్నది:—"తమ రాకచే మా గృహం పావనమైన—"

దేవదాసు మాట పూర్తిచెయ్యనివ్వకుండా—"పావనం సంగతి అలా ఉంచు; డబ్బు తీసుకుంటావా?" అని అడిగాడు.

"ఎందుకు తీసుకోను! లేకపోతే మాకెలా గడుస్తుంది?—"

"అగు—ఇక నేను వినదలుచుకో లేదు." అని జేబులోనుంచి ఒక నోటుతీసి చంద్రముఖి చేతిలోపెట్టి పోవడానికి ఉద్యమించాడు—ఎంత డబ్బిచ్చానని ఒక్కమాటు తిరిగికూడా చూచుకోలేదు.

"అప్పుడే వెళ్ళిపోతారేం?" అని చంద్రముఖి వినయంగా అడిగింది.

దేవదాసు మాట్లాడలేదు. వరండాలోకి వచ్చి నిలబడ్డాడు.

చంద్రముఖి ఒకమాటు డబ్బు తిరిగి ఇచ్చివేయాలనుకున్నది. కాని సంకోచం మూలాన ఇవ్వలేకపోయింది. బహుశా కొంచెం భయపడి ఉండవచ్చు. ఇంతేకాక తిట్లూ, తిరస్కారాలూ సహించే అలవాటు ఆమెకు ఉండటంచేత నిశ్శబ్దంగా, కొయ్య వలె ద్వారబంధము పట్టుకుని ఉండిపోయింది. దేవదాసు మెట్లుదిగి వస్తూ ఉండగా, దోవలో చున్నీలాలు ఎదురైనాడు. అతనికి ఆశ్చర్యంవేసి—"ఎక్కడికి పోతున్నావు, దేవదాస్!" అని అడిగాడు.

"బసకు వెళుతున్నాను."

"అదేమిటోయ్!"

దేవదాసు ఇంకా రెండు మెట్లు దిగాడు.

"పద, నేనుకూడా వస్తున్నాను." అన్నాడు చున్నీలాలు.

దేవదాసు దగ్గరకు వచ్చి చేయిపట్టుకొని—"రా" అన్నాడు.

"కొంచెం ఆగు. ఒకమాటు పైకిపోయి వస్తాను."

"కాదు నేనిప్పుడే పోవాలి. నువ్వు తర్వాత రా" అని దేవదాసు వెళ్ళిపోయాడు.

చున్నీలాలు పైకివచ్చాడు. చంద్రముఖి తలుపు పట్టుకుని ఇంకా అలాగే నిలబడి ఉన్నది. చున్నీని చూడగానే—"నీ స్నేహితుడు వెళ్ళిపోయాడా?" అని అడిగింది.

"ఆఁ."

చంద్రముఖి, చేతిలోని నోటు చూపిస్తూ—"ఇది చూశావా? మర్యాద దక్కించుకోవాలంటే, దీన్ని తీసుకెళ్ళి నీ స్నేహితుడి కివ్వు" అన్నది.

"అతను ఇష్టమై ఇచ్చిపోయాడు. నేను మళ్ళీ ఎందుకు తీసుకువెళ్ళి ఇస్తాను?"

ఇంతసేపటికి చంద్రముఖి కొంచెం నవ్వగలిగింది. కాని ఆ నవ్వులో ఆనందం లేదు. "ఇష్టమై ఇచ్చిపోలేదు. నేను డబ్బు తీసుకుంటాననే కోపంతో ఇచ్చిపోయాడు. సరే కాని చున్నీబాబూ! అతని కేమన్నా పిచ్చా?"

"ఏమాత్రం లేదు. కాని, కొన్నాళ్ళనుండి అతని మనస్సు సరిగా ఉండటం లేదనుకుంటాను."

"ఎందుకు సరిగా ఉండటంలేదో నీకేమన్నా తెలుసునా?"

"తెలియదు. బహుశా ఇంటిదగ్గర ఏదన్నా జరిగి ఉంటుంది."

"అయితే ఇక్కడి కెందుకు తీసుకొచ్చావు?"

"నేను తీసుకురాలేదు. అతనే బలవంతాన వచ్చాడు."

చంద్రముఖికి ఈమాటు నిజంగా విస్మయం కలిగింది—"బలవంతాన వచ్చాడా? అంతా ఎరిగే!" అన్నది.




చున్నీలాలు కొంచెం ఆలోచించి—"అంత కాక! అతనికి అంతా తెలుసు. నేను మోసపుచ్చి తీసుకురాలేదు" అన్నాడు.

చంద్రముఖి కొంచెంసేపు మాట్లాడలేదు. కాసేపు ఏదో ఆలోచించుకుని—"చున్నీ, నాకొక సహాయం చేసిపెడతావా?" అని అడిగింది.

"ఏమిటి?"

"నీ స్నేహితుడు ఎక్కడ ఉంటాడు?"

"నాదగ్గరే."

"ఇంకోమాటు అతన్ని తీసుకురాగలవా?"

"బహుశా తీసుకురాలేననుకుంటాను. ఇంతకుముందు ఇలాంటిచోటి కెప్పుడూ రాలేదు, ఇక ముందు కూడా రాడనుకుంటాను. సరేగాని, ఎందుకో కాస్త చెప్పు విందాం!"

చంద్రముఖి మ్లానహాసంతో 'చున్నీ! ఎలాగైనా, ఆఖరికి మోసగించైనా అతన్ని ఇంకోమాటు తీసుకురావూ!" అన్నది.

చున్నీ నవ్వి—"చీదరింపుతో ప్రేమ పుట్టుకొచ్చిందా ఏమిటి?" అని కన్ను కొట్టుతూ అడిగాడు.

"ఇప్పటికి రెండు సంవత్సరాలైంది మాతల్లి చనిపోయి. ఈ రెండు సంవత్సరాలూ ఎంత కష్టంతోనూ, దుఃఖంతోనూ గడిపామో చెప్పశక్యం కాదు. ఇవ్వాళ మీరు వచ్చారు. ఇకనన్నా మేము సుఖపడేట్టు ఆశీర్వదించు తల్లీ!"

పార్వతి చాల సహజ స్వరంతో మాట్లాడింది. ఒక్కమాటే గృహిణిఅయి, అనేక సంగతులు తెలుసుకోవలసి, మాట్లాడవలసి వచ్చినప్పుడు, మాట్లాడక ఏమిచేస్తుంది? కాని చాలమందికి ఇది అస్వాభావికంగా కనపడవచ్చు. పార్వతిని బాగా ఎరిగినవారు మాత్రం, అవస్థాభేదాలవల్ల పార్వతి ఈడుకుమించి పరిపక్వమైందని తెలుసుకుంటారు. ఇంతేకాక, అనవసరంగా సిగ్గుపడటం, అహేతుకంగా సంకోచపడటం, ఆమె కెప్పుడూ అలవాటు లేదు.

"నా మిగతా పిల్లలు ఎక్కడున్నారు, నాయనా?" అని అడిగింది.

మహేంద్రుడు కాస్తనవ్వి—"చెప్తాను. మీ పెద్దమ్మాయి—నా చెల్లెలు—అత్త గారింటి దగ్గరనే ఉన్నది. నేను ఉత్తరంకూడా రాశాను—కాని యశోద రావటానికి పడలేదు!" అన్నాడు.

పార్వతికి విచారం కలిగింది—"రాలేకపోయిందా? లేక రావటానికి ఇష్టంలేకనా!" అని అడిగింది.

మహేంద్రుడు సిగ్గుపడుతూ—"సరిగా తెలియదమ్మా!" అన్నాడు.

కాని అతని మాటలూ, ముఖభంగిమనూ పట్టి యశోద అలిగే రాలేదని పార్వతి గ్రహించింది.

"మరి చిన్నబ్బాయి?"

"వాడు త్వరలోనే వస్తాడు. కలకత్తాలో ఉన్నాడు—పరీక్షలుకాగానే వస్తాడు."

భువనచౌదరి జమీందారీ పనులు స్వయంగానే చూస్తూవుండేవాడు ఇంతేకాక సాలిగ్రామ పూజ, సత్రంలో సాధుసన్యాసులకు పరిచర్య, తానే స్వయంగా చూస్తూవుండే వాడు. వ్రత ఉపవాసాలుకూడా ఉంటూ ఉండేవాడు. ఈ పనుల్లో అతనికి రాత్రి పది గంటలదాకా తెమలేది కాదు. కొత్తగా పెళ్ళిచేసుకున్న సంతోషం వారిలో ఏమీ కనపడ లేదు. ఎప్పుడైనా ఒకరోజున అంతఃపురంలోకి వచ్చేవాడు లేకపోతే అదీలేదు. వచ్చినా కూడా మామూలు సంభాషణే జరిగేది. పక్కమీద, దాలీసు తలక్రిందకు లాక్కుని, పండు కుని, కళ్ళు మూసుకుని బిగ్గరగా—"ఇప్పుడు నీవే ఈ ఇంటికంతా యజమానురాలివి! కాస్త అంతా చూసి, సంసారం దిద్దు." అనేవాడు.

"అలాగే" అనేది పార్వతి తల తిప్పుతూ.

"ఇదిగో, ఈ పిల్లలంతా నీవాళ్ళే—" అనేవాడు భువనబాబు. భర్త సిగ్గుపడటం చూసి పార్వతి పెదవులమీద నవ్వు కనిపించేది.

"ఇప్పటికి రెండు సంవత్సరాలైంది మాతల్లి చనిపోయి. ఈ రెండు సంవత్సరాలూ ఎంత కష్టంతోనూ, దుఃఖంతోనూ గడిపామో చెప్పశక్యం కాదు. ఇవ్వాళ మీరు వచ్చారు. ఇకనన్నా మేము సుఖపడేట్టు ఆశీర్వదించు తల్లీ!"

పార్వతి చాల సహజ స్వరంలో మాట్లాడింది. ఒక్కసారే గృహిణిఅయి, అనేక సంగతులు తెలుసుకోవలసి, మాట్లాడవలసి వచ్చినప్పుడు, మాట్లాడక ఏమిచేస్తుంది? కాని చాలామందికి ఇది అస్వాభావికంగా కనపడవచ్చు. పార్వతిని బాగా ఎరిగినవారు మాత్రం, అవస్థాభేదాలవల్ల పార్వతి ఈడుకుమించి పరిపక్వమైందని తెలుసుకుంటారు. ఇంతేకాక, అనవసరంగా సిగ్గుపడటం, అహేతుకంగా సంకోచపడటం, ఆమె కెప్పుడూ అలవాటు లేదు.

"నా మిగతా పిల్లలు ఎక్కడున్నారు, నాయనా?" అని అడిగింది.

మహేంద్రుడు కాస్తనవ్వి—"చెప్తాను. మీ పెద్దమ్మాయి—నా చెల్లెలు—అత్త గారింటి దగ్గరనే ఉన్నది. నేను ఉత్తరంకూడా రాశాను—కాని యశోద రావటానికి పడలేదు!" అన్నాడు.

పార్వతికి విచారం కలిగింది—"రాలేకపోయిందా? లేక రావటానికి ఇష్టంలేకనా!" అని అడిగింది.

మహేంద్రుడు సిగ్గుపడుతూ—"సరిగా తెలియదమ్మా!" అన్నాడు.

కాని అతని మాటలూ, ముఖభంగిమనూ పట్టి యశోద అలిగే రాలేదని పార్వతి గ్రహించింది.

"మరి చిన్నబ్బాయి?"

"వాడు త్వరలోనే వస్తాడు. కలకత్తాలో ఉన్నాడు—పరీక్షలుకాగానే వస్తాడు."

భువనచౌదరి జమీందారీ పనులు స్వయంగానే చూస్తూవుండేవాడు ఇంతేకాక సాలిగ్రామ పూజ, సత్రంలో సాధుసన్యాసులకు పరిచర్య, తానే స్వయంగా చూస్తూవుండే వాడు. వ్రత ఉపవాసాలుకూడా ఉంటూ ఉండేవాడు. ఈ పనుల్లో అతనికి రాత్రి పది గంటలదాకా తెమలేది కాదు. కొత్తగా పెళ్ళిచేసుకున్న సంతోషం వారిలో ఏమీ కనపడ లేదు. ఎప్పుడైనా ఒకరోజున అంతఃపురంలోకి వచ్చేవాడు లేకపోతే అదీలేదు. వచ్చినా కూడా మామూలు సంభాషణే జరిగేది. పక్కమీద, బాలీసు తలక్రిందకు లాక్కుని, పండు కుని, కళ్ళు మూసుకుని బిగ్గరగా—"ఇప్పుడు నీవే ఈ ఇంటికంతా యజమానురాలివి! కాస్త అంతా చూసి, సంసారం దిద్దు." అనేవాడు.

"అలాగే" అనేది పార్వతి తల తిప్పుతూ.

"ఇదిగో, ఈ పిల్లలంతా నీవాళ్ళే—" అనేవాడు భువనబాబు. భర్త సిగ్గుపడటం చూసి పార్వతి పెదవులమీద నవ్వు కనిపించేది.



భువనబాబు కొంచెం నవ్వు తెచ్చుకుని మరల అనేవాడు: "ఆఁ—మహేంద్రుడు నీ పెద్దబ్బాయి, బి. ఏ. కూడా ప్యాసయినాడు—ఎంత మంచివాడు!—ఎంత దయాధర్మాలు కలవాడు!—కాస్త ఆత్మీయతా, కొంచెం ఆదరమూ చూపిస్తే—"

పార్వతి నవ్వు నాపుకుని "నాకు తెలుసు. వాడు మన పెద్దబ్బాయని" అనేది.

"అవును, ఎందుకు తెలియదు! అలాంటివాణ్ణి ఎవ్వరూ చూసి ఉండరు. ఇక యశోద పిల్లకాదు ప్రతిమ. తప్పకుండా వస్తుంది; ఎందుకు రాదు? ముసలి తండ్రిని చూడటానికి ఎందుకు రాదూ? వచ్చినప్పుడు కాస్త దాన్ని—"

పార్వతి భర్త దగ్గరకు వచ్చి అతని బట్టతలమీద మెత్తని చేయివేసి "మీరాసంగతి ఆలోచించ నక్కర్లేదు, నేను యశోదను తీసుకురావటానికి మనిషిని పంపుతాను. లేక పోతే మహేంద్రుడే పోతాడు" అనేది.

"పోతాడా? సరే! నేను చాలా రోజులనుంచి చూడలేదు—మనిషిని పంపుతావా?"

"ఎందుకు పంపను? నా అమ్మాయిని తీసుకురావటం నాకు తెలియదా?"

వృద్ధుడు ఉత్సాహంతో లేచి కూర్చుని, ఇద్దరికీ ఉన్న సంబంధంకూడా మరిచి పోయి, పార్వతి తలను స్పృశించి ఆశీర్వదించేవాడు: "నీకు శుభం కలుగుతుంది. నువ్వు సుఖపడుతావు. భగవంతుడు నీకు...."తర్వాత ఆ వృద్ధునికి ఏవేవో సంగతులు జ్ఞాపకం వచ్చేవి. మళ్ళీ పక్కమీద పండుకుని, కళ్ళు మూసుకుని—"ఒక్కగాని ఒక్క అమ్మాయి—నన్ను ఎంత ప్రేమించేది!" అని మనస్సులో అనుకునేవాడు.

ఈ సమయంలో అతని నెరసిన మీసాల పక్కగా అశ్రుబిందువులు జారి బాలీసు మీద పడేవి. పార్వతి తుడిచేది. అతను మెల్లగా గొణుక్కునేవాడు—"అహా, మళ్ళీ అందరూ వస్తారు. ఇంకోవారం ఇల్లూ వాకిలీ కళకళ లాడుతుంది—ఒక్కమాటుగా వెలిగిపోతుంది. పూర్వం సంసారం ఎంత బాగుండేది! కొడుకులు, కూతురు, భార్య—తిరనాళ్లగా ఉండేది; పండుగగా ఉండేది. తర్వాత ఒకనాడు అంతా వెళ్లారి పోయింది. కొడుకులు కలకత్తా వెళ్ళారు. యశోద అత్తవారింటికి పోయింది—మళ్ళీ అంధకారమూ, శ్మశానమూ—"

ఈ సమయంలో అతని మీసాలు రెండూ తడిసి బాలీసుకూడా తడిసేవి, పార్వతి ఆకులపాటుతో కన్నీరు తుడిచి—"మహేనుకు పెళ్ళెందుకు చేయలేరు?" అని అడిగేది.

వృద్ధుడు అనేవాడు—"అలా అయితే నాకు మంచిరోజులు వచ్చేవే! నేనుకూడా చేద్దామనే అనుకున్నాను కాని వాడి మనస్సులో ఏమున్నదో ఎవరికి తెలుసు; వాడు పట్టుపట్టి వివాహం చేసుకోలేదు. అందుకనే ఈ ముసలితనంలో, ఇల్లంతా బావురు మంటూ ఉంటే—దరిద్రుని కొంపమాదిరి బోసికొట్టుతో ఉంటే—లక్ష్మి వదలిపెట్టి వెళ్ళిపోయినట్లుగా ఉంటే—ఇంట్లో ఎక్కడా వెలుగు అనేది కనపడకపోతే-ఈ—"

ఈ మాటలు వింటే పార్వతికి చాలా దుఃఖం వచ్చేది. ఆమె లేనినవ్వు తెచ్చుకుని కరుణస్వరంతో—"మీరు ముసలివారైతే, నేనూ త్వరగా ముసలిదాన్నవుతాను. ఆడ వాళ్లు ముసలివాళ్ళు కావటాని కెంతకాలం పడుతుంది!" అనేది.

భువనచౌదరి లేచి కూర్చుని, చేత్తో ఆమె గడ్డం పట్టుకుని ముఖంవంక చాలా సేపు చూస్తో ఉండిపోయేవాడు. శిల్పి ప్రతిమను అలంకరించి, తలమీద కిరీటం పెట్టి, అటూ ఇటూ వంగి, చాలాసేపు ఎలాచూస్తూ ఉంటాడో, కొంచెం గర్వమూ, చాలాస్నేహమూ అతని ముఖంలో ఎలా కూడుకుంటుందో, అలానే భువనబాబు ముఖంలోనూ కూడుకునేవి ఎప్పుడన్నా అతని నోటినుంచి అస్ఫుటంగా—"అయ్యో! నేను మంచి పనిచేయలేదు!" అని వెలువడేది.

"ఏమిటండీ, మంచిది కానిది?"

"ఈ యింట్లో నీవు శోభించవని అనుకుంటున్నా—"

"బాగానే శోభిస్తాను. మా కింకా శోభించడం, శోభించకపోవడం ఏముంది?" అనేది నవ్వుతూ. వృద్ధుడు మళ్ళీ పండుకుని మనస్సులో అనుకునేవాడు. "ఆ! ఆ సంగతి నాకు తెలుసు—తెలుసును! తప్పక నీకు మేలు కలుగుతుంది. భగవంతుడు నిన్ను కనిపెట్టి ఉంటాడు."

* * *







విధంగా ఒక మాసం గడిచింది. ఈ మధ్య ఒకమాటు చక్రవర్తి కూతుర్ని తీసుకుపోవడానికి వచ్చాడు. కాని పార్వతి పోవటానికి ఇష్టపడలేదు: "దారీ తెన్నూలేని సంసారం నాన్నా! ఇంకా కొన్నాళ్ళుండి వస్తాను" అన్నది తండ్రితో. తండ్రి ముఖం చాటు చేసుకుని నవ్వుకొని—"స్త్రీజాతే యిటువంటి" దని మనస్సులో అనుకున్నాడు. తండ్రి వెళ్ళిపోయిన తర్వాత పార్వతి మహేంద్రుని పిలిచి—"నాయనా! ఒకమాటు మన అమ్మాయిని తీసుకురా!" అన్నది.

మహేంద్రుడు తప్పించుకోవాలని చూశాడు. యశోద ఎంతమాత్రం రాదని అతనికి తెలుసు: "నాన్న పోతే బాగుంటుం దనుకుంటాను" అని సంకోచిస్తూ అన్నాడు.

"ఛీ, అది బాగా ఉంటుందా? అంతకంటె మనిద్దరంపోయి తీసుకువద్దాము." అన్నది పార్వతి.

"మీరు వస్తారా?" అన్నాడు మహేంద్రుడు ఆశ్చర్యంతో.

"తప్పేముంది నాయనా! సిగ్గుపడవలసిన విషయం ఇందులో నాకేమీ కనపడటం లేదు. నేను వెళ్ళినందువల్ల యశోద వస్తే, దాని కోపం తగ్గిపోతే—రావటం నాకే మంత కష్టం!"

మర్నాడు మహేంద్రుడు ఒంటరిగానే యశోదను తీసుకురావటానికి పోయాడు. అక్కడ ఏమి కౌశలం చూపించాడో తెలియదు. కాని నాలుగోనాడు యశోదను వెంటపెట్టుకుని వచ్చాడు.

ఆ రోజున పార్వతి వొంటిమీద కొత్తవి, చిత్రమైనవి, విలువగలవి, చాలా నగలున్నవి. కొన్ని ఆనాడే మహేంద్రుడు కలకత్తా నుంచి తెచ్చియిచ్చాడు. పార్వతి అవి పెట్టుకుని కూర్చున్నది. దేవదాసు వచ్చేటప్పటికి, యశోద కోపంతోనూ, అభిమానం తోనూ అనేక మాటలు అల్లుకుంటూ వచ్చింది. కాని వదినగార్ని చూడగానే ఆమె స్తంభీభూతురాలైంది. ఆమె అనుకున్న కోపంలో పచ్చి వచ్చిన మాటలన్నీ మరచిపోయి అప్పుడుగా—"వదినా!" అని పిల్చి.

పార్వతి యశోదను చేయిపట్టుకొని ఇంట్లోకి తీసుకువచ్చి దగ్గర కూర్చో పెట్టుకుని వినయంతో నవ్వుతూ—"ఏం తల్లీ! అమ్మ మీద కోపమా?" అని అడిగింది.

యశోద ముఖం సిగ్గుతో కందిపోయింది. పార్వతి అప్పుడు తన వొంటిమీది నగలను ఒక్కొక్కటే తీసి యశోదను అలంకరింప నారంభించింది. యశోద విస్మయంతో "ఇదేమిటి?" అని అన్నది.

"ఏమీలేదు. ఇది మీ అమ్మ అభిలాష!"

నగలు పెట్టుకోవటం యశోదకు ఇష్టం లేకపోలేదు. అలంకారం పూర్తి అయినాక ఆమె పెదవులమీద చిరునవ్వు కూడా కనిపించింది. యశోదను అలంకరించి పరాభర ణమై, పార్వతి—"అమ్మమీద కోపమా తల్లీ?" అని అడిగింది.

"ఊహుం. కోపమెందుకు—కోప మేముంది?"

"అంతకన్న మరేముంది తల్లీ! ఇది మీ తండ్రిగారిల్లు. పెద్దయిల్లు....ఎంతోమంది దాసదాసీలు కొలువై ఉంటారు. నేనూ ఒక దాసీనేగా. ఛీ. దాసదాసీల మీద అలగటం బాగా ఉంటుందా తల్లీ!"

యశోద ఏళ్లకు పెద్దదయినా మాటల్లో ఇంకా చాలా చిన్నది. ఆమె కలవర పడింది. పార్వతి వినయంతో నవ్వుతూ అన్నది:

"దరిద్రుల బిడ్డను, మీ దయవల్ల ఇక్కడ కొంచెం చోటు చిక్కింది. ఎంతమంది దీనులూ, అనాధులూ మిమ్మల్ని ఆశ్రయించి బ్రతకటంలేదు?—నేను కూడా వారిలో ఒకతెను, ఆశ్రితులను ."

పార్వతి ఆమె రెండు చేతులూ పట్టుకున్నది.

"నా తప్పులన్నీ ఎంచబోకు తల్లీ!" అన్నది.

మరునాడు మహేంద్రుడు యశోదను చాటుకు పిలిచి...."ఏం, కోపం ఏమన్నా తగ్గిందా?" అని అడిగాడు.

యశోద చప్పన, అన్న కాళ్ళు పుచ్చుకొని...."అన్నా! కోపంలో....ఛీఛీ.... ఏమేమో వాగాను. చూడు, ఆవెక్కడా వెల్లడించకు!" అన్నది. మహేంద్రుడు నవ్వ నారంభించాడు.



"మారుతల్లి ఎక్కడన్నా ఇంత ప్రేమ చూపిస్తుందా, అన్నాయి!" అని యశోద అడిగింది.

రెండు దినాలు గడిచినాక యశోద తండ్రి దగ్గిరికిపోయి ..."ఇంకా రెండు మూడు మాసాల దాకా రానని వారికి ఉత్తరం రాయి నాన్నా!" అన్నది.

"ఎందుకు తల్లీ?" అన్నాడు భువనబాబు ఆశ్చర్యంతో.

యశోద సిగ్గుపడుతూ. మందహాసంచేసి—"నా వొంట్లో అంత బాగాలేదు. కొన్నాళ్ళు పిన్ని దగ్గర ఉంటాను" అన్నది.

ఆనందంతో వృద్ధుని కళ్ళవెంట జలజల నీరు కారింది. సాయంత్రం పార్వతిని పిలిచి—"నువ్వు నా పరువు నిలిపావు! నూరేళ్లు బ్రతుకు—నూరేళ్లు బ్రతుకు!" అని ఆశీర్వదించాడు.

"అదేమిటండీ—" అన్నది పార్వతి.

"అదేమిటో నే నిప్పుడు సరిగా చెప్పలేను—భగవంతుడా! ఇప్పుడు నువ్వు నన్నెంత అవమానంనుంచీ, మనోదుఃఖంనుంచీ తప్పించావు!"

ఆ సందె చీకటిలో భర్త కళ్ళలో నీరు నిండటం పార్వతికి కనిపించలేదు. ఇక వినోదలాల్, భువనబాబు చిన్నకొడుకు మిగిలాడు. వాడు పరీక్షకు కూర్చుని వచ్చి నాక మళ్ళీ చదవటానికి పోలేదు.

(ముగింపు వచ్చే సంచికలో)